**చంద్రయానం**

Chandrayaanam

**మార్చి 01, 2014**

**ప్రతులు : 500**

**టైటిల్ డిజైన్ : ఎ.గిరిధర్, విజయవాడ**

**ప్రచురణ :**

**భువనగిరి చంద్రశేఖర్ స్మారక సంఘం**

**గుంటూరు**

**సంప్రదించవలసిన చిరునామా :**

A. Subrahmanyam
GF1, Sudha Apartments
6/13A, Brodiepet
Guntur - 522 001
Mobile :9000389389
Mail:subrahmanyam.a@gmail.com

---

**Printed at :**

Don Bosco Tech. School Press, Ring Road, Guntur-7, Ph:0863-2350832

# విషయసూచిక

# మా మాట

మానవ హక్కుల నేత, ప్రముఖ న్యాయవాది భువనగిరి చంద్రశేఖర్ జనవరి 22, 2013న మరణించిన తరువాత అతని వ్యాస సంకలనాన్ని ఒక సంపుటంగాను, అతనిమీద స్మృతులను మరొక సంపుటంగాను మొదటి వర్ధంతి సందర్భానికి తీసుకురావాలని సంకల్పించాం. ఆ మేరకు పత్రికా ప్రకటన కూడా ఇచ్చాం. 1980 దశకం చివరి నుండి 2012 మధ్య భాగం వరకు చంద్ర రాసిన వ్యాసాలను ప్రస్తుత సంపుటిలో చేర్చాం. ఇందులో చేర్చిన వ్యాసాలలో ఎక్కువ భాగం చంద్ర ఇంటి నుండి సేకరించాం. **సండే ఇండియన్** పక్ష పత్రికలో ముద్రితమైన వ్యాసాలలో ఎక్కువ భాగం నరేష్ నున్నా పంపించారు. ఇంకా ఇతర మూలాలు, మార్గాల ద్వారా మరికొన్ని వ్యాసాలను సేకరించాం. వీటన్నింటి సంకలనమే మీ చేతిలో ఉన్న చంద్ర వ్యాస సంపుటి. ఈ వ్యాసావళిలోని తెలుగు వ్యాసాలను అవి ప్రచురితమైన తేదీల క్రమంలో అమర్చాము. కొన్ని వ్యాసాలు రాతప్రతులుగానే ఉన్నాయి. వాటిపై తేదిలు ఉంటే ఆ ప్రకారం ఆ వ్యాసాలను పొందుపర్చాము. అలా తేదిలు లభ్యంకాని వ్యాసాలను వాటి విషయాన్ని బట్టి, వేరే అంశాలను బట్టి సుమారైన తేది ఇవ్వడానికి ప్రయత్నంచేశాం. అలా చేసినప్పుడు ఆ విషయాన్ని చెప్పాం. ఆంగ్ల వ్యాసాలను అవి ప్రచురితమైన తేదిల ప్రకారం వ్యాసావళిలో చివర పొందుపరచాము.

చంద్ర వ్రాసిన పుస్తకాలు **శాక్కో - వాంజెట్టి**; **ఎన్‌జీవోల కథ**; **ప్రపంచ సోషల్ ఫోరమ్ ఆర్థిక రాజకీయాలు** (అనువాదం)లను **పర్‌స్పెక్టివ్స్**, హైదరబాదు ప్రచురించింది. అయితే చంద్ర ప్రచురిత వ్యాసాలు, అ ప్రచురిత వ్యాసాలు

ఇప్పటి వరకు పుస్తకరూపంలో రాలేదు. ఆ వెలితిని పూరించడమే ప్రస్తుత సంపుట లక్ష్యం.

చంద్ర సంపూర్ణ వ్యాసావళి తీసుకురావాలని మా ప్రయత్నం. మా శాయశక్తులా ప్రయత్నించి ప్రస్తుత సంపుటిలోని వ్యాసాలను సేకరించాం. ఇంకా మా దృష్టికి రాని, మా ప్రయత్నానికి అందని మూలాలలో ఇంకా కొన్ని వ్యాసాలు ఉంటే ఉండవచ్చు. అలాంటివి మా దృష్టికి తెస్తే మలి ముద్రణలో చేర్చగలమని మనవి చేస్తున్నాం.

వ్యాస సంకలనంలోని చంద్రశేఖర్ అభిప్రాయాలతో బి. చంద్రశేఖర్ స్మారక సంఘం సభ్యులకు ఏకీభావం ఉండనవసరంలేదు. వాటిని వ్యాస రచయిత అభిప్రాయాలుగా తీసుకోవాలని మా మనవి.

వ్యాస సేకరణలో సహకరించిన చంద్ర కుటుంబ సభ్యులు చంద్రిక, శశాంక్‌లకు, పాత్రికేయులు నరేష్ నున్నాకు, ప్రూఫ్ రీడింగ్‌లో సహకరించిన జుగాష్‌విల్లికి, ముద్రణకు సహకరించిన మిత్రులందరికి ధన్యవాదాలు. ఈ పుస్తకాన్ని అందంగా ముద్రించి ఇచ్చిన డాన్‌బోస్కో టెక్నికల్ స్కూల్ ప్రెస్, గుంటూరు వారికి మా ధన్యవాదాలు.

గుంటూరు

ఫిబ్రవరి 15, 2014 **బి. చంద్రశేఖర్ స్మారక సంఘం**

# (మార్క్స్) భౌతిక వాదం నుండి (శంకర అద్వైత) భావవాదానికి

ఎవరీ చంద్రశేఖర్? ఏం చేశారు? ఎందుకీ వ్యాస సంపుటి? ప్రశ్నలు సూటిగా ఉన్నా సూటైన సమాధానం ఇవ్వడం కష్టం. కాని అసాధ్యం కాదు.

ప్రస్తుత వ్యాస సంపుటి కొంతమేరకు ఈ ప్రశ్నలకు సమాధానం ఇవ్వగలదు. అలానే చంద్రశేఖర్ సమకాలీనుల జ్ఞాపకాలలోని నుండి కూడా చంద్ర గురించి కొంత వరకు మనకు సమాధానం లభిస్తుంది.



అది ఫిబ్రవరి, 1984 సంవత్సరం. వేదిక: ఖమ్మంలోని ప్రభుత్వ డిగ్రీ కళాశాల. సందర్భం : ఒక సెమినార్. విద్యార్థి లోకాన్ని వామపక్ష ఆలోచన దిశగా కార్యోన్ముఖులను చేసే అంశం మీద చర్చ. వివిధ వామపక్ష విద్యార్థి సంఘాలు, వాటి ప్రతినిధులుగా రాష్ట్రంలోని వివిధ ప్రాంతాల నుండి వచ్చిన ఆ సంఘాల నాయకులు వేదిక మీద పాత్రదారులు. ఆ కాలేజి విద్యార్థులు శ్రోతలు. ఆయా విద్యార్థి సంఘ నాయకుల పేరులోని ఆంగ్ల అక్షర క్రమాన్ని అనుసరించి వారిని పిలవడం, వారు వేదిక మీదకు వచ్చి, వారికి కేటాయించిన సమయంలో సెమినార్ అంశం మీద ప్రసంగించాలి. అక్షర క్రమాన్ని అనుసరించి మొదట ప్రసంగించే అవకాశం నాకొచ్చింది. ఎ.ఐ.ఎస్.ఎఫ్. ప్రతినిధిగా మా సంఘ స్థానిక నాయకులు సూచన మేరకు హోరెత్తించే రీతిలో మాట్లాడటానికి ప్రయత్నించి వేదిక దిగాను. భారతదేశపు సగటు ఎత్తు (5 అడుగుల 5 అంగుళాలు)న్న ఒక బక్కపలచని శరీరం, పసిడి ఛాయమేని, విశాల నుదురు భాగం, చక్రల్లాంటి కళ్లు కలగాపులంగా ఉన్న వ్యక్తి రెండవ వక్తగా తన పాత్రపోషణకు వేదిక నెక్కాడు. మంద్రస్థాయిలో, కంచు స్వరంతో తన ప్రసంగాన్ని

ప్రారంభించాడు. ప్రసంగ విషయం, ప్రసంగ స్థాయి క్రమేపి ఊపందుకొంది. వాడి, వేడి మిళితమైయ్యాయి. జడివానకు సుడిగాలి తోడైన చందంగా అతని ఉపన్యాసంతో సభాప్రాంగణం మార్మోగిపోయింది. అంతే ఒక్కసారిగా జడివాన కాదు కాని, సుడిగాలి ప్రాంగణాన్ని చుట్టముట్టింది. అక్కడ విశాలంగా పరిచి, నిలబెట్టిన షామియానాలు ఆకాశంలో దాదాపు వంద అడుగులకు ఎగిశాయి. ఎవరికీ ఏమీ ప్రమాదం జరగలేదు. కాని సుడిగాలితో ధీటుగా పెనుగాలి మాదిరి ప్రసంగాన్ని చేసి, విద్యార్థులను కార్యోన్ముఖులను చేయడానికి ప్రయత్నించిన ఆ అసాధారణ (Uncommon) వ్యక్తి భువనగరి చంద్రశేఖర్‌ని, అతను ప్రాతినిధ్యం వహిస్తుంది రాడికల్ విద్యార్థి సంఘానికని అప్పుడు తెలిసింది. అలా చంద్రశేఖర్‌తో ఏర్పడిన పరిచయం స్నేహంగా, కాలక్రమేణా గాఢానుబంధంగా మారింది. కాని మొదటిగా చంద్రశేఖర్ మూర్తిమత్వం (Personality)లో చూచిన తీవ్ర భావావేశం, ఒకింత ఆత్మాశ్రయాంశం (Element of Subjectivism), మరికొంత కొసవెర్రి (Eccentricity) తనంతో కూడిన వస్తు నిష్ఠ, లక్ష్యశుద్ధి అతని జీవితాంతం వరకు కొనసాగింది. అతను, అతని భావప్రాధమ్యాలు, వీటితో అతని సంపర్కం, సంసర్గం ఏ దశలో ఎలాసాగినా, మారినా - వీటితో మనకు ఏకీభావం ఉన్నా లేకపోయినా - చంద్రలో ఆ మూర్తిమత్వలక్షణం తుదకంటా నిలిచింది. కాని చంద్ర భావపరిణామంలో భాగంగా ప్రత్యేకించి తన జీవితంలో చివరి పన్నెండు సంవత్సరాల వ్యవధిలో అతను ఏర్పరచుకొన్న ప్రాపంచిక దృక్పథంతో ప్రస్తుత రచయితకు ఏకీభావం లేదు. అలానే చంద్ర భావపరిణామ క్రమాన్ని విమర్శనాత్మకంగా అంచనా వేసే పని ప్రస్తుత వ్యాస పరిధికిమించినది కనుక ఆ పనిని చేపట్టటంలేదు.



మార్క్సిజం - లెనినిజం - మావో ఆలోచనా విధాన ప్రాతిపదికగా పనిచేస్తున్న సి.పి.ఐ. (ఎం.ఎల్) పీపుల్స్‌వార్ రాజకీయాలవైపు కౌమార దశలోనే ఆకర్షితుడయ్యాడు చంద్ర. మాచర్ల, గుంటూరు పట్టణాలలో విద్యార్థిగా ఉంటూ రాడికల్ విద్యార్థి సంఘంలో కార్యకర్తగా, సంఘా నాయకునిగా క్రియాశీల పాత్ర పోషించాడు. ఈ క్రమంలో చంద్ర తనను తాను కేవలం రాజకీయ

జీవిగానే కాకుండా సాహిత్య, తత్వశాస్త్ర విద్యార్థిగా మలుచుకుంటూ అటు కార్యాచరణ, ఇటు సిద్ధాంత రంగంలో చురుకుగా ముందుకు సాగాడు.

1987-1988 మధ్యకాలంలో గుంటూరు కేంద్రంగా న్యాయవాద వృత్తి లోనికి ప్రవేశించిన చంద్ర పౌరహక్కుల ఉద్యమంలో అత్యంత చురుకైన పాత్ర నిర్వహించాడు. పౌరహక్కుల ఉద్యమ కార్యకర్తగా, నేతగా ఉద్యమ సిద్ధాంత రూపకల్పనలోను చంద్ర ఇతోధిక పాత్ర నెరపాడు. ఎన్‌కౌంటర్ కేసులలో, పోలీస్ కస్టడీలోని మరణాల వెనుక ఉన్న హక్కుల అణచివేతను, రాజ్యహింసను వెలికితీసి ప్రభుత్వ ద్వంద‌నీతిని ఎండగట్టడంలో చంద్ర అద్వితీయమైన శక్తి, సామర్థ్యాలను ప్రదర్శించాడు. ఈ క్రమంలో ఉద్యమ కార్యకర్తగాను, సైద్ధాంతిక పరిపుష్టి గలిగిన నేతగాను, న్యాయవాదిగాను జనజీవనంపై తనదైన ముద్రవేశాడు. ప్రత్యేకించి చిలకలూరిపేట బస్సు దహనం కేసులో చలపతి, విష్ణువర్ధనరావులకు విధించిన మరణశిక్షను యావజ్జీవ కారగార శిక్షగా మార్చేందుకు జరిగిన ఉద్యమంలోను, 1991 నాటి చుండూరు మారణకాండలోని దళిత బాధితుల పక్షం వహించి జరిపిన న్యాయపోరాటంలో చంద్రది చిరస్మరణీయమైన పాత్ర.

దోపిడీరహిత మానవ సమాజానికి, నూతన నాగరికత ఆవిర్భావానికి దారితీస్తుందనుకొన్న సోవియట్ యూనియన్, ఇతర తూర్పు ఐరోపా సోషలిస్టు దేశాల ప్రభుత్వాలు 1989-91 మధ్యలో కుప్ప కూలాయి. ఈ ప్రయోగం పట్ల చంద్ర, అతను ప్రాతినిధ్యం వహించిన రాజకీయ ఉద్యమ అభిప్రాయాలు వేరు. కాని సోషలిస్టు దేశాలలోని 1989-91 నాటి పరిణామాలు, వాటి పర్యవసానాలు అనేకమంది బుద్ధిజీవులను కుదిపినట్టుగానే మరొక పద్ధతిలో చంద్రను కూడా ప్రభావితం చేశాయి.

1987 నుండి విజయవాడ కేంద్రంగా - మార్క్సిజం చరిత్రను, అభివృద్ధిని విశాల ప్రాతిపదికగా చూడాలని, సోషలిస్టు దేశాలలోని పరిణామాలను విమర్శనాత్మకంగా పరిశీలించాలని -ప్రారంభమైన ఒక ఆలోచన 1989 నాటికి **మార్క్సిస్టు అధ్యయన వేదికగా** రూపుదిద్దుకొంది. మార్క్సిజం చరిత్రను మార్క్సి - ఏంగెల్స్, లెనిన్‌లకో లేక మార్క్స్, లెనిన్, మావోలకో పరిమితం చేయకుండా

మార్క్సిజాన్ని, మార్క్సిజం చరిత్రను దానిలోని భిన్నాభిప్రాయాలను మరింత సమదృష్టితో, వస్తుగతంగా పరిశీలించి, మదింపుచేసి, సోషలిస్టు ఆలోచనా, ఆచరణలో వచ్చిన సంక్షోభాన్ని పరిష్కరించుకోవాలన్న లక్ష్యంతో విజయవాడలో ప్రారంభమైన **మార్క్సిస్టు అధ్యయన వేదిక,** దాని నిర్వాహకుల ఆలోచన చంద్రలోని అంతర్మథనానికి తోడైంది. మార్క్సిజం - లెనినిజం - మావో ఆలోచనా విధానం ఆధారంగా సాయుధ పోరాటం ద్వారా భారతదేశంలో నూతన ప్రజాస్వామిక విప్లవం వస్తుందన్న చంద్ర రాజకీయ అవగాహనలో మార్పులు రాసాగాయి. ఈ దశలో జార్జి లూకస్, ప్రత్యేకించి ఇటాలియన్ మార్క్సిస్టు సిద్ధాంతవేత్త ఆంటోనియో గ్రాంసీ ఆలోచనలు చంద్రను బాగా ప్రభావితం చేశాయి. ప్రత్యేకించి ఆధిపత్య భావన, పౌరసమాజం, దానిలోని సంస్థలు సామాజిక మార్పులో నిర్వహించే పాత్ర లాంటి అంశం మీద గ్రాంసీ భావనలు చంద్రను బాగా ఆకర్షించాయి. అంటే రాజ్యం, దాని ఆధిపత్య పాత్రను పౌర సమాజంలోని వివిధ సంస్థలు ఏవిధంగా వ్యవస్థాగతం చేసి ఆధిపత్య వర్గపాలనకు సమ్మతిని చేకూర్చుతాయనే గ్రాంసీ భావన చంద్రను మంత్ర ముగ్ధుణ్ణి చేసిందనడం అతిశయోక్తి కాదు. మారిన పరిస్థితులలో - గ్రాంసీ ఆధిపత్య భావన, అలానే పౌరసమాజంలోని వివిధ సంస్థల ద్వారా శ్రామికవర్గ రాజ్య స్థాపనకు ప్రజామోదాన్ని సాధించడం ద్వారా జరిగే మార్పు మరింత పదిలంగా, సాపేక్షంగా నికరమైన మార్పులకు మార్గాన్ని సుగమనం చేస్తుందని చంద్ర భావించాడు. ఆ మేరకు గ్రాంసీ రచనలను, గ్రాంసీ ఆలోచనలన మీద రచనలను అధ్యయనం చేయడం ద్వారా అతనిని ఆవహింప చేసుకోవడానికి ప్రయత్నించాడు. ఈ నేపథ్యంగానే కొంతమంది చంద్ర మిత్రులు అతనిని గుంటూరు గ్రాంసీ అంటూ హాస్యమాడేవారు. ఆ దశలోనే విజయవాడలోని **మార్క్సిస్టు అధ్యయన వేదిక** ఆధ్వర్యంలో 1993లో గ్రాంసీ ఆలోచన మీద డా. సుజీతారు (హైదరాబాదు) మాట్లాడిన సభకు చంద్ర అధ్యక్షత వహించడం, యాదృచ్ఛికమేమి కాదు. తరువాత సుజీతారు ప్రసంగపాఠాన్ని తెలుగులోనికి తెచ్చి **మార్క్సిస్టు అధ్యయన వేదిక** తరపున అచ్చువేసిన పనిలో చంద్ర భాగస్వామయ్యాడు. గ్రాంసీ ప్రేరణతో 1980వ దశకంలో భారతదేశంలో

ముందుకొచ్చిన ఉపశ్రేణీ తత్వం (Subaltern Studies) కూడా చంద్ర మీద ప్రభావం నెరపింది.

పౌరహక్కుల ఉద్యమంలో భాగంగా తాను సాగించిన అధ్యయనంలో శాక్కో - వాంజెట్టి పై పరిశోధన చంద్ర భావపరిణామంలో ఒక కీలకదశ. రాజకీయ భిన్నాభిప్రాయాలను ప్రత్యేకించి వామపక్ష ఆలోచనలను అణచి వేసే క్రమంలో అమెరికా రాజ్యవ్యవస్థ మానవహక్కుల హననానికి ఏ విధంగా వడిగట్టిందో - శాక్కో - వాంజెట్టి కేసు చరిత్ర పూర్వ, పరాలను శోధించి ఒక వ్యాస పరంపర ద్వారా చంద్ర వివరించాడు. ఈ పరిశోధనను మరింత లోతుగా, విస్తృతంగా కొనసాగించి 1995లో శాక్కో - వాంజెట్టి పేరుతో ఒక బృహద్గ్రంధాన్ని వెలువరించాడు. 6-7 సంవత్సరాలపాటు దపాలవారిగా సాగించిన ఈ పరిశోధనలో - శాక్కో - వాంజెట్టి అరాచకవాద తత్వం తనను ఏవిధంగా ప్రభావితం చేసింది, ప్రత్యేకించి 1993-1995 మధ్యకాలంలో తనను ఆ తత్వం ఏవిధంగా పూనిందో చంద్ర పదేపదే చెబుతుండేవాడు.

పౌర హక్కుల ఉద్యమంలో భాగంగా చంద్ర భాగస్వామైన ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘానికి 1983 నుండి నాయకత్వం వహించి, ఆ సంస్థకు జవజీవాలు అందించిన మేధావి డా.కె. బాలగోపాల్. బాలగోపాల్ మేధోకృషి, నిర్మాణ దక్షత, నిరాడంబరత, నైతికవర్తన ప్రభావానికిలోనైన వారిలో చంద్ర ఒకడు. ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘ చరిత్ర రాయవలసి వస్తే, ఆ చరిత్రను బాలగోపాల్ ముందు, బాలగోపాల్ తరువాత దశలుగా విభజించవలసి ఉంటుందనే మేరకు బాలగోపాల్‌ను ఆవహింపచేసుకొన్నాడు చంద్ర.

ఒక దశాబ్దం పాటు (1983-1993) తాను నాయకత్వం వహించి, నిర్మించిన ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘం, దానికి సైద్ధాంతిక నేపథ్యంగా ఉన్న మార్క్సిజం పట్ల బాలగోపాల్‌లో సందేహాలు తలెత్తాయి. ఆ సందేహాలకు **చరిత్ర, మనిషి, మార్క్సిజం** పేరుతో వ్యాస రూపమిచ్చారు బాలగోపాల్. దాని మీద సుదీర్ఘ కాలంపాటు పెద్ద చర్చ జరిగింది. ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘం వేదికగా ప్రైవేట్, ప్రభుత్వ హింస, వీటిపట్ల సంఘం వైఖరి మీద ఒక చర్చ జరిగింది. అలానే పౌరహక్కుల సంఘం ఒక రాజకీయ పార్టీకి

అనుబంధంగా పనిచేయడమా లేక స్వతంత్రంగా వ్యవహరించడమా? ఏది అనుసరణీయం? ఈ చర్చలో చంద్ర ప్రత్యక్ష భాగస్వామి కాకపోయినప్పటికి ఆత్మీకంగా, ఉద్యమ సహచరునిగా బాలగోపాల్ వెంట నడిచాడు. అంతిమంగా హక్కుల సిద్ధాంతాన్ని పౌరహక్కుల పరిధి నుండి విస్తరించి మానవులందరికి విస్తరించాలన్న అవగాహనకు వచ్చిన బాలగోపాల్ 1997-1998 మధ్య కాలంలో మానవ హక్కుల వేదికను ప్రారంభించినప్పుడు చంద్ర కూడా ఆవేదికలో భాగస్వామై నూతన సహస్రాబ్ది ప్రారంభానికి ఆ వేదిక నుండి బయటకొచ్చాడు.

1993 - 1999ల మధ్య కాలంలో మార్క్సిజం, దానిలోని పరిమితులపట్ల కాని, దాని ప్రాసంగికతపట్ల కాని చంద్ర ఇదమిత్థమైన అభిప్రాయాలను వ్యక్తం చేయలేదు. ఒకనాటి ఉద్యమ సహచరుడు, తన చిరకాల మిత్రుడు డాక్టర్ బి. తిరుపతిరావు ఆధునికానంతర వాదం మీద సాగించిన అధ్యయనాన్ని బాగా సన్నిహితంగా చూశాడు చంద్ర. తాను కొంతమేరకు ఆధునికాంతరవాద సిద్ధాంతాలను, ప్రత్యేకించి మిషల్ ఫూకోను చదివారు. ఈ వాదపు సూక్ష్మ రాజకీయాల (Micro-politics) న్న భావన కూడా కొంతమేర, కొంత కాలంపాటు చంద్రను పట్టుకొంది. తిరుపతిరావుతో కలసి ఒకటి రెండు ఫూకో వ్యాసాలను అనువాదం కూడా చేశాడు. ఆధునికతపైన, శాస్త్రీయ దృష్టిపైన, కార్యకారణ సిద్ధాంతంపైనా, వస్తుగత దృష్టిపైన, ఒక్క మాటలో చెప్పాలంటే మహాకథనాలు, భావజాలాలు అంతమయ్యాయని, చరిత్ర పూర్వదశ అంతమై, నూతన నాగరికతకు దారితీసే సరికొత్త చరిత్ర ప్రారంభమౌతుందని చెప్పే మార్క్సిజంకు కాలం చెల్లిందనే ఆధునికానంతరం వాద విమర్శ ఎక్కడో చంద్రను పట్టుకొంది. బహుశా 1997-1999 మధ్యనే హైదరాబాద్‌లో స్త్రీ వాద బృందం ఆధ్వర్యంలో (Critical Legal Studies)పేరిట నెలకొకసారి అధ్యయనం శిబిరం జరిగేది. ఆ శిబిరానికి చంద్ర కూడా క్రమం తప్పకుండా హాజరయ్యేవాడు. మొత్తంగా మార్క్సిజం మీద ఆధునికానంతర మీద విమర్శలు, దానిలోని తాత్విక ఆత్మాశ్రయవాదం, Critical Legal Studies బృందంతో తన సంసర్గం చంద్రాను ముందుగా ఆధునికత వ్యతిరేక శిబిరంలోనికి చేర్చినట్లు కనిపిస్తుంది. మార్క్సిజం మీద ప్రత్యేకంగా విమర్శచేయకపోయినప్పటికి, దానిని ఆధునికత కొనసాగింపుగా

చూసిన చంద్ర, ఆధునికతపై విమర్శననే దానికి వర్తింప చేశాడు. దీనికి తోడు అమెరికాలో స్థిరపడిన పోలిష్ సామాజిక శాస్త్రవేత్త జిగ్మంట్ బౌమన్ ప్రవచనాలు, ప్రత్యేకించి ఆధునికతపై అతని విమర్శ 2000-2003 మధ్య కాలంలో చంద్రను బాగా ప్రభావితం చేశాయి. 2002లో రాణి శివశంకర్ శర్మ Last Brahmin వెలువరించించాడు. చంద్ర భావపరిణామంలో - లాస్ట్ బ్రాహ్మిణ్, దానిలోని భావ సముచ్ఛయ ప్రభావమేమిటో తెలియదు. కాని తన వాదనకు మరో వాదన తోడైంది. పాశ్చాత్య ప్రపంచాన్నీ, ఆధునికతను, పెట్టుబడిదారీ విధానాన్ని, వలసవాదాన్ని, క్రైస్తవాన్ని ఒకటిగా చూపి సర్వ అనర్థాలకు ఈ సమ్మిశ్రితమే కారణమనే బలమైన అభిప్రాయానికి వచ్చాడు చంద్ర. ఈ సమ్మిశ్రిత ప్రభావం ఫలితంగానే మనిషి తన సామూహిక (Communitarian) ప్రాకృత స్థితి నుండి ఏకాంతక జీవి (Atomistic Individual)గా పరిణమించాడు. అంటే మనిషి చైతన్య పూరితంగా మనిషిగా మారే క్రమాన్ని వెనక్కి మళ్ళించి, ఆధునిక పూర్వ సమాజానికి కి వెళ్ళడంలోనే సత్యం (సత్), శివం (చిత్) సుందరా ( ఆనంద్)న్ని సాక్షాత్కరింప చేసుకోగలమని చంద్ర గట్టిగా నమ్మాడు. అందుకనే పౌరహక్కులే కాదు, అసలు మానవ హక్కులనే భావనే వలసవాద భావన అని, అది మానవ వ్యతిరేక ప్రవచనం అని, కుల సమస్యకాని, దీనిలో భాగంగా ఉన్నత, నిమ్నమనే భావన కాని వలసవాద కళ్ళగంతల (Blinkers) ఫలితమని, ఈ కళ్ళగంతను వదిలించుకొని ఏ కులాలవారు ఆ కులాలకు దగ్గరకు వెళ్ళడం ద్వారా తాము కోల్పోయిన సమూహ అస్థిత్వాన్ని (Communitarian Identity) జీవ అస్థిత్వాన్ని (Species being) తిరిగి ప్రోది చేసుకోవాలని చంద్ర భావించాడు. భావించడమే కాదు. తనను తాను బ్రాహ్మణుడుగా చెప్పుకోవడానికి వెనుకాడ లేదు. అసలు అక్షరాస్యతే వలసవాద పథకంలో భాగమని, అలాంటి ప్రలోభాలకు లోను కాకుండా ఎవరి కులవృత్తినివారు ఆచరించడం ద్వారా ఏకాంత జీవితం నుండి సమూహ జీవితానికి వెళ్ళాలని విశ్వసించి, గట్టిగా వాదించేవాడు చంద్ర.

2003-2005ల మధ్య కాలంలో తన అస్థిత్వాన్ని, తన సమూహ అస్థిత్వాన్ని దేశీయ మూలాల్లో వెతుక్కోవడం ప్రారంభించి అద్వైతాన్ని, అందులోను శంకరాద్వైతాన్ని ఆశ్రయించాడు. ఇందుకు గురు ముఖతా సంస్కృత

భాషాధ్యాయనాన్ని చేపట్టాడు. వేద సాంప్రదాయం మీద గ్రంథ సేకరణ, అధ్యయనం ప్రారంభించాడు. పూజ, పునస్కారాలు, దైవదర్శనాలు చేసుకొనేవాడు.

జీవిక కొరకు వలసవాదం ఫలితమైన న్యాయవాద వృత్తిని చేపట్టి, కొనసాగిస్తున్నప్పటికి వీలైనంత త్వరలో ఆ వృత్తిని త్యజించాలని భావించాడు. తన ఊరికి దగ్గరిగా, కృష్ణానది దక్షిణపు ఒడ్డున శివక్షేత్రమైన దైద సమీపంలో త్వరలో నివాసమేర్పరచుకోవాలని తలచాడు. అందుకు కొద్దిగా భూమిని సేకరించాడు. త్వరలోనే అక్కడ నివాసమేర్పరచుకొని ప్రకృతినిరమిస్తూ, దానితోగమిసస్తూ సమూహ అస్థిత్వాన్ని అన్వేషించుకొందామనుకుంటున్న తరుణంలోనే అరుదైన కాన్సర్ వ్యాధి బారినపడి జనవరి 22, 2013న విగత జీవుడయ్యాడు చంద్ర.



ప్రసుత వ్యాస సంపుటిలో చోటుచేసుకొన్న వ్యాసాలు చంద్ర పరిణామాన్ని ఏదో ఒకమేరకు మాత్రమే పాఠకునికి పట్టిస్తాయి. అంటే 1980 దశకం నుండి 2012 వరకు తన ఉద్యమ, వృత్తి వత్తిడిల మధ్య చంద్ర రాసుకుంటూ వచ్చిన ఈ వ్యాస సంకలనం అతని మూర్తిమత్వం, దానిలోని వైరుధ్యాలను, వైచిత్రులను, విశిష్టతలను, మానవ దృష్టిని, భావావేశాన్ని, లక్ష్యశుద్ధిని లేశమాత్రమే వ్యక్తం చేస్తుందని మాకు తెలుసు. ఇంత సైద్ధాంతిక సుసంగత్వం (Consistency) లేకుండా, జీవిత వివిధ దశలలో తనకు ఎదురైన కొత్త సిద్ధాంతాల పట్ల కొంత వ్యామోహంతో, మరికొంత మోజుతో, ఒకింత కొత్తదనాన్ని ఆహ్వానించాలనే తపనతో వెరుధ్యాల పుట్టగా సాగిన చంద్ర అన్వేషణ, భావ పరిణామం వెనుక అన్ని దశలలోను ఒక అంతఃసూత్రం కనిపిస్తుంది. అది అథోజగత్ సహోదరులపట్ల - అది ఎన్‌కౌంటర్ల పేరుతో రాజ్యహింసకుగురైన వారి హక్కుల పరిరక్షణ సందర్భంలోకాని, ఏ వ్యక్తి ఎంతటి నేరం చేసిన వారికి ఉరిశిక్షవేయడం తాత్వికంగా సబబుకాదని చలపతి, విష్ణువర్ధన్ కేసు నేపథ్యంలో వాదించి, నడిచిన ఉద్యమంలో ముందుపీఠాన నిలిచిన సందర్భంలోగాని, చుండూరులో అమానుష దాడికి గురైన దళితుల పక్షంవహించి, వారికి న్యాయపోరాటాన్ని

విజయవంతంగా నడిపించడంలో గాని, కర్నూల్ జిల్లా ఎస్.పి. దాష్టికానికి బలై విగతజీవులైన గిరిజనుల హక్కుల పోరాటాన్ని ఢిల్లీ వరకు తీసుకుపోయిన సందర్భంలోకాని - చంద్రకున్న సానుభూతి కాని, సహానుభూతి కాని, త్వమేహ భావన కాని, అన్నింటికి మించి తనకున్న నిబద్ధత అచంచలమైంది. ఈ వర్గాల, శ్రేణుల హక్కులపట్ల చంద్రకున్న ఆర్తి, ఆర్ధ్రత తిరుగులేనిది.

కులాలకు, ప్రాంతాలకు, భాషలకు అతీతంగా తాను వివాహం చేసుకొన్నా, సబ్బన్న జాతులను పోగేసి పండిత చర్చచేసినా, భావజాలపరంగా భిన్న దృక్పథాలకు చెందిన వారికి తన ఇంటిని ఒక వాదోపవాదాల వేదికగా చేసి అతిథ్యమివ్వడం చంద్రకే చెల్లు.

తన జమానలో - వర్తమాన సంబంధాలు విధించిన పరిమితుల్లో - డబ్బును మారక విలువ తప్ప ఆస్తి సంబంధంగా చూడని అరుదైన మరో లక్షణం చంద్ర స్వంతం.

చంద్రను నిన్న అభినందించినా, నేడు స్మరించుకొంటున్నా దానికి కారణం అతని మూర్తిమత్వంలోని ఈ లక్షణ సమూహాల పార్శ్వమే. దానికి జోహార్.

విజయవాడ
ఫిబ్రవరి 15, 2014

**ఎన్. అంజయ్య**

# 1. శాక్కో - వాంజెట్టీ

“చార్లెస్ టౌన్ జైలు, మెస్సాచూసెట్స్, మంగళవారం, ఆగస్టు 23-1927. బ్రైన్‌ట్రీలో 1920 ఏప్రిల్ 15న జరిగిన హత్యలకు విధించిన శిక్ష అనుభవిస్తూ నికోలా శాక్కో, బార్టలోమియో వాంజెట్టి ఈ రోజు అర్ధరాత్రి కరెంటు కుర్చీల్లో మరణించారు.

శాక్కో 12.11కి కరెంటు కుర్చీ దగ్గరికి నడిచాడు. 12.19కి చనిపోయాడని ప్రకటించారు. వాంజెట్టి 12.20కి మృత్యువాటికలోకి ప్రవేశించాడు. 12.26కి ప్రాణం పోయిందని నిర్ధారించారు.  తాము ఏ తప్పు ఎరగమని వాళ్ళు చివరి దాకా ఘోషిస్తూనే ఉన్నారు. అమెరికా న్యాయ విజ్ఞానశాస్త్ర చరిత్రలో ఎన్నడూలేని విధంగా న్యాయస్థానాల్లోనూ, బయటా పోరాడినప్పటికీ వాళ్ళు నిర్దోషులని నమ్మినవాళ్ళు చేసిన ప్రయత్నాలు విఫలమయ్యాయి.

శాక్కో, వాంజెట్టీలు కరెంటు కుర్చీని సమీపిస్తున్న సమయంలో కూడా ఆరేళ్ళు మరణశిక్ష విధించబడి జైల్లో ఉన్న ఈ మనుషులకోసం న్యాయస్థానాల్లో జరుగుతున్న యుద్ధం కొనసాగుతూనే ఉంది. విలయమ్స్ టౌన్‌లోని ఫెడరల్ జడ్జి జార్జి అండర్సన్‌ను హెబియస్ కార్పస్ రిట్ అడిగేందుకు ఒక న్యాయవాది విమానంలో ప్రయాణిస్తూనే ఉన్నాడు.

అర్ధరాత్రి అయ్యేసరికి నార్త్ ఎండ్‌లో ఉన్న సాలెమ్ వీధిలో ఐదొందలమంది ఇటాలియన్లు జరుపుతున్న బహిరంగసభను పోలీసులు భగ్నం చేశారు. బంకర్‌హిల్ స్మృతి చిహ్నం దగ్గర ప్రదర్శన జరుపుతామని ప్రదర్శకులు భయపెట్టారు. స్టేట్‌హౌస్ ఎదురుగా ఉన్న ‘కామన్’ (గడ్డి మైదానం) లో నిరసన సభ జరుపుతామని కూడా వాళ్ళు బెదిరించారు.

జైలు చుట్టూ కట్టిన తాళ్ళకు బయట ఉన్న స్థలంలో గుమికూడిన అనేక వేల మందిని గుర్రాలపై ఉన్న పోలీసులు చెదరగొట్టారు. బంకర్ హిల్ దాకా వెళ్ళే ఊరేగింపులో కలవడానికి థామస్ స్క్వేర్‌లో రెండొందలమంది శాక్కో, వాంజెట్టి సానుభూతిపరులు పోగయ్యారు. రెచ్చిపోయిన ఆ గుంపును చెదరగొట్టడం వాహనాల్లేని పోలీసులకు సాధ్యం కాలేదు. గుర్రాలమీది పోలీసులు లాఠీచార్జి చేసి స్త్రీ పురుషులను పిల్లలను అలలాగా వెనక్కి తరిమారు. చాలా మంది గాయపడ్డారు. మెల్లగా నడుస్తున్న ఇద్దరు మహిళలను పోలీసులు అరెస్టు చేసి కేసు పెట్టారు.

ప్రధాన వీధి పొడవునా వెయ్యికి పైగా కార్లు నిలిచిపోయాయి. దారంతా వాహనాలు ఆగిపోయి పాదచారుల, పోలీసుల మార్గానికి అంతరాయం కలిగింది. రకరకాల వాహనాలతో వీధంతా గందరగోళంగా తయారయ్యింది. పోలీసులు కేకలేస్తుంటే, పోలీస్ గుర్రాల గిట్టల ఇనుప నాడాలు పేవ్‌మెంటు మీద ధ్వనిస్తుంటే కార్లు నడిపే వందలమంది అదే పనిగా హారన్లు మోగిస్తుంటే ఆ ప్రదేశమంతా భీభత్స ధ్వనుల మయం అయింది. సినిమా ఫొటోగ్రాఫర్లు మండుతున్న కాల్షియం టార్చిలైట్లు ఎత్తిపట్టుకుని, గుర్రాలపై కూర్చుని ముందుకి వెనక్కి భయానకంగా కదులుతున్న పోలీసుల సజీవ దృశ్యాలపై వెలుగు ప్రసరిస్తూ, ముదురు బూడిద రంగు జైలుగోడలపై పోలీసుల నిశ్శబ్ద చిత్రాల నీడలను ఆడిస్తుంటే అదొక అసహజ యుద్ధ దృశ్యంగా గోచరించింది.''

ఇది శాక్కో, వాంజెట్టీలను కరెంటు కుర్చీలు ఆహుతిగొన్న రోజున ప్రముఖ అమెరికా దినపత్రిక న్యూయార్క్ టైమ్స్‌లో పతాక శీర్షికన ప్రచురించబడ్డ వార్త.

శాక్కో, వాంజెట్టీలు నిర్దోషులని, వాళ్ళను కరెంటు కుర్చీకి ఆహుతి చెయ్యొద్దని అప్పటికి ఏడు సంవత్సరాలుగా జరుగుతున్న ప్రపంచ ప్రజల ఆందోళన ఆరోజు తారాస్థాయికి చేరింది. న్యూయార్క్‌లోని యూనియన్ స్క్వేర్‌లో, కొలరాడోలో లక్షలమంది జనం ఆ రాత్రి మౌన ప్రదర్శన చేశారు. మరణ శిక్ష అమలు జరిగే సమయంలో కూడా శిక్షను ఆపమని అభ్యర్థిస్తూ డెన్‌వర్‌లో విజ్ఞాపన పత్రాల మీద సంతకాలు సేకరిస్తూనే ఉన్నారు.

మెస్సాచూసెట్స్ గవర్నర్‌కు టెలిగ్రామ్‌లు పంపుతూనే ఉన్నారు. బోస్టన్‌లో ఉన్న స్టేట్‌హౌస్ (శాసనసభా భవనం) కు ఫోన్ కనెక్షన్ కావాలని టెలిఫోన్ ఆపరేటర్లను బతిమాలుతూనే ఉన్నారు. శాన్‌ఫ్రాన్సిస్కోలో ఆ సమయంలో శాక్కో, వాంజెట్టీ డిఫెన్స్ కమిటీ కార్యాలయంలో చివరి ప్రయత్నాలుగా టెలిగ్రాంలు రాస్తూనే ఉన్నారు.

అమెరికాలోని ఎన్నో నగరాల్లో పట్టణాల్లో 'శాక్కో-వాజెట్టీ డిపెన్స్ కమిటీ' ఆఫీసుల ముందు ఆ రాత్రి జనం వేలాదిగా సమావేశమై శాక్కో, వాంజెట్టీలు నిర్దోషులని నిర్ద్వంద్వంగా నినదించారు. బోస్టన్‌లో గవర్నర్ పుల్లర్ ఇంటిముందు ఉదయం నుంచే వేలమంది జనం బారులు కట్టి పికెటింగ్‌కు సిద్ధమయ్యారు.

శాక్కో, వాంజెట్టీలు చార్లెస్ టౌన్ జైల్లో చంపబడే సమయంలో లండన్ నగరంలో ఇంకా ఉదయం ఐదుగంటలు కాలేదు. తెల్లవార్లూ జాగారం చేసిన బ్రిటీష్ బొగ్గుగని కార్మికులు, బట్టలమిల్లు శ్రామికులు, ఓడ రేవు పనివాళ్ళూ మరణవార్త విని కొయ్యబారిపోయారు.

బ్రెజిల్‌లో, పెరూలో, చిలీలో, బొలీవియాలో అమెరికా రాయబార కార్యాలయాల ఎదుట జనం నిరసన ప్రదర్శన చేశారు. అనేక దేశాల్లో అమెరికా రాయబార కార్యాలయాల మీద బాంబు దాడులు జరిగాయి. వార్సాలో ఆరోజు ప్రదర్శనలు నిషేధించబడ్డాయి. నిషేధాజ్ఞలు ధిక్కరించి ప్రదర్శన చేస్తున్న ప్రదర్శకులను పోలీసులు చెదరగొట్టారు. తమలాంటి కార్మికులను హత్య చెయ్యొద్దని సిడ్నీలో ఓడరేవు కార్మికులు సమ్మెచేసి ఊరేగింపు జరిపారు. బొంబాయిలో బట్టల మిల్లు కార్మికులు గంటసేపు పని స్థంభింపజేశారు. టోక్యోలో అమెరికా రాయబార కార్యాలయం ముందు ప్రదర్శన జరుపుతున్న కార్మికులపై పోలీసులు లాఠీ చార్జి చేసి చెదరగొట్టారు. ప్రపంచం మొత్తం ఆ రోజు శాక్కో, వాంజెట్టీల మరణశిక్ష రద్దు కోసం గొంతెత్తింది.

అమెరికాలో స్థిరపడ్డ, అరాచకవాదులైన ఈ ఇటాలియన్ ప్రవాసులను విడుదల చేయాలని ఫెలిక్స్ ఫ్రాంక్‌ఫర్టర్, రస్కో పాండ్, జాన్ డాస్ పాస్సోస్ లాంటి వందలమంది అమెరికా ప్రముఖులు, మరెందరో యూరోపియన్ మేధావులు ఏడేళ్ళపాటు రాత్రింబవళ్ళు కృషిచేశారు. 'శాక్కో, వాంజెట్టి డిఫెన్స్

కమిటీ'ని ఏర్పాటుచేసి అమెరికా అంతటా పర్యటించి లక్షల డాలర్లు వసూలు చేసి చివరి క్షణం దాకా పోరాడారు. కానీ కసాయి అమెరికా పాలకులు కనికరించలేదు.

సరైన ఇంగ్లీషు కూడా మాట్లాడలేని శాక్కో, వాంజెట్టీలను చూసి అమెరికా ప్రభుత్వం ఎందుకు గడ గడ లాడింది? చెప్పులు కుట్టి బతికే శాక్కో, చేపలమ్మి జీవించే వాంజెట్టీ లక్షల మెదళ్ళను ఎలా కుదిపేశారు? ఒక తరం మేధావులకు వాంజెట్టీ హీరో ఎలా అయ్యాడు? నాలుగు పదులైనా నిండకముందే శాక్కో, వాంజెట్టీల జీవితాలు ఎంత ఆవేదనగా, అన్యాయంగా, అర్ధాంతరంగా, సంచలనాత్మకంగా ముగిశాయి? మరణించిన అర్ధశతాబ్దం తర్వాత కూడా వాళ్ళిద్దరికోసం ప్రజలెందుకు పోరాడారు?

**డిసెంబరు 14, 1987 - ఉదయం**

# 2. రెడ్స్‌పై పామర్ రెయిడ్స్
## (దాచేస్తే దాగని సత్యం)

సోషలిజం కావాలని చెప్పే అందరినీ అమెరికాలో 'రెడ్స్' లేదా 'రాడికల్స్' అని పిలుస్తారు. అమెరికా వ్యవస్థను అనేక దశాబ్దాల పాటు కుదిపేసిన ఈ 'రెడ్స్'లో ఎక్కువ మంది యూరప్ నుండి అమెరికాకు వలసవచ్చిన ప్రవాసులే.

అమెరికాలో పందొమ్మిదో శతాబ్దపు రెండో అర్థ భాగంలో పరిశ్రమలు బాగా అభివృద్ధి అయ్యాయి. పెరిగిన పరిశ్రమల్లో పనిచేసేందుకు ఈ కాలంలో పెద్ద ఎత్తున శ్రామికులు అవసరమయ్యారు. త్వరగా చౌకగా ఎక్కువ సంఖ్యలో కావాల్సిన ఈ శ్రామికుల కొరతను యూరప్ నుండి వచ్చిన లక్షలాది మంది ఆదివాసులు తీర్చారు.

1907, 1908 సంవత్సరాల్లో అమెరికా ప్రవాసుల తాకిడికి బాగా గురైంది ఈ ప్రవాసుల్లో ఇటాలియన్లది మొదటిస్థానం.

ప్రవాసులు అమెరికా పరిశ్రమల్లో కారు చౌకకు అమ్ముడుపోయారు. గొడ్డుచాకిరీ చేస్తూ అష్టకష్టాలు పడ్డారు. మురికివాడల్లో జీవిస్తూ తమ రక్తంతో, చెమటతో అమెరికా నాగరిక వ్యవస్థని నిర్మించారు. తమ కష్టాలకు కారణం పెట్టుబడిదారీ దోపిడి అని ఈ ప్రవాసులు గ్రహించినా దాన్నుండి బయటపడటం ఎలానో వీళ్లకు మొదట్లో అర్థం కాలేదు. సరైన సిద్ధాంత మార్గదర్శకత్వం లేని ఈ పరిస్థితి అనేక తీవ్రభావాలకు తలుపులు తెరిచింది. ఆ భావాలు చాలా తక్కువ కాలమే జీవించినా విస్తృతంగా ప్రచారమై జనాన్ని బాగా ఆకర్షించాయి.

కష్టాలతో విసిగి వేసారిన ఈ ప్రవాసులను, ఇతర అమెరికా కార్మికులను బాగా ఆకర్షించిన సిద్ధాంతం అరాచకవాదం, దోపిడీ వ్యవస్థను బలప్రయోగంతో కూలదోసి దాని స్థానంలో మానవుల స్వేచ్ఛా కార్య ప్రాతిపదికగా రాజ్యం లేని

సోషలిస్టు సమాజాన్ని నిర్మించాలనేది అరాచకవాదుల ఆశయం. సోషలిజంలో ప్రభుత్వం అవసరం లేదని ప్రభుత్వం ఏ రూపంలో ఉన్నా ప్రజలపై నిరంకుశ పెత్తనం చేస్తుందని వీళ్ళు వాదిస్తారు.

అమెరికాలో 20వ శతాబ్దం ప్రారంభమయ్యే నాటికి కార్మికోద్యమం బాగా బలం పుంజుకుంది. సోషలిస్టులు, అనేక అరాచక వాద గ్రూపుల కృషితో 1905లో చికాగో నగరంలో 'ఇంటర్నేషనల్ వర్కర్స్ ఆఫ్ ది వరల్డ్' (ఐ.డబ్ల్యూ.డబ్ల్యూ) ఏర్పడింది. పెట్టుబడిదారీ వర్గానికి వ్యతిరేకంగా ఐ.డబ్ల్యూ.డబ్ల్యూ నిర్దాక్షిణ్యంగా పోరాడింది. అనేక సమరశీల సమ్మె పోరాటాలు నడిపింది. యూజిన్‌డెబ్స్ లాంటి ఎందరో గొప్ప కార్మిక నాయకులను సృష్టించింది.

అందరూ తప్పనిసరిగా సైన్యంలో చేరాలని ఆదేశిస్తూ 1917లో అమెరికాలో నిర్బంధ సైనిక విధానం ప్రవేశపెట్టారు. సైన్యంలో చేరడానికి నిరాకరించిన అనేకమంది రెడ్స్ మెక్సికోకు ప్రవాసం వెళ్ళారు. కొందరు మారుపేర్లతో రహస్యంగా పనిచేశారు. మరెందరినో ప్రభుత్వం అరెస్టు చేసింది. ఎంతోమంది ప్రవాసుల ఆస్తులను ప్రభుత్వం స్వాధీనం చేసుకుంది.

మొదటి ప్రపంచయుద్ధంలో చాలా తక్కువ నష్టపోయిన అమెరికా పెట్టుబడిదారులు తమ ఆర్థిక వ్యవస్థకు బలం చేకూర్చుకుని లాభాల వేటలో మరింతగా విజృంభించారు. కార్మికులను పీల్చి పిప్పిచేయడం మొదలు పెట్టారు. దానితో కార్మికులు మరింతగా రెడ్స్‌వైపు ఆకర్షింపబడ్డారు. అప్పుడే విజయవంతమైన రష్యా విప్లవం కార్మికులను గాఢంగా ప్రభావితం చేసింది. ఫలితంగా 1919లో అనేక సమ్మెలు జరిగాయి. ప్రభుత్వం కార్మిక సంఘాలపై విరుచుకుపడి వేలాదిమంది రెడ్స్‌ను నిర్బంధించింది. కానీ ఉద్యమం ఆగలేదు.

1919 ఏప్రిల్‌లో కొందరు ప్రముఖ న్యాయమూర్తులకు, కేబినెట్ సభ్యులకు, ఇతర ప్రముఖులకు బాంబులు పోస్ట్ చేయబడ్డాయి. ముందుగానే కనిపెట్టి ప్రమాదాన్ని నివారించగలిగారు గానీ సంఘటనతో సంబంధం ఉన్న ఏ ఒక్కర్నీ పోలీసులు అరెస్టు చేయలేక పోయారు.

ఇది జరిగి రెండు నెలలు కాకుండానే ఎనిమిది నగరాల్లో రెడ్స్‌కి వ్యతిరేకులైన ప్రభుత్వ ప్రముఖుల ఇళ్ళపై అర్ధరాత్రి బాంబుదాడులు జరిగాయి. వాషింగ్టన్‌లో అటార్నీ జనరల్ మిచ్చెల్ పామర్ ఇంటిమీద బాంబులు పేలాయి.

అక్కడికక్కడే ఇద్దరు చనిపోయారు. కానీ పామర్ వెంట్రుక వాసిలో ప్రమాదం తప్పించుకున్నాడు. న్యూయార్క్‌లో జడ్జి నాట్ మేడ బాంబుదాడికి ధ్వంసమయింది. బోస్టన్‌లో రెడ్స్‌కి శిక్షలువేసిన జడ్జి హేడెన్ ఇల్లు, క్లీవ్‌లాండ్ మేయర్ భవంతి నేలమట్టమయ్యాయి.

ఈ దాడులు అమెరికా అంతటా కలవరం సృష్టించాయి. రెడ్స్‌ను తిరిగి తలెత్తకుండా అణిచేయాలని ప్రభుత్వం భావించింది. అందుకోసం రహస్య సన్నాహాలు జరిగాయి. అటార్నీ జనరల్ మిచ్చెల్ పామర్ నాయకత్వంలో పథకాలు రూపొందాయి. పెద్ద ఎత్తున రెడ్స్ పై దాడులు, సోదాలు, అరెస్టులు మొదలయ్యాయి. ఈ దాడులే అమెరికా చరిత్రలో ప్రసిద్ధికెక్కిన 'పామర్ రెయిడ్స్'.

రెడ్స్‌కు వ్యతిరేకంగా ప్రజల్లో ఉన్మాదాన్ని రెచ్చగొట్టాడు పామర్. అమెరికాలో 60 వేలమంది విజాతీయ రాడికల్స్ ఉన్నారని వాళ్ళు బాంబులు, బుల్లెట్లతో రక్తపాత విప్లవం చేసేందుకు కుట్ర చేస్తున్నారని అభూత కల్పనలతో అతిశయోక్తులు ప్రచారం చేశారు.

ఒకేసారి పెద్ద ఎత్తున దాడిచేసి రెడ్స్ అందరినీ అరెస్టు చేయాలని పామర్ నాయకత్వంలో న్యాయశాఖ పథకం సిద్ధం చేసింది. 1920 జనవరి 2 రాత్రి 33 నగరాల్లో, వందలాది పట్టణాల్లో సభలూ, సమావేశాలూ జరుగుతున్న ఇళ్ళు, లాడ్జి హాళ్ళు, కార్మిక సంఘాల కార్యాలయాలు, కాన్ఫరెన్సు హాళ్ళు, చర్చిలమీద పోలీసులు హఠాత్తుగా దాడి చేశారు. మూడువేల మందిని అరెస్టు చేసారు.

దాదాపు ఒక ఏడాది పాటు ఇలా నిరంతరాయంగా జరిగిన పామర్ రెయిడ్లలో మొత్తం ఐదువేలమంది అరెస్టయ్యారు. ఆరువేలమంది విజాతీయ రాడికల్స్‌పై అరెస్టు వారెంట్లు జారీ చేశారు. వెయ్యిమందిని దేశం నుండి బహిష్కరించారు. దుర్భరమైన అమెరికా జైళ్లలో ఎంతోమంది ఆత్మహత్యలు చేసుకున్నారు. కొందరు పిచ్చివాళ్ళయ్యారు. మరికొందరు ప్రవాసం పంపబడ్డారు. అంతటా భయ వాతావరణం అలుముకుంది.

## అరెస్టు

రెడ్ వ్యతిరేక ఉన్మాదం తీవ్రస్థాయిలో ఉన్న 'పామర్ రెయిడ్స్' కాలంలో మెస్సాచుసెట్స్ రాష్ట్రంలో ఉన్న సౌత్ బ్రైన్ ట్రీ పట్టణంలో ఒక దోపిడి జరిగింది. జీతాల కోసం ఒక ఫ్యాక్టరీ నుండి మరో ఫ్యాక్టరీకి డబ్బు తీసుకెళ్తున్న గార్డును,

కాషియర్‌ను ఎవరో చంపి 16వేల డాలర్లు దోపిడీ చేసి కారులో పారిపోయారు.

సౌత్ బ్రైన్ ట్రీ హత్యలు జరిగిన మూడు వారాల తర్వాత ఓ రోజు రాత్రి శాక్కో, వాంజెట్టీలు కొందరు స్నేహితులతో కలిసి బ్రిడ్జివాటర్‌లో ఉన్న జాన్సన్ గేరేజీకి వెళ్ళారు. ఆ గేరేజీలో ఉంచిన తమ స్నేహితుడి కారు తీసుకుని ఆ రాత్రి ప్లిమత్ వెళ్ళాలని వాళ్ళనుకున్నారు. పామర్ దాడులతో అంతటా భయమేఘాలు అలుముకున్న ఆ సమయంలో తమ దగ్గరున్న విప్లవ సాహిత్యాన్ని పోలీసు బారినుండి రక్షించేందుకు, కారులో ప్లిమత్ వెళ్ళి ఒక మిత్రుడిని సహాయం అడగాలనేది వాళ్ళు ఆ రాత్రి చేద్దామనుకున్న పని.

కానీ కారు నంబర్‌ను ఆ సంవత్సరం రెన్యువల్ చేయించలేదని, రెన్యువల్ చేయించిన తర్వాత తీసుకెళ్ళడం మంచిదని గేరేజీ యజమాని జాన్సన్ చెప్పడంతో కారు తీసుకోకుండానే వెనక్కు వెళ్ళిపోయారు.

ఆ రాత్రి తమ ఇంటికొచ్చిన ఈ ఇటాలియన్లను చూసి జాన్సన్ బార్యకు అనుమానం వచ్చింది. బ్రైన్ ట్రీ హత్యల తర్వాత ఎవరైనా విజాతీయులు కారు కోసం వస్తే తెలియజెయ్యమని పోలీసులు చేసిన హెచ్చరిక ఆమెకు గుర్తుకు వచ్చింది. శాక్కో, వాంజెట్టీలు తమ ఇంటి ముందు ఉన్న సమయంలోనే పక్క ఇంటికెళ్ళి బ్రాక్‌టన్ పోలీస్ స్టేషన్‌కు ఫోన్ చేసింది.

జాన్సన్ ఇంటి నుండి వెళ్లిన శాక్కో, వాంజెట్టీలు కొద్ది సేపటి తర్వాత బ్రాక్‌టన్ వైపు వెళ్ళే ట్రామ్ కారులో ప్రయాణిస్తుండగా పోలీసులు అరెస్టు చేశారు.

అరెస్టయ్యే సమయంలో ఇద్దరి జేబుల్లో రివాల్వర్లు ఉన్నాయి. తమను రెడ్స్‌గా అనుమానించి పామర్ రెయిడ్స్‌లో బాగంగా అరెస్టు చేస్తున్నారని అనుకొని శాక్కో, వాంజెట్టీలు పోలీసుల ప్రశ్నలకు సరిగా సమాధానాలు చెప్పలేదు. తమ ఉనికిని తెలియనీయకుండా జాగ్రత్త పడ్డారు.

వీళ్ళిద్దరినీ 'రెడ్స్'గా గుర్తించిన పోలీసులు వీళ్ళపై బ్రైన్‌ట్రీ దోపిడీ - జంటహత్యల కేసు బనాయించారు.

శాక్కో, వాంజెట్టీలు ఇద్దరూ ఇటలీ నుండి అమెరికాకు వలస వచ్చి మెస్సాచుసెట్స్ రాష్ట్రంలో స్థిరపడ్డ తాత్విక అరాచక వాదులే. ఇద్దరూ మంచి

స్నేహితులు. ఇటలీలోని టోల్ మాగ్గియోస్ పట్టణంలో గంపెడు సంతానం ఉన్న నిరుపేద కుటుంబంలో 1891 లో పుట్టాడు శాక్కో. తండ్రి ఆలివ్‌నూనె అమ్మడంతో పాటు వ్యవసాయం కూడా చేసేవాడు.

తన 14వ ఏట తండ్రికి సాయపడేందుకు శాక్కో, చదువుమానేశాడు. రెండేళ్ళతర్వాత మెకానిక్ పని నేర్చుకున్నాడు. 1908లోసైన్యం నుండి తిరిగొచ్చిన తన అన్న అమెరికా వలస వెళ్తుండటంతో స్వేచ్ఛా ప్రపంచంగా భ్రమించి అమెరికా చేరుకున్నాడు.

అమెరికా వచ్చిన కొత్తలో పొట్ట చేతపట్టుకుని అనేక పనులు చేస్తూ తిరిగాడు. ఓ కాంట్రాక్టు కంపెనీలో నీళ్ళు మోసే కుర్రవాడిగా చేరాడు. తర్వాత అక్కడే రాళ్ళు మోసే వాడిగా ప్రమోట్ అయ్యాడు. ఓడ కూలీగా పనిచేశాడు. 1910లో ఓ చెప్పుల కంపెనీలో చేరి పని నేర్చుకుని ఏడు సంవత్సరాల పాటు అక్కడే పనిచేశాడు. ఆ సమయంలోనే అరాచకవాద భావాలకు ఆకర్షితుడయ్యాడు.

మొదటి ప్రపంచ యుద్ధకాలంలో అమెరికాలో నిర్భంధ సైనిక విధానం ప్రవేశపెట్టడంతో అరాచకవాది కాబట్టి సైన్యంలో చేరడానికి నిరాకరించి 1917 జూన్‌లో కుటుంబాన్ని వదలి మెక్సికో వెళ్ళాడు. రెండ్నెల్ల తర్వాత మెక్సికో నుండి తిరిగొచ్చి 1918లో శాంతి ఒప్పందం జరిగిందాకా మస్సకోటెల్లి అనే మారుపేరుతో రహస్యంగా తిరిగాడు. ఆ తర్వాత 3-కె చెప్పుల కంపెనీలో చేరి అరెస్టయిందాకా అక్కడే పనిచేశాడు. అప్పటికి అతనికి భార్య, ఇద్దరు పిల్లలున్నారు.

ఇటలీలోని కునియో ప్రాంతంలో విల్లె ఫెల్లెట్టో పట్టణంలో పేద కుటుంబంలో 1888లో జన్మించాడు వాంజెట్టీ. తండ్రి వ్యవసాయంతో పాటు చిన్న వ్యాపారం చేస్తూ కుటుంబాన్ని పోషించేవాడు. పదమూడేళ్ళ వయసులో చదువుకు స్వస్తిచెప్పి కునియో నగరానికి వెళ్లి స్వీట్లు తయారు చేసే ఫ్యాక్టరీలో వంటవాడిగా వాంజెట్టీ జీవితం ప్రారంభించాడు. 1908లో తన ఇరవయ్యవ ఏట అమెరికాకు వచ్చాడు.

అమెరికాకు వచ్చిన మొదటి రెండేళ్ళూ న్యూయార్క్‌లోని అనేక రెస్టారెంట్లలో వంటవాడిగా పనిచేశాడు. తర్వాత న్యూ ఇంగ్లండ్ ప్రాంతంలో ఉన్న క్వారీల్లో, ఇటుక బట్టీల్లో, రోడ్లువేసే పనిలో సంవత్సరం పైగా కూలివాడిగా

శ్రమించాడు. రైలు పట్టాలు వేసే పని చేశాడు. రాళ్ళు మోశాడు. ప్లిమత్‌లో ఐసులు పగలగొట్టే పనిలో చేరి 1913 నుండి ప్లిమత్‌లోనే స్థిరపడ్డాడు. కొన్నాళ్ళు ఒక బంగళాలో పనిమనిషిగా కూడా ఉన్నాడు.

సైన్యంలో చేరకుండా మొదటి ప్రపంచ యుద్ధకాలంలో ఒక సంవత్సరంపాటు మెక్సికోలో గడిపాడు. మెక్సికో నుండి తిరిగివచ్చిన తర్వాత 1918 నుండి ప్లిమత్‌లో తోపుడు బండిమీద చేపలు అమ్ముతూ జీవించాడు.

పుస్తకాలు విపరీతంగా చదివే వాంజెట్టీ, జీవితంలో కష్టాలను వడపోసిన వాంజెట్టీ ఈ క్రమంలో తాత్విక అరాచక వాది అయ్యాడు. బ్రహ్మచారిగానే మృత్యువు అతడ్ని ఆవహించింది.

**డిసెంబర్ 21, 1987 - ఉదయం**

# 3. నేరమే న్యాయ పీఠమెక్కినప్పుడు...
## (దాచేస్తే దాగని సత్యం)

శాక్కో, వాంజెట్టీలు అరెస్టయిన సంవత్సరం తర్వాత 1921లో డెడ్‌హోం సుపీరియర్ కోర్టులో వాళ్ళపై బ్రైన్‌ట్రీ హత్య కేసు విచారణ ప్రారంభమైంది. ఈ విచారణ ప్రారంభమయ్యేలోగా వాంజెట్టీ ఒక్కడినీ బ్రిడ్జి వాటర్‌లో జరిగిన ఒక దోపిడీ ప్రయత్నం కేసులో ప్రత్యేకంగా యిరికించి డెడ్ హోం కోర్టులోనే విచారించారు. పన్నెండు నుంచి పదిహేను సంవత్సరాల దాకా జైలు శిక్ష వేశారు. మళ్ళీ అదే కోర్టు, అదే జడ్జి, అదే ప్రాసిక్యూటర్, అమెరికా న్యాయ సంప్రదాయాల ప్రకారం 12 మంది జ్యూరీ సభ్యులను ఎన్నిక చేసి జడ్జి థేయర్ కేసు విచారణ జరిపారు. 1921 మే 31న ప్రారంభమైన విచారణ వరుసగా 45 రోజుల పాటు కొనసాగింది.

విచారణ జరిగే సమయంలో కోర్టు కిక్కిరిసిన జనంతో నిండిపోయేది. అమెరికాలోని దాదాపు అన్ని దినపత్రికలు కేసు విచారణ వార్తలను ఎప్పటికప్పుడు ప్రచురించాయి.

శాక్కో, వాంజెట్టీలు నిర్దోషులని ప్రజలు భావించారు. వీళ్ళను కేసు నుండి రక్షించేందుకు అనేకమంది అమెరికా ప్రముఖులతో ''శాక్కో వాంజెట్టి డిఫెన్స్ కమిటీ'' ఏర్పడి నిర్విరామంగా కృషి చేసింది. అమెరికా అధ్యక్షుడు వుడ్రోవిల్సన్‌కు న్యాయ సలహాదారుడిగా పనిచేసి తర్వాత సుప్రీంకోర్టు న్యాయమూర్తి అయిన ప్రొఫెసర్ ఫెలిక్స్ ఫ్రాంక్‌ఫర్టర్, ప్రసిద్ధ న్యాయశాస్త్రవేత్త, హార్వర్డ్ లాస్కూల్ డీన్ రస్కోపాండ్, హార్వర్డ్ లాస్కూల్ ప్రొఫెసర్ జబేరియా చాఫీ లాంటి ప్రముఖులెందరో డిఫెన్స్ కమిటీలో సభ్యులు.

'అమెరికన్ సివిల్ లిబర్టీస్ యూనియన్', 'అమెరికన్ కమిటీ ఫర్‌ది ప్రొటెక్షన్ ఆఫ్ ఫారిన్ బార్న్' లాంటి సంఘాలు డిఫెన్స్ కమిటీలో చురుగ్గా పనిచేశాయి.

కమ్యూనిస్టులు, సోషలిస్టులు, అరాచక వాదులు, అనేకమంది కార్మిక నాయకులు కలిసికట్టుగా శాక్కో, వాంజెట్టీల విడుదల కోసం సాగిన ఉద్యమంలో పని చేశారు.

డిఫెన్స్ కమిటీ నాయకులు అంతటా విరాళాలు, పత్రికా ప్రకటనలు, ఊరేగింపులు పికెటింగులు, విజ్ఞాపనపై సంతకాలు సేకరించడమే కాక, పికెటింగుల్లో అరెస్టయి లాఠీ దెబ్బలు తిన్నారు. జైళ్ళకెళ్ళారు. న్యాయస్థానాల్లో పోరాటం కూడా చేశారు.

ప్రాసిక్యూషన్ కథనం ప్రకారం గార్డు బెరార్డెల్లీపై కాల్పులు జరిపిన హంతకుడు శాక్కో అని, పారిపోయే సమయంలో అతనే జనం మీదకి కాల్పులు జరిపాడని ఆరోపించింది. ఆ సమయంలో కారు నడిపిన వ్యక్తి వాంజెట్టీ అని వాదించింది.

ముందుగానే వేసుకున్న పథకం ప్రకారం అమెరికా న్యాయశాఖ అనేక తప్పుడు సాక్ష్యాలు సృష్టించింది. శాక్కో, వాంజెట్టీలు అరెస్టు అయి బ్రాక్‌టన్ పోలీస్ స్టేషన్‌లో ఉన్న రోజుల్లో తమ సాక్షులనేకమందికి ముందుగానే వీళ్ళను చూపించి ముఖాలు బాగా గుర్తుంచుకునేట్లు చేశారు. ఇలా చేయడం చట్ట విరుద్ధం. జడ్జి థేయర్, జూరీ సభ్యులు అందరూ కరడుగట్టిన రెడ్ వ్యతిరేకులు. శాక్కో, వాంజెట్టీ నేరస్థులన్న దురభిప్రాయాన్ని ముందుగానే తమ మనసుల్లో ఏర్పరచుకొన్నారు. 'నిందితుడిగా కోర్టులో నిలబెట్టబడ్డ వ్యక్తి ఏ మాత్రం సందేహం లేకుండా దోషిగా రుజువయిందాకా నిర్దోషే' అన్న ప్రాథమిక న్యాయ సూత్రాన్ని కూడా జడ్జి గౌరవించలేదు. సాక్షుల విచారణలో కూడా పక్షపాతంగా వ్యవహరించాడు. డిఫెన్సు లాయర్లు ప్రవేశపెట్టిన బలమైన సాక్ష్యాలను కూడా జడ్జి త్రోసిపుచ్చాడు. అయినా కాల్పులు జరుపుతుంటే ప్రత్యక్షంగా చూసిన ఏ ఒక్కరినీ కూడా ప్రాసిక్యూషన్ సాక్షిగా తీసుకు రాలేకపోయింది.

బ్రైన్‌ట్రీలో హత్య చేయబడబోయే రెండు నిమిషాల ముందు రైల్వే గేటు దగ్గర క్యాషియర్ పార్మెంటర్‌తో మాట్లాడిన బోస్టాక్ ప్రాసిక్యూషన్ సాక్షుల్లో ఒకడు.

ఇతను శాక్కో, వాంజెట్టీలను సరిగా గుర్తు పట్టలేకపోయాడు. కారులో పారిపోతున్న హంతకులను చూసిన సాక్షులని చెప్పి ప్రాసిక్యూషన్ కొంతమందిని పట్టుకొచ్చింది. వాళ్ళలో మేరీ స్ప్లైన్ అనే యువతి ప్రధాన సాక్షి.

ఈమెకు అనేకసార్లు బ్రాక్టన్ స్టేషన్‌కు పిలిపించి శాక్కో, వాంజెట్టీల ముఖాలు బాగా గుర్తుంచుకునేట్లు తర్ఫీదు ఇచ్చారు.

స్లేటర్ మోరెల్ కంపెనీలో పనిచేస్తున్న స్ప్లైన్ పెరల్ వీధిలో కాల్పుల చప్పుడు విని, తనున్న భవనంలోని రెండో అంతస్థు కిటికీలోంచి, కారులో పారిపోతున్న హంతకులను చూశానని చెప్పింది. కారులో నుండి రోడ్డు మీది జనంపై కాల్పులు జరిపిన వ్యక్తి శాక్కో అని పోలికలు చెప్పింది.

పధ్నాలుగు అడుగులకు పైగా ఎత్తున్న భవనం రెండవ అంతస్తు నుండి, 80 అడుగుల దూరంలో 20 మైళ్ళవేగంతో రోడ్డు మీద పోతున్న కారులో ఉన్న వ్యక్తి ముఖాన్ని స్పష్టంగా గుర్తు పట్టడం ఎలా సాధ్యమని డిఫెన్స్ లాయర్లు క్రాస్ ఎగ్జామినేషన్‌లో ప్రశ్నించారు.

రక్తం మడుగులో పడి ఉన్న హతుడు బెరార్డెల్లీ పక్కనే రివాల్వర్‌తో శాక్కో నిలుచుని వుండటం తాను పనిచేసే రైస్ అండ్ హచిన్స్ కంపెనీ భవనంలో ఉండి చూశానని లూయిస్ పెల్సర్ చెప్పాడు. అతడిని వుద్యోగంలో నుండి ఊడబీకడంతో శాక్కో, వాంజెట్టీలు హంతకులని కోర్టులో పోలీసుల తరపున తప్పుడు సాక్ష్యం చెప్తానని హామీ యిచ్చిన తర్వాత అతన్ని తిరిగి ఉద్యోగంలోకి తీసుకున్నారు.

హంతకులు తనను బెదిరించి గేటు తెరిపించారని రైల్వే గేట్‌మాన్ చెప్పాడు. ఆ సమయంలో కారు నడుపుతున్న వ్యక్తి వాంజెట్టీ అని చూపించాడు.

వాంజెట్టీ తన జీవితంలో ఎప్పుడూ కారు నడపలేదు. డిఫెన్స్ లాయర్ జెరెమీ మెక్ ఎనార్నీ గేట్‌మాన్‌ను ఒంటరిగా కలిసి మాట్లాడినప్పుడు వాంజెట్టీ హంతకుల కారులో లేడని చెప్పాడు. సంఘటన జరిగినప్పుడు గేట్‌మాన్‌తో పాటు అక్కడే ఉన్న ఓ రైల్వే ఫైర్‌మన్ డిఫెన్స్ తరపున సాక్ష్యమిచ్చాడు. తుపాకీ కాల్పులు వినగానే గేట్‌మాన్ తన హాంటీ (లెవెల్ క్రాసింగ్ పక్కనున్న చిన్నగది)లో దాక్కున్నాడని చెప్పాడు.

విచారణ ప్రారంభమైన పధ్నాలుగు రోజుల తర్వాత ప్రాసిక్యూషన్ కొత్త ఎత్తుగడ వేసింది. అరెస్టయిన సమయంలో శాక్కో, వాంజెట్టీలు దోషుల్లాగా ప్రవర్తించారని, అలాంటి 'దోషులమన్న భావన'ను బట్టి వారిద్దరూ హంతకులని నిర్ధారణ అవుతుందని వాదించింది. ఈ విషయాన్ని కనీసం ప్రారంభ ప్రకటనలో కూడా ప్రస్తావించలేదు.

ఈ 'దోషులం అన్న భావన'ను నిరూపించేందుకు పోలీసులకు శాక్కో, వాంజెట్టీల ఆచూకీ తెలిపి అరెస్టుకు తోడ్పడ్డ గేరేజీ యజమాని భార్య, శాక్కో, వాంజెట్టీలను అరెస్టు చేసిన బ్రాక్‌టన్ పోలీసు అధికారి సాక్ష్యం చెప్పారు.

రాత్రిపూట తమ యింటికొచ్చి కారు కావాలని అడిగిన శాక్కో, వాంజెట్టీలు అనుమానాస్పదంగా ప్రవర్తించారని, ఫోన్ చేసేందుకు బయటికెళ్ళిన తనను వెంబడించారని, గేరేజీ యజమాని భార్య చెప్పింది. అరెస్టు చేస్తున్న సమయంలో అనేక అబద్ధాలు చెప్పి, జేబులో ఉన్న రివాల్వర్లు బయటికి తీయడానికి ప్రయత్నించి నేరస్థులమన్న భావన ప్రదర్శించారని పోలీస్ అధికారి చెప్పాడు.

నిజానికి, అరెస్టు చేసిన సమయంలో శాక్కో, వాంజెట్టీల ప్రవర్తనకు, హత్యలకు సంబంధం లేదు. అప్పట్లో జరుగుతున్న 'పామర్ దాడుల' లో భాగంగా తమను రెడ్స్‌గా అనుమానించి పోలీసులు అరెస్టు చేస్తున్నారనుకొని పోలీసులకు తమ ఉనికి తెలియనీయకూడదనుకొని కొన్ని అబద్ధాలు చెప్పారే తప్ప హంతకులైనందువల్ల కాదు.

బెరార్జెల్లీ శవం పక్కనే పడి ఉన్న టోపీకి శాక్కోకి సంబంధం కలిపేందుకు శాక్కో, వాంజెట్టీల దగ్గర దొరికిన ఆయుధాలకు హత్యలకు ముడిపెట్టేందుకు తన సాక్ష్యాలు ముగించే ముందు ప్రాసిక్యూటర్ మూడు రోజులు కష్టపడ్డాడు.

బెరార్జెల్లీ శరీరంలోకి దూరిన ఆరు బుల్లెట్లలో ఆరవ బుల్లెట్ మాత్రమే మరణానికి కారణమని శవపరీక్ష జరిపిన డాక్టర్ చెప్పాడు. ఆ బుల్లెట్ శాక్కో దగ్గర దొరికిన. 32 కోల్ట్ ఆటోమాటిక్ పిస్టల్ నుండి పేల్చబడిందేనని ప్రాసిక్యూషన్ వాదించింది. ఈ విషయాన్ని ధృవీకరించేందుకు ప్రాసిక్యూషన్ ప్రవేశపెట్టిన ఇద్దరు సాక్షుల్లో మారణాయుధ నిపుణుడు విలియం ప్రోక్టార్ ఒకరు. ప్రోక్టార్ అప్పటికి సాక్ష్యం చెప్పిన దాదాపు వంద కేసుల్లో నిందితులకు మరణశిక్ష వేశారు.

కాని ప్రొక్టార్ సాక్ష్యం అంత స్పష్టంగా లేదు. మరణానికి కారణమని చెప్పబడ్డ బుల్లెట్. 32 కోల్ట్ పిస్టల్ నుండి పేల్చబడింది కాదని డిఫెన్స్ సాక్షులను ప్రవేశపెట్టింది. కాట్రిడ్జ్ తుపాకుల కంపెనీలో పనిచేస్తున్న 30 ఏళ్ళ అనుభవం ఉన్న మారణాయుధ నిపుణుడు జేమ్స్ బర్న్ ఈ విషయం చెప్పాడు. కోల్ట్ రివాల్వర్ ఫ్యాక్టరీలో రివాల్వర్లు పరీక్షించే ఒక ఇంజనీర్ కూడా జేమ్స్ బర్న్ చెప్పిందే నిజమని చెప్పాడు. హత్యానేరంలో వాంజెట్టీ పాల్గొన్నాడనడానికి దాఖలాగా అరెస్ట్ చేసిన సమయంలో అతని దగ్గర దొరికిన రివాల్వర్‌ను చూపించారు. ఆ రివాల్వర్ హతుడు బెరార్డెల్లీదని, వాంజెట్టీ హతుడి నుండి దాన్ని లాక్కున్నాడని ప్రాసిక్యూషన్ వాదించింది. తన వాదనకు బలం చేకూర్చేందుకు బెరార్డెల్లీ చనిపోయే కొద్ది రోజులముందు రివాల్వర్‌ను రిపేర్ చేయించి కొత్త సుత్తి వేయించాడని చెప్పి ఒక రివాల్వర్ కంపెనీ ఉద్యోగుల చేత సాక్ష్యం చెప్పించారు. బెరార్డెల్లీ తన రివాల్వర్‌ను రిపేర్ కంపెనీకి ఇచ్చినట్లుగా రిజిస్టర్‌లో నమోదు అయ్యింది కాని తిరిగి బెరార్డెల్లీ తీసుకున్నట్లుగా రాసిలేదు. ఈ విషయాన్ని డిఫెన్స్ లాయర్లు బయట పెట్టారు. ప్రాసిక్యూషన్ తరఫున వచ్చిన ఇతర సాక్షులు కూడా రివాల్వర్ బెరార్డెల్లీ దేనని నిర్దిష్టంగా చెప్పలేకపోయారు. వాంజెట్టీ తరపున ఆయుధ నిపుణుడు జేమ్స్ బర్న్ మళ్ళీ కోర్టుకొచ్చి రివాల్వర్‌ను రిపేర్ చేసి కొత్త సుత్తి వెయ్యలేదని శాస్త్రాధారాలతో వివరించి చెప్పాడు. ఈ రివాల్వర్ వాంజెట్టీ దగ్గర ఎంతోకాలంగా ఉన్నదే. తనే సొంతంగా కొనుక్కున్నాడు. అసలు హత్యలు జరిగిన రోజు శాక్కో, వాంజెట్టీలు బ్రైన్‌ట్రీలో లేనేలేరని డిఫెన్స్ లాయర్లు సాక్ష్యాలు ప్రవేశపెట్టారు. బ్రైన్ ట్రీ హత్యలు జరిగే కొద్దిరోజుల ముందు తల్లి చనిపోయినట్లు శాక్కోకు తండ్రి ఇటలీ నుండి ఉత్తరం రాశాడు. ఇటలీ వెళ్ళి ముసలి తండ్రితో గడుపుదామనుకుని శాక్కో నిర్ణయించుకుని ఇటలీ ప్రయాణ ఏర్పాట్లు చేసుకునేందుకు ఏప్రిల్ 15నాడు (బ్రైన్ ట్రీ హత్యలు జరిగిన రోజు) బోస్టన్ వెళ్ళి అక్కడి ఇటాలియన్ దౌత్య కార్యాలయాధికారిని కలిసాడు. పని పూర్తికాకపోవడంతో స్టాటన్‌కు తిరిగి వెళ్ళిపోయాడు. దౌత్యకార్యాలయానికి వెళ్ళేముందు ఓ రెస్టారెంట్‌లో కలిసిన జర్నలిస్ట్ మిత్రుడు ప్రొఫెసర్ గుడనాగి, ఇటాలియన్ పత్రిక 'లానాట్జియ' సంపాదకుడు ఆంటానియో డెంటామోర్‌తో కలసి మాట్లాడాడు.

శాక్కోతో ఏప్రిల్ 15 నాడు మాట్లాడిన ఇటాలియన్ దౌత్య కార్యాలయాధికారి ఇటలీ వెళ్ళిపోవడంతో ఆయన ఆ విషయాన్ని ధృవీకరిస్తూ కోర్టుకు అఫిడవిట్ పంపాడు. ప్రొఫెసర్ గుడనాగి, సంపాదకుడు డెంటామోర్‌లు కోర్టుకొచ్చి తమతో ఆరోజు రెస్టారెంట్‌లో శాక్కో మాట్లాడాడని చెప్పారు. వాంజెట్టి ఏప్రిల్ 15నాడు కూడా చేపలమ్ముతూనే ఉన్నాడని కూడా సాక్ష్యాలు చూపించారు. విచారణ జరుగుతూ వుండగా ఓ రోజు కోర్టు హాల్‌లో బోనులో నిలబడి ఉన్న శాక్కో దృష్టి ప్రేక్షకుల్లో ఒక వ్యక్తిపై పడింది. ఏప్రిల్ 15 నాడు బోస్టన్ నుండి బయలుదేరిన రైల్లో తనతోపాటు ప్రయాణించిన వ్యక్తి అని శాక్కో గుర్తుపెట్టాడు. అతని పేరు జేమ్స్ హేయస్. డిఫెన్స్ కమిటీ వెంటనే హేయస్‌ను కలిసింది. హేయస్ కూడా ఏప్రిల్ 15 నాటి రైలు ప్రయాణాన్ని గుర్తుకు తెచ్చుకుని తనెక్కిన పెట్టెలోనే శాక్కో ఎక్కి ఆ రోజు బోస్టన్ నుండి స్టాటన్ దాకా ప్రయాణించాడని కోర్టులో చెప్పాడు. ప్రాసిక్యూషన్ సాక్షులు, డిఫెన్స్ సాక్ష్యాలు పూర్తయ్యేసరికి రెండు వేల పేజీలకు పైగా కోర్టు రికార్డు తయారైంది. న్యాయమూర్తి సహాయంతో ప్రాసిక్యూటర్ కేసు పరిధిలోకి రాని అనేక ప్రశ్నలను క్రాస్ ఎగ్జామినేషన్‌లో అడిగాడు. కావాలని డిఫెన్స్ సాక్షులను ప్రశ్నలతో పక్క దోవ పట్టించాడు.

డిఫెన్స్ లాయర్లకు మాత్రం క్రాస్ ఎగ్జామినేషన్‌కు సరైన అవకాశం ఇవ్వలేదు. అవసరమైన ప్రశ్నలు కూడా వెయ్యకుండా జడ్జి, ప్రాసిక్యూటర్‌లు ఇద్దరూ అడ్డుపడ్డారు. శాక్కో, వాంజెట్టీల రాజకీయ అభిప్రాయాల గురించి ప్రాసిక్యూటర్ తరచుగా ప్రశ్నించాడు.

**డిసెంబరు 28, 1987 - ఉదయం**

# 4. 'మరణమే న్యాయానికి శరణ్యం!'
## (దాచేస్తే దాగని సత్యం)

శాక్కో, వాంజెట్టీలకు ఇంగ్లీష్ సరిగ్గా రాకపోవడం వల్ల కోర్టులో దుబాసీగా వ్యవహరించిన వ్యక్తి చాలా అనుమానాస్పదమైన వ్యక్తిత్వం ఉన్నవాడు. కోర్టులో వేసిన ప్రశ్నలను ఇంగ్లీష్ నుండి ఇటాలియన్‌లోకి తర్జుమా చేసి చెప్పేటప్పుడు చాలా మోసపూరితంగా వ్యవహరించాడని తర్వాత అర్థమైంది. ప్రాసిక్యూషన్ సాక్ష్యాలు ఎంత బలహీనంగా ఉన్నా డిఫెన్స్, ఎంత బలమైన సాక్ష్యాలు చూపించినా కోర్టు పట్టించుకోలేదు. శాక్కో, వాంజెట్టీలను చూడకముందే శిక్ష వేద్దామనుకున్నవాడు జడ్జి థేయర్. జ్యూరీ సభ్యులంతా రెడ్ వ్యతిరేక ఉన్మాదంతో వూగిపోతున్నవాళ్ళు. కాబట్టి వాళ్ళకు చట్టంతో, సాక్ష్యాలతో పనిలేక పోయింది. సాక్ష్యాలు, వాదనలు అయిపోయాయి. కేసు ముగిస్తే ఇళ్ళకెళ్ళి తమ పనులు చేసుకోవచ్చునని జ్యూరీ సభ్యులంతా తహతహలాడుతున్నారు. చివరికి 1921 జూలై 19వ తేదీన శాక్కో, వాంజెట్టీలు హంతకులని జ్యూరీ సభ్యులు పన్నెండుమంది ఏకగ్రీవంగా నిర్ధారించారు.

సాక్షుల విచారణ పూర్తయి శాక్కో, వాంజెట్టీలు హంతకులని జ్యూరీ నిర్ణయించిన తర్వాత అనేక కొత్త విషయాలు, సరికొత్త నిజాలు వెలుగులోకి వచ్చాయి. కొత్తగా తెలిసిన వాస్తవాల ఆధారంగా మళ్ళీ విచారణ జరిపించాలని డిఫెన్స్ కమిటీ విశ్వ ప్రయత్నాలు చేసింది.

జ్యూరీ నాయకుడైన రిప్లే 'వెధవల్ని ఏ రకంగానైనా ఉరితీస్తాం' అని చేసిన వ్యాఖ్యల్ని, అసలు హంతకులను తాను చూశానని చెప్పిన రేజర్ సామాన్లమ్మి బతికే గార్డ్ మాటల్ని సాక్ష్యాలుగా తెచ్చినప్పటికీ జడ్జి థేయర్ రకరకాల నెపాలతో విచారణకు స్వీకరించడానికి నిరాకరించాడు. శాక్కో పిస్టల్ నుండి పేల్చిన

తూటాలవల్లే బెరార్డల్లీ మరణించాడని తాను చెప్పడంలేదని, తన సాక్ష్యాన్ని కోర్టు అపార్థం చేసుకుందని ప్రాసిక్యూషన్ సాక్షి, మారణాయుధ నిపుణుడు ప్రోక్టార్ కోర్టులో ఎదురు తిరిగినా జడ్జి దాన్ని త్రోసిపుచ్చాడు. చివరికి 1926 మే 12న సుప్రీం జ్యుడిషయల్ కోర్టు బెంచ్ తన సుదీర్ఘ నిర్ణయంతో కేసు తిరిగి విచారణ జరపాలన్న అభ్యర్థనను త్రోసి పుచ్చింది.

అప్పటికి ఆరేళ్ళు గడిచాయి. ఈ ఆరేళ్ళుగా కోర్టుల్లోనూ బయటా డిఫెన్స్ కమిటీ చేస్తున్న ప్రయత్నాలేవీ ఫలించకపోవడంతో ఇక శాక్కో, వాంజెట్టీలకు మరణశిక్ష తప్పదని అందరూ అనుకున్నారు. ఈ సమయంలో ఓ ఆశ్చర్యకర విషయం వెలుగులోకి వచ్చింది.

శాక్కోను నిర్బంధించిన వార్లెస్ టౌన్ జైలులోనే మెడేరాస్ అనే 24 ఏళ్ళ పోర్చుగీసు యువకుడు ఒక దోపిడి కేసులో మరణశిక్ష విధించబడి నిర్బంధించ బడ్డాడు. 1925 నవంబర్ నెలలో ఒకరోజు మెడేరాస్ దినపత్రిక నొకదాన్ని ఒక జైలు ఉద్యోగికి ఇచ్చి దాన్ని శాక్కోకు అందజేయమని బతిమాలాడు. ఆ దినపత్రిక అంచులలో మెడేరాస్ రాసిన ఈ వాక్యాలు శాక్కోను ఆకర్షించాయి. ‘‘సౌత్ బ్రైన్‌ట్రీ చెప్పుల కంపెనీ హత్యలు చేసిన ముఠాలో నేను ఉన్నాను. శాక్కో, వాంజెట్టీలకు ఈ నేరంతో సంబంధంలేదని ఇందుమూలంగా నేను ఒప్పుకుంటున్నాను - సెలెస్టినో మెడేరాస్.’’

డిఫెన్స్ కమిటీకి వెంటనే శాక్కో ఈ సంగతి కబురు పెట్టాడు. డిఫెన్స్ లాయర్లు మెడేరాస్ దగ్గరికి పరిగెత్తారు. బ్రైన్‌ట్రీలో ఆ రోజు నేరం ఎలా జరిగిందో మెడేరాస్ వివరంగా చెప్పాడు. హత్యలు జోమొరెల్ అనే అతడి ముఠాతో జరిగిందని, అందులో తానున్నానని చెప్పాడు. జోమొరెల్‌కు శాక్కో పోలికలున్నాయి. తాము చేసిన నేరానికి ఏ పాపం ఎరుగని శాక్కో, వాంజెట్టీలను శిక్షించడం చూసి బాధపడి తాను ఈ విషయాలు బయటపెడుతున్నానని చెప్పాడు మెడేరాస్. జైల్లోనే ఉన్న మెడేరాస్ స్నేహితుడు జేమ్స్ వీక్‌ను కూడా డిఫెన్స్ కమిటీ కలిసి మరికొన్ని నిజాలు సేకరించింది.

ఈ వివరాలు తెలుసుకున్న తర్వాత వివిధ జైళ్ళలో నిర్బంధించబడి ఉన్న జోమొరెల్‌ను, అతని ముఠా సభ్యులను డిఫెన్స్ లాయర్లు కలిశారు. కానీ వాళ్ళు మాట్లాడడానికి నిరాకరించారు. పోలీసు అధికారులు జోమొరెల్ ముఠాకు కొన్ని ఆశలు చూపించి డిఫెన్స్ కమిటీతో మాట్లాడకుండా అడ్డుకున్నారు.

మెడేరాస్, వీక్ పేరుమీద అఫిడవిట్లు దాఖలు చేయించింది డిఫెన్స్. అయితే ప్రాసిక్యూషన్ కూడా తమకు అనుకూలంగా జోమొరెల్ చేత, అతని ముఠా సభ్యుల చేత కౌంటర్ అఫిడవిట్లు దాఖలు చేయించింది. మెడేరాస్ ఎవరో తమకు అసలు తెలియదని జోమొరెల్ చేత చెప్పించారు. చివరికి జడ్జి థేయర్ డిఫెన్స్ అభ్యర్థనను తిరస్కరించాడు. మెడేరాస్ సాక్ష్యం ఆధారంగా కేసును తిరిగి విచారించారు. బోస్టన్ హెరాల్డ్ దినపత్రిక 1926 అక్టోబర్ 26న 'We Submit' (మా మనవి) అనే శీర్షికతో రాసిన సంపాదకీయం ప్రపంచ ప్రఖ్యాతిగాంచింది. ఈ సంపాదకీయం రాసినందుకు లారిస్టన్ బుల్లర్జ్‌కు పులిట్జర్ బహుమతి ఇచ్చారు.

బలమైన ఆధారాలున్న మెడేరాస్ పిటీషన్‌ను కూడా తిరస్కరించడంతో ఇక తిరిగి న్యాయ విచారణ జరుపుతారన్న ఆశ కనుచూపుమేరలో కనిపించలేదు. ప్రభుత్వం పగబట్టి శాక్కో, వాంజెట్టీలను క్రూరంగా హత్య చేయడానికే నిర్ణయించుకుందని అందరూ భావించారు.

## మరణశిక్ష

మళ్లీ న్యాయ విచారణ జరపమని అడిగేందుకు డిఫెన్స్ కమిటీకి ఇక అవకాశాలేమీ లేకపోయాయి. కేసు ముగించి శిక్ష విధించమని కామన్‌వెల్త్ (మెస్సాచుసెట్స్ రాష్ట్ర ప్రభుత్వాన్ని అలా పిలుస్తారు) తరఫున జిల్లా అటార్నీ జడ్జిని కోరారు. త్వరగా తీర్పు చెప్పించి, మరణశిక్ష కూడా అమలుపరిస్తే పేచీ వదులుతుందని ప్రాసిక్యూషన్, జడ్జి భావించారు.

పందొమ్మిది వందల ఇరవై ఏడు ఏప్రిల్ తొమ్మిదో తేదీన ఉదయం 10 గంటలకు డెడ్‌హాం పట్టణంలో సుపీరియర్ క్రిమినల్ కోర్టు సమావేశమయింది.

జడ్జి థేయర్ తన స్థానంలో ఆశీనుడయ్యాడు. ప్రాసిక్యూటర్ కట్జ్‌మన్ స్థానంలో విల్బర్ ఎన్‌ఫీల్డ్ వచ్చాడు. శాక్కో, వాంజెట్టీల తరఫున థామ్సన్, ఎర్వ్‌మన్ హాజరయ్యారు.

కోర్టు ప్రారంభమైంది. శాక్కో, వాంజెట్టీలు హంతకులని ఎలాంటి సందేహాలకు తావులేకుండా 'నిరూపించబడింది' కాబట్టి శిక్ష విధించమని ప్రాసిక్యూషన్ జడ్జిని కోరాడు. ఇక వివరంగా శాక్కో, వాంజెట్టీలు చెప్పేదేమైనా ఉంటే చెప్పుకున్న తర్వాత తీర్పు ప్రకటించాలి.

కోర్టు గుమాస్తా నికొలా శాక్కో, నీపై మరణ శిక్ష ఎందుకు విధించరాదో ఏమైనా చెప్పుకుంటావా?

(శాక్కో వచ్చీరాని ఇంగ్లీషులో మాట్లాడటం ప్రారంభించాడు)

ఎస్ సర్! నేను వక్తనుకాను. నాకు ఇంగ్లీషు రాదు.

ఈ కోర్టుకంటే క్రూరమైన కోర్టుగురించి నేనెక్కడా వినిలేదు, కనలేదు, చరిత్రలో చదవలేదు. ఏడు సంవత్సరాల విచారణానంతరం కూడా మమ్మల్నిప్పటికీ మీరు దోషులుగానే చూస్తున్నారు. ఇవాళ ఈ పెద్ద మనుషులు మాతో యుద్ధానికి సన్నద్ధమయ్యారు.

ఈ కేసు రెండు వర్గాల మధ్య అని నాకు తెలుసు. పీడిత వర్గం, ధనికవర్గం, ఈ రెంటికీ మధ్య ఘర్షణ ఎప్పుడూ ఉంటూనే ఉంది. పుస్తకాల ద్వారా, సాహిత్యం ద్వారా మేం ప్రజలతో స్నేహం చేస్తాం. ప్రజల్ని మీరు క్రూరంగా శిక్షిస్తారు. వాళ్లపట్ల దుర్మార్గంగా ప్రవర్తిస్తారు. వాళ్ళను చంపుతారు. మేం ప్రజల్ని నిరంతరం విజ్ఞానవంతుల్ని చేస్తుంటాం. మాకు, మరో జాతికీ మధ్య మీరు అడ్డుగోడలు సృష్టించి మాలో మేం ద్వేషించుకునేట్లు చేస్తారు.

పీడితుడిని కాబట్టి నేనిక్కడ ఈ బోనులో నిలబడి ఉన్నాను. బాగుంది! మీరు పీడకులు.

పదేళ్ళపాటు మాతో ఉండి మాకు సానుభూతి ప్రకటించి, వాళ్లశక్తినీ, ప్రేమనీ మాకందించిన ప్రజానీకాన్నంతా మీరు మర్చిపోయారు. మీరు వాళ్ళను లక్ష్యపెట్టరు. ప్రజలతో, కామ్రేడ్స్‌తో, కార్మిక వర్గంతో కలిసి మాకోసం ఏడేళ్ళ పాటు పనిచేసిన మేధావులు పెద్ద సంఖ్యలోనే ఉన్నారు. ఇలా మమ్మల్ని క్రూరంగా శిక్షించడం కోసం కాదు. ఇప్పటికీ కోర్టు తనపని తాను చేసుకుపోతూనే ఉంది.

ప్రజలారా! కామ్రేడ్స్! శాక్కో, వాంజెట్టీ కేసులో మాతో పాటు ఏడు సంవత్సరాలు ప్రయాణించిన మీకందరికీ కృతజ్ఞతలు చెప్పాలనుకుంటున్నాను. ఇక నా మిత్రుడికి అవకాశం ఇస్తాను. నా కామ్రేడ్ గుర్తు చేసిన ఒక విషయం నేను చెప్పడం మర్చిపోయాను. నేనింతకు ముందే చెప్పినట్టు జడ్జి థేయర్‌కు నా జీవితమంతా తెలుసు. నేనెప్పుడూ దోషిని కానని ఆయనకు తెలుసు. ఎప్పటికీ దోషిని కానని నిన్న, నేడు, మరెప్పటికీ కానని".

శాక్కో ముగించిన తర్వాత వాంజెట్టీ వంతొచ్చింది.

కోర్టు గుమాస్తా: బార్టలోమియో వాంజెట్టీ, నీకు మరణశిక్ష ఎందుకు విధించరాదో ఏమైనా చెప్పుకుంటావా?

వాంజెట్టీ: ఎస్. నేను చెప్పేందేంటంటే నేను నిర్దోషినని. బ్రైన్ ట్రీ నేరంలోనే కాదు, బ్రిడ్జ్ వాటర్ నేరంలో కూడా నేను నిర్దోషిని. ఈ రెంటిలో మాత్రమే కాదు, మొత్తం నా జీవిత కాలంలో నేనెప్పుడూ దొంగతనం చేయలేదు, నేనెప్పుడూ హత్య చేయలేదు, నేనెప్పుడూ రక్తం చిందించలేదు. అదీ నేను చెప్పదలచుకున్నది. అంతేకాదు. ఈ రెండు నేరాల్లోనూ నేను నిర్దోషిని కావడమే కాకుండా, నేను హేతుబద్ధంగా ఆలోచించడం ప్రారంభించిన దగ్గర్నుండీ ఈ ప్రపంచం నుండి నేరాన్ని పారద్రోలడం కోసం నా జీవితమంతా పోరాడాను. నడిరోడ్డు మీద కెళ్ళి మనిషిని చంపి డబ్బు లాక్కోవల్సిన అవసరం నాకు లేదని ప్రతి ఒక్కరికీ తెలుసు, ఈ రెండు చేతులకూ తెలుసు. నా రెక్కల్తో నేను బతగ్గలను. బాగానే బతగ్గలను. మన నుదిటి చెమటతో తిండి సంపాయించు కోవడాన్ని కాక ఈ ప్రపంచం దేన్నైతే ఉన్నత జీవితంగా భావిస్తుందో అలా జీవించడానికి, స్వతంత్రంగా జీవించడానికి నాకు బోలెడంత అవకాశం ఉంది. ఇటలీలో మా నాన్న మంచి స్థితిలోనే ఉన్నాడు. నేను ఇంటికి తిరిగి వెళ్లగలిగితే ప్రతిసారీ ఆయన రెండు చేతుల్తో ఆహ్వానించి ఉండేవాడు. నా జేబులో చిల్లిగవ్వైనా లేకుండా వెళ్ళినా నాకు కొంత ఆస్తి ఇచ్చి ఉండేవాడు. శ్రమించడం కోసం కాదు. వ్యాపారం చేయడం కోసం. లేకపోతే తనకున్న పొలం వ్యవహారాలు చూసేందుకు. అలా అని ఆయన నాకెన్నో ఉత్తరాలు రాశాడు. స్థితిపరులైన బంధువులు కొందరు ఆ అర్థం వచ్చేట్టు అనేక ఉత్తరాలు రాశారు. నేను చూపించగలను. ఐతే వ్యాపారం ఒకరిని ఒకరు దోచుకోవడం కాబట్టి నేనది చేయలేదు.

క్షమించాలి! నా జీవితంలో నేనింతవరకూ చూడని మంచి మనుషున్నాడు. నేను యూజిన్ డబ్స్ గురించి ప్రస్తావిస్తున్నాను.

ఆ మనిషికి కోర్టుల గురించి, జైళ్ళగురించి, జ్యూరీ గురించి వాస్తవమైన అనుభవం ఉంది. ఈ ప్రపంచం ఇంకాస్త బాగా ఉండాలని కోరుకున్నందుకు తన బాల్యం నుండి వృద్ధాప్యం వరకూ శిక్షించబడ్డాడు. అప్రతిష్టపాలు చేయబడ్డాడు. మా నిర్దోషిత్వం ఆయనకు తెలుసు. ఆయనకే కాదు, ఈ దేశంలోనే కాదు ఇతర దేశాల్లోనూ, ప్రపంచంలో ఉన్న అర్థం చేసుకోగల వారందరికీ

తెలుసు. వారంతా మమ్మల్ని అంటిపెట్టుకొనే ఉన్నారు. యూరప్‌లోని మానవ జాతంతా, మంచి రచయితలు, యూరప్‌లోని మహా మేధావులు మా తరఫున వాదించారు. గొప్ప విజ్ఞాన శాస్త్రవేత్తలు, గొప్ప రాజనీతిజ్ఞులు మా తరఫున వాదించారు. విజాతీయ ప్రజలు మా తరఫున వాదించారు. మేం రాడికల్స్‌మని, మేం అధోజగజ్జనులమని, దృఢ విశ్వాసంతో ద్వేషిస్తున్న మీ విశ్వాసాన్ని నేను ఖండించదలచుకోలేదు. మీరు మంచిదని నమ్మిన వ్యవస్థకు మేం శత్రువులమని, మొదటిసారి విచారణతోనే మమ్మల్ని నేరస్తులుగా తీర్పు చెప్పడం తేలికేనని మమ్మల్ని చూడకముందే మీకు తెలుసు.

మేం యుద్ధానికి వ్యతిరేకులం కాబట్టి జ్యూరీ మమ్మల్ని ద్వేషించింది. యుద్ధం చివరికి నిష్ప్రయోజనకరమని మాకు తెలుసు. మా కేసు నడిచిన ఐదేళ్ళలో ఒక సంవత్సరాన్ని మొదటి విచారణను ప్రారంభించడానికే ప్రాసిక్యూషన్ ఖర్చు చేసిందన్నమాట. అప్పుడు డిఫెన్స్ మీకు అప్పీలు చేసింది. మీరు కొన్నాళ్ళాగారు. మేం చేసిన ప్రతి అప్పీలును తిరస్కరిద్దామన్న అభిప్రాయం మీ హృదయంలో విచారణ పూర్తయ్యేసరికే ఉందని నేనుకొంటాను. మీరు ఒక నెలా పదిహేను రోజులు ఆగి క్రిస్‌మస్ ముందురోజు సాయంత్రం మీ నిర్ణయాన్ని ప్రకటించారు. చారిత్రక దృక్కోణం నుండి చూసినా, చర్చి దృక్పథం నుండి చూసినా క్రిస్‌మస్ సాయంత్రపు పురాణగాథలో మాకు నమ్మకంలేదు. మన జనం కొందరు ఇప్పటికీ దాన్ని నమ్ముతారని మాకు తెలుసు. మాకు దాన్లో నమ్మకం లేదు కాబట్టి దానర్థం మేం మనుషులం కాదని కాదు. మేం మానవులం. క్రిస్‌మస్ ప్రతిమనిషి హృదయానికీ తీయనిదే. మా కుటుంబాల హృదయాలను, మేం ప్రేమించిన వాళ్ళ హృదయాలను విషపూరితం చేసేందుకే క్రిస్‌మస్ సాయంత్రం మీ నిర్ణయాన్ని ప్రకటించారని నేననుకొంటున్నాను.

ఇదీ నేను చెప్పేది: చేయని నేరానికి నేను పడుతున్న పాట్లు ఒక కుక్కగానీ, పాముగానీ, భూమ్మీద ఉన్న ఏ దురదృష్టకర అత్యల్ప ప్రాణిగానీ పడాలని కోరుకోను.

నేను రాడికల్‌ను కాబట్టే బాధలనుభవిస్తున్నాను.

నా గురించి నేను చాలా ఎక్కువ మాట్లాడాను. కానీ శాక్కో పేరు ప్రస్తావించడం మర్చిపోయాను. మంచి ఉద్యోగం, బ్యాంక్ ఎకౌంట్, ఆకర్షణీయమైన మంచి భార్య, ముద్దులొలికే ఇద్దరు పిల్లలు, సెలయేరు పక్కన

ప్రశాంత వాతావరణంలో శుభ్రమైన, ముచ్చటైన ఇల్లు వున్న శాక్కో కూడా చిన్నతనం నుంచి కార్మికుడే. నైపుణ్యంగల కార్మికుడు. శ్రమను ప్రేమించేవాడు. ప్రకృతిని, మానవ జాతిని ప్రేమించేవాడు. స్వేచ్ఛకోసం, మానవజాతిపై తనకున్న ప్రేమకోసం డబ్బును, విశ్రాంతిని, తన స్వంత భార్యాపిల్లల్ని, తనని, తన సొంత జీవితాన్ని అన్నిటిని వదులుకున్నవాడు. అన్నిటినీ త్యాగం చేసినవాడు.

ముగించాను. థాంక్యూ!''

వాంజెట్టీ ఉపన్యాసాన్ని కోర్టు హాల్లో వారంతా ఊపిరిబిగబట్టి విన్నారు. భయంకర నిశ్శబ్దం ఆవరించింది. ఆ నిశ్శబ్దాన్ని ఛేదిస్తూ రెండు నిమిషాలు ఉపోద్ఘాతం చెప్పి జడ్జి శిక్ష ప్రకటించాడు.

జడ్జి: మొదటి నికోలా శాక్కోకు న్యాయస్థానం శిక్ష విధిస్తుంది. నికొలా శాక్కో అనే నువ్వూ క్రీస్తుశకం పందొమ్మిది వందల ఇరవై ఏడో సంవత్సరం ఆదివారంతో మొదలయ్యే వారంలో, జూలై నెల పదవ రోజున నీ శరీరంలోకి విద్యుత్ ప్రవాహం పంపబడి మరణశిక్ష అనుభవించమని కోర్టు ఆజ్ఞాపిస్తుంది.

..... వాంజెట్టీ అనే నువ్వు............

వాంజెట్టీ: యువరానర్, దయచేసి ఒక్క క్షణం ఆగండి. నేను ఒక నిమిషం నా లాయర్‌తో మాట్లాడవచ్చా.... థామ్సన్ గారూ.....?

జడ్జి : .................. క్రీస్తుశకం పందొమ్మిది వందల.............

శాక్కో (పెద్దగా) : నేను నిర్దోషిని.  మీకు తెలుసు. ఇవి నేను ఏడేళ్ల క్రితం చెప్పిన మాటలే. మీరు ఇద్దరు నిర్దోషులను చంపుతున్నారు.........

జడ్జి - ...... ఇరవై ఏడో సంవత్సరం, ఆదివారంతో మొదలయ్యే వారంలో జూలైనెల పదవరోజున నీ శరీరంలోకి విద్యుత్ ప్రవాహం పంపబడి మరణశిక్ష అనుభవించు. ఇది చట్ట ప్రకారం విధిస్తున్న శిక్ష.

**జనవరి 04, 1988 - ఉదయం**

# 5. ప్రశ్నించినందుకే ఈ హత్యలు
## (దాచేస్తే దాగని సత్యం)

శాక్కో, వాంజెట్టీలకు మరణశిక్ష విధిస్తున్న రోజు దగ్గరవుతున్న కొద్దీ ప్రజా ఉద్యమం ఉధృతమయింది. మెసాచుసెట్స్ గవర్నరును క్షమాభిక్ష పెట్టమని అడగటానికి డిఫెన్స్ కమిటీ ప్రయత్నించినప్పటికీ అభ్యర్థనా పత్రంపై సంతకం పెట్టమని అడగటానికి శాక్కో నిరాకరించాడు. తమను ఎలాగైనా చంపాలని ప్రభుత్వం నిర్ణయించుకున్నప్పుడు విజ్ఞప్తులు పనిచేయనని శాక్కో చెప్పాడు.

డిఫెన్స్ కమిటీ ఒత్తిడివల్ల, ప్రజల ఆందోళనవల్ల కేసును సమర్థించుకోవడానికి చివరకు గవర్నర్ ముగ్గురు సభ్యులతో కూడిన సలహా సంఘాన్ని నియమించాడు. మరణశిక్షను 1927 ఆగస్టు 10 అర్ధరాత్రి వరకు వాయిదా వేస్తున్నట్లు ప్రకటించారు.

అయితే గవర్నర్ నియమించిన సలహా సంఘం అధ్యక్షుడు రెడ్స్‌ని తీవ్రంగా ద్వేషించేవాడు. జూలై 27న సలహా సంఘం గవర్నర్‌కు సమర్పించిన నివేదికలో శాక్కో వాంజెట్టీలకు మరణశిక్ష సరైనదేనని పేర్కొన్నారు.

36 నిమిషాలలో కరెంటు షాక్ ఇస్తారనగా గవర్నర్ డిపెన్స్ కమిటీ ప్రయత్నం మేరకు మరణశిక్ష నిలిపి వేస్తూ పిలుపు టెలిగ్రాం పంపాడు. ఆగస్టు 22-23 అర్ధరాత్రి దాకా మరణశిక్ష వాయిదా పడింది.

కేసును మళ్ళీ విచారించాలన్న చివరి పిటీషన్‌ను కూడా సుప్రీం జ్యూడిషియల్ కోర్టు తిరస్కరించింది. రాజ్యాంగాన్ని ధిక్కరిస్తున్నారని వివక్షతో శిక్ష విధించారని ఫెడరల్ కోర్టుల్లో వేసిన హెబియస్ కార్పస్ పిటీషన్‌ను అమెరికా సుప్రీంకోర్టు తిరస్కరించింది.

## ఆందోళన విజృంభణ

మరణశిక్ష అమలు జరిపే రోజులు దగ్గర పడిన కొద్దీ ప్రజల ఆందోళన వేగం పుంజుకుంది. ప్రపంచ వ్యాప్తంగా సమ్మెలు, ప్రదర్శనలు,సభలూ, సమావేశాలూ అసంఖ్యాకంగా జరిగాయి. ఆగ్రహోదగ్రులైన ప్రజలు యూరప్ అంతటా అమెరికా రాయబార కార్యాలయాల మీద బాంబు దాడులు చేశారు. శాక్కో, వాంజెట్టీలకు వ్యతిరేకంగా సాక్ష్యం చెప్పిన సాక్షుల ఇళ్ళు నేలమట్టమయ్యాయి.

ఎన్నో వార్తాపత్రికలు శిక్ష రద్దు చేయమని ప్రభుత్వానికి విజ్ఞప్తి చేశాయి. బాగా సర్క్యులేషనున్న ది పోస్ట్ డిస్పాచ్, ది వరల్డ్ లాంటి అమెరికా దిన పత్రికలు మరణశిక్షకు వ్యతిరేకంగా తీవ్ర ప్రచారం చేశాయి.

ఆగస్టు 21 వచ్చింది. శాక్కో, వాంజెట్టీలు మృత్యువుకు చేరువలో ఉన్నారు. మరుసటి రోజు రాత్రికి తాము మరణించడం ఖాయమని ఆరోజు వాళ్ళు పూర్తిగా నిర్ధారించుకున్నారు. తమకోసం ఏడేళ్ళ నుంచి తీవ్ర పోరాటం చేస్తున్న డిఫెన్స్ కమిటీకి ఆ సాయంత్రం ఈ వీడ్కోలు లేఖ రాశారు.

ఆగస్టు 21-1927 మెస్సాచుసెట్స్ జైలు మృత్యు గృహం నుండి

ప్రియమైన శాక్కో, వాంజెట్టీ డిఫెన్స్ కమిటీ స్నేహితులారా! కామ్రేడ్స్!

రేపు అర్ధరాత్రి మమ్మల్ని చంపబోతున్నారు. అమెరికా సుప్రీంకోర్టుగానీ, గవర్నర్ ఫుల్లర్గానీ శిక్ష నిలిపేయమని కొత్తగా ఆర్డర్ ఇస్తే తప్ప! మమ్మల్ని రక్షించడానికి మీరు చేసిన కృషికి మా కృతజ్ఞతలను మా అభినందనలనూ మీకు అందజేసేందుకు ఈ లేఖ రాయాలని మేం నిర్ణయించాం. మిత్రులారా, కామ్రేడ్స్, ముగింపు కొస్తున్న ఈ విషాథ సమయంలో మనమంతా ఒకే హృదయంతో వుందాం. మనలో ఇద్దరం మాత్రమే మరణిస్తున్నాం. కామ్రేడ్స్, మన భావాలు లక్షల మందిలో జీవిస్తాయి. మనం ఓడిపోయాం కాని నాశనం కాలేదు. మన బాధల్ని మన విచారాల్ని, మన పొరపాట్లను, మన అపజయాలను, మన ఆవేదనను భవిష్యత్తు యుద్ధాల కోసం పదిలపర్చుకుందాం. ఈ విషాద కాల ఘడియల్లో మనం అందరం ఒకే హృదయంతో ఉందాం. ప్రేమానురాగాలు నిండిన హృదయాలతో మీ అందరికీ చివరి వీడ్కోలు చెబుతున్నాం. ఇప్పటికీ, ఎప్పటికీ మీరంతా చిరకాలం జీవించాలి. స్వేచ్ఛ వర్ధిల్లాలి.

ఆగస్ట్ 22వ తేదీ ఉదయం నుంచే గవర్నర్ ఇంటి ముందు జనం బారులు కట్టి పికెటింగ్‌కు సిద్ధమయ్యారు. సాయంత్రం అయ్యేసరికి జనం ప్రవాహంలా పోగయ్యారు. సాయంత్రం లా ప్రొఫెసర్ రస్కో పౌండ్ గవర్నర్‌ను కలిసి మరణశిక్ష నిలిపేయమని బతిమిలాడాడు. వాంజెట్టీ తన జీవితంలో ఎప్పుడూ బ్రైన్ ట్రీ పట్టణానికి వెళ్ళలేదని ఆ రాత్రికి అతను మరణిస్తే కనీసం తనపై ఆరోపింపబడిన నేరం జరిగిన స్థలం కూడా చూడకుండా చనిపోతాడని మరీ మరీ అభ్యర్థించాడు. రోజ్ శాక్కో, లూగియా వాంజెట్టీలు కూడా గవర్నర్‌ను కలిసి ప్రాణభిక్ష పెట్టమని ఏడుస్తూ వేడుకున్నారు. ఆగస్ట్ 22వ తేదీ ఉదయాన్నే శాక్కో భార్య రోజినా, వాంజెట్టీ చెల్లెలు లూగియా ఛార్లెస్ టౌన్ జైలుకొచ్చారు. చివరి క్షణాల్లో వాంజెట్టీని చూసేందుకు లూగియా ఇటలీ నుండి వచ్చింది. జైలు గది తలుపులు తీయకుండానే మాట్లాడుకోమని జైలు అధికారులు చెప్పారు. పైగా వాళ్ళేం రహస్యాలు మాట్లాడుకుంటారోనని జైలు గార్డులు దగ్గరగా వచ్చి నిలబడ్డారు. అంగుళం మందంలో ఉన్న జైలు గది తలుపుల కటకటాలకు ఇనుప జల్లెడ బిగింపబడి ఉంది. ఆ ఇనుపజల్లెడకు ముఖాన్ని అదిమి ఒకరిని ఒకరు ముద్దుపెట్టుకున్నారు. చివరి క్షణాల్లో తమ ఆత్మీయుల్ని కౌగిలించుకోవడానికి కూడా జైలు అధికారులు తలుపులు తెరవలేదు. వాంజెట్టీ తన చెల్లెల్ని జైలు డాక్టరుకు పరిచయం చేసి తన శవాన్ని ఆమెకు ఇవ్వమని చెప్పాడు. కొద్దిసేపటికి భారంగా విడిపోయారు. మధ్యాహ్నం రెండు గంటలకు డిఫెన్స్ లాయర్ మైకేల్ ముస్మాందర జైలుకు వచ్చాడు. సుప్రీంకోర్టులో ఆరోజు చేసిన సెర్షియోరరీ రిట్‌ను న్యాయమూర్తి జస్టిస్ స్టోన్ స్వీకరించలేదని చెప్పాడు. ఈ భూమి మీద వాళ్ళిద్దరినీ కాపాడే ఏ శక్తి డిఫెన్స్ కమిటీకి కనిపించలేదని చెప్పి విషాద వదనంతో వెళ్ళిపోయాడు. మరోసారి తన భార్యను చూడాలని వుందని శాక్కో జైలర్‌ని కోరాడు. సాయంత్రం 3-10 కి రోజ్, లూగియాలు జైలుకొచ్చారు. జనానికి ఎప్పుడూ నిర్భయంగా ప్రశాంత వదనంతో కనిపించే రోజ్ జైలు గేట్ దగ్గరికి వచ్చేసరికి మొదటిసారి ఏడ్చింది. లూగియా ఆమెను రెక్క పట్టుకుని జైలులోనికి నడిపించుకెళ్ళింది. ఇనుపజల్లెడ సందుల్లోనుంచి ఒకరితో ఒకరు మాట్లాడుకున్నారు. ఒకరినొకరు ఓదార్చుకున్నారు. టైం అయిపోయిందని జైలు

గార్డులు నాలుగు గంటలకే విడదీశారు. బయటకు వచ్చిన తర్వాత కూడా ఇద్దరూ ఏడుస్తూనే ఉన్నారు. రాత్రి ఏడుగంటలకు రోజ్, లూగియా చివరిసారి జైలుకొచ్చి ఐదు నిమిషాలు మాత్రమే ఉండి కన్నీటి వీడ్కోలు చెప్పి వెళ్ళిపోయారు. బాగా పొద్దుపోయిన తర్వాత డిఫెన్స్ లాయర్ థామ్సన్ వచ్చాడు. వాంజెట్టీ కోరిన మీదట న్యూహాంప్ షైర్ నుండి ప్రత్యేకంగా వచ్చిన థామ్సన్ దాదాపు గంటసేపు ఇద్దరితోనూ మాట్లాడి బయటకు వచ్చాడు. జైలు నుండి బయటకు రాగానే చుట్టుముట్టిన పత్రికా విలేకరులతో మాట్లాడుతూ శాక్కో, వాంజెట్టీలు నిర్దోషులని పునరుద్ఘాటించాడు థామ్సన్. అర్ధరాత్రి కావస్తూ ఉండగా ఛార్లెస్ టౌన్ జైలు చుట్టూ పోలీసులు పెద్ద ఎత్తున మోహరించారు. అర్ధరాత్రి అయ్యేసరికి జైలు చుట్టూ వేల సంఖ్యలో జనం చేరారు. దిక్కులు పిక్కటిల్లేటట్లు నినాదాలు చేశారు. ఆ రాత్రికే శిక్ష అమలు జరపబోతున్నారన్న సంగతిని జైలు నిబంధనల ప్రకారం అర్ధరాత్రి పన్నెండు గంటలు కావస్తూవుండగా జైలు వార్డెన్ హెండ్రి శాక్కో, వాంజెట్టీలకు తెలియజేశాడు.

జైలు గడియారం పన్నెండు గంటలు కొట్టింది. మత కర్మకాండ తమకు అవసరం లేదని శాక్కో, వాంజెట్టీలు చెప్పడంతో అప్పటి దాకా నిరీక్షించిన జైలు మతాధికారి వెళ్ళిపోయారు. శిక్ష అమలు జరిపేందుకు జైలు సూపరింటెండెంట్, జైలు డాక్టర్ రెడీ అయ్యారు. సాక్షిగా అనుమతించబడ్డ ఒకే ఒక అసోసియేటెడ్ ప్రెస్ విలేకరి కూడా వచ్చి తన స్థానంలో నిలబడ్డాడు. బ్యాంక్ క్యాషియర్‌ను చంపిన కేసులో శిక్ష అనుభవించాల్సిన మెడేరాస్‌ను మొదటగా కరెంట్ కుర్చీ దగ్గరకు నడిపించుకెళ్ళారు. ఇతను ఆ రోజంతా విపరీతంగా సిగరెట్లు కాల్చాడు. ఎవరి సహాయం అక్కర్లేకుండానే మౌనంగా కుర్చీలో కూర్చున్నాడు. 12-03కి స్విచ్ నొక్కారు. 12.09కి చనిపోయాడు. తర్వాత వంతు శాక్కోది. జైలు గార్డు శాక్కో ఉన్న గది తలుపు తెరిచాడు. శాక్కో లేచి నిలబడ్డాడు. చాలాకాలంగా జైల్లో వుండడం వల్ల అతని ముఖం పాలిపోయింది. ఏం మాట్లాడకుండా మౌనంగా జైలు గార్డు వెంట బయలుదేరాడు. కరెంట్ కుర్చీ ఉన్న గది దాకా ఉన్న ఏడు అడుగుల దూరాన్ని గంభీరంగా నడిచాడు. తనకు తానే కుర్చీలో కూర్చున్నాడు. గార్డులు కరెంట్ ప్లగ్ సరిచేస్తూ ఉండగా 'అరాచకం వర్ధిల్లాలి' అంటూ ఇటాలియన్ భాషలో నినాదం చేశాడు.

‘నా భార్యకు, బిడ్డకు, నా స్నేహితులందరికీ ఈ వీడ్కోలు’ అంటూ ఇంగ్లీష్‌లో పెద్దగా అరిచాడు. శాక్కోకి ఇద్దరు పిల్లలు. కాని ఇంగ్లీష్ సరిగ్గా రాకపోవడం ఆ ఉద్వేగ క్షణాల్లో అతని భావాలకు అడ్డుపడింది.

“గుడ్ ఈవెనింగ్ జంటిల్మెన్” అని హడావిడిగా అన్నాడు. చివరిగా “అమ్మా! వీడ్కోలు” అంటూ కేక వేశాడు.

12.11 అయింది.

శాక్కో ఇంకేమీ చెప్పేది లేదని స్పష్టంగా నిర్ధారించుకున్న తర్వాత స్విచ్ వెయ్యమని వార్డెన్ సైగ చేశాడు.

జైలు డాక్టరు స్టెతస్కోపుతో పరీక్షించి 12.19.02కి శాక్కో ప్రాణాలు వదిలాడని నిర్ధారించాడు.

గార్డులు తన గది తలుపు తెరిచినప్పుడు వాంజెట్టీ మౌనంగా ఉన్నాడు. అతనికి ఇక మృత్యువు మిల్లీ మీటర్ల దూరంలోనే ఉంది.

జైలు గార్డులతో కరచాలనం చేసి వాళ్ళతో అడుగులు కలిపాడు వాంజెట్టీ. శాక్కో గది కంటే, వాంజెట్టీ గదికి కరెంటు కుర్చీ నాలుగడుగులు మాత్రమే ఎక్కువ దూరంలో ఉంది.

“మీరు నాకోసం చేసిన దానికంతా కృతజ్ఞతలు” అని వార్డెన్‌తో ఇంగ్లీష్‌లో అంటూ మృత్యువాటికలోకి హుందాగా నడిచాడు.

వార్డెన్‌తో కరచాలనం చేసి “అన్ని నేరాల్లోనూ నేను నిర్దోషిని. వీటిల్లోనే కాదు. అన్నిట్లోనూ, నేను నిర్దోషిని” అని చెప్పాడు.

గార్డుల సహాయం లేకుండానే కుర్చీలో కూర్చున్నాడు.

స్విచ్ నొక్కారు. 12.26.55కు వాంజెట్టీ ప్రాణం పోయిందని రికార్డులో రాసుకున్నారు.

వార్డెన్ గుండె నీరయింది. చట్ట ప్రకారం అనాల్సిన వాక్యాలు మెల్లగా యాంత్రికంగా ఉచ్ఛరించాడు.

“ఇతను మరణించాడని చట్ట ప్రకారం అధికారికంగా ప్రకటిస్తున్నాను. కోర్టు విధించిన శిక్ష చట్టబద్ధంగా అమలు చేయబడింది”

నూతిలో నుంచి వచ్చినట్టున్న ఈ మాటలు సాక్షులకు విన్పించలేదు.

## అమాయకుల సంహారానికి ఉపసంహారం

శాక్కో, వాంజెట్టీలు మరణించారు. కాని వారి భావాలు మరణించలేదు. జైల్లో ఉన్న రోజుల్లో వారు తమ హృదయ స్పందనల్ని ఉత్తరాలుగా రాశారు. అవి పుస్తకాలుగా అచ్చయి అమెరికా సాహిత్య జగత్తులో గొప్ప స్థానాన్ని సంపాదించుకొన్నాయి. కార్మిక వర్గాన్ని ఎంతగా ప్రేమించారో ఆ ఉత్తరాలు తెలియజేస్తాయి. వాంజెట్టీ అనేక వ్యాసాలు, స్వీయ చరిత్ర కూడా రాశాడు. ప్రపంచంలో సంక్షోభం గురించి ఆందోళన పడ్డాడు.

శాక్కో, వాంజెట్టీల హృదయ విదారక గాథపై అనేక భాషల్లో సాహిత్య సృష్టి జరిగింది. ప్రముఖ కవులు, కవయిత్రులు, కవితా గానం చేశారు. వారి జీవితంపై నవలలు కూడా వచ్చాయి. 1952లో హోవర్డ్ ఫాస్ట్ 'శాక్కో వాంజెట్టీల విషాదగాథ' అనే నవల రాశాడు. 1927లో మదరాసు కాంగ్రెస్ మహాసభలో శాక్కో, వాంజెట్టీలకు జోహార్లర్పిస్తూ తీర్మానించారు.

శాక్కో, వాంజెట్టీలు మరణించిన అనేక దశాబ్దాల తర్వాత కూడా వాళ్ళు నిర్దోషులని ప్రభుత్వం ప్రకటించాలని పోరాటం కొనసాగింది.

ప్రఖ్యాత విజ్ఞాన శాస్త్రవేత్త ఆల్బర్ట్ ఐన్‌స్టీన్, రూజ్‌వెల్ట్ భార్య, ప్రముఖ కార్మిక నాయకుడు ఫిలిప్ ముర్రేలు కలిసి శాక్కో, వాంజెట్టీల శిలా విగ్రహాలు చెక్కించమని 20వ వర్ధంతి సందర్భంగా 1947లో మెస్సాచుసెట్స్ గవర్నర్‌కు, బోస్టన్ నగర మేయర్‌కు విజ్ఞప్తి చేశారు.

హంతకులైన శాక్కో, వాంజెట్టీలకు శిలా విగ్రహాలు పెట్టించుకునే గౌరవం పొందే అర్హత లేదని ఆ ప్రతిపాదనను తిరస్కరించారు.

1957 ఆగస్టు 23న పోస్ట్ డిస్పాచ్ దినపత్రికలో ఓ లేఖ ప్రచురించబడింది. 20వ వర్ధంతి సందర్భంగా ఐన్‌స్టీన్ అన్న మాటలను గుర్తు చేస్తూ శాక్కో, వాంజెట్టీల చరిత్రను ముందు తరాల వాళ్ళకు అందించాలని పదిమంది అమెరికా ప్రముఖులు లేఖలో విజ్ఞప్తి చేశారు. గార్డెనర్ జాక్సన్, జాన్ ఛాంబర్లేన్, జాన్‌డాన్ పాస్సోస్, యూజిన్‌లయన్స్, నార్మన్ థామస్, ఆల్జినో ఫెరికనీ, యూజిన్ రాస్వో,

రోగర్ బాల్డ్విన్, గెరాల్డ్ జాన్సన్, ఆర్థర్ ష్లేసింజర్‌లు ఆ లేఖపై సంతకాలు చేశారు.

చివరకి 1977లో ''శాక్కో, వాంజెట్టీల పేర్లకు ఉన్న కళంకాన్ని'' తుడిచేస్తున్నట్లు అప్పటి మెస్సాచూసెట్స్ గవర్నర్ మైకేల్ డుకాకిన్ అధికారికంగా ప్రకటించాడు.

శ్రమజీవులు రక్తంతో రాసుకున్న చరిత్రకు ప్రతిరూపాలు శాక్కో, వాంజెట్టీలు. 'ప్రజాస్వామ్యం' అని పేరు పెట్టుకున్న మట్టి కాళ్ళ రాక్షసి జనదేహం మీద చేసిన నెత్తుటి గాయాలు శాక్కో, వాంజెట్టీలు. స్వేచ్ఛ కోసం కారిన రుధిర ధారలు. శాక్కో, వాంజెట్టీల నుంచి భూమయ్య, కిస్టాగౌడ్‌ల దాకా, స్పార్టకస్ నుండి బెంజిమన్ మొలైసీ, డాక్టర్ రామనాథం దాకా సంఘటనలు వేరైనా, కాలాలు వేరైనా, స్థలాలు వేరైనా, హత్యా పద్ధతులు వేరైనా చంపబడింది మాత్రం అధికార వర్గాన్ని ప్రశ్నించినందుకే.

స్వేచ్ఛ కోసం పోరాడే శక్తులు, శాక్కో, వాంజెట్టీల చరిత్రనుండి పాఠాలు నేర్చుకోకపోతే, అధికారాన్ని ప్రశ్నిస్తూ, ఇవాళ మన చుట్టూ క్రూరంగా హత్య చేయబడుతున్న అనేక మంది శాక్కో, వాంజెట్టీలను గుర్తించకపోతే మనం మళ్లీ మళ్లీ మోసపోతూనే ఉంటాం.

**జనవరి 11, 1988 - ఉదయం**

# 6. మరణశిక్షను బేషరతుగా వ్యతిరేకించిన మార్క్స్ కూడా మనువాదేనా?*

## (బాలగోపాల్ పై వై.కె. విమర్శకు సమాధానం)

పౌరహక్కుల సంఘం ప్రధాన కార్యదర్శి డాక్టర్ కె. బాలగోపాల్ మార్చి 4 న 'వార్త' కు ఇచ్చిన ఇంటర్వ్యూలో మరణశిక్షను ఎవరికీ విధించరాదనీ, దాన్ని పూర్తిగా రద్దు చేయాలని వ్యక్తపర్చిన అభిప్రాయాలను విమర్శిస్తూ గుంటూరు న్యాయవాది వై. కె. రాసిన విమర్శకు ఇది సమాధానం.

బాలగోపాల్ " పాముకీ- కప్పకీ, తోడేలుకీ-మేకకీ, పెట్టుబడిదారుడికీ - కార్మికుడికీ, భూస్వామికీ - రైతుకూలీకి, అగ్రకుల దురహంకారులకీ-దళితులకీ, పురషాహంకారానికీ, మహిళలకీ తేడా చూపలేద"నీ, అది 'సామాజిక మార్పుకు వ్యతిరేక దృక్పథమ'నీ, 'సామాజిక యథాతథవాదమ'నీ, 'అందరి చేతా మంచి అనిపించుకోవాలనే ప్రమాదకరమైన సాత్విక వాదమ'నీ 'మనుస్మృతికి మరో రూపమ'నీ వై.కె. తీవ్రవిమర్శ చేశారు.

న్యూయార్క్ డైలీ ట్రిబ్యూన్ దినపత్రికలో కారల్ మార్క్స్ రాసిన వ్యాసంలోని ఈ క్రింది అభిప్రాయం వై.కె.గారి రాతలకు చక్కని విరుగుడు. మరణశిక్షను రద్దు చేయాలని వాదిస్తూ 1853లో రాసిన ఆ వ్యాసంలో మార్క్స్ ఇలా అన్నారు.

"తన నాగరికత గురించి గొప్పలు చెప్పుకునే సమాజంలో - మరణశిక్ష ఉపయోగాన్ని గానీ, అందులోని న్యాయాన్ని గానీ సమర్థించగలిగే ఏ సూత్రాన్నైనా కనిపెట్టడం చాలా కష్టతరం'

---

* బి.చంద్రశేఖర్, జి.శివనాగేశ్వరరావుల సంయుక్త రచన.

అలాగే 'తన రక్షణ కోసం తలారీ తప్ప మరొక మెరుగైన సాధనం తెలియని' వ్యవస్థను మార్క్స్ తన వ్యాసంలో తీవ్రంగా విమర్శించారు.

మన దేశంలో కొందరు ముతక కమ్యూనిస్టులు తయారయ్యారు. 'వర్గ', 'సమాజ' అనే పదాలతో కూడిన ఓ పది పదబంధాలు వీరి ఇరుకైన మెదడులో ఉంటాయి. ఇటీవల 'దళిత', 'స్త్రీ' అనేవి కూడా వాటికి తోడయ్యాయి. వాటిని అదేపనిగా వాడితే మార్క్సిస్టుగా, దళితవాదిగా, స్త్రీ పక్షపాతిగా చలామణి అవ్వొచ్చని వీరి భావన. అనేక సందర్భాల్లో వీరు అలా చలామణి అవుతుంటారు కూడా. ఈ థర్డ్ రేటు మేధావులు సరైన అధ్యయనం చేయకుండానే వాళ్ళకున్న మిడిమిడి జ్ఞానాన్ని యథేచ్ఛగా చలామణి చేస్తూ ప్రజలను తప్పుదోవ పట్టిస్తుంటారు. సెంటిమెంట్లను రెచ్చగొట్టడం ద్వారా వీరు ప్రజల బలహీనతలను అధికారం కిందకు మార్చుకోవాలని చూస్తుంటారు. చర్చను అసలు విషయం నుంచి ఇట్టే దారి మళ్ళించగలరు.

వై.కె. డాక్టర్ బాలగోపాల్‌కు లేవని చెప్పిన 'వర్గస్పృహ', 'సామాజిక దృక్పథం', 'సామాజిక స్వభావం గురించి అవగాహన' డాక్టర్ కారల్ మార్క్స్‌కు కూడా లేనట్టున్నాయి. వై.కె. గారి వాదనను ఒప్పుకుంటే మార్క్స్ కూడా బ్రాహ్మణీయ (కాకపోతే యూదు) బూర్జువా సాత్విక వాది అవుతాడు. మనువాది అవుతాడు. ఎందుకంటే, ఆయన కూడా మరణశిక్షను పూర్తిగా రద్దు చేయాలని కోరాడు కాబట్టి. 'ఏవో విలువల మీద ఆధారపడి'' వర్గాలకు, కులాలకూ, జెండర్‌కీ అతీతమైన మానవ విలువలు ఉంటాయనే భ్రమలోనే మార్క్స్ కూడా జీవించాడు పాపం!

మార్క్స్‌ను కాసేపు పక్కనబెట్టి చూసినప్పటికీ వర్గాలకు, కులాలకీ, జెండర్‌కీ అతీతంగా కొన్ని మానవ విలువలు ఉంటాయన్న ఇంగితజ్ఞానం వై.కె. గారిలో కరువైనట్టుంది. ప్రభుత్వం చట్టబద్ధంగా పాలించాలనీ, చిత్రహింసలు పెట్టి ఎవరితో నేరం ఒప్పించరాదనీ, ఎదుటివారి వాదన వినకుండా శిక్షలు విధించరాదనీ నెలకొన్న పాలనా సూత్రాలు మానవ సమాజం పోరాడి సాధించుకున్న కొన్ని మానవ విలువలు. వర్గ, కుల, జెండర్‌లతో సంబంధం లేకుండా మానవులందరికీ ఇవి సమానంగా వర్తిస్తాయి. కనీస న్యాయశాస్త్ర

పరిజ్ఞానం ఉన్న ఏ వ్యక్తి అయినా ఈ విలువలను గుర్తిస్తాడు. మరణశిక్ష రద్దు కూడా ఇలాంటి మానవ విలువలలో భాగమేనని పౌరహక్కుల సంఘం భావిస్తోంది.

మరణశిక్షను ఆదిమ ప్రతీకార నీతికి ఆఖరి అవశేషంగా బాలగోపాల్ పోల్చడాన్ని, తన పరిజ్ఞానంతో వై.కె. విమర్శించి బాలగోపాల్‌కు శిక్షకు కక్షకు మధ్య తేడా తెలియదన్నారు. కానీ ఏంగెల్స్‌కు కూడా అది తెలిసినట్టులేదు. 'ఆదిమ సమాజ రక్త శిక్త ప్రతీకారేచ్ఛను సరిపోల్చదగిన ఏకైక నాగరిక రూపం'గా మరణశిక్షను ఏంగెల్స్ అభివర్ణించారు. (చూడండి - కుటుంబం, వ్యక్తిగత ఆస్తి, రాజ్యం పుట్టుక).

'ఉరికంబం మనిషిని చంపే యంత్రం మాత్రమే కాదు. భయోత్పాతానికీ, క్రూరత్వానికీ, జీవితాన్ని అవమానపర్చడానికీ అది ప్రతీక. ఆదిమ రాక్షసత్వానికీ, మధ్యయుగ మౌఢ్యానికీ, ఆధునిక నిరంకుశత్వానికీ సామాన్య లక్షణం' అంటారు ప్రముఖ రచయిత ఆర్థర్ కోయిస్లర్ (చూడండి రిఫ్లెక్షన్స్ ఆన్ హాంగింగ్).

ఎవరికైనా మరణశిక్ష విధించి చంపే అధికారం రాజ్యానికి ఉండాలా అక్కర్లేదా అనే చర్చను కాస్తా చుండూరు హంతకులకు మరణశిక్షను విధించడం సబబా కాదా అనే దానికి కుదించి వై.కె. చర్చను తాత్విక స్థాయినుంచి దిగజార్చి సెంటిమెంట్లను రెచ్చగొట్టే ప్రయత్నం చేశారు.

రాజ్యం యొక్క క్రూర అధికారాలు కుదించే దిశగా మానవ సమాజ గమనం ఉండగా వై.కె. దానికి ఎక్కువ క్రూర అధికారాలు కట్టబెట్టే వందిమాగధుడి పాత్ర నిర్వహిస్తున్నారు. అగ్రకులోన్మాదుల దాడుల నుంచి దళితులు రక్షణ పొందేందుకు రాజ్యం చేతిలో మరణ దండనాధికారం ఉండటం ఒక పరిష్కారంగా వై.కె. భావిస్తున్నారు. రాజ్యం చేతిలో మరణ దండనాధికారం ఉండడాన్ని ఆమోదించడం ద్వారా రాజ్యాన్ని బలోపేతం చేయాలని వై.కె. కోరుకుంటే ఆపని ఆయన స్వేచ్ఛగా చేయవచ్చు. దానికి చుండూరు అగ్రకుల హంతకులను సాకుగా చూపించాల్సిన పనిలేదు.

మరణశిక్షను ఏ ఇతర నేరం తోనూ సరి పోల్చలేమని ప్రఖ్యాత రచయిత ఆల్బర్ట్ కాము అంటారు. పథకం ప్రకారం చేసే హత్యల్లో మరణశిక్షదే అగ్రస్థానం

అంటారాయన. చంపదల్చుకున్న వ్యక్తిని నెలల తరబడి నిర్బంధించి, అతనికి చంపబడే తేదీని ముందుగా చెప్పి, తన దయా దాక్షిణ్యాల మీద అట్టిపెట్టుకుని హత్య చేసినప్పుడు మాత్రమే అది మరణశిక్షతో సరిపోల్చదగిన హత్య అవుతుందని కాము అంటారు. ఇలాంటిది వాస్తవ ప్రపంచంలో జరగదు కాబట్టి మరణశిక్షకు సమానమైన నేరం ఎవరూ చేయజాలరని అది చాలా ఘోరమైన శిక్ష అని ఆయన చెప్పారు (చూడండి రిఫ్లెక్షన్స్ ఆన్ గిలెటిన్). నేరానికి, శిక్షకు మధ్య సంబంధం ఉండాలనే వై.కె.గారు ఈ విషయాన్ని పరిగణించాలి.

అగ్ర కులస్తులను, ధనిక వర్గాల వారిని, పురుష దురహంకారులను శిక్షించేందుకు మరణశిక్ష ఉండాలని చెప్పిన వై.కె. దానివల్ల ఒనగూడే ప్రయోజనమేమిటి అనేది ఎక్కడా చెప్పలేదు. భవిష్యత్ లో నేరాల్ని ఆపడం కోసమా? లేదా నేరస్తుడిని భౌతికంగా సంహరించకపోతే అతను తిరిగి నేరాలకు పాల్పడతాడు కాబట్టా? లేదా కక్ష కోసమా?

నేరాలు మరణశిక్ష వల్ల నిరోధించబడలేదని ఇప్పటివరకూ శాస్త్ర పరిశోధనలు నిరూపించాయి. మార్క్స్ కూడా తన వ్యాసంలో మరణశిక్షను విధించడం ద్వారా హత్యలు నిరోధించబడలేదని వివరంగా నిరూపించారు. 1984 లెక్కల ప్రకారం మరణశిక్షను రద్దు చేసిన 55 దేశాల్లోనూ, చట్టాల్లో ఆ శిక్ష ఉన్నప్పటికీ దాన్ని అమలు చేయని మరో 42 దేశాల్లోనూ హత్యల సంఖ్య అంతకు ముందుకన్నా పెరగలేదు. ఇంగ్లండ్‌లో 1949-53 మధ్య 129 మంది పురుషులకు మరణశిక్ష రద్దుచేసి విడుదల చేయగా వారిలో కేవలం ఒక్కరు మాత్రమే తిరిగి హత్యకేసులో ముద్దాయయ్యారు. కెనడాలో మరణశిక్ష రద్దయ్యాక హత్యల సంఖ్య తగ్గింది. కక్షకోసం, ప్రతీకారం కోసం అయితే ఆధునిక సమాజంలో రాజ్యం ఆ పని చేయరాదని మా నిశ్చితాభిప్రాయం. రాజ్యానికి ఆ పని అప్పజెప్తే మనం తిరిగి భౌతికంగా కాకపోయినా మానసికంగా ఆదిమ కాలంలో జీవిస్తున్నట్టు లెక్క.

ఇక్కడ గీటురాయి నేరస్తులు, వారి విలువలు కాదు. మనం వారిపట్ల ఎంత నాగరికంగా వ్యవహరిస్తున్నామన్నదే గీటురాయి. మానవ హక్కుల ప్రాముఖ్యతను క్లుప్తంగా చెప్పుకోవాలంటే - సమాజాన్ని రక్షించడం కోసం కొన్ని

పద్ధతులను ఎప్పటికీ ఉపయోగించరాదు. ఎందుకంటే, సమాజం పరిరక్షించుకోవాలనుకునే విలువలను అవి ధ్వంసం చేస్తాయి కాబట్టి.

వై.కె. అన్నట్టు పార్టీలకు, వ్యక్తులకు, సంస్థలకు మనుషుల్ని చంపడానికి లైసెన్స్ ఇచ్చే కార్యక్రమమేదీ పౌరహక్కుల సంఘంగానీ, బాలగోపాల్‌గానీ చేపట్టలేదు. ఈ సందర్భంలో, మరణశిక్ష రద్దు చేయాలని కోరుతూ రోజా లగ్జంబర్గ్ చెప్పిన మాటలు గుర్తు చేసుకోవడం అవసరం.

“విప్లవ కార్యకలాపాలు, లోతైన మానవతా వాదం అనేవి మాత్రమే సోషలిజానికి నిజమైన ఊపిర్లు.... ప్రపంచాన్ని తల్లకిందులు చేయాల్సిందే. అనవసరంగా ఒక్క కన్నీటి బొట్టు కారినా అది ఆరోపణే అవుతుంది. క్రూరమైన ఉపేక్షతో వానపామును చంపినా అది నేరమే అవుతుంది” (ఆన్ కాపిటల్ పనిష్మెంట్).

**మార్చి 20, 1996 - రాతప్రతి**

# 7. మరణశిక్షలూ రాజ్యహత్యలే

జీవించే హక్కుకి మరణశిక్ష వ్యతిరేకం. జీవించే హక్కు మనిషికి స్వతస్సిద్ధంగా లభించిన హక్కుగా ఐక్యరాజ్యసమితి గుర్తించింది. రెండవ ప్రపంచ యుద్ధం ముగిశాక విడుదలైన ఐక్యరాజ్యసమితి అంతర్జాతీయ మానవ హక్కుల ప్రకటన రాజ్యం ఎవరినీ చిత్రహింసలకు గానీ, క్రూరమైన అమానుషమైన, అవమానకరమైన శిక్షకు గాని గురిచేయరాదని నిషేధం విధించింది. ఈ స్వతస్సిద్ధమైన మానవ హక్కులను మనిషి నుండి విడదీయలేమనీ, మనుషుల మంచి చెడు లక్షణాలను బట్టి అవి ఇవ్వడం, రద్దుచేయడం చేయరాదనీ మానవ హక్కుల ప్రకటన స్పష్టంచేసింది. భారత రాజ్యాంగం జీవించే హక్కును 21వ అధికరణంలో పొందుపరిచినప్పటికీ మనదేశంలో ఇప్పటికీ రాజ్యం చట్టబద్ధంగా మరణశిక్ష రూపంలోనూ, చట్ట వ్యతిరేకమైన అనేక ఇతరరూపాల్లోనూ జీవించే హక్కును కాలరాయడం జరుగుతోంది. భారతదేశంలోని అత్యున్నత న్యాయస్థానం సైతం పలుమార్లు మరణశిక్ష రాజ్యాంగ బద్ధమేనని ప్రకటించడం విస్మయం కలిగించే విషయం.

ప్రపంచ వ్యాప్తంగా మరణశిక్ష రద్దుకోసం పలు ప్రయత్నాలు జరిగి కొంత మేరకు సఫలీకృతమయ్యాయి. 1980 వరకూ 25 దేశాలు మాత్రమే మరణశిక్షను రద్దుపర్చగా, ఆమ్నెస్టీ ఇంటర్నేషనల్ 1994లో విడుదల చేసిన లెక్కల ప్రకారం మరో 30 దేశాలు కూడా ఆ జాబితాలో చేరాయి. మరణశిక్షను రద్దుచేసిన దేశాల్లో కెనడా, జర్మనీ, గ్రీస్, నార్వే, స్వీడన్, డెన్మార్క్, ఫ్రాన్స్, ఆస్ట్రేలియా లాంటి యూరోపియన్ దేశాలే కాక ఫిలీప్పిన్స్, కొలంబియా, కొస్టారికా, హైతీ, వెనిజులా లాంటి మూడవ ప్రపంచ దేశాలనేకం వున్నాయి. అంతేకాక, చట్టాల్లో

మరణశిక్ష ఉన్నప్పటికీ దాన్ని అమలు చేయని దేశాలు సుమారు 40 వరకూ వున్నాయి. గ్రేట్ బ్రిటన్‌లో యుద్ధ నేరాలకు తప్ప మిగిలిన అన్ని నేరాలకూ మరణశిక్షను రద్దుపర్చారు. అమెరికా సంయుక్త రాష్ట్రాల్లో అనేకం మరణ శిక్షను రద్దుచేశాయి.

మరణశిక్షను రద్దు చేసేదిశగా ప్రపంచం ప్రయాణిస్తున్నప్పటికీ ప్రపంచ మానవాళి అంతస్సాక్షి మాత్రం ఆ దిశగా ప్రయాణించక పోవడం గమనార్హం. సమాజం పెంపొందించదలచుకున్న విలువలనే ధ్వంసం చేసే సాధనాలను ఎప్పటికీ సమాజ పరిరక్షణకు ఉపయోగించరాదు. అలా చేస్తే జరిగే హానిని ఇంకా ప్రపంచ దేశాలు గుర్తించాల్సి ఉంది. ప్రపంచంలోని అత్యున్నత మేధావులు, మానవ హక్కుల సంస్థలు మరణశిక్ష రద్దు కోసం ప్రయత్నం చేస్తుండగా చాలామంది ఇంకా మరణశిక్షకు అనుకూలంగా ఉండడం బాధాకరం. మరణశిక్షను క్రూరమైన అనాగరికమైన, ప్రజాస్వామ్య విలువలను ధ్వంసం చేసేదిగా వారు భావించడం లేదు. మరణశిక్షను సమర్థించే వారి అభిప్రాయాలు ఎలాంటి శాస్త్రీయతకూ నిలబడవు. మరణశిక్షవల్ల భవిష్యత్‌లో నేరాల సంఖ్య తగ్గుతుందనే, నేరాల నిరోధానికి అది దోహదం చేస్తుందనే మూఢనమ్మకాలే మరణశిక్షపట్ల ఆకర్షణకు ప్రధానమైన కారణం.

ఒక మనిషిని తానుచేసిన నేరానికి తగు విధంగా శిక్ష విధించే బదులుగా, మరెవరినో ఉదహరణగా చూపి భవిష్యత్‌లో నేరాలు నిరోధించేందు కోసం శిక్ష విధించడం అసంమంజసం. అన్యాయుం. డిటరెంట్ శిక్షా సిద్ధాంతంలో ఇమిడివున్న అసంబద్ధత ఇది.

శాస్త్రీయ పరిశోధనలనేకం మరణశిక్షకు సంబంధించి ఈ సిద్ధాంతం తప్పని రుజువు చేశాయి. మరణశిక్ష రద్దుచేసిన దేశాల్లో అంతకు ముందు ఆ శిక్ష అమలు చేసినప్పటి కంటే నేరాల సంఖ్య ఏమాత్రం పెరగలేదు. మరణశిక్షను అమలు జరుపుతున్న దేశాల్లో నేరాల సంఖ్య ఏమాత్రం తగ్గలేదు. కెనడాను ఉదాహరణగా తీసుకుంటే 1978లో అక్కడ మరణశిక్షను రద్దుపర్చారు. అంతకుముందు అక్కడ హత్యానేరానికి మరణశిక్ష విధించేవారు. 1975లో ఒక లక్ష జనాభాకు 3.09 హత్యలు జరగ్గా, మరణశిక్ష రద్దయిన అయిదేళ్ళకు ఆ

రేటు కేవలం 2.74గా ఉంది. ఆ తరువాత ఏడాది ఎన్నడూ లేనంత తక్కువ సంఖ్యలో హత్యానేరాలు జరిగాయి. 1988లో ఐక్యరాజ్యసమితి జరిపిన సర్వే కూడా మరణశిక్ష రద్దు హత్యానేరాల సంఖ్య పెరగడానికి ఏమాత్రం దోహదం చేయలేదనీ, జీవిత ఖైదుకన్న మరణశిక్షకు నేర నిరోధక శక్తి ఏ మాత్రం ఎక్కువగా లేదని నిరూపించింది. మరణశిక్ష సమాజాన్ని మరింత క్రూరంగా మారేందుకు దోహదం చేస్తుందని కూడా కొన్ని శాస్త్ర పరిశోధనలు నిరూపించాయి. ఉదాహరణకు, బ్రిటన్‌లో మరణశిక్ష రద్దువిషయమై సిఫార్సు చేసేందుకు యాభై ఏళ్ళ క్రింద నెలకొన్న రాయల్ కమీషన్ విచారించిన 167 మంది మరణశిక్షకు గురైన ఖైదీల్లో 164 మంది బహిరంగ ఉరిశిక్షలు అమలును చూసినవాళ్ళే. వారిని ఆ దృశ్యం హంతకులు కాకుండా నిరోధించక పోగా, హత్యలు చేసేందుకు కావాల్సినంత క్రూరత్వాన్ని వారి మెదళ్ళలో నిలిపింది.

హత్య, మరణశిక్ష పరస్పర విరుద్ధమైనవి కావు. పరస్పరం రద్దు పర్చుకోవు అంటారు జార్జి బెర్నాల్డ్. ప్రభుత్వం అమలు జరిపే మరణశిక్ష ఏవిధంగా చూసినా వ్యక్తి చేయగలిగిన నేరంతో సరిపోల్చలేనిదని మరో మేధావి అభిప్రాయం. ఒక మనిషిని నిస్సహాయంగా నిర్బంధించి, చనిపోయే తేదిని ముందుగా ప్రకటించి తన దయా దాక్షిణ్యాలపై అట్టిపెట్టుకొని చంపడం అత్యంత క్రూరమైంది. పథకం ప్రకారం చేసే హత్య మొదటి శ్రేణికి చెందింది. అలాంటిది వాస్తవ ప్రపంచంలో జరగడం దుస్సాధ్యం. కాబట్టి మరణశిక్షను ఏ నేరంతోనూ పోల్చడానికి వీల్లేదు. మరణశిక్షలో తీవ్రమైన, వర్ణనకు లొంగని మానసిక, శారీరక చిత్రహింస ఇమిడి ఉంది.

నేరస్తుడు భవిష్యత్‌లో పశ్చాత్తాపం ప్రకటించి మారిపోయి మంచి మనిషిగా కాగలగడం సాధ్యమేననే ఆశాభావాన్ని మరణశిక్ష ధ్వంసం చేస్తుంది. ఫలితంగా అది మనోవికాసాన్ని, అంతస్సాక్షి ఎదుగుదలను, సమవికాసాన్ని నిర్మూలిస్తుంది. మనుషులను అవలీలగా చంపగలిగే హంతకులను ప్రభుత్వ యంత్రాంగాలలోను, దాన్ని తేలిగ్గా ఆమోదించే వారిని సమాజంలోనూ సృష్టిస్తుంది. ప్రభుత్వ వ్యవహారాల్లో, చట్టాల్లో వ్యక్తి కక్షకు స్థానం కల్పిస్తుంది. సమాజ అంతరాత్మను ఆదిమ అనాగరికత దిశగా నడిపిస్తుంది.

క్రూరమైన నేరస్తుడిని అంతం చేయడం ద్వారా అతను తిరిగి నేరం చేసే అవకాశాన్ని నిర్మూలిస్తుంది కాబట్టి మరణశిక్ష సమంజసమనేది మరోవాదన. నేరస్తులు పలు రకాల ప్రభావాలకు లోనై క్రూర నేరం చేసినప్పటికీ వారు జీవితఖైదు లాంటి శిక్షల అనంతరం తిరిగి మామూలు పౌరులుగా సమాజంలో ఇమిడిపోయిన ఘటనలే ఎక్కువ. ఇంగ్లాండ్‌లో మరణశిక్షను రద్దుపర్చగా విడుదలైన 129 మంది హంతకులు కేవలం ఒకరు మాత్రమే తిరిగి హత్యానేరానికి జైలుకు వెళ్లారు.

ప్రస్తుతం అమలులో వున్న శిక్షా పద్ధతి నేరానికి నేరస్తుడినే పూర్తిగా బాధ్యుడిగా ప్రకటించి సామాజిక బాధ్యతను మరుగుపరుస్తుంది. సామాజిక పరిస్థితులే వ్యక్తులను నేరాలకు పురికొల్పుతాయి. అందులో నేరస్తుడి వ్యక్తిగత పాత్ర ఉండకపోదు. కాని నేరస్తుడి పాత్ర ఎంత, సామాజిక పరిస్థితుల పాత్ర ఎంత అనే అంచనా వేసి అందుకు తగు మోతాదులో నేరస్తుడికి శిక్ష విధించాలి. సమాజ పరిస్థితుల మార్పుకు కృషి చేయగలిగే విధంగా చట్టాలను మానవీకరించుకోవాలి. నేరస్తులను పరివర్తనకు వీల్లేని మనషులుగాకాక వారిలో పరిపక్వతకు దోహదం చేసి పరివర్తనా శిక్షా సిద్ధాంతాన్ని క్రిమినల్ చట్టాల్లో అమలు పర్చాలి. మరణశిక్ష మానవీకరణ పరివర్తనకు వ్యతిరేకం. సామాజిక పరిస్థితుల నుండి తలెత్తే అనేక నేరాలకుగాను మరణశిక్షకు గురయ్యేది ముఖ్యంగా దళితులు, పేదలు, మైనార్టీ జాతుల వారేననేది కూడా ఇక్కడ గమనించాలి.

న్యాయస్థానాలు పొరపాట్లకు అతీతమైనవి కావు. మరణశిక్షను ఒకసారి అమలు జరిపితే తిరిగి వెనక్కి తీసుకోవడం సాధ్యంకాదు. అనేక కేసుల్లో మరణశిక్షకు గురైనవాళ్ళు నిర్దోషులని లేదా వారు మరణశిక్ష విధించదగ్గ నేరం చేయలేదని తేలింది.

ఇంగ్లాండులో 1950లో టిమోతీ ఎవాన్స్‌ను హత్యానేరంపై ఉరితీశారు. 1953లో అతను నిర్దోషి అని కొన్ని సాక్ష్యాధారాలు బయటపడ్డాయి. అమెరికాలో శాక్కో, వాంజెట్టి కేసులోనూ, రోజెన్ బర్గ్ దంపతుల కేసులోనూ కమ్యూనిస్టు వ్యతిరేక ఉన్మాదం వల్ల వారు మరణశిక్షకు లోనయ్యారని బయటపడింది.

శాక్కొ, వాంజెట్టిలు చనిపోయిన యాభైఏళ్ళకు ప్రభుత్వం పరోక్షకంగా వారిని అమాయకులని చెప్పక తప్పలేదు. ఇక మనదేశం గురించి చెప్పుకోవాలంటే 1975 అక్టోబర్‌లో అలహాబాద్ హైకోర్టు జీలుసింగ్, హర్బన్స్ సింగ్, కాశ్మీర్‌సింగ్‌లకు ఒక హత్యకేసులో మరణశిక్ష విధించింది. హత్యలో వారు సమాన పాత్ర నిర్వహించారని హైకోర్టు పేర్కొంది. వారు ముగ్గురు విడివిడిగా సుప్రీంకోర్టులో అప్పీలు కోసం స్పెషల్ లీవ్ పిటీషన్ దాఖలు చేసుకున్నారు. జీలుసింగ్ పిటీషన్ జస్టిస్ చంద్రచూడ్, జస్టిస్ క్రిష్ణయ్యర్, జస్టిస్ అంత్వాలా ముందు కొచ్చింది. ఆ పిటీషన్‌ను 1975 ఏప్రిల్ 15న డిస్‌మిస్ చేశారు. కాశ్మీర్‌సింగ్ పిటీషన్ జస్టిస్ ఫజల్ ఆలీ, జస్టిస్ భగవతి ముందుకు రాగా, 1977 ఏప్రిల్ 10న అనుమతించారు. శిక్షను యావజ్జీవ కారాగారశిక్షకు తగ్గించారు. జీలుసింగ్‌ను 1981 అక్టోబర్ 6న ఉరితీశారు. మూడో ఖైదీ హర్బన్స్ సింగ్ మరోసారి పిటీషన్ వేసుకోగా సుప్రీంకోర్టు దాన్ని అనుమతించలేదు. కానీ రాష్ట్రపతి క్షమాభిక్ష కోసం అభ్యర్థించమని సూచించింది. ఇలా ఒకే కేసులోని నేరస్థులకి రకరకాల శిక్షలు పడి మరణశిక్ష ఔచిత్యాన్నే ప్రశ్నిస్తున్నాయి.

**(1998)**

# 8. రైతుల కిడ్నీల అమ్మకం - అసలు కథ

గుంటూరు జిల్లా పల్నాడు ప్రాంతంలోని రెంటచింతల రైతులు అప్పులు తీర్చలేక మూత్రపిండాలను అమ్ముకోవడం ఇటీవల దేశవ్యాప్తంగా సంచలనం రేకెత్తించింది. స్టార్ టి.వి., జీ. టి.వి.లతోపాటు దేశవాళీ టీవీ ఛానళ్ళు ఈ వార్తను ప్రముఖంగా టెలికాస్ట్ చేశాయి. ఆ తర్వాత దినపత్రికలు మేలుకొన్నాయి. ఈ మాటంటే తెలుగు దినపత్రికల స్థానిక విలేఖరులకు కోపం వస్తుంది. రావడం న్యాయం కూడా. పాపం వాళ్ళు కష్టపడి ఈ వార్తను అందరికంటే ముందే తమ పత్రికలకు చేరవేశారు. అయితే అది జిల్లా పేజీల అగడ్తలలో పూడుకుపోయింది. అది చూసిన టీవీ ఛానళ్ళ వాళ్ళూ, ఇంగ్లీషు దినపత్రికల వాళ్ళూ మేలుకొని దాన్ని అంతర్జాతీయ వార్త చేశారు. ఆ తర్వాత ఆ వార్తను కనిపెట్టిన ఖ్యాతిని ప్రకటించుకుంటూ తెలుగు దినపత్రికలు వాటికి 'పెద్ద పేజీల'లో చోటిచ్చాయి. పిట్టకథగా మార్చబడిన మహాకథనం తిరిగి అసలు స్వరూపం సంతరించుకుంది.

పిట్టకథగా ఉన్నప్పుడు స్పందించని రాష్ట్ర ప్రభుత్వం మహాకథనానికి స్పందించక తప్పలేదు. కానీ దాన్ని తిరిగి పిట్టకథగా మార్చేసే వరకూ అది నిద్రపోలేదు. ఆ వైనాన్ని చూద్దాం.

రాష్ట్రంలో అత్యధిక ఉష్ణోగ్రతకు పేరుపొందిన రెంటచింతలలో రైతులు అప్పులపాలై కిడ్నీలను అమ్ముకోవడం 1991 నుంచీ ప్రారంభమైంది. చాలాకాలంగా వాణిజ్య పంటలకు ఆలవాలమైన ఈ గ్రామంలో రైతులు మిర్చి, ప్రత్తి విరివిగా పండిస్తారు. నకిలీ విత్తనాలు, పనిచేయని పురుగుమందులు, అననుకూల వాతావరణం, గిట్టుబాటు ధర లేకపోవడం, ప్రభుత్వ బ్యాంకులు అప్పులివ్వకపోవడం లాంటి కారణాలు వీరిని ప్రైవేటు వడ్డీ వ్యాపారుల బారిన

పడవేశాయి. నూటికి ఐదూ, పది రూపాయల కాబూలీ చక్రవడ్డీల వలలో చిక్కుకుపోయారు. తమ దేహంలో రెండు కిడ్నీలుంటాయనీ, అందులో ఒకటి లేకపోయినా బతకవచ్చనీ, అసలు ఒకటి పోగొట్టుకుంటేనే బతకగలమనీ వారికి ఇటీవలే తెలిసింది. పక్క గ్రామానికి చెందిన ఒక ఆసామీ కిడ్నీ అమ్మకానికి ప్రయత్నించి మార్గం కనుక్కొని వచ్చాడు. గుంటూరు, ఏలూరు పట్టణాలకు చెందిన బ్రోకర్లు ఢిల్లీ, హర్యానాలలో ఈ కిడ్నీ అమ్మకాలను నిర్వహించారు. రెంటచింతలలో రెండు డజన్ల మందికి పైగా కిడ్నీలను అమ్ముకోగా, మరో వందమంది తమ కిడ్నీలు విక్రయ వస్తువుగా ఉపయోగపడగలవని వైద్య పరీక్షల ద్వారా నిర్ధారించుకున్నారు. ఒక్కొక్క కిడ్నీకి రైతుకు ముట్టింది నలభైవేల నుంచి యాభైవేల రూపాయలే. కిడ్నీ ధర మార్కెట్‌లో లక్షన్నర నుంచి రెండున్నర లక్షల వరకూ ఉంటుందని అంచనా. మళ్ళా అక్కడా రైతులకు అండర్ సెల్లింగ్ తప్పలేదు.

వీటిపై రాష్ట్ర ప్రభుత్వం స్పందించిన తీరు చాలా హేయంగా వుంది. ఆత్మహత్యలు, ఆకలి చావులు కాక బతకడానికి అదొక్కటే మార్గంగా భావించి కిడ్నీలు అమ్ముకుంటున్నారనే సానుభూతి కూడా లేకుండా వాళ్ళని అవమానిస్తోంది. వారి పరిస్థితులను మెరుగుపరచడానికి ఏమీ చేయడంలేదు. కిడ్నీలను కొన్న దళారులు, వైద్యులు, వైద్యశాలల యజమానులను కఠినంగా శిక్షించేందుకు, చట్ట పాలనా యంత్రాంగాన్ని సరైన విధంగా కదిలించేందుకు కూడా ఎలాంటి ప్రయత్నం చేయడంలేదు. స్టాక్ మార్కెట్‌లో పడిపోతున్న షేర్‌ల ధరను పెంచు కునేందుకు ప్రయత్నించే కంపెనీ లాగానే ప్రభుత్వం స్పందించిందని చెప్పాలి.

## చంద్రబాబు మౌనానికి అర్థమేమిటి?

రాష్ట్ర ముఖ్యమంత్రి ఇప్పటివరకూ ఈ విషయమై నోరు మెదపలేదు. తను జోక్యం చేసుకోదగ్గంత పెద్ద సమస్య కానట్టుగా ప్రవర్తిస్తున్నారు. చాలా చిన్న విషయంగా, పిట్టకథగా అనిపిస్తున్నట్టుంది ఆయనకు.

మరోవైపు రాష్ట్ర వైద్య ఆరోగ్యశాఖ మంత్రి శ్రీమతి శనక్కాయల అరుణ కిడ్నీలమ్ముకున్న బాధిత రైతులకు వ్యతిరేకంగా ప్రకటనలు గుప్పిస్తున్నారు.

కిడ్నీ విక్రయాలకూ రైతుల అప్పుకూ సంబంధంలేదనీ, రాష్ట్ర ప్రభుత్వ ఆర్థిక విధానాలకూ అక్కడి రైతుల పరిస్థితికీ ఎలాంటి లంకె లేదనీ, ప్రభుత్వానిది అందులో ఏ పాపం లేదనీ ఆమె శెలవిచ్చారు. తేలిగ్గా డబ్బు సంపాయించేందుకు ('ఈజీ మనీ కోసం') రైతులు కిడ్నీలు విక్రయించారని కూడా ఆమె పత్రికల వారికి చెప్పారు. కిడ్నీల విక్రయం వ్యక్తిగత వ్యవహారం మాత్రమేనని దాని సారాంశం. పిట్టకథగా మార్చేందుకు ఇదొక ఎత్తుగడ.

స్థానిక పోలీసు స్టేషన్లో ఒక చిన్న క్రిమినల్ కేసు మాత్రమే నమోదు చేశారు. భారత శిక్షాస్మృతిలోని సెక్షన్ 326 (ప్రమాదకర ఆయుధాల ద్వారా, పద్ధతుల ద్వారా తీవ్రమైన గాయం కలుగజేయడం), సెక్షన్ 420 (మోసగించడం) కింద ఈ కేసులో ఇద్దరు దళారులను అరెస్టు చేశారు. కేసును రాష్ట్ర సి.ఐ.డి.కి అప్పజెప్పారు. అంతే ఇక కథ కంచికి, మనం ఇంటికి పోవాలని అది కోరుకుంది.

## ఉండీ లేనట్టయిన మానవ అవయవాల మార్పిడి చట్టం

'మానవ అవయవాల మార్పిడి చట్టం' పేరిట 1994లో భారత పార్లమెంటు ఒక చట్టం చేసింది. 1995 ఫిబ్రవరి నుంచి మహారాష్ట్ర, గోవా, హిమాచల్ ప్రదేశ్ రాష్ట్రాల్లో అమల్లోకి వచ్చిన ఈ చట్టం మన రాష్ట్రంలో కూడా ఆ తర్వాత అమలులోకి వచ్చింది. మానవ అవయవాలను అమ్మడం, కొనడం ఏడేళ్ళ జైలు శిక్షకు అర్హమైన నేరంగా చట్టం నిర్దేశించింది. దీనికి కనీస శిక్ష రెండేళ్ళ జైలు. డాక్టర్లకయితే ఐదేళ్ళ వరకూ జైలు శిక్ష వేసే అధికారం కోర్టుకుంది. కిడ్నీల విక్రయాన్ని అడ్డుకొనేందుకు భారత శిక్షాస్మృతి సరిపోదని తేల్చుకున్న తర్వాతే ఈ ప్రత్యేక చట్టం అవసరమని పార్లమెంటు భావించింది. కానీ, రెంటచింతల కేసులో రాష్ట్ర ప్రభుత్వం ఈ చట్టాన్ని పక్కకు పెట్టి పనికిరాని ఐపిసి పిట్టకథను ముందుకుతెచ్చి తను పనిచేసే ప్రభుత్వంగా నిరూపించదలుచుకుంది. కిడ్నీల క్రయవిక్రయాన్ని, అవయవాల మార్పిడిని కాక, 'గాయపర్చడం', 'మోసం చేయడం' మాత్రమే ఐపిసి కింద నేరాలుగా పోలీసులు నమోదు చేశారు. అవి నిరూపించగల అవకాశాలు లేవు. కేసు నమోదై వారం రోజులు దాటినప్పటికీ, ఢిల్లీ, హర్యానా వైద్యుల పేర్లు తెలిసినప్పటికీ ఇప్పటివరకూ వాళ్ళను పట్టుకున్న దాఖలా లేదు.

అయితే మానవ అవయవాల మార్పిడి చట్టం కింద పోలీసులకు అధికారాల్లేవు. కేసులను పరిశోధించే అధికారం రాష్ట్ర ప్రభుత్వం నియమించిన 'అప్రాప్రియేట్ అథారిటీ'కి మాత్రమే ఉంది. ఆ అథారిటీ పోలీసు అధికారి కాని పక్షంలో అరెస్టులు, ఇంటరాగేషన్లు ఉండే అవకాశం లేదు. మన రాష్ట్రంలో అప్రాప్రియేట్ అథారిటీగా నియమితులైన వారిలో పోలీసు అధికారులు లేరు. వైద్య సర్వీసుల డైరెక్టర్, నీలోఫర్ ఆస్పత్రి సూపరింటెండెంట్ 'అప్రాప్రియేట్ అథారిటీ'గా నియమితులయ్యారు. వారికి నేర పరిశోధనలో అనుభవం లేదు. కిడ్నీలు పోగొట్టుకున్న బాధితులను కూడా ముద్దాయిలుగా ఈ చట్టం భావిస్తుంది. ప్రైవేట్‌గా క్రిమినల్ కేసును ఈ చట్టం కింద దాఖలు చేయాలంటే 60 రోజులు ముందుగా అప్రాప్రియేట్ అథారిటీకి నోటీసు ఇవ్వాల్సివుంది.

ఈ లోపాలను చూసే మన రాష్ట్ర ప్రభుత్వం ఐపిసి కింద కేసు నమోదు చేసిందేమోనని ఎవరైనా సందేహ పడనక్కర్లేదు. రాష్ట్ర ప్రభుత్వానికి మనసుంటే మార్గముండేదేమో. అప్రాప్రియేట్ అథారిటీగా వెంటనే పోలీసు ఉన్నతాధికారి నొకరిని నియమించి ఉండవచ్చు. లేదా కేంద్ర నేరపరిశోధక సంస్థ - సిబిఐకి ఈ కేసును అప్పజెప్పి ఉండవచ్చు. ఢిల్లీలో, హర్యానాలో ఉన్న డాక్టర్లు కిడ్నీలను మార్పిడి చేశారని బ్రోకర్లు పోలీసులకు చెప్పారు కాబట్టి సిబిఐకి కేసును అప్పజెప్పడం సముచిత చర్యగా ఉండేది. కానీ రాష్ట్ర ప్రభుత్వం ఆ పని చేయదల్చుకోలేదు. ఎందుకంటే కేసును సిబిఐకి అప్పజెప్తే తాము పిట్టకథగా మార్చింది కాస్తా మహాకథనమౌతుంది కాబట్టి మన పోలీసులే దాన్ని చేపట్టి పరిశోధించాలని ప్రభుత్వం కోరుకుంది.

ఏమైనప్పటికీ తెలుగు రైతుల కడగండ్లను, ప్రభుత్వ విధానాల వైఫల్యాన్ని, మానవ అవయవాల చట్టం డొల్లతనాన్ని రెంటచింతల రైతులు కిడ్నీలను అమ్మి దేశ ప్రజల ముందు ఆవిష్కరించారు. ఒక మూత్రపిండం కోల్పోయి జీవించే హక్కును కాపాడుకోగలిగారు. వాళ్ళు క్రిమినల్ కేసులో నిందితులు కానప్పటికీ రాష్ట్ర ప్రభుత్వ దృష్టిలో దోషులే. రాష్ట్ర ప్రభుత్వ ప్రతిష్టను దెబ్బతీసిన విలన్లు.

"మేం చనిపోయాక ప్రభుత్వం మా కుటుంబాలను ఆదుకుంటుందన్న నమ్మకం మాకు లేదు. మేం అప్పుల పాలయ్యాం కాని ఆకలి చావుల పాలు

కాదల్చుకోలేదు. మా మూత్రపిండాలను మేం అమ్ముకుని బతకడం తప్పా?" అని ఆగ్రహంతో ప్రశ్నిస్తున్న ఆ రైతులకు తమ కిడ్నీలను అమ్మి పెట్టిన బ్రోకర్లే దేవుళ్ళుగా కనిపిస్తున్నారు. ప్రభుత్వాన్నే శత్రువుగా చూస్తున్నారు. ఈ రోల్ రివర్సల్‌కు ప్రభుత్వం వద్ద సమాధానం లేనంత వరకూ ఇలాంటి ఘటనలు పునరావృతమవుతూనే ఉంటాయి. దోషులు నిర్దోషులుగా విడుదలయ్యే అవకాశాలుంటాయి.

**మే 5, 2000 - నీహార్ ఆన్‌లైన్.కామ్**

# 9. పేదలను బ్రతకనివ్వండి! ఈ నగరాన్ని మాంసాహార పుష్పంగా మార్చకండి!!*

## (వీధి వ్యాపారులకు వ్యతిరేక విధానాలను నిరశిస్తూ గుంటూరు నగరపాలక సంస్థకు హెచ్ఆర్ఎఫ్ బహిరంగ లేఖ)

డియర్ సర్స్,

రోడ్లు విస్తరించే పేరిట నగరపాలక సంస్థ పాలకవర్గం అత్యుత్సాహంతో చేపట్టిన కూల్చివేత కార్యక్రమాన్ని ఈ నగరం గత మూడేళ్ళుగా చూస్తూనే వుంది. గత మేయర్, కమీషనర్‌లు ఉన్మాదోత్సాహంతో ఆ పని చేశారు. వీధి వ్యాపారులపై ఎక్కుపెట్టి అదే పనిని మీరు ఒక నెల క్రితం తిరిగి ప్రారంభించారు. గత మేయర్, కమీషనర్‌ల లాగే వీధి వ్యాపారుల గురించిన మీ దృక్పథం న్యూయార్క్, లండన్, సింగపూర్ వీధులను దృష్టిలో పెట్టుకొని ఏర్పరచుకున్నదే.

నగరాన్ని అందంగా తీర్చిదిద్ది అభివృద్ధి చేయాలనే పేరుతో రోడ్డు విస్తరించే కార్యక్రమం వేలాదిమంది పేద ప్రజల బ్రతుకుతెరువు అవకాశాలను క్రమంగా కుదిస్తూ వచ్చింది. వారిలో ఎక్కువమంది పేద దళితులు, బి.సి.లు, ముస్లింలు. మునుపటి మేయర్, కమీషనర్‌లు రోడ్డు మార్జిన్‌ల నుండి 3 వేలమంది కుటుంబాలను నిర్దాక్షిణ్యంగా స్థానభ్రంశం చేశారు. పెద్దపెట్టున పేద ప్రజల బతుకులను ధ్వంసించే ఈపనికి రాకాసిలాంటి పొక్లెయిన్లను ఉపయోగించారు. క్షణాల్లో షాపులను కూలగొట్టారు. వికలాంగుల టెలిఫోన్ బూత్‌లను తొలగించారు. గుడిసెలను నేలమట్టం చేశారు. ఆర్.టి.సి. బస్‌డిపో వద్ద జెండా

---

* హెచ్ఆర్ఎఫ్ పేరిట ఇవ్వబడినప్పటికీ ఈ లేఖ రచయిత చంద్రశేఖర్. అందువలన ఈ సంపుటిలో చేర్చబడినది.

చెట్టు తొలగించేందుకు నెలల తరబడి సంప్రదింపులు జరిపామని చెప్పుకున్న నగరపాలక సంస్థ అధికారవర్గం పేదలను నిలువనీడ లేకుండా చేసే ముందు కనీసం వారికి ఆ విషయం చెప్పలేదు. దురదృష్టవశాత్తూ, ఏ రాజకీయ పార్టీగానీ, ఇతర ప్రజాసంస్థలుగానీ చెప్పుకోదగ్గ విధంగా ప్రతిఘటించలేదు. ప్రతి ఒక్కరూ ఆ పనిని సమర్థిస్తున్నారనే అప్పట్లో అనుకున్నారు. రోడ్డు మార్జిన్‌ల నుంచి తొలగించిన వారిలో కొందరిని నగరానికి వెలుపలి ప్రదేశాలకు తరలించారు. అక్కడ రోడ్లు, నీటి వసతి, విద్యుచ్ఛక్తి లాంటి మౌలిక సదుపాయాల్లేవు. వారి బాధల గురించి ఎవ్వరూ పట్టించుకోలేదు. ఈ నగరాభివృద్ధి గురించిన గొప్పల వెనుక, ఇళ్ళు కోల్పోయిన, పనులు కోల్పోయిన వేలాదిమంది వ్యధార్త జీవితగాధలున్నాయి. ఇప్పుడు వీధి వ్యాపారులను తరిమేసే పని మీరు చేస్తున్నారు. ఆగస్టు 11న మీరు దినపత్రికల్లో ఇచ్చిన నోటిఫికేషన్ మీ పనిని చట్టబద్ధం చేసుకునే బూటకపు తంతు. ఎందుకంటే, మీరు ముందుగానే దాన్ని ప్రారంభించారు కాబట్టి. వీధి వ్యాపారులపై ఐదొందల రూపాయలు జరిమానా విధించడం (తర్వాత దాన్ని నాలుగువందలకు తగ్గించారు) చూస్తే మీరు రూపాయల్లో కాక డాలర్లలో ఆలోచించగలరనిపిస్తోంది. (నాలుగువందల రూపాయలు అంటే కేవలం పది అమెరికన్ డాలర్లు!).

కానీ, భారతదేశంలో నగరాల పుట్టుక, పాశ్చాత్య దేశాల్లో నగరాల పుట్టుక ఒకటి కాదు. 'భారత నగరాలు గ్రామాల సముదాయాలు' అని ప్రఖ్యాత చరిత్రకారుడు డి.డి. కోశాంబి రాశారు. బలప్రయోగంతో, హింసతో, చట్టపరమైన చర్యల బెదిరింపులతో, అమానుష పోలీసు యంత్రాంగం మద్దతుతో గుంటూరు మీద మీ మెదడులో పాశ్చాత్య నగరం గురించి మీకున్న భావనను రుద్దుతున్నారు. అలా మీరు ఈ నగరాన్ని మాంసాహార పుష్పంగా తయారుచేస్తున్నారు. ఈ రకమైన అభివృద్ధి మానవహక్కుల ఉల్లంఘనపై ఆధారపడింది. దయచేసి గుర్తుంచుకోండి! ఉపాధి కల్పించలేని, పేదరికాన్ని నిర్మూలించలేని రాజ్యానికి నిజాయితీగా కష్టపడి పొట్టపోసుకునే వీధి వ్యాపారుల జీవనభృతిని ధ్వంసించే అధికారంలేదు.

వీధి వ్యాపారులు వీధుల్లో ఆనందించడానికి లేరు. ట్రాఫిక్‌కు అంతరాయం కలిగించేందుకు, ఇబ్బంది పెట్టేందుకు లేరు. తమ కుటుంబాలకు ఒక పూటైనా

కడుపునిండా తిండి పెట్టేందుకు వారు వీధులను ఆశ్రయిస్తున్నారు. తమ పిల్లలను విలాసవంతులుగా, తేలిగ్గా డబ్బు సంపాయించేందుకు ఉవ్విళ్ళూరే వాళ్ళుగా, ఇంటర్‌నెట్ బ్రౌజింగ్‌లో కాలం గడిపే వారిగా తయారు చేయలేమని వారికి తెలుసు. మేయర్‌గారు నడిపే కాలేజీల్లాంటి వాటికి తమ పిల్లలను ఏనాడూ పంపలేమని వారికి తెలుసు. ఐఎఎస్ అధికార్లుగా చేయలేమని వారికి తెలుసు. కనీసం జంతు ప్రాయంగానైనా ఈ భూమ్మీద జీవించాలని వారు కోరుకుంటున్నారు. ఘనత వహించిన యాభైఏళ్ళ స్వాతంత్ర్యం వారికి ఏ సంపదలనూ తెచ్చిపెట్టలేదు. (మీ వర్గానికి చెందినవాళ్ళే స్వతంత్ర ఫలాలను భోంచేసి వారిని వీధుల్లోకి నెట్టివేశారని మేం చెప్పగలం). వారి మానాన వారిని వదిలేయండి! భారత రాజ్యాంగం హామీ ఇచ్చిన జీవించే హక్కును వారికి దక్కకుండా చేయకండి.

ఈ దేశంలో పేదలకు ఇప్పుడు మరీ గడ్డుకాలం దాపురించింది. రాజ్యాంగం పట్ల, అది ఆశించిన సమసమాజం పట్ల ఏ మాత్రం గౌరవంలేని ప్రభుత్వాధికార్ల, రాజకీయ నాయకమ్మన్యుల (న్యాయవ్యవస్థకు చెందిన బ్యూరోక్రాట్ల) తెగ తయారైంది. సామాజికంగా, ఆర్థికంగా, రాజకీయంగా వెనుకబడిన తరగతుల ప్రజలను బలోపేతం చేయడం వారి అస్పష్ట జ్ఞాపకాల్లో కూడా లేదు. ప్రాథమిక హక్కులను, ఆదేశిక సూత్రాలను ఉటంకిస్తే వారు సందేహాస్పదంగా చూస్తారు. వాటిని శాపగ్రస్త గతానికి చెందిన విషయాలుగా వారు భావిస్తారు. రాజ్యాంగంకంటే వారికి ప్రపంచ బ్యాంకు షరతులే గొప్పవి. రాజ్యాంగాన్ని తిరగరాయడాన్ని వారు సమర్థిస్తారు. వీధి వ్యాపారులకు వ్యతిరేకంగా మీ చర్యలు చూస్తే మీరు కూడా అలాంటి వారేనని ఎవరైనా నమ్ముతారు.

రాజ్యాంగం కాకపోయినా, సుప్రీంకోర్టు తీర్పులైనా మీరు చేస్తున్నది చట్ట వ్యతిరేకమని మీరు ఆలోచించేట్లు చేయగలుగుతాయా? లేదా, మీరు 'హ్హా! హ్హా!! మాకు మేమే చట్టాలం' అని బిగ్గరగా నవ్వుతారా?

నగరం, పట్టణం గురించిన వేరే అభిప్రాయాలు కూడా ఉండగలవు. మన అభిప్రాయాలను బట్టి మన చర్యలు కూడా మారతాయి. ఈ శతాబ్దం ప్రారంభంలో స్కాటిష్ సిటీ ప్లానర్ పాట్రిక్ గెడ్స్ భారత పట్టణాలను తీవ్రంగా అధ్యయనం చేశాడు. బ్రిటీష్ వలస పాలన తెచ్చిపెట్టిన అభివృద్ధి సమస్యల

గురించి ఆలోచించాడు. పేదలకు నివాసయోగ్యమైన, మానవత్వంతో కూడిన పట్టణ ప్రణాళికలను రూపొందించాడు. మొదటి ప్రపంచ యుద్ధానంతరం అభివృద్ధి చెందిన సిటీప్లానింగ్ సిద్ధాంతాలు అర్బన్ ప్లానింగ్‌లో సామాజిక సంబంధాల స్థల ఆధిపత్యాన్ని గురించి కేంద్రీకరించాయి. నగరంలో స్థలాలను సరైన విధంగా పంపిణీ చేయడం నగర పాలకుల, ప్రణాళికా రచయితల బాధ్యత అని చెప్పాయి. ''నగరంలోని ప్రాథమిక సామాజిక క్రమాలు స్థలాలను మార్కెట్‌ద్వారా, అధికారవర్గం ద్వారా కేటాయించడానికి సంబంధించినవి. అవి నగర స్థలాల కోసం సామాజిక నిచ్చెనలో ఉన్న వివిధ వర్గాల పోరాటానికి సంబంధించినవి''. నగరంలో స్థలాలకోసం పోరాటం జీవించే అవకాశాల గురించిన వర్గపోరాటం (కులం, మతం కూడా కొన్నిసార్లు ఇందులో పాత్ర వహిస్తాయి) అని విశ్లేషించవచ్చని కొందరు పరిశోధకులు చెప్పారు. మీరు ఈ పోరాటంలో కంచెకు ఆవల పేదలకు వ్యతిరేకంగా మోహరించారు. కానీ, ఈ దేశంలో అత్యున్నత శాసనం ప్రకారం, అత్యున్నత న్యాయస్థాన ఆదేశానుసారం మీరు అలా ఉండకూడదు.

నగర ప్రజల ముఖ్యంగా నగరాలకు తరలివచ్చే గ్రామీణ పేదల సమస్యలకు వీధి వ్యాపారులు ఒక పరిష్కారం అని మీరు గుర్తించాలి. చౌక ధరలకు సరుకులు అందజేయడం ద్వారా, వీధి వ్యాపారులు నగరంలోని పేద, మధ్య తరగతి వర్గాల ప్రజలను ఆదుకుంటున్నారు. ప్రభుత్వం చేయాల్సిన పని చేస్తున్నారు. భూసంస్కరణల ఘోర వైఫల్యం లక్షలాది ప్రజలను నగరాలకు తరిమివేసింది. వారిని వీధి వ్యాపారులుగా, రిక్షా పుల్లర్స్‌గా, ఆటోడ్రైవర్లుగా, చెప్పులు కుట్టుకునే వాళ్ళుగా ఇంకా ఎన్నో విధాలుగా నగరంలో బ్రతుకు వెళ్ళమార్చేవారిగా చేసింది. ఉదారవాద ఆర్థిక సంస్కరణలు వారిని కొత్తపేదలుగా మార్చాయి. ఈ విధంగా అంచుకు విసిరివేయబడిన వాళ్ళ జీవనాన్ని దెబ్బతీసేందుకు మీరు ప్రయత్నిస్తున్నారు.

వీధి వ్యాపారులను సానుకూలంగా అర్థం చేసుకునేందుకు, వారిని నగరంలో విడదీయరాని భాగాలుగా భావించేందుకు చాలా కారణాలున్నాయి. వాళ్ళు తమ బ్రతుకు తామే బ్రతుకుతారు. ప్రభుత్వాన్ని ఉద్యోగాలిమ్మని అడగరు. వారు పేదరికాన్ని తగ్గిస్తారు. పేదలు తమ పేదరికాన్ని పోగొట్టుకునేందుకు

వీధి వ్యాపారాన్ని మార్గంగా భావిస్తారు. వారు ప్రజలకు ముఖ్యమైన సేవలందిస్తారు. మీరెప్పుడైనా పేదరికంవల్ల ఆకలితో అలమటిస్తే గుంటూరు వీధుల్లో పదిరూపాయలకే సుష్టుగా భోంచేయవచ్చు! ఆర్థిక అభివృద్ధిలో వారు తమ వంతు పాత్ర నిర్వహిస్తారు. (ముంబాయిలో వీధి వ్యాపారులు ఏడాదికి 6వేల కోట్ల రూపాయల వ్యాపారం చేస్తారు.)

వీధి వ్యాపారులు మన సంస్కృతిలో, సంప్రదాయంలో భాగం. (మీరెప్పుడైనా వీధుల్లో సాయంత్రం వేళల్లో మిరపకాయ బజ్జీలు తిన్నారా? ఉదయాన్నే వీధుల్లో పూలమ్మే వాళ్ళు, పళ్ళమ్మేవాళ్ళు, కొబ్బరి బోండాలమ్మే వాళ్ళు, ఇడ్లీలు తయారుచేసే వాళ్ళు మన సంస్కృతిలో భాగం). వాళ్ళను వీధుల్లోంచి తరిమేసి సూపర్ మార్కెట్స్‌కు అవకాశం కల్పించడం మన అస్థిత్వంలో ఒక భాగాన్ని ధ్వంసం చేస్తుంది. మన సమిష్టి మానసిక స్థితి అభివృద్ధిని, మన స్వీయ నిర్వచన పురోగమనాన్ని నిరోధిస్తుంది. బహిరంగ వ్యాపారం, వీధి మూలల్లో వ్యాపారం, సంతలు, ఇంటింటికీ తిరిగి వస్తువులమ్మడం మన సంప్రదాయంలో భాగం (పాశ్చాత్య దేశాల్లో ఇది లేదు). (మన చెరకు రసం బండ్లవాళ్ళు, కొబ్బరిబోండాలమ్మేవాళ్ళు, థమ్సప్, కోకాకోలాలకు ఈ దేశంలో నిజమైన సవాల్).

దయచేసి ముంబాయి, ఇంఫాల్ లాంటి నగరాల్లో మాదిరిగా నగర ప్రణాళికను రూపొందించండి. వీధి వ్యాపారులను, ఇతర చిరువ్యాపారులను వ్యాపార ప్రాముఖ్యమున్న స్థలాల్లో బ్రతుకనివ్వండి. దురదృష్టవశాత్తూ ఈ నగరానికి అలాంటి ప్రణాళిక లేదు. ఈ నగరపాలక సంస్థ గుంటూరును నగరీకరించే క్రమం 'మధ్యతరగతి నగరాన్ని సృష్టించడం' తప్ప మరొకటి కాదు. మీరు ఇటీవల జరిపిన అభిప్రాయ సేకరణలో పాల్గొనేందుకు ఉద్దేశించినవారూ, పాల్గొన్నవారూ మధ్య తరగతికి, ఉన్నత తరగతికి చెందినవారే. ఇప్పటివరకు ఉన్నత తరగతి, అగ్రకుల వ్యాపార ప్రదేశాలు నగరపాలక సంస్థ ముద్దుబిడ్డలయ్యాయి. గత ఆర్థిక సంవత్సరంలో ఓల్డ్‌క్లబ్ రోడ్, అరండల్ పేట 4వ లైనుకు ఖర్చుపెట్టిన (2 కోట్ల రూపాయలకుపైగా) మొత్తం, అదే కాలంలో నగర జనాభాలో నాలుగోవంతు నివశించే 101 మురికివాడలకు ఖర్చుపెట్టారు. ఆ డబ్బు కూడా నగరపాలక సంస్థ పన్నుల రూపేణా వసూలుచేసిన డబ్బు

కాదు. NSDP, SJRSY నిధుల నుంచి మాత్రమే ఖర్చుపెట్టడం మోసం. నగరపాలక సంస్థ అభివృద్ధి కుల వివక్షతో, వర్గ వివక్షతో కూడుకుందని అనవచ్చా? అది పురుష వివక్షతో కూడా కూడుకుంది! (బహిరంగ ప్రదేశాల్లో నగరపాలక సంస్థ మహిళలకు మూత్రశాలలు నిర్మించలేదు. మహిళలు బజారుకొచ్చేందుకు ఒక గంటముందునుంచే తక్కువ నీళ్ళు తాగాలి. అతిమూత్రవ్యాధి వుంటే మానసిక ఆందోళన తప్పదు).

వీధి వ్యాపారులపై దాడిచేయడం మాని వారితో సమావేశం ఏర్పాటు చేయండి. వీధి వ్యాపారులు, మానవ హక్కుల సంస్థలు, రేట్ పేయర్స్ అసోసియేషన్, రాజకీయ పార్టీల ప్రతినిధులతో అఖిలపక్ష కమిటీ వేయండి. వాళ్ళకు నగర సమస్యలను చెప్పండి. వారి సమస్యలను వినండి.

వ్యాపారం చేసుకునేందుకు వీలున్న స్థలాల్లో ట్రాఫిక్‌కు అంతరాయంలేని ప్రదేశాలను వీధి వ్యాపార జోన్‌లుగా గుర్తించి వారికి కేటాయించండి. కేటాయించిన స్థలాల్లో వ్యాపారం, ఇతర వృత్తులు చేసుకునేందుకు లైసెన్స్‌లివ్వండి. మానవ గౌరవంతో ఈ నగరంలో బ్రతికే విధంగా స్థలాలను కేటాయించండి. (ఉదాహరణకు ఎ.ఇ.ఎల్.సి. ముందున్న స్థలాన్ని హాకింగ్ జోన్‌గా గుర్తించవచ్చు. కానీ, వీధి వ్యాపారులను ఆ స్థలం నుంచి తరమగానే ఎ.ఇ.ఎల్.సి. కంచెవేసి పది అడుగుల వెడల్పు స్థలాన్ని ఆక్రమించింది. రెండేళ్ళపాటు నగరపాలక సంస్థ దాన్ని అనుమతించింది. ఐ.ఎల్.టి.డి. రోడ్డు మార్జిన్ నుంచి గుడిసె వాసులను తరిమేసిన తర్వాత ఆ స్థలాన్ని ఐ.ఎల్.టి.డి కంచెతో ఆక్రమించింది. పార్కింగ్ స్థలాలు లేకుండా షాపులు నిర్మించుకునేందుకు, కష్టమర్ల వాహనాలతో రోడ్డును ఆక్రమించి వీధి వ్యాపారులను నెట్టివేసేందుకు నగరపాలక సంస్థ వ్యాపారులను అనుమతించింది. ఉదాహరణకు అరండల్‌పేట, బ్రాడీపేట 4వ లైన్లు. సెల్లార్లు కూడా వ్యాపార నిమిత్తం వాడుకోబడుతున్నాయి. వీధి వ్యాపారులు అభ్యంతరం కానీ, ప్రైవేటు పార్కింగ్ స్థలాలు లేకపోవడంవల్ల వాహనాలు వీధుల్లో పార్క్ చేయడం నగరపాలక సంస్థకు అభ్యంతరం కాదు. ఆక్రమించింది పేదలైతే అభ్యంతరం. ధనికులైతే అభ్యంతరం కాదు.)

మీకు మనస్సాక్షి ఉంటే (ఉందని భావిస్తున్నాం) ఈ విషయాల గురించి కనీసం మీ విశ్రాంతి సమయాల్లో లేదా బ్రేక్‌ఫాస్ట్ టేబుల్ దగ్గర ఆలోచించండి. ఇది దయాభిక్షకోసం అభ్యర్థన కాదు. ఇది మీ చట్టబద్ధ విధుల గురించీ, జీవించేందుకు పేదలకున్న మానవహక్కుల గురించి మీకు గుర్తుచేయడం. అంతర్జాతీయ మానవహక్కుల ప్రకటన పీఠికలో ఉన్న హెచ్చరిక దృష్ట్యా కూడా ఇది అవసరం.

"చివరి ప్రయత్నంగా మనుషులు నిరంకుశ పరిపాలనకు, పీడనకు వ్యతిరేకంగా తిరుగుబాటు చేసే పరిస్థితి నివారించడం కోసం చట్టపాలన ద్వారా మానవ హక్కులను కాపాడటం అవసరం".

కృతజ్ఞతలు

**న్యాయప్రయోజనార్థం**

**సెప్టెంబరు 25, 2000** **మానవహక్కుల వేదిక (HRF)**

# 10. 'మిలీనియంలో మీడియా'కు కలంపోట్లు

'ఆంధ్రప్రదేశ్‌లో ఇరవయ్యవ శతాబ్ది మీడియా పరిణామాలు' అనే అంశంమీద జనవరి 24న గుంటూర్లో ఒక సెమినార్ జరిగింది. ఆంధ్రప్రదేశ్ ప్రెస్ అకాడమీ, ఆల్ ఇండియా రేడియో సంయుక్తంగా ఈ కార్యక్రమాన్ని నిర్వహించాయి.

రాష్ట్రంలోని అన్ని ప్రముఖ దినపత్రికల ప్రస్తుత ఎడిటర్లు/డిఫాక్టో ఎడిటర్లు/మాజీ ఎడిటర్లు పాల్గొన్న ఈ సెమినార్‌లో ముఖ్య విశేషాలు మూడు - 1. ప్రింట్ మీడియాలో విదేశీపెట్టుబడులకు తలుపులు తెరవాలన్న కీనోట్ ప్రసంగం, 2. భవిష్యత్తు పట్ల భయాందోళనలు తారాడుతున్న కలం కార్మికులు, 3. సంపాదకుడి మరణవార్త ప్రకటన.

సెమినార్ నిర్వహణ పలువిమర్శలకు గురైంది. యాభైమంది మాత్రమే కూర్చునే వీలున్న హాలు కాబట్టి చాలామంది నిల్చోవాల్సివచ్చింది. జిల్లాలోని వర్కింగ్ జర్నలిస్టులు, స్థానిక ప్రేక్షకులు వస్తారన్న స్పృహ నిర్వాహకుల్లో కరువైంది.

సెమినార్‌కు హాజరైన వందమందిలో ఐదుగురు మాత్రమే మహిళలు. వారంతా AIR ఉద్యోగులే. ఒక్కరు మాజీ. మొత్తం 24 మంది వక్తల్లో ఒక్కరే మహిళ. దళితులు/గిరిజనులు ఉన్నారా? అన్నది సందేహాస్పదమే. రాష్ట్రంలో రెండవ అధికారభాషగా ప్రకటించబడ్డ ఉర్దూ భాషా పత్రికల ప్రతినిధులుగానీ, ముస్లిం జర్నలిస్టులుగానీ లేనేలేరు. సర్కారీ ప్రోగ్రాం కాబట్టి రిజర్వేషన్లు పాటించాలని అనడం లేదుగానీ రాజ్యాంగస్ఫూర్తిని దృష్టిలో పెట్టుకొని, బహుళత్వాన్ని ఆచరించి దళిత/గిరిజన/బిసి/మైనారిటీ/మహిళా ప్రాతినిధ్యం, గ్రామీణ ప్రాతినిధ్యం ఆశించడం దురాశకాదు. ప్రత్యామ్నాయ పత్రికల

ఊసులేదు. చిన్న పత్రికలను చిన్నచూపు చూశారు. 'మీడియా' అని శీర్షికలో ఉన్నా ఎలక్ట్రానిక్ మీడియాను ఆహ్వానించిన దాఖలాలేదు. ఇరవయ్యవ శతాబ్దిలో తెలుగు పత్రికా రచనారంగంలోని ఆధిపత్య ధోరణులను సెమినార్ ఈ రకంగా ప్రతిబింబించినట్లయింది.

పత్రికలనుంచికూడా కలం వీరులు తప్ప ధనం వీరులు, అంగడివీరులు, వాణిజ్య ప్రకటనాశూరులు ఆహ్వానించబడినట్లు లేదు. ఇక పాఠకులు/పత్రికల వినియోగదార్లు ఎవరూ ఈ సెమినార్ దృష్టిలో ఉన్నట్టులేరు. నిర్వాహకులు ఏం ఆశించి ఈ సెమినార్ ఏర్పాటు చేశారోగానీ, మధ్యలో ఎవరో 'అనుకున్నదొకటి అయినదొకటి' అని వ్యాఖ్యానించడాన్ని బట్టి నిర్వాహకులు ఆశించినదానికి భిన్నమైన చర్చ జరిగిందనుకోవాలి.

సెంటర్ ఫర్ మీడియా స్టడీస్ అనబడు ఢిల్లీ సంస్థకు డైరక్టర్‌గా చెప్పబడే డాక్టర్ భాస్కరరావు అనే ఆసామీ చేత నిర్వాహకులు కీనోట్ ప్రెజెంట్ చేయించారు. ప్రింట్ మీడియాలో విదేశాలకు తలుపులు తెరవమని చెప్పడం తప్ప ఆయన పట్టుకొచ్చిన తాళం ఏ చర్చకూ తలుపుల్ని తెరవలేక పోయింది. చర్చంతా కీనోట్ బయట జరగడం విశేషం. కొండకచో దానికి వ్యతిరేకంగా సాగడమూ విశేషమే. ప్రింట్ మీడియాకు అఖండ భవితవ్యాన్ని కీనోట్ ప్రామిస్ చేస్తుండగా, చర్చలో పాల్గొన్న సదస్సుల మొహాల్లో, మాటల్లో భవిష్యత్తు గురించిన భయాందోళనలు ఎక్కువగా తారట్లాడాయి. ఉద్యోగుల భవితవ్యం గురించిన భయాలు, ప్రత్యామ్నాయ పత్రికలు, చిన్న పత్రికలు చితికిపోతున్న శబ్దాలు, ఎడిటర్లకున్న స్వేచ్ఛ/లేనిస్వేచ్ఛ/ఉండాల్సిన స్వేచ్ఛ/ఉండగలిగే స్వేచ్ఛ/ మార్కెట్ కబళిస్తున్న స్వేచ్ఛ/న్యూస్‌రూం స్వేచ్ఛను హరిస్తున్న బిజినెస్ రూం పట్ల భయం, వాణిజ్య ప్రకటన సేకర్తలుగా మార్చబడుతున్న వార్తాహరుల వృత్తినైతికత పతనమౌతున్న బాధ, వార్తాగుత్తాధిపత్యంపై నిరసన/నిస్సహాయత వగైరాలన్నీ చర్చల్లో విన్పించాయి.

పత్రికలు మూసివేస్తున్న తాళాల చప్పుడు. అసలు ఎడిటర్ అనే వాడొకడు ఇంకా బ్రతికే ఉన్నాడా? అన్న అస్తిత్వ ప్రశ్న అందరి ఆత్మలనూ తొలిచివేస్తున్న శబ్దం. 20వ శతాబ్ది మీడియా పోకడలేమోగానీ 21వ శతాబ్దపు ముసళ్ళ పండుగ

గురించి భయం, ఆవేదన, నిస్సహాయత కన్పించాయి. వీటికతీతంగా సెమినార్‌లో మాట్లాడింది ముగ్గురే ముగ్గురు - ఒకరు, 'భవిష్యత్ శాస్త్రకారుడయిన కీనోట్ అడ్రస్ దారుడు. రెండవవారు అద్వైతాన్ని నమ్మే ఒక మెగా దినపత్రిక సైనికుడు. ఇక మూడవవారు తన కథని మాత్రమే ప్రచురించాలనుకునే ఒక పోలీసు పాఠకుడు లేదా పాఠకపోలీసు.

ఆహుత వ్యక్తులకు ఒక్కొక్కరిని ఒక్కొక్క అంశంపై ప్రసంగించవలసిందని నిర్వాహకులు కోరినట్టున్నారు. ఆ అంశాలపై వారు ఉపన్యాసాలు రాసుకొని వచ్చారు. తెలుగులో స్వతంత్ర వార్తాసంస్థ సాధ్యాసాధ్యాలు - (వి. హనుమంతరావు), పత్రికలు - ఉద్యమాలు (వరదాచారి), పత్రికలు-రాజకీయ పక్షపాతం (రాజశుక), పత్రికల్లో శీర్షికలు (కూచిమంచి సత్యసుబ్రహ్మణ్యం), రేడియో వార్తలు (వేదవతి), తెలుగు పత్రికల్లో ఇంగ్లీషు పదాలు (ఏడిద గోపాలరావు) ఇంకా ఇలాంటివే. చివరికి చర్చ సరళి చూసి, పైగా ఒక్కొక్కరికి కేవలం ఐదు నిమిషాలే కేటాయించడం వల్ల వక్తల్లో అనేకులు తమ రాతప్రతులను భవిష్యన్ముద్రణకు భద్రంగా దాచుకొని (వాటిని పుస్తకంగా ప్రచురిస్తామని పొత్తూరి హామీ ఇచ్చారు) చర్చలో పాల్గొన్నారు. చాలామంది ఉపన్యాస శీర్షికలు కూడా ప్రేక్షకులకు తెలియలేదు. లక్షలు ఖర్చుపెట్టి నిర్వహించిన ఈ ఆర్భాటం అర్థవంతమైన చర్చ లేకుండానే ముగిసింది. కీనోట్‌ను కూడా నిర్వాహకులు పంచలేకపోవడం బాధాకరం.

పత్రికా స్వేచ్ఛ పరిమితులను గతంలో రాజ్యపరంగా చెప్పేవారు. కానీ ఇవాళ రాజ్యం నాన్ ఎంటిటీ అయిందన్నట్టుగా మార్కెట్/పెట్టుబడి స్వేచ్ఛను కబళిస్తుంటే, జర్నలిస్టు జీవితాల్లోకి అనిశ్చితత ప్రవేశిస్తుంటే, రాజ్యం కంచెకు ఆవలివేపు ఉందనే ఆరోపణగా చర్చ జరిగింది.

కీనోట్ అడ్రస్‌దారుడు డాక్టర్ భాస్కర్రావు ఎవరో తెలియని వాళ్ళకోసం నిర్వాహకులు ఒక కాగితం ఇంగ్లీషులో అచ్చొత్తించి వదిలారు. అందులోని విషయాలను బట్టి రావుగారు చాలా పెద్దమనిషనీ, తలకుమించి ఆలోచించగలరనీ మనకు తెలియగలదు. థింక్ బిగ్, థింక్ బియాండ్ అని నినదిస్తూ ఆయన ఆంగ్ల కీనోటోపన్యాసాన్ని ముగించినందున నాబోటి

మీడియేతరులకు తెలుస్తుంది. ప్రజాభిప్రాయాన్ని అమ్మకపు సరుకుగా చలామణీ చేయించగల, భవిష్యత్‌ను మార్కెట్ పెట్టుబడిగా మార్చగల శాస్త్రకారుడాయన. ఎమర్జెన్సీ చీకటి రోజుల్లో ఇరవై సూత్రాల పథకం గురించిన సలహాదారుడిగా ఒక వెలుగు వెలిగారీయన. ఆత్మను రాజ్యపరమాత్మతో లీనంచేసి అంకితభావంతో ఆయన సేవ చేస్తుండగా జనతాపార్టీ ప్రభుత్వం దానిని కొనసాగించిందని చెప్పజాలము. భరతఖండము రెండువేల ఇరవై ఒకటిలో ఎలా వుంటుందో చెప్పవలసిందిగా అమెరికా ప్రభుత్వం అడిగిందే తడవుగా పన్నెండేళ్ళు కాయకష్టం చేసి మనదేశ భవిష్యత్తు చిత్రపటాన్ని, దేశ జీవనాడిని, జీవనగతిని అంకుల్ శ్యాంకు అమ్ముకున్నారట. దాన్ని 'ఇండియా 2021' అన్న పుస్తకంగా 1988లో అచ్చొత్తించారు. 'మీడియా సీన్ ఇన్ ఇండియా', 'రూరల్ మార్కెటింగ్', 'మార్కెటింగ్ కమ్యూనికేషన్' వంటి గ్రంథరాజములు లేదా రాజగ్రంథములు వారి కలం నుండి జాలువారాయి. ఈయనకు ఏదో సంస్థ మాన్ ఆఫ్ ఏచీవ్‌మెంట్-1999 అవార్డును ఎందుకు ప్రదానం చేసిందన్న విషయం ఆ సంస్థగురించి తెలిస్తే తప్ప మనకు అర్థం కాదే. అరడజను దేశ, దేశాల సంస్థల్లో వీరు సభ్యులు. వీరు ఆసియా అభివృద్ధి బ్యాంకు, ప్రపంచబ్యాంకు పోర్డు ఫౌండేషన్ సలహాదారులట. కాబట్టి వీరిని కీనోట్ చిరునామాదారుడిగా ఆహ్వానించడానికి నిర్వాహకులకు పూర్తిహక్కు ఉందని మనం భావించక తప్పదు.

డాక్టర్ భాస్కరరావు కీనోట్ ప్రసంగం సారాంశం ఇది: టెక్నాలజీలో వెనకబడొద్దు. అప్పుచేయకపోతే పిచ్చోడంటారు. పెద్ద వ్యాపారాలే చేయండి. పత్రికల అమ్మకాలకు ఢోకాలేదు. విదేశీయులను ఆహ్వానించండి.

తనునుతాను తప్ప మరొకరిని ఉల్లేఖించకుండా ఆయన చెప్పిన అంశాలను పామరులకోసం జన్మభూమి నినాదాలుగా రాస్తే దాదాపు ఇలా వుంటాయి:

1. ఆర్థిక అసమానతల కన్నా సమాచార అసమానతలు మిన్న
2. రాజ్య గుత్తాధిపత్యం కన్నా ప్రైవేటు గుత్తాధిపత్యం మిన్న
3. రాజ్యం మీడియా జోలికి రారాదు! మార్కెట్ మీడియాకి రారాజు!
4. టెక్నాలజీ భయం/పెట్టుబడి భయం! సృజనాత్మకత ఖతం, ఖతం!

5. మనం - చెప్పేకొసకన్నా వినేకొసనున్నాం!
6. బిజినెస్ సైజు బిగ్గు! లాభాల వేటలో నెగ్గు!!
7. పత్రికలు ప్రజాస్వామ్య నాల్గవ స్థంభం అనే భావనకు చెల్లైనులే కాలం!
8. ప్రింట్‌మీడియా, ఎలక్ట్రానిక్ మీడియా నందామయా ప్రభుత్వ పాలసీల వైరుధ్యం పోవాలయా!

'మేము' కాక 'నేను' భావం బలపడిందనీ, పౌరుడు-సమాజం నుంచి, కన్స్యూమర్-మార్కెట్ వరకూ ప్రయాణించాలనీ, రేపు మళ్ళీ రాదు నేడే శుభం (దేవుడు చేసిన మనుషులు సినిమా పాటలావుంది) అనే తత్వం గురించి, బిజినెస్‌లో హైట్ పాత్ర గురించి ఎలిమెంటరీ విద్యార్థులకు పాఠం చెప్పినట్టుగా చెప్పారు. ఇవాల్టి మీడియా మోడల్ సరికాదనీ, అది మారాలనీ అన్నారు.

భాస్కరరావుగారి సుదీర్ఘ కీ-నోట్ ముగిసిన వెంటనే చర్చ ప్రారంభమైంది. కె. శ్రీనివాస్ రెడ్డి (జర్నలిస్టు సంఘం నేత - విశాలాంధ్ర) ఎడిటర్‌కూ యాజమాన్యానికి ఉన్న సంబంధం గురించి మాట్లాడారు. ఎడిటర్ యాజమాన్యం పక్షంవహించే ధోరణిని విమర్శించారు. జర్నలిస్టులకు వాణిజ్య ప్రకటనల సేకరణా బాధ్యత అప్పజెప్పడం వల్ల వృత్తి ధర్మం బలౌతుందన్నారు.

మార్కెట్/మనీ చేత నిర్ణయించబడే పత్రికలలో ఎడిటర్లకు ఆదర్శాలు ఉండటం అసాధ్యమని 'ఆంధ్రజ్యోతి' ఎడిటర్ ఐ. వెంకట్రావు అన్నారు. ఎడిటర్ ఉద్యోగి మాత్రమేనని ఆదర్శాలుంటే సొంత పత్రిక పెట్టుకొని చెప్పుకోవాల్సిందని అన్నారు. ఆదర్శాల ఎడిటర్‌కు ఉద్యోగం ఊడటం ఖాయం. ఆ తర్వాత ఇలాంటి మీటింగులకు కూడా ప్రెస్ అకాడమీ పిలవదని ఆయన నిర్మొహమాటంగా చెప్పారు.

ఎడిటర్ అనేవాడు లేడనీ, అతనూ ఒకానొక జనరల్ మేనేజర్ లాంటివాడేననీ 'వార్త' ఎడిటర్ కె. రామచంద్రమూర్తి ప్రకటించారు. సంస్థ అధిపతి మనసునొప్పించే విషయాలు ఎవరూ మాట్లాడకూడదని చెప్పారు. ఎడిటర్ స్వేచ్ఛగురించి వినడానికి జనానికి బోర్ కొడుతుందని కూడ ఆయన కుండబద్దలు కొట్టినట్టు చెప్పారు.

ఎడిటర్‌కు ప్రత్యేక అస్తిత్వం ఉండాలి, మేనేజ్‌మెంట్ కన్నా ఉద్యోగులకు దగ్గరగా ఉండాలి అని శ్రీనివాసరెడ్డి చెప్తే, ఎడిటర్‌కు ప్రత్యేక అస్తిత్వమే లేదని వెంకట్రావుగారి మాట. ఇక రామచంద్రమూర్తి ఎడిటర్ మరణాన్నే ప్రకటించారు. తన స్వేచ్ఛను అనుమతించిన మేరకు ప్రజాసేవకు, అభ్యుదయానికి ఉపయోగించుకోవాలని 'ఎనాలిసిస్' నాగేశ్వర్ అన్నారు. రామచంద్రమూర్తిగారిది నిజమైన సందిగ్ధస్థితి. ఆయన చెప్పిన పరిష్కారం కూడా తర్కబద్ధంగానే ఉంది. కాకపోతే అందులో ఆయన పాత్రలేదు. ఆ తర్కం ఇదీ: న్యూస్‌పేపర్ ఒక అమ్మకపు సరుకు. దాన్ని మార్కెట్ శక్తులు (అంటే వినియోగదార్లని అర్థం చేసుకోవాలి) నిర్ణయిస్తాయి. ఆ సరుకు లాభాలు తేవాలి. కాబట్టి మార్కెట్ శక్తులే ఎడిటర్/రిపోర్టర్ల స్వేచ్ఛను రక్షించాలి. అంటే పాఠక ప్రజలలో స్వేచ్ఛాభావాలు వెల్లివిరిస్తే తప్ప ఎడిటర్ అభిప్రాయ స్వేచ్ఛను అనుభవించలేడు. స్వేచ్ఛాభావాలు అమ్మకపు సరుకుగా చలామణి అయ్యే పరిస్థితుల్లో పత్రికాధిపతి దాన్ని సొమ్ముచేసుకోబూనుకున్నప్పుడు ఎడిటర్‌కు ఆ మేరకు స్వేచ్ఛ లభిస్తుంది. (స్వేచ్ఛాప్రియుడైన మూర్తిగారికి ఇది స్వీయ అనుభవం కావచ్చు). అందుకే ఆయన సదస్సులో పత్రికాధిపతులు, పాఠకులు లేనందుకు బాధపడ్డారు. పత్రికా ప్రపంచంలో మార్పులు తేగలిగినవారు సెమినార్ బయట ఉంటే చర్చకు అర్థంలేదని ఆయన భావన. పత్రికారంగానికి అమావాస్య చీకట్లు ముసురుకున్నాయని (జనవరి 24, మౌని అమావాస్య) చెప్పిన ఎంవిఆర్ శాస్త్రి (ఆంధ్రభూమి ఎడిటర్) మూర్తిగారితో ఏకీభవించలేదు. ఇరవైనాలుగేళ్ళ తన అనుభవంలో తనకు స్వేచ్ఛ నిరాకరించిన మేనేజ్‌మెంట్ లేదన్నారు. ఎడిటర్‌కు కావాల్సినంత స్వేచ్ఛ ఉందని ఆయన భావన. (ఇదికూడా స్వీయానుభవం కావచ్చు. మేనేజ్‌మెంట్ భావాలు, ఎడిటర్ భావాలు ఒకటైన చోట కూడా స్వేచ్ఛ సమస్యకాదు).

న్యూస్‌రూంపై బిజినెస్ రూం ఆధిపత్యం గురించి వాసుదేవ దీక్షితులు వాపోయారు. సెక్యులరిజం, ప్రజాస్వామ్య విలువలు 'మినిమమ్ అండ్ మోడెస్ట్ ఎజెండా'గా పత్రికా ఎడిటర్ స్వేచ్ఛ విలసిల్లాలని తెలకపల్లి రవి (ప్రజాశక్తి) తన ధోరణిలో ప్రసంగించారు.

ఈ స్వేచ్ఛా ప్రవచనానికి (discourse of liberty) అతీతంగా అటు డా॥ భాస్కరరావు ఇటు, కొమ్మినేని శ్రీనివాసరావు ఉన్నారు. వారిద్దరికే స్వేచ్ఛ అసలు సమస్య కాదు. శ్రీనివాసరావుగారు స్వయంగానూ, గర్వంగానూ చెప్పుకున్నట్టు వారు రామోజీ కింద సైనికుల్లా పనిచేస్తారు. ఆత్మ పరమాత్మ ఒకటే అయిన అద్వైత వేదాంతధోరణి వారిది.

కలం కార్మికుల బాధలపై చర్చ మరోసారి పెట్టవలసిందిగా దేవులపల్లి అమర్ (ప్రజాతంత్ర) ప్రెస్ అకాడమీకి విజ్ఞప్తి చేశారు. అప్పటివరకూ నైతిక విషయపరంగా జరుగుతున్న చర్చను ఆయన లీగల్ విషయానికి మార్చారు. ప్రెస్‌కౌన్సిల్ వారి మార్గదర్శక సూత్రాల ఉల్లంఘన, చిన్న పత్రికలకు యాడ్‌లివ్వని ప్రభుత్వం, కనీస వేతనాలు, అవార్డులు ఆయన ఉపన్యాసంలో చోటుచేసుకున్నాయి.

ప్రపంచీకరణ, ఆర్థిక గుత్తాధిపత్యం, సమాచార గుత్తాధిపత్యం లాంటి విషయాల గురించి ఎప్పటిలాగే ఈడ్పుగంటి నాగేశ్వరరావుగారు మాట్లాడారు. వీరు లేని పక్షంలో 'భారతరాజ్యాంగం' అన్న పదం వినిపించకుండానే సెమినార్ ముగిసివుండేది. ఆ ప్రమాదాన్నించి సెమినార్‌ను కాపాడి రాజ్యాంగ విలువల గురించి ఆయన గుర్తుచేశారు.

పత్రికల గుత్తాధిపత్యం గురించి మొదటగా ప్రొఫెసర్ విశ్వేశ్వరరావు (ఉస్మానియా) ప్రస్తావించారు. బహుళత్వం నుంచి ఏకత్వానికి రాష్ట్ర పత్రికా రంగం ప్రయాణించిందనీ, ఒకే గొంతుక వినిపిస్తోందనీ అన్నారు. "రాష్ట్రంలో 11.5 కోట్ల దినపత్రికల సర్క్యులేషన్‌లో 80 శాతం ఒకరే నియంత్రించడం ప్రమాద సంకేతం. ఏ సమస్యలు ఫోకస్ అవుతాయి, ఏవి సమస్యలవుతాయి, ఏది రాష్ట్రప్రజల ఎజెండా అవుతుంది. అనే నిర్ణయాలు ఒకరే చేస్తున్నార'న్నారు. పేదరికం, అసమానతలు చర్చినీయాంశాలు కాకపోవడానికి కారణం అదేనన్నారు. అందులో కులసమస్య కూడా ఉందన్నారు. (కుల సమస్య గురించి ప్రస్తావించింది వీరొక్కరే) రాష్ట్రంలో పసికందుల మరణాల రేటు, పత్రికల మరణాలరేటు ఎక్కువైందని ముగించారు.

ఇంత జరుగుతుంటే పొత్తూరిగారు ఏంచేశారన్న ఆసక్తి పాఠకులకు కలగకమానదు. అధ్యక్ష స్థానంలో ఆశీనులైన ఆయన చర్చ జరుగుతున్నంతసేపూ

విషాద మనస్కులుగా కనిపించారు. సెమినార్‌లో ప్రదర్శితమైన భయాలను, విషాదాన్ని ఆయన సానుభూతితో పంచుకున్నారనిపించింది. మధ్యలో మాట్లాడుతూ టివి, వెబ్ పోర్టళ్ళవల్ల ప్రింట్ మీడియా సర్క్యులేషన్ పడిపోతుందన్న భయాన్ని వ్యక్తం చేశారు. ప్రింట్ మీడియాలోకి పరిమితిలేని విదేశీ పెట్టుబడులు ప్రవేశిస్తే భవితవ్యం ఏమిటన్నది ఆయన మరో సందేహం. మూతపడిన, పడబోతున్న పత్రికల గురించి మరోబాధ. సెమినార్ ఆయనకు అనుకున్నదొకటి, అయ్యిందొకటి కాదని వేరే చెప్పనక్కర్లేదు. కానీ, ఆ విషయాన్ని ఆయన ప్రకటించలేకపోవడం ప్రెస్ అకాడమీ ఛైర్మన్‌గా ఆయన స్వేచ్ఛకు రాజ్యం గీసిన అలిఖిత సరిహద్దు.

ఈ మొత్తం విషాదభరిత సన్నివేశం ఒకే ఒక్క పాఠకుడికి ఆనందాన్నిచ్చింది. ఆ రోజు సాయంత్రం ఆ ఒక్క పాఠకుడికే నిర్వాహకులు మాట్లాడే అవకాశాన్ని కల్పించారు. ఆయన పేరు పూర్ణచంద్రరావు. జిల్లా ఎస్.పి. ఆయన సంతోషానికి కారణం దిగ్గజాల్లాంటి కలం వీరులు పెట్టుబడి ఆదేశాలవల్ల స్వేచ్ఛకోల్పోయారని తెలియడం. అలాంటి వారికి తమలాంటి వారిని విమర్శించే నైతిక హక్కు ఎలా ఉంటుంది అన్న దాన్ని ఆయన విడమర్చి చెప్పారు కూడా.

21వ శతాబ్ది ప్రారంభంలో రాష్ట్రంలో 'అచ్చుపత్రికారంగం'లో కలం వీరుల భయాల, సందేహాల, అభద్రతా భావాలను వ్యక్తంచేసిన సదస్సుగా దీన్ని చెప్పుకుంటే ఈ సెమినార్ విజయవంతమైనట్టే లెక్క.

## పోస్ట్ మోడ్రన్ స్క్రిప్టు

సెమినార్ జరుగుతున్న సమయంలో ప్రేక్షకుల చెవుల్లో పుట్టిన తెలుగు జాతీయం "ఎడిటర్‌ను కొన్నవాడే ఎడిటర్ స్వేచ్ఛగురించి మాట్లాడగలడు".

**జనవరి 26, 2001 - అభిప్రాయ వేదిక**

# 11. న్యాయవ్యవస్థపై కన్నేసిన ప్రపంచ బ్యాంకు

ప్రపంచ బ్యాంకు, ప్రపంచ వాణిజ్య సంస్థల ప్రోద్బలంతో ఆర్థిక, వ్యవసాయ, విద్యుత్ రంగాల్లో చేపట్టిన సంస్కరణలు, వాటి దుష్ప్రభావం గురించి చర్చ జరుగుతోంది. ప్రజలనుంచి ప్రతిఘటన వ్యక్తమౌతోంది. చట్టాలనూ, న్యాయవ్యవస్థనూ సంస్కరించని పక్షంలో సరళీకృత ఆర్థిక విధానాలకు, ప్రపంచీకరణకు వీలు కుదరదనీ ప్రపంచ బ్యాంకు తదితర అంతర్జాతీయ విపణి సంస్థలు గుర్తించాయి. 'విపణి స్నేహిత న్యాయవ్యవస్థ' నినాదంతో ప్రపంచ బ్యాంకు గతపదేళ్ళుగా మనబోటి బడుగుదేశాల చట్టాలను, న్యాయవ్యవస్థలను చాపకిందనీరులా తొలిచేస్తోంది. ఈ పని మనదేశంలో కూడా జరుగుతున్నప్పటికీ దానికి ప్రతిఘటన కాదుగదా చర్చేలేదు. న్యాయవ్యవస్థలో బతికే వారికి కనీస సమాచారం తెలియదు. విదేశీ లాయర్ల ప్రవేశానికి గేట్లు తెరుస్తామంటేనో, సివిల్ ప్రొసీజర్ కోడ్‌కు భారీ సవరణలు ప్రతిపాదిస్తేనో ప్రతిఘటించిన న్యాయవాద సంఘాలకు ఒక విస్తృత అవగాహన కరువైంది. పైగా న్యాయవ్యవస్థతో తమ ఆర్థిక ప్రయోజనాలు ముడిపడివున్న కొందరికి ఈ సంస్కరణలు ప్రియమైనవిగా మారి వినాశకాల విపరీత బుద్ధులు పొడచూపుతున్నాయి.

గత దశాబ్దం ప్రారంభం నుంచీ భారత దేశంతో సహా 26 తృతీయ ప్రపంచ దేశాలపైకి అంతర్జాతీయ పెట్టుబడి తన న్యాయ/చట్ట సంస్కరణల పంజా విసిరింది. ప్రపంచ బ్యాంకు , ఇంటర్ అమెరికన్ అభివృద్ధి బ్యాంకు, ఆసియా అభివృద్ధి బ్యాంకు కలిసి 1993 నుంచి 1997 వరకూ 500 మిలియన్ డాలర్లకు పైగా ఈ తరహా సంస్కరణల కోసం వివిధ దేశాలకు అప్పులిచ్చాయి. జపాన్,

స్విట్జర్లాండ్, ఫ్రాన్స్ ప్రభుత్వాలు, ఐరోపా సమాజం, జర్మన్ వ్యాపార సంస్థ జి.టి.జెడ్, అమెరికన్ బార్ అసోసియేషన్ లాంటి ప్రభుత్వేతర సంస్థలు కూడా ఈ కార్యక్రమంలో భాగస్వాములు. ఆఫ్రికా అభివృద్ధి బ్యాంకు, యూరోపియన్ ఇన్‌వెస్ట్‌మెంట్ బ్యాంకు లాంటివి ఈ పనిలో ప్రపంచ బ్యాంకుతో జతకట్టాయి.

అంతకు ముందు 1980లలో అమెరికా ప్రభుత్వ సంస్థ యుఎస్ ఎయిడ్ ఇదే ఖాతాలో మంజూరు చేసింది. ఇంకాస్త వెనక్కి వెళ్ళి చూస్తే 1960లలో మనదేశంతో సహా పలు మూడవ ప్రపంచదేశాల్లో అమెరికా తరహా చట్టాలను, న్యాయవ్యవస్థను రుద్దేందుకు ఒక విఫలయత్నం జరిగిందని మనలో చాలామందికి తెలియదు. యుఎస్. ఎయిడ్, ఫోర్డ్ ఫౌండేషన్ నిధులు సమకూర్చిన ఈ పథకం పేరు 'లా అండ్ డెవలప్‌మెంట్ మూవ్‌మెంట్.' కంపీటింగ్ ఈక్వాలిటీస్ పేరిట రిజర్వేషన్ల అమలు గురించి ఉద్గ్రంథాన్ని రచించిన మార్క్ గాలంటర్ ఈ పథకం అమలుదారుల్లో ఒకరు. కానీ, ఈ 'ఉద్యమం' విఫలమయింది. 'ఉద్యమదారులు' గుణ పాఠాలు తీశారు. పౌర సమాజంతో సంబంధం లేని విధంగా పైనుండి అమెరికా న్యాయవ్యవస్థను దిగుమతి చేయబూనుకున్నందున ఆ 'ఉద్యమం' విఫలమైందని మార్క్ గాలంటర్, డేవిడ్ ట్రుబెక్ లాంటి మేధావులు కనిపెట్టారు. ఆ గుణపాఠాల వెలుగులో ప్రపంచబ్యాంకు ప్రస్తుత న్యాయ/చట్ట సంస్కరణలకు పూనుకుంది. పౌర సమాజంతో అనుసంధానించి మాత్రమే ఈ పని చేస్తే పెట్టుబడికి గిట్టుబాటు అవుతుందని స్వయంగా ప్రపంచబ్యాంకు నిపుణులు ప్రకటించారు. (లీగల్ లిటరసీ-న్యాయ విజ్ఞానం పేర్లతో న్యాయ మూర్తులను, న్యాయవాదులను గ్రామ, పట్టణ ప్రజల దగ్గరికి తీసుకెళ్ళి న్యాయ శాస్త్రాల గురించి బోధించే ప్రక్రియ ప్రపంచ బ్యాంక్ 'షరతు' మేరకే జరుగుతోంది. ఇలా పౌర సమాజంతో సంబంధంలోనే దేశీయ న్యాయ వ్యవస్థను ధ్వంసించే ఏర్పాట్లు జరుగుతున్నాయి). విదేశీ పెట్టుబడుల జోక్యంలో మన న్యాయ సంవిధానంలో, న్యాయ తత్త్వ దృక్పథంలో పెనుమార్పులు క్రమంగా చీకట్లలా కమ్ముకుంటున్నాయి. పేదలు, దళితులు, స్త్రీలు, గిరిజనులు లాంటి అంచుకు విసిరివేయబడిన వాళ్ళిప్పుడు న్యాయశాస్త్ర ఎజెండాలో లేరు. న్యాయవివేచన నుంచి అంచుకు విసిరివేయబడుతున్నారు. మొత్తం న్యాయవ్యవస్థ ప్రక్షాళనకు,

చట్ట సంస్కరణకు కేంద్రబిందువుగా 'మార్కెట్' నిలిచే స్థితి క్రమంగా నెలకొంటోంది. న్యాయకోవిదులు ప్రపంచబ్యాంకు సేవలో తదాత్మ్యం చెందుతున్నారు. ప్రైవేటు విద్యుత్ ప్రాజెక్టుల ఏర్పాటును సరళతరం చేసేందుకు తగిన చట్టాల రూపకల్పన కోసం కొన్నాళ్ళక్రితం ప్రపంచబ్యాంకు 30 మిలియన్ డాలర్లు (రూ.120 కోట్లు) మనకి అప్పిచ్చింది. తర్వాత ఏం జరిగిందో మనకు స్వీయ అనుభవమే. మనకి అప్పిచ్చి మనచే చట్టాలు రాయించి మన విద్యుత్‌ను విదేశీ సంస్థలకు ధారాదత్తం చేయించి మనపై పెను ఆర్థిక భారాన్ని మోపడం ప్రపంచబ్యాంకు చట్ట సంస్కరణల చాణక్య నీతిలో భాగం.

ప్రాజెక్టు లార్జ్ పేరుతో 1993 డిసెంబర్‌లో ఒక మెగా పరిశోధనా ప్రాజెక్టును ప్రారంభించారు. ప్రపంచబ్యాంకు కోరుకున్న విధంగా గ్లోబలైజేషన్ దిశగా మనదేశ చట్టాలను తిరిగి రచించడం, పనికిమాలిన చట్టాలేవో గుర్తించి వాటిని చించడం ఈ ప్రాజెక్టు ముఖ్యోద్దేశం. గత ఏడాది 'ఇండియా-రెడ్యూసింగ్ పావర్టీ, యాక్సిలరేటింగ్ డెవలప్‌మెంట్' పేరిట ప్రపంచబ్యాంకు విడుదల చేసిన నివేదికలో కేంద్ర ఆర్థిక మంత్రిత్వశాఖ, ఐక్యరాజ్యసమితి అభివృద్ధి ప్రాజెక్టు 'గొడుగు' కింద చేపట్టిన ఈ ప్రాజెక్టు గొప్పతనాన్ని వివరించింది. ఏ దాపరికం లేకుండా నిర్మొహమాటంగా పేరులోనే చెప్పినట్టుగా ప్రపంచీకరణ కోసం అవసరమైన చట్టపరమైన ఏర్పాట్లు, సంస్కరణలు దీని లక్ష్యం. బెంగుళూరులోని నేషనల్ లా స్కూల్ ఆఫ్ ఇండియా యూనివర్శిటీలో పనిచేసే న్యాయకోవిదులు పవిత్రమైన దేశభక్తితో ఈ ఘనకార్యానికి అంకితమయ్యారు. 1993 డిసెంబర్ నుంచి మూడేళ్ళపాటు ప్రాజెక్టు మొదటిదశ పూర్తయ్యింది. మొత్తం 30 విధాన పత్రాలను రూపొందించారు. నాలుగు వాల్యూముల ఉద్గ్రంథాలలో వివరంగా మన చట్టాలలోని సందర్భాసందర్భాలను విడమర్చి చెప్పారు. అమెరికా చట్టాలను మన దేశం మీద ఎలా రుద్దవచ్చో ఈ 'లార్జ్' శంఖంలో పోసి నేషనల్ లా స్కూల్ వారు తమ జాతీయతను నిరూపించుకుంటున్నారు. న్యాయకోవిదులను పిలిచి తమ ఘనతను సెమినార్లలో చాటుకుంటున్నారు. కార్మికుల హక్కులు హరింపజేసే చట్ట రచన, భూసంస్కరణల వ్యతిరేక ప్రతిపాదనలు 'లార్జ్' భోజనంలో ఇష్టమైన వంటకాలు. రెండవ దశలో వీటిని చేపట్టారు. వివిధ రాష్ట్రాలలో అమలులో ఉన్న భూసంస్కరణ, కార్మిక, పర్యావరణ చట్టాలనూ

తిరగరాస్తారు. కోర్టులకు వెలుపల పరిష్కారాలు, సివిల్ ప్రొసీజర్ కోడ్‌కు, లిమిటేషన్ చట్టానికి సవరణలు తయారయ్యాయి. ఒక మెగా స్థాయిలో దేశ చట్టాలను ప్రపంచీకరించడం ఈ ప్రాజెక్టు చేస్తున్న పని.

భారత పరిశ్రమల సమాఖ్య, ప్రపంచ బ్యాంకు 1999లో ఒక సర్వే నిర్వహించాయి. ప్రపంచ వ్యాపార వాతావరణ సర్వేగా దీనికి నామకరణం చేశారు. ఇందులో భాగంగా మన దేశంలో 210 వ్యాపార సంస్థల వద్ద వివిధ ప్రభుత్వరంగ సేవల గురించి అభిప్రాయాలు సేకరించారు. భారత సైన్యానికి మొదటి స్థానం లభించింది. టెలిఫోన్‌లకు రెండవ స్థానం లభించింది. చట్టపరమైన సేవల రంగానికి బాగా తక్కువ మార్కులొచ్చాయి. ప్రపంచబ్యాంకు నిర్వహించిన సర్వే ప్రకారం అంతర్జాతీయంగా చూస్తే భారత చట్టవ్యవస్థ 50 శాతం పైగా మార్కులు తెచ్చుకొని సెకండ్ క్లాస్‌లో ఉత్తీర్ణత పొందింది. అయినప్పటికీ, సాధారణ వ్యాపార సంస్థలు దానిపై నమ్మకం ఉంచినప్పటికీ, 88 శాతం 'సర్వేజనం' అది మెల్లగా నడుస్తోందని చెప్పారట. ఈ సర్వేజనం సుఖంగా వ్యాపారాలు చేయాలంటే చట్టవ్యవస్థలో పెనుమార్పులు కావాలి. లార్జ్ ప్రాజెక్టు ప్రతిపాదనల వల్లగానీ, నరసింహం కమిటీ-II, ఫైనాన్స్ కమీషన్ సిఫార్సుల వల్లగానీ గ్లోబలైజేషన్ దిశగా చట్టాలను రూపొందించే ప్రక్రియలో భాగంగా గత ఐదేళ్ళలో పలు చట్టాలలో మార్పులొచ్చాయి. రాబోతున్నాయి. పట్టణ గరిష్ట భూ పరిమితి చట్టానికి తూట్లు పొడిచారు. వ్యవసాయ రంగంలో సంస్కరణల పేరిట కార్పొరేట్ వ్యవసాయాన్ని చట్టబద్ధం చేయబోతున్నారు. ఇన్సూరెన్స్ రంగంలో విదేశీ పెట్టుబడులకు ద్వారాలు తెరిస్తూ ఇన్సూరెన్స్ రెగ్యులేటరీ అండ్ డెవలప్‌మెంట్ అథారిటీ బిల్లును పార్లమెంటులో ప్రవేశపెట్టారు. కార్మిక హక్కులను హరించే ఇండస్ట్రియల్ రిలేషన్స్ బిల్లు, పేటెంటు బిల్లు చట్టాలుగా రూపొందించబడే క్రమంలో ఉన్నాయి.

గ్లోబలీకరణ వల్ల కొన్ని వ్యాపార సంస్థలు దివాళా తీయడం జరుగుతోంది. కాబట్టి పరిశ్రమల మూసివేతను సరళీకరించే విధంగా చట్టాలను రూపొందించారు. వెయ్యిమంది కార్మికులు పనిచేసే పరిశ్రమను కూడా ప్రభుత్వానుమతి లేకుండా మూసివేయవచ్చు. వ్యాపార సంస్థల విలీనానికి, కొత్త సంస్థల ఆవిర్భావానికీ దోహదం చేసే విధంగా కంపెనీ చట్టాలను మార్చే

బిల్లు రూపొందించారు. ఖాయిలా పడ్డ పరిశ్రమల బిల్లు తయారై ఉంది. పరిపాలక న్యాయశాస్త్రాన్ని శల్యపరీక్షకు గురిచేసేందుకు కేంద్ర ప్రభుత్వం నియమించిన కమీషన్ 1998లో పలు సూచనలు చేసింది. పదిహేడు వందల పరిపాలక చట్టాల్లో సవరణలు ప్రతిపాదించింది. ఆ నివేదిక అమలు కోసం నియమించబడ్డ స్టాండింగ్ కమిటీ కూడా 1999లో తన నివేదిక సమర్పించింది. పనులు కూడా చురుగ్గా సాగుతున్నాయి.

మనదేశ న్యాయవ్యవస్థలో 2.8 కోట్ల కేసులు పెండింగ్‌లో ఉన్నాయి. పెండింగ్ తగ్గించేందుకు ప్రపంచబ్యాంకు సూచించిన నివారణోపాయాలను చేయడానికి మన ప్రభుత్వం పూనుకుంది. సిపిసి సవరణల పేరుతో కోర్టుల్లో అప్పీళ్ళను, రిట్‌ల దాఖలును నివారించే ప్రయత్నం చేస్తోంది. కోర్టు ఫీజులు పెంచబూనుకుంటోంది. అంతర్జాతీయ పెట్టుబడి షరతులకు లొంగి భారత ప్రభుత్వం న్యాయ సంస్కరణపై నియమించిన నేషనల్ టాస్క్‌ఫోర్స్ ఆన్ జ్యుడీషియల్ రిఫార్మ్ 1996 నవంబర్‌లో నివేదిక సమర్పించింది. ప్రపంచబ్యాంకు మాటలు టాస్క్‌ఫోర్స్ నోట వెలువడ్డాయి. అలా న్యాయవ్యవస్థ సంస్కరణలకు నాంది పలికారు. కేసుల వెల్లువకు లాకులు దించి అడ్డుకోవడం, కోర్టు ఫీజులు పెంచి ప్రజలు కోర్టులకు రాకుండా చేయడం, కోర్టు వెలుపల పరిష్కారాలను ప్రోత్సహించడం అందులో కొన్ని.

విదేశీ న్యాయవాదుల ప్రవేశానికి ఏర్పాట్లు చేయాలని డబ్ల్యుటివొ ఒప్పందం మేరకు నిర్ణయించారు. లా కమీషన్, బార్ కౌన్సిల్ గ్లోబలైజేషన్‌ను న్యాయరంగంలోకి ఆహ్వానిస్తున్నాయి. న్యాయశాస్త్ర విద్యను ప్రపంచబ్యాంకు షరతుల మేరకు రూపొందించేందుకు బార్ కౌన్సిల్ ఏనాడో పూనుకుంది. న్యాయశాస్త్ర విద్యలో వ్యాపార సంబంధ చట్టాల గురించిన కార్పోరేట్ లా జ్ఞానబోధకు బాటలు వేసింది. న్యాయశాస్త్ర విద్యాబోధనలో ఇప్పటికే రెండు తరగతుల విధానం అమలులోకి వచ్చింది. ఏడాదికి లక్షరూపాయలు ఖర్చుపెట్టి లా కోర్సు చదివే ధనిక విద్యార్థుల కోసం బెంగుళూర్లో నేషనల్ లా స్కూల్, హైదరాబాద్‌లో నల్సార్, భోపాల్, కలకత్తా నగరాల్లో అలాంటి లా స్కూళ్లు మరి రెండు స్థాపితమయ్యాయి. కొన్ని కంపెనీలు ముందుగా స్పాన్సర్ చేసి లా కోర్సు చదివింపజేసి తమ కంపెనీల్లో ఉద్యోగాలివ్వటం దేశంలో మొదటిసారిగా

బెంగుళూరులో ప్రారంభమైంది. న్యాయస్థానాల పని నిర్వహణలో ఆధునిక కంప్యూటర్లు ఉపయోగించమని ప్రపంచ బ్యాంకు కోరగానే ప్రభుత్వం ఆ పనికి పూనుకుంది. ఇప్పుడు రాష్ట్ర హైకోర్టుల్లో, జిల్లా కోర్టుల్లో కంప్యూటర్లు దర్శనమిస్తున్నాయి. జైల్లో ఖైదీలకు న్యాయమూర్తులు కంప్యూటర్ స్క్రీన్‌పై దర్శనమిచ్చి సంభాషిస్తున్నారు.

పెండింగ్ కేసుల పరిష్కారానికి ఫాస్ట్ ట్రాక్ కోర్టుల ఆలోచన కూడా ప్రపంచబ్యాంకు బుర్రలోదే. కాకపోతే ప్రపంచబ్యాంకు చెప్పిందని కేంద్రప్రభుత్వమే ఈ పథకం అమలుకు పూనుకుని సుప్రీంకోర్టును బైపాస్ చేసింది. లోప భూయిష్టమైన మన చట్టాల్లో, న్యాయవ్యవస్థలో సంస్కరణలను ప్రపంచబ్యాంకు సూచిస్తే మంచిదేగా అని కొందరనవచ్చు. నిజానికి ప్రపంచబ్యాంకు సూచనలైనా, సలహాలైనా రుణం పొందేటప్పుడు షరతులని గుర్తించుకోవాలి. ప్రపంచబ్యాంకుగానీ, మరే ఇతర వడ్డీవ్యాపారిగానీ మన బాగు కోరుకొని సలహాలిస్తారనుకోవడం భ్రమ. ఇలాంటి చేతబడి ప్రక్రియ ప్రపంచబ్యాంకుకు కొట్టినపిండి. ప్రభుత్వ నిర్వహణలో అవినీతి గురించి ప్రపంచబ్యాంకు మాట్లాడింది. అవినీతి పోవాలంది. పారదర్శకత ఉండాలంది. అందుకు సిటిజన్స్ చార్టర్ల ద్వారా (లోక్ సత్తా మన రాష్ట్రంలో విడుదల చేసింది) ప్రచారం చేయించింది. కంప్యూటర్లు వస్తే పారదర్శకత ఉంటుందని ప్రపంచబ్యాంకు చెప్పడం మొదలు పెట్టింది. ఫలితంగా ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ రంగానికి మూడు బిలియన్ డాలర్ల మార్కెట్ కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వ కార్యాలయాల్లో తయారైంది.

న్యాయవ్యవస్థలో పెట్టుబడుల రూపేణా, మార్కెట్ వస్తువుల రూపేణా లాభం ఆర్జించడం మాత్రమే ప్రపంచబ్యాంకు చేయడంలేదు. మొత్తం భారత న్యాయవ్యవస్థను (అలాగనే తృతీయ ప్రపంచ దేశాలన్నింటి న్యాయవ్యవస్థలను) కబళించడం దాని ధ్యేయం. న్యాయవ్యవస్థను తాత్వికంగా కూడా ప్రస్తుత రాజ్యాంగ విలువల నుంచి దూరంచేసి ప్రపంచీకరణ వేపు, మార్కెట్ శక్తులవేపు తిప్పుకోవడం దాని లక్ష్యం. జ్యుడీషియల్ మేనేజ్‌మెంట్‌ను బిజినెస్ మేనేజ్‌మెంట్‌గా మార్చడం దాని ముఖ్యోద్దేశం.

లాటిన్ అమెరికా దేశాలైన అర్జెంటీనా, ఈక్వెడార్‌లో ప్రపంచబ్యాంకు ప్రోద్బలిత న్యాయ సంస్కరణలను మథించిన బుస్కాగ్లీ, డకోలియాస్ విదేశీ పెట్టుబడులను ఆహ్వానించేందుకు అవసరమైన వాతావరణాన్ని కల్పించడం న్యాయవ్యవస్థపని అని కుండబద్దలు కొట్టి చెప్పారు. మార్కెట్ల పెరుగుదలలో కోర్టులు ముఖ్యపాత్ర వహిస్తాయని వారు తమ పరిశోధనలో కనిపెట్టారు. "వాణిజ్య వాతావరణంలోనూ, ఆర్థిక రంగంలోనూ మౌలికమైన విధాన పరమైన మార్పులు చేయాలంటే చట్టపరమైన, సంస్థాగత వ్యవహారాల్లో మౌలిక మార్పులు అవసరం. ఇంకా వివరంగా చెప్పాలంటే సివిల్ సర్వీసులోనూ, చట్టాల్లోనూ, న్యాయవ్యవస్థలోను మార్పులు పెట్టుబడులు పెట్టే ముందుగా తప్పక రావాల్సివుంది" అని ప్రపంచబ్యాంకు ఉపాధ్యక్షుడు ఇబ్రహీం షిహాటా ఒక సందర్భంలో చెప్పారు.

ఇవాళ చట్ట/న్యాయ రంగాల్లో సంస్కరణలు అందుకోసం జరుగుతున్నాయి. మన చట్టాలను ప్రపంచీకరించే దిశగా ఈ ప్రహసనం సాగుతోంది. న్యాయ/చట్ట సంస్కరణలకు మార్కెట్/మనీ కేంద్ర బిందువు కావడం మన దురదృష్టం. ఈ దేశ రాజ్యాంగం, ప్రజలు, వారి బాధలు, వారి హక్కులు, వారి కందాల్సిన సామాజిక, ఆర్థిక న్యాయం, సామాజిక సంక్షేమం, స్త్రీల హక్కులు, దళిత గిరిజనుల బాధలు ఈ సంస్కరణలకు ప్రాతిపదిక కాదు. ప్రపంచ పెట్టుబడిదారులు, వడ్డీవ్యాపారుల షరతుల మేరకు మన న్యాయం రూపొందడం ప్రమాదకరమైన విషయం. బ్రిటీషు పాలన వల్ల మన న్యాయ వ్యవస్థ పరాయిదిగా రూపొందగా, 250 ఏళ్ళ సహజీవనం తర్వాత ఈ రోజు మనపై నయావలస న్యాయపాలన రుద్దబడబోతోంది.

దాని దుష్ఫలితాలు ఎలా వుంటాయో ఊహించుకుంటే భయమేస్తోంది. ప్రపంచ బ్యాంకు చట్ట, న్యాయ సంస్కరణల షరతుపై వడ్డీకి డబ్బిచ్చిన చాలా దేశాల్లో అది న్యాయవ్యవస్థను శాసిస్తోంది. చట్టాలను రచించుకుంటోంది. సార్వభౌమత్వాన్ని మంటగలిపి ఆయా దేశాలను సామంత రాజ్యాలుగా పాలిస్తోంది. లాటిన్ అమెరికా, కరిబియన్ దేశాల్లో అనేకం అదే స్థితిలో ఉన్నాయి. లీగల్ ఇంపీరియలిజం (చట్ట సామ్రాజ్య వాదం)గా ఈ స్థితికి అక్కడి మేధావులు నామకరణం చేశారు. అదే స్థితి కొనసాగితే మన న్యాయ స్థానాలు ప్రపంచబ్యాంకు

సామ్రాజ్యంలో పూర్తిగా భాగమయ్యే ప్రమాదం ఉంది.

ప్రపంచ బ్యాంకు ఆర్టికల్స్ ఆఫ్ ఎగ్రిమెంట్ ప్రకారం అది "ఏ సభ్యదేశ రాజకీయ వ్యవహారాల్లో" జోక్యం చేసుకోరాదు. ఈ క్లాజుకు ఒక మినహాయింపు వుంది. బ్యాంకు వ్యాపార ప్రయోజనాల కోసం అయితే జోక్యం ఆమోదయోగ్యమే. ఇవాళ చట్ట, న్యాయ సంస్కరణల్లో జోక్యాన్ని సమర్థించుకోవడం కోసం ప్రపంచ బ్యాంకు ఏమంటుందంటే వాటి వల్ల ఆర్థిక వ్యవస్థ మెరుగుపడుతుంది. కాబట్టి మినహాయింపు కిందకు ఈ కార్యక్రమం వస్తుంది. ఇప్పటికే ప్రపంచ బ్యాంకు బోలీవియా, పెరూ, అర్జంటీనా, వెనెజ్వులా లాంటి లాటిన్ అమెరికా దేశాల్లో న్యాయవ్యవస్థను ఆక్రమించుకుంది. ప్రస్తుతం ఇండియా, బంగ్లాదేశ్, పాకిస్తాన్ మీదా, మరోవైపు ఆఫ్రికా దేశాలు, మాజీ సోవియట్ దేశాలు, తూర్పు యూరప్ దేశాలపై దృష్టి సారించింది.

మన పొరుగునున్న బంగ్లాదేశ్‌లో 1990లో అప్పిచ్చిన ప్రపంచ బ్యాంకు కొత్త తరహా న్యాయస్థానాలను పెట్టించి బ్యాంకుల అప్పు వసూళ్ళను వేగవంతం చేయించింది. గత మార్చి 30న 30 మిలియన్ డాలర్ల అప్పును ప్రకటించి బంగ్లాదేశ్ న్యాయాన్ని గుత్తకు తీసుకోబోతోంది. పాకిస్తాన్‌కు 213 మిలియన్ డాలర్ల రుణం మంజూరు చేసింది. అదే దేశంలో చట్ట/న్యాయ సంస్కరణల కోసం జపాన్ ప్రభుత్వం రెండు విడతలుగా 125 మిలియన్ యెన్‌లు అప్పిచ్చింది. శ్రీలంకలో న్యాయమూర్తులకు శిక్షణ ఇచ్చే సంస్థకు ప్రపంచ బ్యాంకు నిధులిచ్చింది. న్యాయం/చట్ట సంస్కరణ గురించిన పరిశోధనలకు, న్యాయమూర్తుల శిక్షణకు శిక్షణాలయాల నిర్మాణానికి, న్యాయస్థానాలను కంప్యూటరీకరించడానికి, అప్పు వసూళ్ళ కోసం, వ్యాపార వ్యవహారాల పరిష్కారాల కోసం కొత్త కోర్టులు పెట్టేందుకూ షరతులు విధించి అది అప్పులిస్తోంది. ప్రత్యామ్నాయ వివాద పరిష్కార పద్ధతుల కోసం కూడా అది రుణం మంజూరు చేస్తోంది.

న్యాయ సంస్కరణలపై ఇప్పటికే మొదటి అంతర్జాతీయ మహాసభను ప్రపంచ బ్యాంకు వాషింగ్టన్‌లో నిర్వహించింది. అమర్త్యసేన్ దాన్ని ప్రారంభించారు. రెండవ మహాసభ జూలై 13 నుంచి 19 వరకు రష్యాలోని సెయింట్ పీటర్స్‌బర్గ్‌లో జరగబోతోంది. రష్యా అధ్యక్షుడు పుతిన్

ప్రారంభోపన్యాసం చేస్తారు. ఇప్పటికే ఎన్నో పత్రాలు, నివేదికలు వెలువడ్డాయి. ప్రపంచబ్యాంకు నిపుణులు అహోరాత్రాలు కష్టపడి ఇప్పటి వరకూ అమలయిన సంస్కరణల నుంచి గుణపాఠాలు తీస్తూ, కొత్త విధానాలకు రూపకల్పన చేసి వాటికి అంతర్జాతీయ ప్రమాణాలున్నాయని భ్రమ కల్పించి మనల్ని నిమ్నజాతి న్యాయవ్యవస్థ ఉన్నవారిగా చిత్రీకరించే తెల్లదొరతనం అది. అభివృద్ధి పేరిట అమెరికా న్యాయ వ్యవస్థను దిగుమతి చేసేందుకు ప్రపంచ బ్యాంకు కంకణం కట్టుకుంది.

అభివృద్ధికి అమెరికా తరహా ఆధునిక న్యాయవ్యవస్థ తప్పనిసరి అవసరమని పాట్రిక్ ఆస్లాన్ అనే ప్రపంచ బ్యాంకు నిపుణుడు ప్రకటించి వున్నాడు. ప్రపంచ బ్యాంకు కుట్రను మనం తెలుసుకునే లోగానే మన చట్టాలు చాలా భాగం మారిపోతున్నాయి. మన న్యాయ వ్యవస్థ క్రమంగా 'అభివృద్ధి', 'ప్రపంచీకరణ' దిశగా దృష్టి సారించింది. అందుకోసం ప్రభుత్వం ఏం చేసినప్పటికీ అడ్డుకొనేందుకు న్యాయస్థానాలు సిద్ధంగా లేవు. ప్రజల హక్కుల కంటే ప్రభుత్వ విధానాలకే ప్రాధాన్యం ఇస్తున్నాయి. ఇటీవలి కాలంలో ప్రజలకు మేలు చేసే తీర్పులు ఏం వెలువడ్డాయి. అని ఆలోచిస్తే ఒకటి ఆరా తప్ప గుర్తుకు రావు. సరళీకృత ఆర్థిక విధానాలలో భాగంగా వస్తున్న అన్ని సంస్కరణలనూ అవి రాజ్యాంగ విరుద్ధమైనవా కావా, అవి ప్రజల హక్కులను హరిస్తున్నాయా అన్న దానితో నిమిత్తం లేకుండానే కోర్టులు బలపరుస్తూ వచ్చాయి. రాజ్యాంగ అదేశిక సూత్రాలకు వ్యతిరేకంగా సాగుతున్న ప్రైవేటీకరణ విధానాలను అడ్డుకొని చరిత్రలో ప్రజాపక్షాన నిలబడటంలో కోర్టులు విఫలమయ్యాయి. మళ్ళీ ఇవాళ రాజ్యాంగం విఫలమైందా? అని అదే న్యాయమూర్తులు పరిశీలించబూనుకోవడం విచిత్రం.

సుప్రీంకోర్టు న్యాయమూర్తులిద్దరు 1994లో ఒక కేసులో తీర్పు చెప్తూ తమ తీర్పు గ్లోబలైజేషన్ దిశగా దేశ చట్టాలను నడిపించేందుకు ఒక మెట్టని చెప్పుకున్నారు. నర్మదా బచావ్ ఆందోళన్ కేసులో ఇటీవల సుప్రీం కోర్టు 'అభివృద్ధి' గురించి ప్రపంచ బ్యాంకులాగా మాట్లాడింది. విద్యుత్ ఛార్జీల పెంపుదలను మనరాష్ట్ర హైకోర్టు సమర్థించడం తెలిసిందే. అభివృద్ధికి, సరళీకృత ఆర్థిక విధానాలకు అడ్డొచ్చే శక్తులకు, నిరసనకు అభిముఖంగా కోర్టులు నిలుస్తున్నాయి.

ఇటీవల పోస్టల్ సమ్మెపై ఎస్మా చట్టాన్ని ప్రయోగించమని కేంద్రాన్ని సుప్రీంకోర్టు కోరింది. బంద్‌లు, హర్తాళ్‌లు రాజ్యాంగ విరుద్ధమని కేరళ హైకోర్టు తీర్పు చెప్పింది.

బోనస్ కోసం సమ్మె చేస్తున్న బొంబాయి మున్సిపల్ వర్కర్లపై సైన్యాన్ని ప్రయోగించాల్సి వస్తుందని బొంబాయి హైకోర్టు గత ఏడాది హెచ్చరించింది. పర్మినెంట్ ఉద్యోగం, ఉద్యోగాల నుంచి అక్రమ తొలగింపు నుంచి రక్షణ లాంటివి న్యాయశాస్త్ర పరిభాషలో భవిష్యత్తులో మిగలక పోవచ్చుననే అనుమానం వస్తోంది.

న్యాయస్థానాలు ప్రజల హక్కులకు మరింత దూరంగా జరుగుతున్నాయి. న్యాయవ్యవస్థలోని బ్యూరోక్రాట్స్ దంత ప్రాకారాల్లో జీవిస్తూ కార్పొరేట్ న్యాయాన్ని అందిస్తున్నారు. పేదలు, అంచుకు విసిరివేయబడిన వాళ్ళు ఫ్రాంజ్ కాఫ్కా కథలో చట్టాన్ని చూసే అవకాశం జీవితాంతం దొరక్క గేటు వద్ద చనిపోయిన పాత్రలో జీవిస్తున్నారు. దళితుల గురించి పార్లమెంటు చట్టం చేసి మాట్లాడీ చాలా రోజులైంది. 1989 తర్వాత చట్ట ప్రవచనంలో దళితుల చిరునామా కరువైంది. మహిళా బిల్లు ఇంకా చట్టం కావల్సివుంది. రాజ్యాంగంలో ఐదో షెడ్యూలు సవరించి సెజ్‌లను, భూములను బడా పెట్టుబడికి దఖలు పరుస్తున్నారు. చివరికి రాజ్యాంగాన్నే పూర్తిగా తిరగరాయబోతున్నారు.

రేపు ఇండియన్ జ్యూడీషియల్ సర్వీస్ పెడతారు. ఖరీదైన లా స్కూళ్ళలో, కార్పొరేట్ లా కళాశాలల్లో చదివిన ధనవంతులు జిల్లా కోర్టునుంచి సుప్రీంకోర్టు దాకా న్యాయ పీఠాలను అధిరోహిస్తారు. మానవహక్కులకు వారే భాష్యం చెప్తారు. పరిస్థితి ఇలా ఉంటే మన న్యాయ వాదులు, న్యాయమూర్తులు, న్యాయ శాస్త్రవేత్తలు తెలియని ఏ తీవ్రశక్తులో నడిపిస్తే నడిచి మనుష్యులు అన్న చందంగా ప్రవర్తిస్తున్నారు. సత్యజిత్ రే తీసిన 'షత్రంజ్ కే ఖిలారీ' సినిమాలో లాగా బ్రిటిష్ సామ్రాజ్య వాద సైన్యం ఒక వేపు భారత భూభాగాన్ని కబళిస్తుంటే చదరంగ జూద ప్రక్రియలో మునిగి తేలి రాజ్యభ్రష్టులైన సంస్థానాదీశుల్లాగా లేకపోతే లొంగిపోయిన సామంతుల్లాగా....

**మే 16, 2001 - వార్త**

# 12. డర్బన్ సదస్సు - కులవివక్ష - హక్కుల ఉద్యమాలు

జాతి వివక్షకు వ్యతిరేకంగా ఐక్యరాజ్యసమితి ఆధ్వర్యంలో దక్షిణాఫ్రికా లోని డర్బన్ నగరంలో ప్రపంచ సదస్సు ఈ నెలాఖరున ప్రారంభం కానుంది. ఆ సదస్సు ఎజెండాలో కులవివక్షను కూడా చేర్చాలని మనదేశంలో దళిత హక్కుల గురించి పనిచేసే కొన్ని ఎన్జీవోలు భారత ప్రభుత్వంపై ఒత్తిడి తెస్తున్నాయి. భారత ప్రభుత్వం ససేమిరా అంటోంది. జాత్యహంకారంతో పోల్చదగిన అగ్రకుల దురహంకారం, వర్ణవివక్షతో పోలికలున్న (ఇంకా ఘోరమైన) అంటరానితనం, ఇతర రూపాల్లో దళితులపై హింస, వివక్ష ఈ చర్చలో ప్రధానాంశాలు.

యాభైఏళ్ళ స్వతంత్ర భారతంలో దళితులపై యథేచ్ఛగా అమలవుతున్న కులవివక్షను చట్టాలు ఏమీ చేయలేకపోయాయన్న విమర్శలో నూటికి నూరుపాళ్ళు నిజముంది. దళితులు పోరాటాల ద్వారా ఒక రాజకీయ శక్తిగా ఎదిగిన తర్వాత మాత్రమే 1989లో దళితులపై అత్యాచారాల అణచివేతకు ప్రత్యేక చట్టం వచ్చింది. అంతకుమునుపు పౌరహక్కుల పరిరక్షణ చట్టం అనే మినీ చట్టం దళితులకు వరగబెట్టింది లేదు. జాతీయస్థాయిలో పెద్దపెట్టున కార్యాచరణ చేపట్టి మసూచి లాంటి జబ్బులను నిర్మూలన చేసిన విధంగా కనీసం ఒక దేశవ్యాప్త ప్రచార ఉద్యమాన్ని కూడా ఏ కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలూ కులవివక్షకు వ్యతిరేకంగా ఎక్కుపెట్టింది లేదు. ఆంధ్రప్రదేశ్‌లో ఎన్ని విడతలు జన్మభూమి జరిగినా కులవివక్ష నిర్మూలనకు ఒక్కసారి కూడా ప్రాముఖ్యం ఇచ్చిందిలేదు.

హిందుత్వను ప్రాపంచిక దృక్పథంగా ప్రకటించుకున్న శక్తులు ప్రాబల్యం వహిస్తున్న కేంద్ర ప్రభుత్వం కులవివక్ష గురించి అంతర్జాతీయ వేదిక మీద

ప్రస్తావించనిస్తుందని భావించడం పేరాశే అవుతుంది. హిందుత్వంగా సంఘ్‌పరివార్ ప్రకటిస్తున్న మత సాంస్కృతిక సమ్మేళనంలో మనుషుల మధ్య అసమానతలను స్థిరీకరించే కులవ్యవస్థ ప్రధానాంశం. కులవివక్షను సిద్ధాంతీకరించిన వర్ణవ్యవస్థ హిందుత్వంలో భాగం. దళితుల పట్ల అగ్రకుల సమాజం చూపిన అమానుషత్వం హిందుత్వ తాత్విక పునాదిలోనే ఉంది. ''కులాన్ని నిర్మూలించడం హక్కుల ఉల్లంఘన'' అని ఇటీవల ఒక ఆంగ్ల దినపత్రికకు ఇచ్చిన ఇంటర్వ్యూలో విశ్వహిందూ పరిషత్ ప్రధాన కార్యదర్శి ఆచార్య గిరిరాజ్ కిషోర్ సెలవిచ్చారు. కులనిర్మూలనకోసం కృషిచేసిన డాక్టర్ అంబేద్కర్ కులాన్ని నిర్మూలించమని పిలుపిస్తే సరిగ్గా దానికి వ్యతిరేక దిశలో ప్రయాణిస్తున్నట్టు విహెచ్‌పినేత ప్రకటిస్తున్నారు.

ఏమైనప్పటికీ, భారత ప్రభుత్వ అగ్రకుల పక్షపాతాన్ని, దళిత వ్యతిరేకతను, హిందుత్వ ఎజెండాను ఈ కులవివక్ష చర్చ బహిర్గతం చేసింది. (ఇప్పటికి కూడా కులవివక్ష పట్ల తగినంత మోతాదులో స్పందించి సత్వర చర్చలు, దీర్ఘకాలిక ప్రణాళికల లాంటివి ప్రకటించే ఉద్దేశ్యం కూడా ప్రభుత్వానికి ఉన్నట్టుగా తోచదు) ఈ విధంగా ప్రభుత్వ బండారాన్ని బయట పెట్టిన మేరకు ఈ చర్చకు పాజిటివ్ పాత్రవుంది. అది ఈ దేశ దళితులకు ఎంతో ఉపయోగ పడేదనడంలో సందేహం లేదు. కాకపోతే ఈ చర్చలో మరోపక్షమైన ఎన్జీవోల సంగతే బట్టబయలు కాకపోవడం ఈ దేశ మేథోబలహీనతకు చిహ్నం.

కులవివక్ష చర్చను లేవనెత్తిన భారతదేశంలోని ఎన్జీవోలకు ఉత్తర అమెరికా, యూరప్ ఖండాలలో తెల్లదొరల సంపన్న దేశాలనుండి నిధులు వస్తున్నాయన్న సంగతి మర్చిపోరాదు. జాతీయ దళిత మానవ హక్కుల ప్రచారోద్యమం (NCDHR) పేరిట దళితుల హక్కుల గురించి ఈ సందర్భంగా మాట్లాడుతున్న సంస్థకు నిధులు ఆ దేశాలనుంచే సరఫరా అవుతున్నాయి. అఖిలభారత క్రైస్తవ కార్యాచరణ సమితి(AICAC), ఉత్తర అమెరికాలోని భారత అమెరికన్ క్రైస్తవ సంఘాల సమాఖ్య (FIACONA) కూడా కులవివక్ష చర్చను సమర్థిస్తున్న ప్రధాన సంస్థలు. క్రైస్తవం వలసవాదంతోపాటు ఈ దేశంలోకి ప్రవేశించి, వలసవాద ప్రోద్బలంతోనూ, హిందుత్వ శక్తుల అమానుషత్వం వల్లా ఎదిగిందని గుర్తుపెట్టుకోవాల్సి ఉంది.

పూర్తిగా విదేశీ నిధులతో నడిచే సంస్థలు భారత దళితులకు ఒకజాతీయ ఎజెండాని - డర్బన్ సదస్సులో కులవివక్షపై చర్చకు డిమాండ్ - తయారు చేయడంలో సఫలీకృతమయ్యాయి. ఈ దేశహక్కుల ఉద్యమ చరిత్రలో ఇది తొలిసారి జరుగుతోంది. ఏఏ దేశాలనుంచి ఈ సంస్థలకు నిధులు వస్తున్నాయో ఆ దేశాలు ఎగదోస్తున్న మార్కెట్‌శక్తులు మనల్ని చుట్టుముట్టి ప్రపంచీకరణ భూతప్రయోగం చేస్తున్న చారిత్రక సందర్భంలో ఇది జరుగుతోంది. ప్రపంచీకరణ ప్రభావం ఈ దేశ పేదల మీద - ముఖ్యంగా దళిత ఆదివాసీల మీద, ఇంకా బ్రతికున్న చేతివృత్తుల వారి మీదా తీవ్ర ప్రతీఘాత ప్రభావం చూపెడుతున్న పోగాలంలో విదేశీసంస్థలు ఇక్కడ దళితహక్కుల, మహిళలహక్కుల మార్కెట్లను డబ్బుతో సృష్టిస్తున్నాయన్న సంగతి కూడా మనం పట్టించుకోవాల్సి ఉంది.

అమెరికా నేరుగా ఇండియాను పాలిస్తే బాగుంటుందని ఇటీవల ఒక దళిత కాలమిస్టు రాసినట్టు గుర్తు. దళితుల గురించి, ప్రజాస్వామ్యం గురించి రాసిన, రాస్తున్న ప్రముఖ కాలమిస్టు గెయిల్ ఓమ్‌విట్ ఇటీవల ప్రపంచీకరణను, భారీడ్యాంలను, మొన్‌సాంటో కంపెనీని సమర్థిస్తూ రాయడం కాకతాళీయం కాదు. అవి రెండూ (దళిత హక్కులు-ప్రపంచీకరణ) పరస్పర విరుద్ధ అంశాలని ఆమె అనుకోవడం లేదు. ''మరో రెండువందలేళ్ళు మనం బ్రిటీష్ వలస పాలనలో ఉంటే దేశంలోని శూద్ర, ఛండాల శక్తులు మరిన్ని అవకాశాలను పొందగలిగేవి'' అని ప్రజాతంత్ర సాహిత్య సంచిక (మార్చి 25, 2001) కు ఇచ్చిన ఇంటర్వ్యూలో డాక్టర్ కంచ ఐలయ్య చెప్పడం ఈ సందర్భంలో గమనార్హం. ఆయన రాసిన 'వై అయామ్ నాట్ ఎ హిందు?' (నేను హిందువునెట్లయిత?) పుస్తకాన్ని అమెరికాలోని అరడజను విశ్వవిద్యాలయాల్లో రిఫరెన్స్ బుక్‌గా ఆదరించడం, వాషింగ్టన్‌లోని హ్యూమన్‌రైట్స్ వాచ్ భారతదళితులపై ప్రత్యేక గ్రంథం (బ్రోకెన్ పీపుల్) ప్రచురించడం, విదేశీ నిధులతో దళిత మానవహక్కుల జాతీయ ప్రచారోద్యమం సంస్థ ఏర్పాటు, కుల వివక్షపై డర్బన్‌లో చర్చించాలన్న డిమాండ్ - ఇవన్నీ గత కొన్నేళ్ళుగా ఒకదాని వెంట ఒకటి వరసగా జరగడం ఏ మాత్రం యాదృచ్ఛికం కాదు.

మనదేశంలో సంస్థలకు విదేశాల నుంచి ఏటా రూ.4,000 కోట్ల రూపాయల నిధులందుతున్నాయి. ఏటా వేల కోట్ల రూపాయల బడ్జెట్‌తో

అమెరికా, కెనడా, జర్మనీ తదితర సంపన్న దేశాలు ఈ దేశం మీదకు విడుదల చేస్తున్న మానవహక్కుల ఎజెండాలు దేనికి పనికొస్తాయోగానీ ప్రపంచీకరణకు మాత్రం మన మనోద్వారాలను విశాలంగా తెరుస్తాయి. ప్రపంచీకరణ కాకపోతే విదేశీ మార్కెట్‌కు గత జూన్ 3న 'హిందు' దినపత్రికలో స్వామి అగ్నివేష్, రెవరెండ్ వల్సన్ థంపు రాసిన వ్యాసంలో కులవివక్షపై డర్బన్‌లో చర్చ జరగాలని చెప్తూ ప్రపంచీకరణ దిశగా పురోగమిస్తున్న ప్రపంచంలో కులాన్ని ప్రపంచ విమర్శకు వదిలేయక తప్పదన్నారు. జాతి రాజ్యభావనను వారు అవహేళన చేశారు. ప్రపంచీకరణ, గ్లోబల్ లాంటి పదాలను విరివిగా వాడిన ఈ వ్యాసం ద్వారా మనకర్థమయ్యేదేమిటంటే డర్బన్‌లో కులవివక్షపై చర్చ ప్రపంచీకరణలో భాగమని.

గ్లోబల్ గ్రామం ఏర్పడబోతోందని, దేశాల సరిహద్దులు మిథ్య అనీ, జాతి రాజ్య భావనకు కాలం చెల్లిందనీ చెప్పే మార్కెట్ మాయాజాలంలో వివిధ దేశాల ప్రభుత్వాలను అంతర్జాతీయ సంస్థలకు జవాబుదారీ చేయడం భాగం. ఐక్యరాజ్యసమితి సదస్సులో కులవివక్ష గురించిన చర్చ ప్రపంచీకరణ వాదులకు ప్రీతిపాత్రం కావడానికి కారణాల్లో ఇదొకటి. అందుకోసం డబ్బు వెదజల్లుతారు. హక్కుల ఉద్యమాలను సృష్టిస్తారు. 'తెలియని ఏ తీవ్రశక్తులో నడిపిస్తే నడిచి' అన్న చందంగా హక్కుల బాటలో మనుషులను నడిపిస్తారు. సంపన్న రాజ్య ప్రయోజనాలకోసం వాడుకుంటారు. ఐరాస తెల్లదొరల కూటమిలో బడుగుదేశాల గొంతులను  నొక్కగలుగుతారు.

కులవివక్ష చర్చను భారతదేశంలో లేవనెత్తేందుకు సంపన్న దేశాలకు మరో ప్రయోజనం కూడా ఉంది. వలసవాదంవల్ల మూడవ ప్రపంచదేశాల ప్రజలకు జరిగిన అవమానాలకు, వారు గురైన దోపిడీకి మాజీసామ్రాజ్యవాద దేశాలనుండి ఆఫ్రికా దేశాలు డర్బన్ సదస్సులో నష్టపరిహారాన్ని డిమాండ్ చేయబోతున్నాయి. (ఈ డిమాండ్ భవిష్యత్తులో బడుగుదేశాల రుణ విమోచన కోసం డిమాండ్‌గా రూపుదిద్దుకొనే అవకాశాలు కూడా ఉన్నాయి.) మరోవేపు పాలస్తీనాతో పాటు మరికొన్ని అరబ్‌దేశాలు ఇజ్రాయెల్ దుశ్చర్యలను ఖండించేందుకై సదస్సులో పట్టుబట్టే అవకాశాలు కూడా ఉన్నాయి. ఆఫ్రికా, అరబ్‌దేశాల చర్చను స్థంభింపజేసేందుకు పాశ్చాత్య దేశాలకు, అమెరికాకు మనదేశ మద్దతు అవసరం.

అందుకే అవి ఎన్జీవోల ద్వారా కులవివక్ష చర్చను ప్రోత్సహించాయి. భారతప్రభుత్వంపై వత్తిడి తేగలిగాయి. డర్బన్ సదస్సులో కులవివక్షను ఎజెండా అంశంగా పెట్టకుండా అవి భారత్‌కు సహాయంచేసి, తర్వాత ఆఫ్రికా, అరబ్ దేశాల డిమాండ్లను ఓడించడంలో భారత్ సహాయం పొందుతాయి. ఈ అంతర్జాతీయ తెల్లజాతి ఎత్తుగడ ఫలితం ఆగస్టు మొదటివారానికి కొంత తెలిసింది. జెనీవాలో జరిగిన సన్నాహక సమావేశంలో కులవివక్షను డర్బన్ సదస్సు ఎజెండాలో చేర్చాలనే అంశం పట్ల సభ్యదేశాలు ఆసక్తి కనపర్చలేదు. ఇక భారతదేశం ఆఫ్రికా, అరబ్ దేశాల డిమాండ్లను అంగీకరించకపోవడం, వాటిని ఏకాకులను చేసి సంపన్న రాజ్యాలకు సహాయపడటం తరువాయి భాగం. (ఆఫ్రికా దేశాల డిమాండ్ ఆమోదం పొందితే భారతదేశంలాంటి బడుగుదేశాలు చాలా లాభం పొందుతాయి. కానీ ఈ విషయమై ఎవరూ మాట్లాడక పోవడం హక్కుల ఉద్యమం ఏ దిశగా నడుస్తోందో తెలియజేస్తుంది)

అంతర్జాతీయ వేదికల్లో కులవివక్షపై చర్చ అనే రాజకీయ నాటకం ప్రస్తుతానికి అధికారికంగా అలా పరిసమాప్తం కానుంది. కాకపోతే, ఎన్జీవోలన్నీ కలిసి డర్బన్‌లో మరోచోట అనధికారిక సభ నిర్వహించి, నిరసన వ్యక్తంచేసి కులవివక్ష ఈ దేశంలో ఉందని ఫోకస్ చేయడం అనే పనిచేస్తారు. ప్రపంచవ్యాప్తంగా పత్రికల్లో చదువుతాం. ఎన్జీవోలకు మరిన్ని నిధులొస్తాయి. దళితుల హక్కుల గురించి మాట్లాతున్నందుకు ఎన్జీవోలను అభినందించే వారు కూడా ఈ అంతర్జాతీయ జగన్నాటకం తెలిసాక ముక్కుమీద వేలేసుకోక తప్పదు.

కాకపోతే ఈ విషయంలో ఒక స్పష్టమైన వైఖరిని ప్రదర్శించలేకపోవడం విదేశీ నిధులు స్వీకరించని హక్కుల సంఘాల మేధోబలహీనతకు చిహ్నం. 'దేశీయ' హిందుత్వకు, గ్లోబల్‌వాద హక్కుల దుకాణాలకు వ్యతిరేకంగా దళితుల ప్రయోజనాలు ఇమిడివున్నాయని ఇవి చెప్పకపోవడం చారిత్రక తప్పిదం. విదేశీనిధులతో నడిచే మానవహక్కుల షాపులను ఏ మాత్రం విమర్శకు లోనుచేయని ఈ సంస్థలు ఇటీవల విదేశీ ఎన్జీవోల కార్యకలాపాల్లో కూడా పాలు పంచుకోవడం తరచూ జరుగుతోంది. దళితులను సంపన్నదేశాలనిధులు పొందే ఎన్జీవోలకు, 'స్వదేశీ'ని సంఘపరివార్‌కు వదిలేసి స్వంత దృక్పథం కరువైన పరిస్థితి ఈ సంస్థలకు దాపురించింది. ఒకవేపు హిందుత్వ శక్తులు, మరోవేపు

విదేశీ సంస్థలు చురుగ్గా పనిచేస్తుంటే ఈ హక్కుల సంఘాలు మాత్రం రోజురోజుకూ నీరసిస్తున్నాయి. హక్కుల ప్రవచనంలో గ్లోబల్ మార్కెట్ శక్తుల ఆసక్తికి కారణాలను కనిపెట్టలేని తనం వీటికి తటస్థించింది.

కులాధిపత్యం, పితృస్వామ్యం లాంటి ఫ్యూడల్ విలువలకు వ్యతిరేకంగా మళ్ళీ మార్కెట్ శక్తులు విజృంభించాయా? అనిపిస్తోంది. ప్రజాస్వామిక విప్లవ ఎజెండాలో దళిత, స్త్రీ హక్కుల భాగాలను మార్కెట్ శక్తులే తమ ప్రయోజనార్థం నెత్తికెత్తుకున్నాయా? అనిపిస్తోంది. (కార్పొరేట్ వ్యవసాయం ఫ్యూడల్ భూసంబంధాలను ధ్వంసించి మార్కెట్ తరహా వ్యవసాయ విప్లవానికి నాంది పలుకుతుందేమో?) మార్కెట్ హక్కుల ప్రవచనంలో చాలాసార్లు కలిసి ఒకే గొంతుకతో మాట్లాడుతున్నామేమో. విదేశీ నిధుల ఎన్జీవోలతో ఇతర సంఘాల చెలిమికి అది మానసిక ప్రాతిపదికనేమో!

మన హక్కుల ఉద్యమానికి ఏనాడూ దేశీయ స్ఫూర్తిలేదు. హాబ్స్ అయినా, లాక్ అయినా, కారల్ మార్క్స్ అయినా పాశ్చాత్య సిద్ధాంతకారుల భావనలే పునాదిగా అది ఇప్పటివరకూ నడుస్తోంది. కులవివక్ష గురించి, కుల నిర్మూలన గురించి మాట్లాడుతున్నప్పుడైనా మన బసవడి ఉద్యమం లాంటి వాటిని గుర్తుచేసుకోం. హిందుత్వను వ్యతిరేకిస్తూ విదేశీ నిధులతోనడిచే సంస్థల హక్కుల ప్రవచన బండారాన్ని బయటపెట్టే దేశీయ మానవదృక్పథం ఇప్పుడు కావాలి. అది మాత్రమే కులవివక్షను గురించిన సరైన దృక్పథాన్ని కలిగివుండగలదు.

**ఆగష్టు09, 2001 - రాతప్రతి**

# 13. ఈ ప్రవచనాల బండారమే బయటపడాలి!

జాతి వివక్షకు వ్యతిరేకంగా ఐక్యరాజ్య సమితి ఆధ్వర్యంలో దక్షిణాఫ్రికాలోని డర్బన్ నగరంలో ప్రపంచ సదస్సు ఈ నెలాఖరున ప్రారంభం కానుంది. ఆ సదస్సు ఎజెండాలో కుల వివక్షను కూడా చేర్చాలని మన దేశంలో దళిత హక్కుల గురించి పనిచేసే కొన్ని ఎన్.జి.వో. లు భారత ప్రభుత్వంపై వత్తిడి తెస్తున్నాయి. భారత ప్రభుత్వం ససేమిరా అంటోంది. జాత్యహంకారంతో పోల్చదగిన అగ్రకుల దురహంకారం, వర్ణ వివక్షతో పోలికలున్న అంటరానితనం, ఇతర రూపాల్లో దళితులపై హింస, వివక్ష ఈ చర్చలో ప్రధానాంశాలు. యాభై ఏళ్ళ స్వతంత్ర భారతంలో దళితులపై యధేచ్ఛగా అమలవుతున్న కుల వివక్షను చట్టాలు ఏమీ చేయలేకపోయాయి. దళితులు పోరాటాల ద్వారా ఒక రాజకీయ శక్తిగా ఎదిగిన తర్వాత మాత్రమే 1989లో దళితులపై అత్యాచారాల అణచివేతకు ప్రత్యేక చట్టం వచ్చింది. జాతీయ స్థాయిలో పెద్ద పెట్టున ఒక దేశవ్యాప్త ప్రచార ఉద్యమాన్ని కూడా ఏ కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలూ కుల వివక్షకు వ్యతిరేకంగా ఎక్కుపెట్టింది లేదు.

హిందుత్వను ప్రాపంచిక దృక్పథంగా ప్రకటించుకున్న శక్తులు ప్రాబల్యం వహిస్తున్న కేంద్ర ప్రభుత్వం కుల వివక్ష గురించి అంతర్జాతీయ వేదిక మీద ప్రస్తావించనిస్తుందని భావించటం పేరాశే అవుతుంది. హిందుత్వగా సంఘ్ పరివార్ ప్రకటిస్తున్న మత సాంస్కృతిక సమ్మేళనంలో మనుషుల మధ్య అసమానతలను స్థిరీకరించే కులవ్యసవ్థ ప్రధానాంశం. కుల వివక్షను సిద్ధాంతీకరించిన వర్ణ వ్యవస్థ హిందూత్వలో భాగం. దళితుల పట్ల అగ్రకుల సమాజం చూపిన అమానుషత్వం హిందుత్వ తాత్విక పునాదిలోనే వుంది 'కులాన్ని నిర్మూలించడం హక్కుల ఉల్లంఘన' అని ఇటీవల ఒక ఆంగ్ల దినపత్రికకు ఇచ్చిన ఇంటర్వ్యూలో విశ్వ హిందూ పరిషత్ ప్రధాన కార్యదర్శి ఆచార్య గిరిరాజ్

కిషోర్ అన్నారు. కుల నిర్మూలన కోసం కృషి చేసిన డాక్టర్ అంబేద్కర్ కులాన్ని నిర్మూలించమని పిలుపిస్తే సరిగ్గా దానికి వ్యతిరేక దిశలో ప్రయాణిస్తున్నట్లు విహెచ్‌పి నేత ప్రకటిస్తున్నారు. భారత ప్రభుత్వ అగ్రకుల పక్షపాతాన్ని, దళిత వ్యతిరేకతను, హిందుత్వ ఎజెండాను ఈ కుల వివక్ష చర్చ బహిర్గతం చేసింది. ఈ విధంగా ప్రభుత్వ బండారాన్ని బయట పెట్టిన మేరకు ఈ చర్చకు పాజిటివ్ పాత్ర వుంది. అది ఈ దేశ దళితులకు ఎంతో ఉపయోగపడేదనడంలో సందేహం లేదు. కాకపోతే ఈ చర్చలో మరో పక్షమైన ఎన్‌జివోల సంగతే బట్టబయలు కాకపోవడం ఈ దేశ మేధో బలహీనతకు చిహ్నం.

కుల వివక్ష చర్చను లేవనెత్తిన భారతదేశంలోని ఎన్‌జివోలకు ఉత్తర అమెరికా, యూరప్ ఖండాలలో తెల్లదొరల సంపన్న దేశాల నుండి నిధులు వస్తున్నాయన్న సంగతి మర్చిపోరాదు.  జాతీయ దళిత మానవ హక్కుల ప్రచారోద్యమం పేరిట దళితుల హక్కుల గురించి మాట్లాడుతున్న సంస్థలకు నిధులు ఆ దేశాల నుంచే సరఫరా అవుతున్నాయి. అఖిల భారత క్రైస్తవ కార్యాచరణ సమితి (ఎఐసిఎసి), ఉత్తర అమెరికాలోని భారత అమెరికన్ క్రైస్తవ సంఘాల సమాఖ్య (ఎఫ్ఐఎసిఎసిఒఎన్ఎ) కూడా కుల వివక్ష చర్చను సమర్ధిస్తున్న ప్రధాన సంస్థలు. పూర్తిగా విదేశీ నిధులతో నడిచే సంస్థలు భారత దళితులకు ఒక జాతీయ ఎజెండాని - డర్బన్ సదస్సులో కుల వివక్షపై చర్చకు డిమాండ్ - తయారు చేయడంలో సఫలీకృతమయ్యాయి. ఈ దేశ హక్కుల ఉద్యమ చరిత్రలో ఇది తొలిసారి జరుగుతోంది. ఏ ఏ దేశాల నుంచి ఈ సంస్థలకు నిధులు వస్తున్నాయో ఆ దేశాలు ఎగదోస్తున్న మార్కెట్ శక్తులు మనల్ని చుట్టుముట్టి ప్రపంచీకరణ ప్రయోగం చేస్తున్న సందర్భంలో ఇది జరుగుతోంది. ప్రపంచీకరణ ప్రభావం ఈ దేశ పేదల మీద - ముఖ్యంగా దళిత, ఆదివాసీల మీద, చేతివృత్తుల వారి మీదా - తీవ్ర ప్రభావం చూపెడుతున్న పోగాలంలో, విదేశీ సంస్థలు ఇక్కడ దళిత హక్కుల, మహిళల హక్కుల మార్కెట్లను డబ్బుతో సృష్టిస్తున్నాయన్న సంగతి కూడా పట్టించుకోవాల్సి ఉంది. దళితుల గురించి, ప్రజాస్వామ్యం గురించి రాసిన, రాస్తున్న ప్రముఖ కాలమిస్టు గెయిల్ ఓమ్‌విట్ ఇటీవల ప్రపంచీకరణను, భారీ డ్యాంలను, మోన్‌సాంటో కంపెనీని సమర్థిస్తూ రాయడం కాకతాళీయం కాదు.  అవి రెండూ (దళిత హక్కులు-ప్రపంచీకరణ) పరస్పర విరుద్ధ అంశాలని ఆమె అనుకోవడం లేదు. 'మరో రెండు వందలేళ్ళు

మనం బ్రిటీష్ వలస పాలనలో ఉంటే దేశంలోని శూద్ర, చండాల శక్తులు మరిన్ని అవకాశాలను పొందగలిగేవి' అని ప్రజాతంత్ర సాహిత్య సంచిక (మార్చి 25, 2001) ఇచ్చిన ఇంటర్వ్యూలో డాక్టర్ కంచ ఐలయ్య చెప్పడం గమనార్హం ఆయన రాసిన 'వై ఆయామ్ నాట్ ఎ హిందు?' పుస్తకాన్ని అమెరికాలోని అరడజను విశ్వవిద్యాలయాల్లో రిఫరెన్స్ బుక్‌గా ఆదరించడం, వాషింగ్టన్‌లోని హ్యూమన్‌రైట్స్ వాచ్ భారత దళితులపై ప్రత్యేక గ్రంథం (బ్రోకెన్ పీపుల్) ప్రచురించడం, విదేశీ నిధులతో దళిత మానవ హక్కుల జాతీయ ప్రచారోద్యమ సంస్థ ఏర్పాటు, కుల వివక్షపై డర్బన్‌లో చర్చించాలన్న డిమాండ్ - ఇవన్నీ గత కొన్నేళ్ళుగా ఒకదాని వెంట ఒకటి వరసగా జరగడం ఏమాత్రం యాదృచ్ఛికం కాదు.

మన దేశంలో సంస్థలకు విదేశాల నుంచీ ఏటా రూ.4000 కోట్ల రూపాయల నిధులందు తున్నాయి. ఏటా వేలకోట్ల రూపాయల బడ్జెట్‌లో అమెరికా, కెనడా, జర్మనీ, తదితర సంపన్న దేశాలు ఈ దేశం మీదకు విడుదల చేస్తున్న మానవ హక్కుల ఎజెండాలు దేనికి పనికొస్తాయో గానీ ప్రపంచీకరణకు మాత్రం మన మనోద్వారాలను విశాలంగా తెరుస్తాయి. ప్రపంచీకరణ కాకపోతే విదేశీ మార్కెట్ల విస్తరణకు.

గత జూన్ 3న 'హిందు' దినపత్రికలో స్వామి అగ్నివేష్, రెవరెండ్ వల్సన్ థంపు రాసిన వ్యాసంలో కుల వివక్షపై దర్బన్‌లో చర్చ జరగాలని చెప్తూ ప్రపంచీకరణ దిశగా పురోగమిస్తున్న ప్రపంచంలో కులాన్ని ప్రపంచ విమర్శకు వదిలేయక తప్పదన్నారు. జాతి రాజ్య భావనను వారు అవహేళన చేశారు. ఈ వ్యాసం ద్వారా అర్థమయ్యేది డర్బన్‌లో కులవివక్షపై చర్చ ప్రపంచీకరణలో భాగమని, గ్లోబల్ గ్రామం ఏర్పడబోతోందని, దేశాల సరిహద్దులు మిథ్య అనీ, జాతి రాజ్య భావనకు కాలం చెల్లిందనీ చెప్పే మార్కెట్ మాయాజాలంలో వివిధ దేశాల ప్రభుత్వాలను అంతర్జాతీయ సంస్థలకు లోబరచడంలో భాగమే. ఐక్య రాజ్య సమితి సదస్సులో కుల వివక్ష గురించిన చర్చ ప్రపంచీకరణ వాదులకు ప్రీతిపాత్రం కావడానికి కారణాల్లో ఇదొకటి. అందుకోసం డబ్బు వెదజల్లుతారు. హక్కుల ఉద్యమాలను సృష్టిస్తారు. హక్కుల బాటలో మనుషులను నడిపిస్తారు. సంపన్న రాజ్య ప్రయోజనాలకోసం వాడుకుంటారు. ఐ.రా.స. తెల్లదొరల

కూటమిలో బడుగు దేశాల గొంతులను నొక్క గలుగుతారు. కులవివక్ష చర్చను భారతదేశంలో లేవనెత్తేందుకు సంపన్న దేశాలకు మరో ప్రయోజనం కూడా ఉంది. వలసవాదం వల్ల మూడవ ప్రపంచ దేశాల ప్రజలకు జరిగిన అవమానాలకు, వారు గురైన దోపిడీకి మాజీ సామ్రాజ్యవాద దేశాల నుండి ఆఫ్రికా దేశాలు డర్బన్ సదస్సులో నష్ట పరిహారాన్ని డిమాండ్ చేయబోతున్నాయి. మరోవైపు పాలస్తీనాతో పాటు మరికొన్ని అరబ్ దేశాలు ఇజ్రాయెల్ దుశ్చర్యలను ఖండించేందుకై సదస్సులో పట్టుబట్టే అవకాశాలు కూడా ఉన్నాయి. ఆఫ్రికా, అరబ్ దేశాల చర్చను స్తంభింపచేసేందుకు పాశ్చాత్య దేశాలకు, అమెరికాకు మనదేశ మద్దతు అవసరం. అందుకే అవి ఎన్.జి.వోల ద్వారా కుల వివక్ష చర్చను ప్రోత్సహించాయి. భారత ప్రభుత్వంపై వత్తిడి తేగలిగాయి. డర్బన్ సదస్సులో కుల వివక్షను ఎజెండా అంశంగా పెట్టకుండా అవి భారత్‌కు సహాయం చేసి, తర్వాత ఆఫ్రికా, అరబ్ దేశాల డిమాండ్లను ఓడించడంలో భారత్ సహాయం పొందుతాయి. ఈ అంతర్జాతీయ తెల్లజాతి ఎత్తుగడ ఫలితం ఆగస్టు మొదటి వారానికి కొంత తెలిసింది. జెనీవాలో జరిగిన సన్నాహక సమావేశంలో కులవివక్షను డర్బన్ సదస్సు ఎజెండాలో చేర్చాలనే అంశం పట్ల సభ్య దేశాలు ఆసక్తి కనపర్చలేదు. ఇక భారతదేశం ఆఫ్రికా, అరబ్ దేశాల డిమాండ్లను అంగీకరించకపోవడం, వాటిని ఏకాకులను చేసి సంపన్న రాజ్యాలకు సహాయపడటం తరువాయి భాగం. (ఆఫ్రికా దేశాల డిమాండ్ ఆమోదం పొందితే భారతదేశం లాంటి దేశాలు లాభం పొందుతాయి. కానీ ఈ విషయమై ఎవరూ మాట్లాడకపోవడం హక్కుల ఉద్యమం ఏ దిశగా నడుస్తోందో తెలియచేస్తోంది). మన హక్కుల ఉద్యమానికి ఏనాడూ దేశీయ స్ఫూర్తి లేదు. పాశ్చాత్య సిద్ధాంతకారుల భావనలే పునాదిగా అది ఇప్పటి వరకూ నడుస్తోంది. కుల వివక్ష గురించి, కుల నిర్మూలన గురించి మాట్లాడుతున్నప్పుడైనా మనం బసవడి ఉద్యమం లాంటి వాటిని గుర్తుచేసుకోం. హిందుత్వను వ్యతిరేకిస్తూ, విదేశీ నిధులతో నడిచే సంస్థల హక్కుల ప్రవచన బండారాన్ని బయటపెట్టే దేశీయ మానవ దృక్పథం ఇప్పుడు కావాలి. అది మాత్రమే కుల వివక్షను గురించిన సరైన దృక్పథాన్ని కలిగి వుండగలదు.

**ఆగష్టు 12, 2001 - వార్త**

# 14. మానవ హక్కుల సంస్థలన్నీఒకటే!

పెట్టుబడి విస్తరణకు మానవ హక్కులు అత్యంత అవసరం. ప్రపంచీకరణ కోసం విస్తరింపచూస్తున్న పెట్టుబడిదారులే మానవహక్కుల గురించి మాట్లాడటం విడ్డూరంగా ఉంది. పెట్టుబడి, విదేశీ సరుకుల ప్రవేశం కోసం మానవ హక్కులను అడ్డుపెట్టుకుని చట్టబద్ధపాలన గురించి ఏ మానవహక్కుల సంస్థ మాట్లాడనంతగా ఇవాళ ప్రపంచ బ్యాంకు మాట్లాడుతోంది. ప్రపంచీకరణకు అవసరమయ్యే వన్నీ మానవహక్కులుగా నిర్వచించబడి హక్కుల డిక్షనరీ లోకి చేరుతున్నాయి. అభివృద్ధిని హక్కుగా ఐక్యరాజ్యసమితి గుర్తించింది. అభివృద్ధి పేరిట ఏం జరుగుతుందో రాష్ట్ర ప్రజలకు స్వానుభవమే. అలానే సమాచారం పొందే హక్కు, పారదర్శకత పేరిట బిల్‌గేట్స్ లాంటి వాళ్ళ ఉత్పత్తులకు గిరాకీ పెంచుకుంటున్నారు. ఈ మానవహక్కుల పరిభాష, ఆధునికపూర్వ సమాజ మానవహక్కుల కార్యచరణలను, అస్తిత్వాలను వెనుకబాటు తనంగా, హక్కుల అణిచివేతగా మాత్రమే గుర్తిస్తుంది. ప్రపంచీకరణ కోసం, పెట్టుబడి విస్తరణ కోసం మానవ హక్కులనే ఆయుధాలుగా అమెరికా, పాశ్చాత్య దేశాలు మలుచుకోవడం చూస్తూనే ఉన్నాం. సార్వభౌమత్వం, జాతి రాజ్యాలు, ఒకప్పటి మానవహక్కులు కాగా అభివృద్ధిపేరిట, ప్రపంచీకరణ పేరిట సరిహద్దుల చెరిపివేత, పరాధీనత హక్కుల కింద మారుతున్నాయి. ప్రపంచీకరణ రాజకీయాల్లో భాగంగా మహిళల, దళితుల హక్కులకోసం ఉద్యమాలను ప్రోత్సహించడం ముమ్మరమైంది. (ఐదు వందల మంది తాలిబాన్ యుద్ధ ఖైదీలను చంపించిన ఆధునిక హిట్లర్ ఆఫ్ఘన్ మహిళల హక్కుల గురించి కన్నీరు కారుస్తుంటారు). ఫలితంగా ప్రపంచీకరణ నేపథ్యంలో కొన్ని

మానవహక్కుల దుకాణాలు వెలిశాయి. వాటికి భారీ నిధులు అందుతున్నాయి. వీటికి ఎంతో భిన్నంగా ఉంటూ పెట్టుబడిని, ప్రపంచీకరణను వ్యతిరేకించే వామపక్ష (విస్తృతార్థంలో) మానవ హక్కుల ఉద్యమాలు కూడా పాశ్చాత్య నాగరికత, పెట్టుబడి వేటినైతే హక్కులుగా నిర్వచించిందో వాటి కోసమే ప్రధానంగా పనిచేస్తాయి. అందువల్ల హక్కుల భాషలో తేడా పెద్దగా లేదు. అన్నిమానవహక్కుల సంస్థలూ ఒకేలాగా కన్పిస్తాయి. ఈ తరహా ఉద్యమాలు కూడా పరోక్షంగా ఆధునిక పెట్టుబడి విస్తరణకి, ప్రపంచీకరణకి దోహదం చేస్తున్నాయి. ఈ నేపథ్యంలో తలెత్తుతున్న అస్తిత్వ ఉద్యమాలు సారాంశంలో ప్రపంచీకరణ దిశగానో, పెట్టుబడి విస్తరణ దిశగానో ముగుస్తున్నాయి.

**డిసెంబరు 9, 2001 - వార్త**

# 15. ఆఫ్ఘన్‌పై యుద్ధంలో రంగువెలసిన ఆమ్నెస్టీ, హ్యూమన్ రైట్స్ వాచ్

ఆఫ్ఘనిస్తాన్‌పై అమెరికా కూటమి చేస్తున్న అమానుష యుద్ధంపట్ల గ్లోబల్ మానవ హక్కుల సంస్థలు ఎలాంటి వైఖరి ప్రదర్శిస్తున్నాయో తెలుసుకోవాలనే కుతూహలం మానవ హక్కుల రంగంలో పనిచేస్తున్న వారికి కలగడం సహజం. ప్రపంచ వ్యాప్తంగా పనిచేస్తున్న రెండు ప్రముఖ మానవహక్కుల సంస్థలున్నాయి. అందులో ఒకటి అమెరికాకు, మరొకటి అమెరికా యుద్ధ భాగస్వామి బ్రిటన్‌కు చెందినవి. అందువల్ల అవి రెండూ యుద్ధం విషయంలో ఎలా స్పందించాయో తెలుసుకోవడం మానవ హక్కుల ఉద్యమ బాధ్యత కూడా. పైగా ఆ రెండు సంస్థలతో మన దేశంలోని మానవ హక్కుల ఉద్యమానికి మంచి సంబంధాలుండటంవల్ల కూడా ఆ బాధ్యత మరింతగా ఉంటుంది. ఆ సంస్థలు ఆమ్నెస్టీ ఇంటర్నేషనల్, హ్యూమన్ రైట్స్ వాచ్. ఐక్యరాజ్యసమితి మానవహక్కుల కమీషన్‌ని పక్కన బెడితే (దాని బండారాన్ని, కోఫీ అన్నన్‌కు నోబెల్ శాంతి బహుమతి ప్రదానాన్ని ప్రపంచ ప్రజలు బాగానే అర్థంచేసుకున్నారు) ఇవి రెండూ బాగా గుర్తింపు ఉన్న సంస్థలు.

బిబిసి లాగా ఆమ్నెస్టీ లండన్ కేంద్రంగా నలభై ఏళ్ళ అనుభవం కలిగిన సంస్థ. సి.ఎన్.ఎన్.లాగా హ్యూమన్‌రైట్స్ వాచ్ పది పదిహేనేళ్ళుగా ప్రాచుర్యం పొందింది. ప్రపంచీకరణ భావజాలం ఎదుగుతున్న కాలంలో ఇది కూడా అంతర్జాతీయ స్థాయికి ఎదిగింది. ఈ రెండు సంస్థలనూ ఐక్యరాజ్యసమితి మానవ హక్కుల విషయాల్లో సంప్రదిస్తుంటుంది. సమావేశాలకు పరిశీలకులుగా ఆహ్వానిస్తుంటుంది. ఆఫ్ఘనిస్తాన్‌పై అమెరికా-బ్రిటన్ కూటమి ఏకపక్ష యుద్ధం పట్ల ఆ రెండు దేశాలకే చెందిన ఈ సంస్థల వైఖరి వీటి దృక్పథానికి, పనితీరుకు

గీటురాయి అవుతుంది. కాబట్టి మన మానవహక్కుల ఉద్యమం ఈ రెంటి పోకడలను ఈ సందర్భంగా సునిశతంగా పరిశీలించి అంచనాలకు రావాలనడంలో తప్పులేదు.

ఈ రెండు సంస్థలూ అమెరికాపై సెప్టెంబర్ 11న జరిగిన దాడులను తీవ్రంగా ఖండించాయి. ఆమ్నెస్టీ ప్రధాన కార్యదర్శి ఐరిన్ ఖాన్ సెప్టెంబర్ 21న అమెరికా అధ్యక్షుడికి రాసిన లేఖలో ప్రతీకార చర్యలకు అమెరికా పాల్పడరాదనీ, న్యాయం కోసం జరిపే ప్రయత్నాలలో మానవ హక్కుల ఉల్లంఘనకు తావు లేకుండా అన్ని చర్యలు గైకొనాలని కోరారు. 'ప్రతీకారం కాదు న్యాయం' ఆమ్నెస్టీ నినాదమైంది. హ్యూమన్ రైట్స్ వాచ్ ఎగ్జిక్యూటివ్ డైరెక్టర్ కెన్నెత్ రోత్ అమెరికా విదేశాంగశాఖ మంత్రి కోలిన్ పోవెల్‌కు సెప్టెంబర్ 24న లేఖ రాస్తూ టెర్రరిజంపై జరిపే పోరాటంలో మానవ హక్కులపై రాజీకి తావులేదని అమెరికా తన కూటమి సభ్యులకు చెప్పాలని విజ్ఞప్తి చేశారు. లేని పక్షంలో టెర్రరిజం వ్యతిరేక పోరాటం పేరిట మానవ హక్కులు మంటగలిసే ప్రమాదముందని హెచ్చరించారు.

ఈ రెండు లేఖలు వెలువడేనాటికి ఇంకా యుద్ధం మొదలు కాలేదు. ఆమ్నెస్టీ, హ్యూమన్ రైట్స్ వాచ్ రెండూ యుద్ధాన్ని వ్యతిరేకిస్తాయనుకున్న వారికి ఆశాభంగమైంది. ఈ దేశంలో మానవ హక్కుల సంస్థల (దుకాణాలు కాదు) వారినెవరినడిగినా అమెరికా పెద్ద టెర్రరిస్టు అంటారు. అంతమాట అననివాళ్ళు కూడా అమెరికా కూటమి ఆఫ్ఘన్‌పై చేస్తున్న యుద్ధం అన్యాయమైన ఏకపక్ష దాడి, మహాపాతకం అని కరాఖండిగా చెప్తారు. కానీ ఇప్పటి వరకూ ఆమ్నెస్టీ, హ్యూమన్‌రైట్స్ వాచ్‌లు ఈ యుద్ధం అన్యాయమైనదని ప్రకటించలేదు. మానవాళిపై జరుగుతోన్న మారణహోమంగా గుర్తించలేదు. సెప్టెంబర్ 11న అమెరికా నగరాలపై జరిగిన దాడులు మానవ జాతిపై జరిగిన నేరాలుగా ప్రకటించిన హ్యూమన్ రైట్స్ వాచ్ సంస్థకు ఆఫ్ఘన్ ప్రజలపై అమెరికా కూటమి అమలు జరుపుతున్న మారణకాండ అలా కన్పించలేదు. సెప్టెంబర్ 11 దాడులు ఈ సంస్థ దృష్టిలో ప్రపంచానికే షాక్. కానీ, ఆఫ్ఘన్ మృత్యుఘోష ఎవరికీ షాక్ కాదు.

అంతర్జాతీయ న్యాయశాస్త్ర పరిభాషలో రెండు వ్యక్తీకరణలు ఉన్నాయి. JUS AD BELLUM (యుద్ధం న్యాయబద్ధత), JUS IN BELLO (యద్ధం

చేసే పద్ధతి న్యాయబద్ధత). హ్యూమన్ రైట్స్ వాచ్‌కి, ఆమ్నెస్టీకి మొదటి దానితో పనిలేదు. అంటే అమెరికా కూటమి యుద్ధం చేసే పద్ధతి మాత్రం అంతర్జాతీయ న్యాయసూత్రాలకు లోబడి ఉందా లేదా అని మాత్రమే ఈ సంస్థలు పరిశీలిస్తున్నాయి. అంటే JUS IN BELLO గురించి మాత్రమే పట్టించుకుంటాయన్నమాట. అమెరికా ఎందుకు యుద్ధం చేస్తుందో వీటికనవసరం. ఎలా చేస్తుందో మాత్రమే ఇవి పరిశీలిస్తాయి. ఈ సంస్థలు యుద్ధమే నేరమని ప్రకటించవు. యుద్ధ నేరాలను మాత్రమే అంటే పౌరులను చంపడం, పౌర ఆస్తుల విధ్వంసం, యుద్ధఖైదీల హక్కుల ఉల్లంఘన లాంటి వాటిని మాత్రమే ఖండిస్తాయి. ('అనుబంధ నష్టం' అనే ముద్దుపేరుతో అమెరికా కూటమి దేశాలు ఈ నేరాలను పిలుస్తున్నాయి.)

సెప్టెంబర్ 11 దాడులు అమెరికా పాప ఫలితమని ఆ దేశ మాజీ అధ్యక్షుడు బిల్ క్లింటన్ సైతం ఒప్పుకోక తప్పలేదు. ప్రపంచ ప్రజాభిప్రాయం కూడా అదే. కానీ, మానవ హక్కుల గురించి నిరంతరం పని చేస్తున్నామనే ఆమ్నెస్టీ, హ్యూమన్ రైట్స్ వాచ్‌లు అమెరికా గత పాపాల చిట్టాను ఏ మాత్రం ప్రస్తావించడంలేదు. అమెరికా ఆర్థిక, రాజకీయ, విదేశాంగ విధానాలపై ఈ రెండు సంస్థలు ఈ సందర్భంలో పల్లెత్తు మాట అనలేదు.

సెప్టెంబర్ 11 దాడులకు కారకులైన వారిని పట్టుకునేందుకు ప్రపంచ దేశాలన్నీ అమెరికాకు సహకరించవలసిందిగా భద్రతామండలి చేసిన తీర్మానాన్ని ఆమ్నెస్టీ హర్షించింది. టెర్రరిస్టు చర్యలను ఎదుర్కొనేందుకు విస్తృతమైన (?) చర్యలు చేపట్టాలని భద్రతా మండలి చేసిన మరో తీర్మానాన్ని కూడా ఆమ్నెస్టీ ఆహ్వానించింది. ఇవి రెండూ అమెరికా యుద్ధ చర్యలకు నేపథ్య గీతాలని ఆమ్నెస్టీకి తెలియదా? ఆఫ్ఘన్‌పై యుద్ధానికి భద్రతామండలి ఆమోదం పొందేందుకు ఆ తర్వాత అమెరికా ప్రయత్నించలేదు. నోమ్ చోమ్‌స్కీ అన్నట్టు భద్రతామండలి ఆమోదం పొందటం అమెరికాకు పెద్ద కష్టం కాదు. కానీ, ఐరాసకు అతీతంగా తనున్నానని, తను అంతర్జాతీయ న్యాయశాస్త్ర సంప్రదాయాలను ఆమోదించనని అమెరికా చెప్పదల్చుకుంది. అయినప్పటికీ ఆమ్నెస్టీ, హ్యూమన్‌రైట్ వాచ్‌లు యుద్ధం న్యాయమా? అని ప్రశ్నించలేదు. ఆ ప్రశ్న తన కనవసరమని హ్యూమన్‌రైట్స్ వాచ్ నిస్సిగ్గుగా ప్రకటించింది. అలాంటి

ప్రశ్నల్లోకి వెళ్తే యుద్ధ నేరాల గురించి మాట్లాడేటప్పుడు తన విశ్వసనీయత ప్రశ్నార్థకమౌతుంది అని అది సాకు చూపించింది. కానీ యుద్ధాన్ని నేరంగా ఖండించకపోతే తన విశ్వసనీయత దెబ్బ తింటుందని ఆ సంస్థ భావించలేదు.

ఐక్యరాజ్యసమితి ఛార్టర్ ప్రకారం చూసినా ఈ యుద్ధం ఆమోదయోగ్యం కాదు. తక్షణ ఆత్మరక్షణార్థం ఒక దేశం తనపై మరో దేశపు దాడులను తిప్పికొట్టవచ్చు. సెప్టెంబరు 11 అలాంటిది కాదు. ఐరాస, భద్రతామండలి తీర్మానాల్లేకుండా యుద్ధకూటమిని ఏర్పరచి జరుపుతున్న ఈ యుద్ధం అన్ని అంతర్జాతీయ న్యాయసూత్రాలనూ ఉల్లంఘించి చేస్తున్న ఘోరనేరం. నికరాగువాలో అమెరికా తన బంట్లయిన కాంట్రా గెరిల్లాలకు సైనిక సామాగ్రి అందించి సహకరించడాన్ని 1986లో అంతర్జాతీయ న్యాయస్థానం అభిశంసించింది. యుద్ధ శిక్షణా మాన్యువల్‌ను అందించడానికి కూడా అమెరికాకు అధికారం లేదనీ, అలాంటి పనులు అంతర్జాతీయ మానవతా చట్టాల ఉల్లంఘన అని చీవాట్లు పెట్టింది. మరి ఇవాళ ఆఫ్ఘనిస్తాన్‌లో జరుగుతున్నది అంతకంటే వేలరెట్లు ఘోర దుర్మార్గం. వర్ణించనలవికానంత మారణహోమం. కానీ, యుద్ధం ఎందుకు అని రెండు గొప్ప మానవ హక్కుల సంస్థలు ప్రశ్నించవు. కాస్త జాగ్రత్తగా చెయ్యండని మాత్రమే సలహా ఇస్తాయి. పౌరుల మరణాల్ని నంగి నంగి మాటల్లో ఖండిస్తూ ఒక పత్రికా ప్రకటన ప్రపంచ మానవుల మొఖాలపైకి ఈ హక్కుల సంస్థలు విసురుతాయి. మానవుల కష్టాలపట్ల సానుభూతీ, మానవ హక్కుల ఉల్లంఘన పట్ల తీవ్రమైన ఆవేదన చెందుతున్నట్టుగా ప్రపంచ ప్రజలు భ్రమించడానికి అవసరమైన మేరకు ఈ రెండు సంస్థలు మాట్లాడాయి. పౌరుల మరణాల గురించి కొద్దిగా, శరణార్థుల కష్టాల గురించి కొద్దిగా మాట్లాడాయి. బాంబుదాడులవల్ల శరణార్థులుగా మారుతున్న వాళ్ళ బాధ్యతని మోయవలసిందిగా అమెరికా కూటమికి ఆమ్నెస్టీ విజ్ఞప్తి చేసింది. (నారు పోసినవాడే నీరు పోయాలన్న సామెతకు విషాద అన్వయింపా?) ఉత్తర కూటమికి విచక్షణా రహితంగా ఆయుధాలిస్తే ప్రమాదకర పరిస్థితులు ఏర్పడతాయని అమెరికాను (అవును ప్రపంచ టెర్రరిస్టు అమెరికానే) ఆమ్నెస్టీ హెచ్చరించింది. క్లస్టర్ బాంబులు వేయడం మానవ హక్కుల ఉల్లంఘన. వాటిని ఆఫ్ఘన్‌పై వేయవద్దని అమెరికా కూటమికి రెండు సంస్థలూ వేర్వేరుగా

హితవు చెప్పాయి. ఆఫ్ఘన్ పౌరులకు యుద్ధంవల్ల జరిగే హానిని 'సాధ్యమైనంతగా తగ్గించేందుకు', 'వీలున్న' చర్యలు తీసుకోవలసిందిగా అమెరికా యుద్ధ కూటమికి హ్యూమన్ రైట్స్ వాచ్ విజ్ఞప్తి చేసింది. ఆ సంస్థ ఆసియా విభాగపు ఎగ్జిక్యూటివ్ డైరెక్టర్ సిడ్నీ జోన్స్ అక్టోబర్ మొదటివారంలో చేసిన ప్రకటనలో క్రూరులైన ఉత్తర కూటమి సైనికాధికారులతో చేతులు కలపరాదని అమెరికా కూటమికి విజ్ఞప్తి చేశాడు. (దయ్యాలను భూతాలకు సహకరించవద్దన్నట్టు!) అక్టోబర్ 23న ఆ సంస్థ అమెరికా విదేశాంగ శాఖ మంత్రికి రాసిన లేఖ మరొక క్రూయల్ జోక్. "పోవెల్‌గారూ మీరు మీ పలుకుబడి ఉపయోగించి ఉత్తర కూటమి సైన్యం ప్రతీకారదాడులకు, విచక్షణారహిత ఫిరంగి దాడులకు, ఇతర మానవహక్కుల ఉల్లంఘనలకూ పాల్పడకుండా చూడగలరు." (అప్పటికి బుష్, పోవెల్, రమ్స్ ఫెల్డ్‌లు చేస్తున్న పని ప్రతీకార దాడులేనని స్కూలు పిల్లలకు సైతం తెలుసు).

ఆమ్నెస్టీ, హ్యూమన్‌రైట్స్ వాచ్ ఎలాగోలా కొంతవరకైనా మానవహక్కుల పనే చేస్తున్నాయి కదా అని సర్దుకుపోయే మనుషులున్నారు. వారన్నది నిజమే. కానీ యుద్ధం మాటేమిటి అని అడగాల్సిన అవసరం లేదా? JUS AD BELLUM గురించి మాట్లాడమని వాటిని నిలదీయాల్సిన పనిలేదా? యుగోస్లావియా మాజీ అధ్యక్షుడు మిలోసోవిక్‌పై హేగ్‌లోని అంతర్జాతీయ నేరాల ప్రత్యేక ట్రిబ్యునల్‌లో జాతి సంహార నేరానికి ప్రాసిక్యూట్ చేస్తున్నారు. ఆ పద్ధతిలోనే అమెరికా అధ్యక్షుడు జార్జి బుష్‌ను, బ్రిట్ ప్రధాని టోనీ బ్లెయిర్‌ను వారి సైనిక గణాన్ని అరెస్టుచేసి అంతర్జాతీయ యుద్ధ నేరాల ట్రిబ్యునల్‌ను ఏర్పరచి విచారించాలని మానవ హక్కుల సంస్థలు నిలదీయకపోతే వాటి నిజాయితీని శంకించాల్సిన అవసరం లేదా?

యుద్ధ నేరాలకు పాల్పడిన తాలిబాన్ కమాండర్లను, నార్తర్న్ ఎలయన్స్ సైనికాధికార్లను ఏ పద్ధతిలో విచారిస్తే బాగుంటుందో డిసెంబర్ 3న హ్యూమన్ రైట్స్ వాచ్ బాన్‌లో సమావేశమైన ఐరాస బృందానికి సలహాలిచ్చింది. ఆ సందర్భంలో కూడా అమెరికా కూటమి యుద్ధనేరాల గురించిన చిరు ప్రస్తావన కూడా ఆ సంస్థ తేలేదు. మజారే షరీఫ్‌లో సిఐఎ ఏజెంట్‌ను చంపినందుకు వందలాది మంది యుద్ధ ఖైదీల రక్తం చవిచూసిన అమెరికాకు, బ్రిటన్‌కు ఈ వారం ఆ సంస్థ చేసిన విజ్ఞప్తి ఏమిటంటే - యుద్ధఖైదీల నిర్బంధానికి నార్తర్న్

ఎలయన్స్‌కు ఆ రెండు దేశాలూ సైనిక సహకారం అందించి యుద్ధఖైదీల హక్కులు కాలరాయకుండా కాపలా కాయండని.

ఆఫ్ఘనిస్తాన్‌లో తాలిబాన్ ప్రభుత్వం కూలిపోక ముందే అక్కడ భవిష్యత్ ప్రభుత్వ రూపురేఖల గురించి అమెరికా కూటమి చర్చ లేవనెత్తింది. ఆమ్నెస్టీ, హ్యూమన్‌రైట్స్ వాచ్ రెండూ ఈ చర్చల్లో భాగంగా సూచనల్విడం మొదలు పెట్టాయి. ఆఫ్ఘనిస్తాన్‌లో ఏ ప్రభుత్వాన్ని పెట్టాలో నిర్ణయించడానికి మనమెవరం అని ఏ పాశ్చాత్య మానవహక్కుల సంస్థా అమెరికా కూటమిని నిలదీసింది లేదు.

మానవహక్కుల చైతన్యం ప్రపంచ వ్యాప్తంగా పెరిగిందనీ, మానవ జాతి అలా పై మెట్టుకు ఎదిగిందనీ, ప్రజాస్వామిక హక్కుల కోసం అంతర్జాతీయ సంస్థలూ, ఒప్పందాలూ ఏర్పటయ్యాయని, ప్రజాస్వామిక విలువల చైతన్యం పొంగి పొర్లుతోందనీ, పాత సమాజాల్లో ఆ పరిస్థితి లేదని మానవహక్కుల ఉద్యమ పాఠాలు చెప్పగా విన్నాం. నిజమని నమ్మి ప్రచారం చేశాం. వేలాది మందిని హతమార్చి, పదిహేను లక్షలమందిని బిచ్చగాళ్ళను చేసి దేశ సరిహద్దుల బయటికి తరిమిన ఒక భీకర యుద్ధాన్ని ఈ చైతన్యాలూ, సంస్థలూ, విలువలూ నిలువరించకపోగా, దాన్ని పరోక్షంగానో, ప్రత్యక్షంగానో సమర్థిస్తుంటే 'మానవ హక్కులు' ఎందుకోసం? ఎవరికోసం? అని ప్రశ్నించక తప్పదు. అవి వికారంగానూ, వికృతార్థంలోనూ కన్పించక తప్పదు. లక్షలాది శరణార్థుల సృష్టి కర్తలయిన అమెరికా కూటమిని బాంబు దాడులను ఆపమని అడగకుండా, శరణార్థులకు అన్నం పెట్టండని మాత్రమే ఆమ్నెస్టీ అడిగినప్పుడు 'మానవ హక్కులు' మనవి కాదేమో అనిపించక తప్పదు.

మానవ హక్కుల గురించిన మన ఆలోచనలకు పలుకోణాల నుంచి ఆఫ్ఘనిస్తాన్ ఒక కేంద్రబిందువు. హక్కుల సిద్ధాంతాలను ఆఫ్ఘన్ పటంలో నిగ్గు తేల్చాలి. యుద్ధ నేపథ్యంలో వాటిని పునఃసమీక్షించుకోవాలి. వలసవాద మానవహక్కుల దృక్పథాలను, కార్పొరేట్ మానవ హక్కుల దుకాణాల బండారాన్ని బయటపెట్టాల్సిన అవసరాన్ని ఆఫ్ఘన్ అనుభవం నుంచి మనం గుర్తించాలి.

**డిసెంబరు 20, 2001 – జనపథం పక్ష పత్రిక**

# 16. 'ప్రశ్నభూమి' కథ

'ప్రశ్నభూమి' కథ 2002 ప్రజాతంత్ర సాహిత్య సంచికలో ప్రచురించబడి పాఠకుల దృష్టిని ఆకర్షించింది. కొంగొత్త కథావస్తువుతో న్యాయశాస్త్ర భూమికతో వాడ్రేవు చిన వీరభద్రుడు రచించిన ఈ కథ ఆ ఏడాది ఉత్తమ కథల సంపుటి కథ-2002లో చోటు సంపాయించింది.

సాంకేతికలోపాలు ఈ కథకుడికి న్యాయశాస్త్రంతో, న్యాయస్థానాలతో పరిచయం లోతుగా లేని తనానికి నిలువుటద్దంలా నిలుస్తాయి. ఈ కథ మొదటి వాక్యంలోనే అది కొట్టొచ్చినట్టు కనిపిస్తుంది. కథ 'సబార్డినేట్ జడ్జి కోర్టుహాలు ఎన్నడూ లేనంతగా కిటకిటలాడుతోంది' అని ప్రారంభమౌతుంది. కథావస్తువేమో క్రిమినల్ కేసు. సబార్డినేట్ జడ్జి సివిల్ కేసులు విచారిస్తారు. క్రిమినల్ కేసులు విచారించేటప్పుడు అసిస్టెంట్ సెషన్స్ న్యాయమూర్తి హోదాలో విచారిస్తారు. కాబట్టి అసిస్టెంట్ సెషన్స్ న్యాయమూర్తి అని రాసివుండాల్సింది. కానీ అలా రాయడం కూడా తప్పే. ఎందుకంటే ఈ కేసులో విచారించబడిన కేసు ఐపిసి 441 (క్రిమినల్, ట్రెస్‌పాస్), 442 (హౌస్ ట్రెస్‌పాస్) 509 (స్త్రీలపట్ల అగౌరవంగా ప్రవర్తించడం) మూడు ఒక అసిస్టెంట్ సెషన్స్ న్యాయమూర్తి విచారించేవికావు. అవి క్రిమినల్ ప్రొసీజర్ కోడ్ ప్రకారం ఫస్ట్‌క్లాస్ మేజిస్ట్రేట్ విచారించదగ్గవి. కోర్టును వర్ణించాక రచయిత 'కోర్టుహాల్లో మాజిస్ట్రేట్ ప్రవేశించలేదు' అని రాశారు. మొదటి నుంచి అదే రాస్తే బాగుండేది. కానీ, కొంత కథ నడిచాక మళ్ళీ 'సబ్‌జడ్జి కోర్టులోకి తద్వారా కథలోకి నేరుగా ప్రవేశిస్తాడు. తర్వాత రెండు వాక్యాల అనంతరం హఠాత్తుగా 'మేజిస్ట్రేట్'గా మారిపోగా "మాజిస్ట్రేట్ని చూస్తూనే కోర్టు హాల్లోని వారంతా లేచినిలుచున్నారు." తర్వాత అతను మేజిస్ట్రేట్‌గా విధులను నిర్వర్తించబూనుకొంటాడు. కానీ అప్పుడాయన హైకోర్టు న్యాయమూర్తిగా

మారిపోయాడు. ఏ మేజిస్ట్రేట్ కోర్టులోనూ జరగని విధంగా, "లాయర్లు ఆయన ఎదుటికిపోయి ..... వాయిదాలు కోరుకున్నారు. వారి కోరికల్ని మాజిస్ట్రేట్ మంజూరు చేసేస్తున్న సమయంలో బెంచి క్లర్క్ వాటిని నమోదు చేసుకుంటున్నారు." ఇలా వాయిదాలు (సాక్షులు రాలేదనో, పార్టీలు రాలేదనో మాత్రం కాదు) అడగడం కేవలం హైకోర్టులో మాత్రమే న్యాయమూర్తి, ఆశీనుడవ్వగానే జరుగుతుంది. దాన్ని చూసికాబోలు రచయిత ఈ కథలో మేజిస్ట్రేట్ కోర్టు లేదా సబ్‌కోర్టుకు అన్వయించాడు. ఈ రెండు తరహాల కోర్టుల్లో మొదట 'కాల్‌వర్క్' చేపడతారు. అంటే అన్ని కేసులనూ పిల్చి వాయిదాలు ఇచ్చేవాటికి ఇచ్చి సాక్షులు వచ్చిన కేసులను పక్కన పెట్టి, తిరిగి వాటిని ఒకదాని వెంట ఒకటిగా పిల్చి విచారిస్తారు.

మాజిస్ట్రేట్ ప్రమోషన్‌పై నేరుగా జిల్లా జడ్జి కాలేడనీ, మధ్యలో సబ్‌జడ్జి అయ్యి తీరుననీ రచయితకు గ్రహింపులేదు. అందుకే "అంతసేపూ మాజిస్ట్రేట్.... సంకేతమిస్తున్నాయి". అని రచయిత ఏ సంకోచం లేకుండా రాయగలిగాడు. ఈ కథ కొన్ని అసంబద్ధ ప్రతిపాదనల మీద ఆధారపడింది. మొదటిది: రాజ్యంలో న్యాయస్థానాలు భాగం కాదు. రెండవది: క్రిమినల్‌కేసుల్లో న్యాయ విచారణ ప్రక్రియతో రచయితకు పెద్దగా పరిచయంలేదు. కాబట్టే ఈ కేసులో వందమంది సాక్షులను ప్రాసిక్యూషన్ విచారించింది అని రాశారు. వందమంది సాక్షులను ఆరు హత్యలు జరిగిన కారంచేడు కేసులో కూడా ప్రాసిక్యూషన్ విచారించలేదు. ఇంత 'సిల్లీ' కేసులో పదిమందికి పైన సాక్షులను ప్రవేశపెట్టడానికి ఏ ప్రాసిక్యూటర్ ఒప్పుకోడు. అథవా ఒప్పుకున్నా న్యాయస్థానాలు ఒప్పుకొనే ప్రసక్తి లేదు. ఒక అధికారి తన విధి నిర్వహణలో చేసిన పని నేరమనే ఆరోపణ వస్తే సెక్షన్ 197 క్రిమినల్ ప్రొసీజర్ కోడ్ కింద ప్రభుత్వ అనుమతి అవసరం ఈ కేసులో కోణం.

ఈ కథలో కోర్టురూంకు సినిమాటిక్ టచ్ ఉంది. వాస్తవానికి అతిదూరంలో నేర విచారణా ప్రక్రియనడుస్తుంది. అమలులో ఉన్న చట్టాలకు దీనికి ఏ సంబంధం లేదు. రచయిత పూర్తిగా కాల్పనిక ప్రదేశాన్ని, కల్పిత న్యాయశాస్త్రాన్ని సృష్టించివుంటే ఏ పేచీ పెద్దగా ఉండేదికాదు గానీ మోహన్ చందాపై ఉన్న క్రిమినల్ కేసులో విచారణా ప్రక్రియ ఎలా ఉంటుందో కోర్టుకేసులో దేని తర్వాత

ఏది జరుగుతుందో రచయితకు అవగాహనా రాహిత్యం సంపూర్ణంగా ఉంది.

ప్రశ్నభూమి కథను రెండు అంశాల ఆధారంగా వినిర్మాణం చేయవచ్చు. ఏ రెండు అంశాల ఆధారంగానే కథ నిర్మితమైందో ఆ రెండు ఏ అంశాల ఆధారంగా ప్రశ్నభూమి కథ నిర్మితమైందో అవే అంశాల ఆధారంగా దాన్ని వినిర్మాణం చేయవచ్చు. ఒకటి: రాజపురుషుడు. రెండు: సత్యం అనిర్ధారితం.

రాజ్యం పురుషుడైతే, న్యాయవ్యసవ్థ కూడా పురుషుడే. ఈ విషయాన్ని కథకుడు చెప్పి మరీ విస్మరించాడు. పురుషుడైన న్యాయస్థానం సత్యం (తనకు తోచిన ఒకానొక సత్యం) నిర్ధారించే క్రమంలో నిర్ణయించుకున్న పద్ధతిలో మోహన చంద్ర కథనాన్ని అనుమతిస్తుందా?

ముద్దాయి మోహన్ చంద్ర సుదీర్ఘ కథనం న్యాయస్థానంలో చెప్పబడింది. న్యాయస్థానాన్ని రచయిత భూమితో పోల్చాడు. భూమి స్త్రీ. మోహన్ చంద్ర తాను దేన్నైతే ఒక మనిషిగా విసర్జించదల్చాడో, దాన్నే ముద్దాయిగా ఆశ్రయించాడు. మనిషిగా రాజ్యపురుషుడి కుడ్యంగా పలు ప్రాంతాల్లోకి అంగప్రవేశం చేసి లైంగికానుభూతిని పొందానని చెప్పిన మోహన్ చంద్ర సుదీర్ఘమైన కథనం అనే కుడ్యం ద్వారా ప్రశ్నభూమిలో అంగప్రవేశం చేశాడు. “ఆ విషయం మీద నేను చెప్పవలసింది ఇంతకు ముందే పబ్లిక్ ప్రాసిక్యూటర్‌గారి క్రాస్ ఎగ్జామినేషన్‌ను భరించి చెప్పాను.”

**2002 - రాతప్రతి**

## 17. న్యాయశాఖ అటెండర్ల 'ఇంటిపని' బాధలు తీరేనా?

న్యాయశాఖలో పనిచేస్తున్న నాల్గవ తరగతి ఉద్యోగుల బాధలు చూస్తే 'నేతి బీరకాయలో నెయ్యి' సామెత గుర్తొస్తుంది. న్యాయాధికారులు అటెండర్ల చేత 'ఇంటి పని' చేయించుకునే దురాచారాన్ని రూపుమాపేందుకు హైకోర్టు న్యాయమూర్తి జస్టిస్ బి.ఎస్.ఎ. స్వామి ఇటీవల గళం విప్పారు.

రాష్ట్ర జ్యుడీషియల్ అకాడమీ ఆధ్వర్యంలో ఫిబ్రవరి మూడవ వారంలో గుంటూర్లో 160 మంది న్యాయాధికారులు పాల్గొన్న నాలుగు జిల్లాల జోనల్ సమావేశంలో జస్టిస్ స్వామి మాట్లాడుతూ ఇంటి పనులకు అటెండర్లను వినియోగించడాన్ని మానవలసిందిగా న్యాయమూర్తులకు హితవు చెప్పారు. (హిందూ దినపత్రిక ఫిబ్రవరి 19 చూడండి). ఇంటి పనులకు అటెండర్ల వినియోగంపై రాష్ట్ర హైకోర్టుకు ఫిర్యాదులు అందుతున్నాయని ఆయన ఆవేదన వ్యక్తం చేశారు. న్యాయాధికారుల విధి నిర్వహణలో సహకరించడం కోసమే క్రిందిస్థాయి ఉద్యోగులు ఉన్నారని గుర్తించవలసిందిగా న్యాయాధికారులను ఆయన కోరారు. ఒక ఫిర్యాదును ఆయన ఉదాహరణగా చెప్పారు - ఒక న్యాయమూర్తి భార్య అటెండర్ చేత రిఫ్రిజిరేటర్ శుభ్రం చేయిస్తుండగా అది దెబ్బతిందట. న్యాయమూర్తి ఆ అటెండర్‌ను తనకు నష్ట పరిహారం చెల్లించవలసిందిగా వత్తిడి చేశాడట. ఇలాంటివి హాస్యాస్పదంగా తోస్తాయని చెప్తూ ఇకపై అలాంటి ఫిర్యాదులు హైకోర్టుకు రాకుండా ప్రవర్తించుకోవలసిందిగా జస్టిస్ స్వామి న్యాయమూర్తులను కోరారు.

న్యాయాధికారుల ఇంటి పనులకు తమను వాడుకోరాదని న్యాయశాఖలోని నాల్గవ తరగతి ఉద్యోగులు చాలాకాలంగా కోరుతున్నారు. పోలీసు శాఖలో

ఆర్డర్లీ వ్యవస్థను రద్దు చేయించుకో గలిగినప్పటికీ దానితో పోల్చదగిన 'ఇంటిపని' న్యాయశాఖలోని చిరుద్యోగులను దశాబ్దాలుగా వెంటాడుతూనేవుంది. యాభై మూడేళ్ళ క్రితం 1948లో మద్రాసు రాష్ట్ర ప్రభుత్వం ఆఫీసు ఫ్యూన్‌లను ఇంటిపనుల కోసం వినియోగించే అలవాటును ఒక జి.వో. (జి.వో.ఎం.ఎస్. నెం.1364) లో నిరసించింది. దాన్ని రూపుమాపేందుకు ఆదేశాలిచ్చింది. అయినప్పటికీ అధికారులు ఆ పని మానుకోలేదన్న సంగతి గ్రహించడానికి ప్రభుత్వానికి పుష్కర కాలం పట్టింది. మన రాష్ట్ర ప్రభుత్వం 1962 డిసెంబర్‌లో జారీచేసిన మెమోలో (నెం.2604/62-2, జిఎడి-సెక్షన్-సి డిపార్ట్‌మెంట్, తేది 28.12.62) అధికారులు తమ ఇంటిపనుల కోసం ఫ్యూన్‌లను వినియోగించడాన్ని తక్షణం నిలిపి వేయాలని ఆదేశించింది. వంటపాత్రలు శుభ్రం చేయించడం, నీళ్ళు మోయించడం, బట్టలుతికించడం, ఇంటివద్ద రాత్రులు కాపలాగా ఉపయోగించడం లాంటి పనులను అధికారులు ఫ్యూన్‌లచే చేయిస్తున్నట్టు ప్రభుత్వ దృష్టికి వచ్చినట్టుగా రాష్ట్ర ప్రభుత్వ మెమో పేర్కొంది. ఇకపై అలాంటివి చేయించే అధికార్లపై క్రమశిక్షణా చర్యలు గైకొనాల్సి వస్తుందని మెమో హెచ్చరించింది. ఈ మెమో న్యాయశాఖకు కూడా వర్తిస్తుంది. న్యాయ మూర్తులకు మెమో కాపీలు పంపారు కూడా. కానీ ఆ మెమో పూర్తిగా అమలయిన దాఖలా లేదు.

ఆ తర్వాత 1971లో జారీచేసిన మరో జి.వో (జి.వో.ఎం.ఎస్. నెం.1059, జి.ఎ.డి, తేది 11.11.1971) ద్వారా అధికారుల ఇళ్ళవద్ద పనిచేసే అటెండర్ల సంఖ్యను రాష్ట్ర ప్రభుత్వం క్రమేపీ తగ్గించే ప్రయత్నం చేసింది. ఈ జివో పరిధినుంచి న్యాయమూర్తులను మినహాయించాలనీ, న్యాయాధికారుల ఇళ్ళవద్ద అటెండర్లను ఉంచుకునే సదుపాయం కల్పించాలని రాష్ట్ర హైకోర్టు రిజిస్ట్రార్ ప్రభుత్వాన్ని కోరారు. దానికి హైకోర్టు చూపిన కారణాలు ఇవి: న్యాయాధికారులకు ప్రజలతో సంసర్గం ఉండదు; వారు కోర్టులకు, నివాసగృహాలకు పరిమితమౌతారు; వారి ఇళ్ళవద్ద విలువైన కోర్టు రికార్డులు, తీర్పు కాగితాలు ఉంటాయి; వారు పలు రకాల నేరస్తులను విచారిస్తుంటారు; ఈ పరిస్థితులలో న్యాయమూర్తుల ఇళ్ళలోకి ఎవరు పడితే వారు వెళ్ళడాన్ని నిరోధించేందుకు ఒక అటెండరైనా వారి ఇళ్ళవద్ద విధినిర్వహణలో ఉండాలి. ఈ కారణాలు

సమంజసంగా తోచిన రాష్ట్ర ప్రభుత్వం 1973లో మరో జివో (జి.వో.ఎం.ఎస్.నెం.219, జిఎడి, తేది 5.5.1973) జారీ చేసి న్యాయమూర్తులను జివో ఎం.ఎస్. నెం.1059 పరిధినుంచి తప్పించింది. న్యాయమూర్తుల ఇళ్ళవద్ద రికార్డుల కాపలాకు మాత్రమే ఉపయోగించుకోవాల్సిన అటెండర్లను న్యాయాధికారులు పలువురు ఇంటిపనికి ఉపయోగించుకుంటుండడంతో నాల్గవ తరగతి ఉద్యోగుల బాధలు అలానే మిగిలిపోయాయి. ఇంటిముందు కళ్ళాపు చల్లి ముగ్గులు వేయించడం దగ్గర్నుంచి లెట్రిన్ శుభ్రపర్చడం దాకా అటెండర్లను వినియోగిస్తున్నారని నాల్గవ తరగతి ఉద్యోగుల సంఘం గతంలో హైకోర్టుకు ఫిర్యాదు చేసింది.

బాధలు భరించలేని అటెండర్లు 1992 మొదట్లో ధిక్కార స్వరం వినిపించారు. తాము కోర్టులలో తప్ప న్యాయాధికారుల ఇళ్ళవద్ద పనిచేయబోమని షుమారు 60 రోజులపాటు కోర్టు విధులకు మాత్రమే హాజరై నిరసన వ్యక్తం చేశారు. (ఆ కాలంలో వారిని విధులకు హాజరు కానట్టుగా పరిగణించి జీతంలో కోత విధించారు. తర్వాత దయతలచి ఆ కాలానికి జీతం డబ్బులిచ్చారు). ఈ నిరసనను రాష్ట్ర హైకోర్టు పరిగణనలోకి తీసుకోక తప్పలేదు.

పరిస్థితిని సమీక్షించిన హైకోర్టు 1992 ఫిబ్రవరి 24న ఒక సర్క్యులర్ (ఆర్వోసి నెం.116-92-సి1) జారీచేసింది. నాల్గవ తరగతి ఉద్యోగులు (అటెండర్లు, ప్రాసెస్ సర్వర్లు) చట్ట ప్రకారం చేయాల్సిన పదకొండు విధులను నిర్వచించింది. వాటిలో ఒకటి - రాత్రిపూట న్యాయాధికారుల ఇళ్ళవద్ద ప్రభుత్వ ఆస్థి - అంటే కేసు రికార్డులు, పుస్తకాలు, వగైరాలకు - కాపలా కాయడం. మరొకటి, న్యాయమూర్తుల ఆఫీసు పెట్టెలను, పుస్తకాలను, రికార్డులను న్యాయమూర్తుల ఇళ్ళకు, తిరిగి కోర్టుకు రవాణా చేయడం. ఇవి తప్ప న్యాయమూర్తుల ఇళ్ళ వద్ద ఎలాంటి పనులనూ చట్టబద్ధ విధులుగా సర్క్యులర్లో పేర్కొనలేదు. రాష్ట్రంలోని న్యాయాధికారులందరికీ ఈ సర్క్యులర్ను రాష్ట్ర హైకోర్టు పంపింది.

అయినప్పటికీ పరిస్థితిలో పెద్దగా మార్పు రాలేదని జస్టిస్ స్వామి ప్రసంగం తెలియజేస్తోంది. న్యాయాధికారుల బాధలు భరించలేక నాల్గవ తరగతి ఉద్యోగులు ఆత్మహత్యలు చేసుకున్నారన్న ఆరోపణలు కూడా వెలువడ్డాయి.

రంగారెడ్డి జిల్లా వికారాబాద్‌లో 1997 నవంబర్‌లో ఒక అటెండర్ కోర్టు ఆవరణలో చెట్టుకు ఉరేసుకుని ఆత్మహత్య చేసుకోవడానికి అక్కడి న్యాయమూర్తి వేధింపులే కారణమని న్యాయశాఖ నాల్గవతరగతి ఉద్యోగుల సంఘం అప్పట్లో ఆరోపించింది. గుంటూరు జిల్లాలో బూట్లు తుడిపిస్తున్న ఒక సబార్డినేట్ జడ్జి వేధింపులు భరించలేక ట్రాన్స్‌ఫర్ కోసం ఒక అటెండర్ చేతబడి దృశ్యాన్ని న్యాయమూర్తి ఇంట్లో సృష్టించానని పోలీసుల దగ్గర ఒప్పుకున్నట్టు రికార్డులున్నాయి.

నాల్గవ తరగతి ఉద్యోగులతో ఇంటిపనులు చేయించుకునే అధికారం తమకుందని పలువురు న్యాయమూర్తులు భావిస్తున్నారు. ఆ పనులు చేయ నిరాకరించిన సందర్భాల్లో అధికారికంగా షోకాజ్ నోటీసులు, మెమోలు ఇచ్చిన సందర్భాలు, క్రమశిక్షణా ఎంక్వైరీలు జరిపించిన సందర్భాలు ఉన్నాయి. మొక్కలకు నీళ్ళు పోయకపోతే, సినిమా టిక్కెట్లు తేవడానికి నిరాకరిస్తే, నీళ్ళు పట్టకపోతే, పక్క వేయ నిరాకరిస్తే మెమోలిచ్చి ఎంక్వైరీలు జరిపించిన ఘటనలున్నాయి. అటెండర్లను నీళ్ళు పట్టడానికి, పిల్లలను స్కూలుకు తీసుకెళ్ళి తిరిగి తీసుకురావడానికి, తమ పిల్లలకు మీల్స్ క్యారియర్‌ను స్కూలుకు తీసుకెళ్ళడానికి వినియోగిస్తామని ప్రమాణ పూర్వకంగా సాక్ష్యం చెప్పిన న్యాయాధికార్లున్నారు.

చట్ట పరిభాషలో చెప్పాలంటే జివోల ద్వారా, హైకోర్టు ఉత్తర్వుల ద్వారా రూపొందిన చట్టాల్ని కొందరు న్యాయమూర్తులు ధిక్కరిస్తూ అటెండర్లతో ఇంటి పనులు చేయించుకుంటున్నారు. అలా ధిక్కరించడం రాజ్యాంగంలోని 21వ అధికరణం కింద జీవించే హక్కుకు విరుద్ధమైనది. చట్టబద్ధ పాలనను నిలబెట్టాల్సిన న్యాయవ్యవస్థలో పరిస్థితి ఇదైతే, న్యాయం కోసం బాధితులు ఎవరికి మొరపెట్టుకోవాలి.

న్యాయశాఖ నాల్గవ తరగతి ఉద్యోగుల సంఘం 1997లో హైకోర్టులో రిట్ దాఖలు చేసింది. నాల్గవ తరగతి ఉద్యోగులతో ఇంటి పనులు చేయించుకోవడం చట్ట విరుద్ధమనీ, రాజ్యాంగ ధిక్కరణ అనీ ప్రకటించి వారి విధుల గురించిన స్పష్టమైన ఉత్తర్వులు జారీ చేయవలసిందిగా రిట్ పిటీషన్ హైకోర్టును అభ్యర్థించింది. జస్టిస్ రెడ్డపరెడ్డి, జస్టిస్ ఎ హనుమంతులతో కూడిన

డివిజన్ బెంచ్ రిట్ పిటీషన్‌ను అనూహ్యంగా డిస్‌మిస్ చేసింది. జిల్లా స్థాయి న్యాయాధికారుల దృష్టికి ఈ విషయాన్ని తేకుండా నేరుగా హైకోర్టుకు వచ్చారని పిటీషన్‌ను డిస్‌మిస్ చేస్తున్నామని న్యాయమూర్తులు ప్రకటించారు. 1992లో జారీ అయిన హైకోర్టు సర్క్యులర్‌ను జిల్లా న్యాయాధికారులు అమలు పరుస్తారనడంలో తమకు సందేహాలు లేవని వారు పేర్కొన్నారు.

మరో ఐదేళ్ళ తర్వాత జస్టిస్ బి.ఎస్.ఎ. స్వామి గారి గుంటూరు ప్రసంగం పరిస్థితి తీవ్రతను తెలియచేస్తున్నది. జస్టిస్ స్వామిగారి హిత వచనాలను ఇప్పటికైనా న్యాయాధికారులు ఆలకిస్తారా? నాల్గవ తరగతి ఉద్యోగులను వారి మానవహక్కులననుభవించనిస్తారా? వారి బతుకులు భూస్వామి దగ్గర పాలేరు బ్రతుకులు కావని ప్రకటిస్తారా?

**ఫిబ్రవరి 19, 2002 - రాతప్రతి**

# 18. ఎన్‌కౌంటర్లు - చట్టం - ఆచరణ

ఎదురుకాల్పుల పేరిట పోలీసులు నక్సలైట్లను, వారి సానుభూతిపరులను, కొండొకచో పూర్తి అమాయకులను హతమార్చడం ఈ రాష్ట్రానికి కొత్త కాదు. ఎన్‌కౌంటర్లంటే అసలు అర్థం మరుగునపడిపోయి 'బూటకపు ఎదురుకాల్పుల ఘటనను సృష్టించి నిలువునా కాల్చిచంపడం' అనే అర్థం స్థిరపడింది. 'నిన్ను ఎన్‌కౌంటర్ చేసి చంపుతాను' అనే పోలీసు బెదిరింపు సర్వ సాధారణమైంది. కానీ, నక్సలైట్ ఉద్యమానికి పరిమితమైన ఈ ఎన్‌కౌంటర్లను ఇతర కేసుల్లో నిందితులకు కూడా ఇటీవల కొందరు పోలీసు అధికార్లు విస్తరిస్తున్నారు. చిత్తూరు జిల్లాలో సీరియల్ హంతకులు, రంగారెడ్డి జిల్లాలో వ్యవసాయం ఫాంలలో దోపిడీ కేసుల్లో నిందితులు, కర్నూలు జిల్లాలో 'కిరాయి హంతకులు' ఎన్‌కౌంటర్ మరణాల పాలయ్యారు. ఇదివరలో అధికారికంగా అరెస్టు ప్రకటించాక, కోర్టులో హాజరు పర్చాక ముద్దాయి ప్రాణాలకున్న భరోసా కూడా ఇవాళ కరువైంది. చిత్తూరు, పశ్చిమగోదావరి, రంగారెడ్డి, కర్నూలు, ఇటీవల గుంటూరు, విజయవాడలలో జరిగిన ఎన్‌కౌంటర్లు దీన్ని నిరూపిస్తున్నాయి. సాధారణ హత్య కేసులో కోర్టు కస్టడీలో ఉన్న నిందితుడిని సైతం విజయవాడ నగరం నడిబొడ్డున పోలీసు స్టేషన్‌లో కాల్చి చంపడంతో ఇక ఎన్‌కౌంటర్‌లు ఎంత వరకైనా వెళ్ళగలవని భయపడే రోజువచ్చింది.

ఎన్‌కౌంటర్ జరగ్గానే అది ఎంత బూటకమో నిరూపించేందుకు పత్రికలు, మానవ హక్కుల సంస్థలు పోలీసుల ఆత్మరక్షణ కథనంలో ఉన్న లొసుగులను, అసంబద్ధతను ఎత్తి చూపుతుంటాయి. ఎన్‌కౌంటర్ జరిగిన నేర స్థలంలో ఉన్న సాక్ష్యాధారాలను, శవాలపై గాయాలను, ముందుగా మృతుడిని పోలీసులు

నిర్బంధించిన వైనాన్ని ఇందుకు ఉపయోగించుకుంటాయి. ఎన్‌కౌంటర్ కట్టుకథ అనే సంగతి నిరూపణ చేయడం కాసేపు పక్కన బెట్టి, ఎన్‌కౌంటర్ అనంతరం పోలీసులు చట్టప్రకారం పెట్టాల్సిన కేసును, చేయాల్సిన దర్యాప్తును గురించి ఆలోచిద్దాం.

## మృతుడే ముద్దాయి!?

ప్రతి ఎన్‌కౌంటర్ తర్వాత సంబంధిత పోలీసు స్టేషన్‌లో ఒక క్రిమినల్ కేసు నమోదు చేస్తారు. చంపిన పోలీసులే ఫిర్యాదుదారులుగా, చనిపోయిన వాళ్ళే ముద్దాయిలుగా ప్రాథమిక సమాచార నివేదికలు (ఎఫ్.ఐ.ఆర్.లు) తయారౌతున్నాయి. చనిపోయిన వ్యక్తే తమపై హత్యాప్రయత్నం చేయగా ఆత్మరక్షణార్థం జరిపిన కాల్పుల్లో అతను మరణించాడని పోలీసు ఫిర్యాదులో ఉంటుంది. దాని ప్రకారం మృతుడిపైనే బారత శిక్షాస్మృతిలోని 307వ సెక్షన్ కింద హత్య ప్రయత్నం కేసు నమోదు చేసి ఎఫ్.ఐ.ఆర్‌లోని కాలం నెం.7లో 'ముద్దాయి' అని వున్న చోట 'ముద్దాయి మరియు హతుడు' అని చనిపోయిన వ్యక్తి పేరు రాస్తున్నారు. ముద్దాయి చనిపోయాడు కాబట్టి కేసులో నేరపరిశోధన జరపాల్సిన పనిలేదని కేసు ఫైలును మూసివేస్తున్నారు. జాతీయ మానవ హక్కుల కమీషన్ ముందు పౌరహక్కుల సంఘం దాఖలు చేసిన ఎన్‌కౌంటర్ కేసుల్లో మన రాష్ట్ర పోలీసు శాఖ తను ఈ పద్ధతినే అవలంబిస్తున్నట్టుగా అదే చట్ట ప్రకారం సరైన పద్ధతిగా పేర్కొంది.

అది చట్ట ప్రకారం సరైన పద్ధతి కాదని న్యాయశాస్త్రం చదువుకున్న వారికెవరికైనా ఇట్టే బోధపడుతుంది. భారత శిక్షాస్మృతిలోని సెక్షన్ 100 ప్రకారం ఆత్మరక్షణ కోసం ఎవరి ప్రాణాలనైనా తీయడం కొన్ని పరిస్థితులలో చేయవచ్చు. ఎదుటివారి ప్రాణాలకు ముప్పు ఏర్పడే దాడి జరిగినప్పుడు, లేదా దాడివల్ల తీవ్రగాయం ఏర్పడే అవకాశం ఉన్నప్పుడు, రేప్‌కు, కిడ్నాప్‌కు గురయ్యేటప్పుడు, బాహ్యప్రపంచంతో సంబంధాలు కోల్పోయేలా అక్రమంగా నిర్బంధించ బడినప్పుడు ఆత్మరక్షణార్థం అవసరమైతే ఎదుటి వారి ప్రాణాలు తీయవచ్చు. ప్రాణం తీయకుండా ప్రమాదాన్ని నివారించగలిగే అవకాశం ఉంటే ప్రాణం తీయరాదు. ఈ హక్కు పోలీసులకే కాదు పౌరులందరికీ, పౌరులుకానివారికీ

ఉంది. కాకపోతే క్రిమినల్ ప్రొసీజర్ కోడ్‌లోని 46వ సెక్షన్ ప్రకారం పోలీసులు ఒక వ్యక్తిని అరెస్టు చేసే సందర్భంలో తగు మోతాదులో బలప్రయోగం చేయాలనీ, ఆ వ్యక్తి మరణశిక్ష, యావజ్జీవశిక్షకు అర్హమైన నేరంలో నిందితుడై ఉంటే తప్ప ఆ బలప్రయుగం అతని ప్రాణాలు తీసేవరకూ పోరాదని ఆంక్షలున్నాయి. (ఎన్‌కౌంటర్ కేసుల్లో పోలీసులు ఆత్మరక్షణ తప్ప అరెస్టు ప్రయత్నం కథలు చెప్పడం లేదు కాబట్టి ఆ సెక్షన్‌ను కాసేపు పక్కన పెడదాం)

## ఆత్మరక్షణార్థం చంపితే కేసుండదా?

ఆత్మరక్షణార్థం మనిషిని కొట్టినా, చంపినా ఆ మాటకొస్తే భారత శిక్షాస్మృతిలో శిక్షనుండి మినహాయింపులు పొందేందుకు అవకాశమున్న ఏ ఇతర విషయాన్నైనా నిరూపించాల్సిన బాధ్యత అలాంటి మినహాయింపును కోరుతున్న వ్యక్తి మీద ఉంటుంది. పైగా అలాంటి మినహాయింపును కోర్టులో కేసు విచారణ సందర్భంలో మాత్రమే ముద్దాయి వాదించుకోవాలి. ముద్దాయి అలాంటి మినహాయింపు కవసరమైన పరిస్థితులు నిరూపించుకునే వరకూ అతను నేరస్తుడని కోర్టు భావించాలి. ఇది భారతీయ సాక్ష్యాధారాల చట్టంలోని సెక్షన్ 105 సారాంశం.

దీన్ని సరళమైన భాషలో ఎన్‌కౌంటర్‌కు అన్వయిస్తే, ఎన్‌కౌంటర్ పేరిట మనుషులను చంపిన పోలీసులపై హత్యకేసు నమోదు చేయాల్సి వుందనీ, ఆ పోలీసులను అరెస్టు చేసి, వారిపై నేరారోపణ చేయాలనీ, వారు హంతకులని కోర్టు మొదట భావించాలనీ అర్థం. తాము హంతకులం కామనీ, తాము ఆత్మరక్షణార్థం అదీ తమ ప్రాణాలకు ఏర్పడిన తక్షణ ప్రమాదాన్ని నివారించడం కోసమో లేక తీవ్రగాయాలకు లోనయ్యే ప్రమాదాన్నించి తప్పించుకోవడం కోసమో విధిలేక జరిపిన కాల్పుల్లో ఎదుటివ్యక్తి చనిపోయాడనీ నిరూపించుకోవాల్సిన బాధ్యత ముద్దాయిలైన పోలీసులపై ఉంటుందని కూడా ఆ సెక్షన్ అర్థం. అంటే ఆత్మరక్షణ అనేది కోర్టులో లభ్యమయ్యే డిఫెన్స్ తప్ప కేసులో నేరపరిశోధనా కాలంలో అందుబాటులో ఉంటే డిఫెన్స్ కాదని అర్థం చేసుకోవచ్చు.

కానీ, మన రాష్ట్రంలో మాత్రం ఎన్‌కౌంటర్ కేసులు నమోదౌతున్న తీరు దీనికి సరిగ్గా విరుద్ధం. హంతక పోలీసులే ఫిర్యాదు దారులు. హతులే ముద్దాయిలు. ముద్దాయిలు మరణించినందువల్ల కేసు ఫైలు మూసివేత. ఇలా చేయడం ఆనవాయితీ అయింది. ఎఫ్.ఐ.ఆర్. లోనే ఆత్మరక్షణ ఖాతా తెరిచి కేసులను విచారణకు రాకుండా పోలీసు స్టేషన్ స్థాయిలో ముగిస్తున్నారు.

## జాతీయ మానవ హక్కుల కమీషన్ వివరణ

జాతీయ మానవ హక్కుల కమీషన్ ఈ దురాచారాన్ని ఖండించింది. పౌరహక్కుల సంఘం తెలంగాణాలో పదేళ్ళ క్రితం జరిగిన ఐదు ఎన్‌కౌంటర్ మరణాలను కమీషన్ దృష్టికి తేగా 1996లో అప్పట్లో కమీషన్ ఛైర్మన్ జస్టిస్ రంగనాథ మిశ్రా రాష్ట్రంలో పర్యటించి సాక్ష్యాధారాలు సేకరించారు. (వరంగల్, నల్గొండలలో ఆయన సమక్షంలోనే పోలీసులు సాక్షులను బెదిరించడం, కమీషన్ ఎదుటే గలాటా సృష్టించి విచారణను భగ్నం చేసేందుకు యత్నించడం రాష్ట్ర ప్రజలకు గుర్తుండే వుంటుంది.) తర్వాత ఢిల్లీలోని కమీషన్ కార్యాలయంలో ఇరుపక్షాల వాదనలను కమీషన్ వినింది. ఎన్‌కౌంటర్ కేసుల్లో మృతులనే ముద్దాయిలుగా చూపడాన్ని కె.జి. కన్నబిరన్ తప్పుపట్టారు. ఈ విషయమై చట్టం ఏం చెప్తుందో సెలవియ్యమని కమీషన్ భారత సొలిసిటర్ జనరల్‌ను, రాష్ట్ర అడ్వకేట్ జనరల్‌ను కోరింది. వారిద్దరూ రాష్ట్ర పోలీసు దురాచారాన్ని చట్ట ప్రకారం సమర్థించలేకపోయారు. తర్వాత కమీషన్ తన నివేదికలో ఇలా పేర్కొంది.

"మృతుడినే ముద్దాయిగా పేర్కొని కేసు మూసివేయడాన్ని కన్నబిరన్ తీవ్రంగా సవాల్ చేశారు. అది చట్ట వ్యతిరేకమన్నారు. మేం సొలిసిటర్ జనరల్‌ను, ఆంధ్రప్రదేశ్ అడ్వకేట్ జనరల్‌ను ఈ పద్ధతి చట్టబద్ధమేనా? క్రిమినల్ న్యాయతత్వశాస్త్ర పరీక్షలో నెగ్గుతుందా?' అని అడిగాం. వారిద్దరూ దీన్ని చట్టబద్ధమేనని చెప్పలేకపోయారు. జరిగినవి నిజమైన ఎదురుకాల్పులేనని పోలీసులు చెప్తున్నది నిజమని అనుకున్నప్పటికీ, మృతులను ముద్దాయిలుగా చూపరాదు. ఎందుకంటే ఎక్కువ కేసుల్లో ప్రాథమిక సాక్ష్యాధారాలను బట్టి మృతులు ముద్దాయిలయ్యే పని ఏమీ చేయలేదు."

ఎన్‌కౌంటర్ కేసుల్లో చట్టప్రకారం ఏం చేయాలో కమీషన్ చెప్పింది.

"ఎన్‌కౌంటర్లో ఎవరి ప్రాణాన్నైనా తీశామని పోలీసు అధికారి పోలీసు స్టేషన్‌లో సమాచారం ఇచ్చినప్పుడు, ఆ పోలీసు అధికారి దాన్ని నమోదు చేశాక నేరం జరిగిందని అనుమానించాలి. దాన్ని పరిశోధించేందుకు ఉపక్రమించాలి. ఇలా కాకపోతే ఎన్‌కౌంటర్ పేరిట ఎవరినైనా పోలీసులు చంపి ఆత్మరక్షణార్థమో, లేదా సిఆర్‌పిసిలోని 46వ సెక్షన్ ప్రకారమో వ్యవహరించామని చెప్పి ఎలాంటి శిక్ష లేకుండా తప్పించుకునేందుకు అది లైసెన్స్ అవుతుంది. అన్యాయమైన, అసమంజసమైన, అహేతుకమైన ఈ పద్ధతి రాజ్యాంగంలోని 21వ అధికరణానికి లోబడి ఉందని చెప్పబూనుకోవడం సరికాదు."

## ముఖ్యమంత్రులకు కమీషన్ లేఖ

ఆ తర్వాత 1997 మార్చి 29న దేశంలోని అన్ని రాష్ట్రాల ముఖ్యమంత్రులకు అప్పటి కమీషన్ చైర్మన్ జస్టిస్ వెంకటాచలయ్య లేఖ రాశారు. ఎన్‌కౌంటర్ కేసుల్లో తాము సూచించిన విధంగా చట్టబద్ధమైన పద్ధతుల్లో కేసు నమోదు చేసి దర్యాప్తు జరిపించమని కోరారు. మృతుడినే ముద్దాయిగా చూపే పద్ధతికి స్వస్తిచెప్పి, మృతుని మరణానికి కారకులైన పోలీసు అధికారులపై విధిగా హత్యకేసు నమోదు చేసి నేరపరిశోధన జరిపించమని కూడా కోరారు. అన్ని ఎన్‌కౌంటర్ కేసులను రాష్ట్ర సిఐడికి అప్పజెప్పమన్నారు. తమ రాష్ట్రాలలో పోలీసు స్టేషన్లకు ఈ మేరకు రాష్ట్ర డిజిపిలు ఆదేశాలు జారీచేసేలా చూడమని ముఖ్యమంత్రులను కోరారు.

## పాత పద్ధతే కొనసాగింపు

కాగా, ఇతర రాష్ట్రాల సంగతి ఎలా ఉన్నప్పటికీ, మన రాష్ట్రంలో మాత్రం జాతీయ మానవ హక్కుల కమీషన్ సూచనలను పాటించిన దాఖలా లేదు. పాత పద్ధతే అంటే 'మృతుడే ముద్దాయి' - 'హంతకుడే ఫిర్యాది' అన్న పద్ధతిని కొనసాగిస్తున్నారు. పైగా రాష్ట్రంలో ఎన్‌కౌంటర్లు ఎక్కువగా జరుగుతున్నాయి. కాబట్టి ప్రతి కేసులో సిఐడి దర్యాప్తు అసాధ్యం కనుక ఏ జిల్లాలో ఎన్‌కౌంటర్ జరిగితే పక్క జిల్లాలోని డియస్‌పి, ఎయస్‌పి కాడర్ అధికార్లతో దర్యాప్తు జరిపించేందుకు అంగీకరించమని కమీషన్‌ను రాష్ట్ర పోలీసు శాఖ కోరింది.

కమీషన్ అందుకు అనుమతించింది. ఫలితంగా 1999 ఆగస్టు 30న రాష్ట్ర డిజిపి జారీచేసిన సర్క్యులర్ మెమొరాండంలో పక్క జిల్లా డియస్‌పిలతో ఎన్‌కౌంటర్ కేసుల్లో దర్యాప్తు జరిపించమని డిఐజిలను కోరారు. కానీ, మృతులపై కాక హంతకులపై కేసు నమోదు చేయమని మాత్రం ఆ సర్క్యులర్‌లో చెప్పలేదు.

ఇప్పుడు అక్కడక్కడా పక్కజిల్లా డియస్‌పిలతో కేసు పరిశోధన చేయించడం జరుగుతోంది. అదీ ఒక బూటకపు తంతుగానే. కానీ మృతులనే ముద్దాయిలుగా చూసే పద్ధతికి మాత్రం పోలీసు శాఖ స్వస్తి పలకలేదు.

## బూటకపు దర్యాప్తులకు స్వస్తి పలికేదెన్నడు?

జాతీయ మానవ హక్కుల కమీషన్ చట్టాలకు భాష్యాన్ని మాత్రం సక్రమంగానే చెప్పింది. కానీ ఎన్‌కౌంటర్ కేసుల్లో రాష్ట్ర సి.ఐ.డి. తో దర్యాప్తు చేయించేందుకు సిఫార్సు చేయడం ఏమంత పనికివచ్చే ప్రతిపాదన కాదు. ఇక పక్క జిల్లా డియస్పీ దర్యాప్తు మరీ పనికిమాలినది. సి.ఐ.డి.కి గానీ, పక్క జిల్లా డియస్పీలకు గానీ స్వతంత్ర ప్రతిపత్తి లేకపోగా సి.ఐ.డి. పోలీసు అధికార్లుగానీ, డియస్పీలుగానీ ఎన్‌కౌంటర్ కేసుల్లో నిందితులుగా ఉండే అవకాశం మెండుగా ఉంది. నేను ఎన్‌కౌంటర్ చేస్తే నువ్వు దర్యాప్తు చెయ్యి, నువ్వు ఎన్‌కౌంటర్ చేస్తే నేను దర్యాప్తు చేస్తాను అన్న చందంగా దర్యాప్తులు బూటకంగా మారతాయి. ఇప్పటివరకూ ఏ ఒక్క ఎన్‌కౌంటర్ కేసులో కూడా హత్యకేసు నమోదు చేయడంగానీ, దర్యాప్తు అనంతరం పోలీసులను ముద్దాయిలుగా చూపుతూ ఛార్జిషీటు దాఖలు చేయడంగానీ జరగలేదు. సి.ఐ.డి.కి బదులు సి.బి.ఐ. దర్యాప్తుకు ఆదేశిస్తే కొంతమేలు జరిగే అవకాశం ఉంది. మన రాష్ట్ర హైకోర్టు 1995 ఆగస్టులో మధూసూదనరాజ్ యాదవ్ ఎన్‌కౌంటర్ మృతి కేసులో మరణానికి కారకులైన పోలీసు అధికార్లపై కల్పబుల్ హోమిసైడ్ కేసు నమోదు చేయాలనీ, సి.బి.ఐ.కి కేసును అప్పగించాలని తీర్పునిచ్చింది. (ఆ తీర్పును రాష్ట్ర ప్రభుత్వం సుప్రీంకోర్టులో సవాలు చేసి స్టే ఉత్తర్వులు పొందింది).

బూటకపు ఎన్‌కౌంటర్లను నేరుగా నిరోధించలేకపోయినా, వాటిపై బూటకపు కేసులను, బూటకపు దర్యాప్తులను జాతీయ మానవ హక్కుల కమీషన్, న్యాయవ్యవస్థ ఆపగలిగితే బూటకపు ఎన్‌కౌంటర్లకు కళ్ళెం వేసినట్లవుతుంది.

మేజిస్ట్రేట్‌లు కూడా తమవద్ద దాఖలైన ఎఫ్ఐఆర్‌లను ఐపిసి 302 సెక్షన్ కింద స్వీకరించి ఎన్‌కౌంటర్‌లో పాల్గొన్న పోలీసు అధికారులకు అరెస్టు వారెంట్లు జారీచేయవచ్చు. భారతీయ సాక్ష్యాధారాల చట్టంలోని 105వ సెక్షన్‌ను అనుసరించి కేసును సెషన్స్ న్యాయస్థానానికి పంపవచ్చు.

చట్టాన్ని మోసపుచ్చి తమ పని తాము చేసుకుపోలేమని పోలీసు అధికార్లలో నాటుకునేలా చట్టసభ, న్యాయవ్యవస్థ ప్రవర్తించగలిగితే చాలు బూటకపు ఎన్‌కౌంటర్ శకం ముగిసే అవకాశం ఉంది. ఆ మనోసంకల్పం చట్టసభకు, న్యాయవ్యవస్థకు ఏర్పడేలా ప్రజాస్వామిక వాదులు కృషి చేయడం తక్షణావసరం.

**జులై 22, 2002 - రాతప్రతి**

# 19. ఎన్‌కౌంటర్ అవుతున్న చట్టాలు, మృతుడే ముద్దాయి హంతకుడే ఫిర్యాది

ఎన్‌కౌంటర్ల విషయంలో కొద్దిరోజుల క్రితం నాటకీయ పరిణామాలు జరిగి పోలీసు యంత్రాంగానికి నోట్లో వెలక్కాయ పడినట్టయింది. కస్టడీలో ఉన్న కొందరు దొంగలను ఎన్‌కౌంటర్ పేరిట కాల్చిచంపబోతున్నారన్న సమాచారం ముందుగా మీడియాకు తెలియడంతో పత్రికా విలేకరులు, టి.వి. ఛానళ్ళ ప్రతినిధులు పోలీసుల కంటే ముందు గానే 'ఎన్‌కౌంటర్' ప్రదేశానికి చేరుకోవడంతో పోలీసులు బిక్కచచ్చిపోయారు. తమ అదుపులో ఉన్న నిందితులను కోర్టులో హాజరుపర్చక తప్పలేదు. ఆ తరువాత ఆ నిందితులకు ఎలాగూ ఎన్‌కౌంటర్ తప్పలేదు. అది వేరే సంగతి. ఎదురుకాల్పుల పేరిట పోలీసులు నక్సలైట్లను, వారి సానుభూతి పరులను, ఏ సంబంధం లేనివారిని హతమార్చడం మనకు కొత్తకాదు. ఎన్‌కౌంటర్ జరగ్గానే అది ఎంత బూటకమో నిరూపించేందుకు పత్రికలు, మానవ హక్కుల సంస్థలు ప్రయత్నిస్తుంటాయి. ఎన్‌కౌంటర్ కట్టుకథలని నిరూపించే వైనం కాసేపు పక్కనపెట్టి, ఎన్‌కౌంటర్ నిజమైనప్పటికీ పోలీసులు చట్టప్రకారం నమోదు చేయవలసిన కేసును, చేయాల్సిన దర్యాప్తు గురించి ఆలోచిద్దాం.

ప్రతి ఎన్‌కౌంటర్ తర్వాత పోలీసుస్టేషన్లో ఒక క్రిమినల్ కేసు నమోదు చేస్తారు. చంపిన పోలీసులే ఫిర్యాదుదారులుగా చనిపోయినవాళ్ళే ముద్దాయిలుగా ప్రాథమిక సమాచార నివేదిక (ఎఫ్.ఐ.ఆర్.)లు తయారౌతున్నాయి. చనిపోయిన వాళ్ళే తమపై హత్యాప్రయత్నం చేయగా, ఆత్మరక్షణార్థం జరిపిన కాల్పుల్లో మృతులు మరణించారని పోలీసుల ఫిర్యాదులో పేర్కొంటారు. దాని ప్రకారం మృతుడి పైనే భారత శిక్షాస్మృతిలోని 307వ సెక్షన్ ప్రకారం హత్యాప్రయత్నం

కేసు నమోదు చేస్తున్నారు. ఎఫ్.ఐ.ఆర్. 7వ కాలమ్‌లో 'ముద్దాయి' అని ఉన్న చోట 'ముద్దాయి మరియు మృతుడు' అని చేర్చి మృతుడి పేరు రాస్తున్నారు. ముద్దాయి చనిపోయాడు కాబట్టి కేసులో నేరపరిశోధన జరపవలసిన పనిలేదని కేసు ఫైలు మూసివేస్తున్నారు. న్యాయశాస్త్రం చదువుకున్న వారికి ఇలా చేయడం చట్టం ఆమోదించిన పద్ధతి కాదని ఇట్టే బోధపడుతుంది.

భారత శిక్షాస్మృతిలోని సెక్షన్ 100 తనను రక్షించుకునేందుకు వ్యక్తికున్న ఆత్మరక్షణ హక్కు దాడిచేసిన వారి ప్రాణాలను తీసేందుకు ఏ పరిస్థితుల్లో అనుమతిస్తుందో వివరిస్తుంది. ప్రాణహాని, తీవ్రగాయం కలిగే అవకాశం, రేప్, కిడ్నాప్, బాహ్యప్రపంచంతో సంబంధాలు లేకుండా అక్రమ నిర్బంధానికి గురైనప్పుడు ఆత్మరక్షణార్థం దుండగుల ప్రాణాలు తీయవచ్చు. ప్రాణం తీయకుండా ప్రమాదాన్ని నివారించే అవకాశం ఉంటే ప్రాణం తీయరాదు. ఈ ఆత్మరక్షణ హక్కు పోలీసులకే కాదు పౌరులకూ, పౌరులు కానివారికి కూడా ఉంది. కాకపోతే క్రిమినల్ ప్రొసీజర్ కోడ్‌లోని 46వ సెక్షన్ ప్రకారం పోలీసులకు మరికొన్ని అధికారాలున్నాయి. ఒక వ్యక్తిని అరెస్టు చేసే సందర్భంలో అతను/ఆమె పారిపోయే ప్రయత్నం చేస్తే తగు మోతాదులో వారు బలప్రయోగం చేయవచ్చు. ఆ వ్యక్తిపై మరణశిక్ష, యావజ్జీవ కారాగారశిక్షకు అర్హమైన నేరం చేసినట్టుగా నిందారోపణ ఉంటే తప్ప ఆ బలప్రయోగం ఆ వ్యక్తి ప్రాణాలు తీసేవరకూ పోరాదని ఆంక్షలున్నాయి. తగు మోతాదులో మాత్రమే అప్పుడైనా బలప్రయోగం చేయాలే తప్ప నిలువునా కాల్చి చంపే అధికారం పోలీసులకు ధారాదత్తం చేయబడలేదు.

## ఆత్మరక్షణార్థం చంపితే కేసుండదా?

ఆత్మరక్షణార్థం మనిషిని కొట్టినా, చంపినా - ఆ మాటకొస్తే భారత శిక్షాస్మృతిలో శిక్షనుండి మినహాయింపులు పొందేందుకు అవకాశమున్న ఏ ఇతర విషయాన్నైనా - నిరూపించాల్సిన బాధ్యత అలాంటి మినహాయింపును కోరుతున్న వ్యక్తిపై ఉంటుంది. పైగా అలాంటి మినహాయింపును కోర్టులో కేసు విచారణ సందర్భంలో మాత్రమే ముద్దాయి కోరుకునే వీలుంటుంది. మినహాయింపునిచ్చే పరిస్థితులను ముద్దాయే నిరూపించుకోవాలి. అలా నిరూపించుకునే వరకూ అతను నేరస్తుడని కోర్టు భావించాలి. ఇది భారతీయ సాక్ష్యాధారాల చట్టంలోని

సెక్షన్ 105 సారాంశం. దీన్ని సరళమైన భాషలో ఎన్‌కౌంటర్లకు అన్వయిస్తే - ఎన్‌కౌంటర్ పేరిట మనుషులను చంపిన పోలీసులపై హత్య కేసు నమోదు చేయాల్సి వుంటుందని చెప్పవచ్చు. వారిని అరెస్టు చేసి నేరారోపణ చేయాలనీ, వారు హంతకులని కోర్టు భావించాలనీ అర్థం. తాము హంతకులం కామనీ, ఆత్మరక్షణార్థం, అదీ తమ ప్రాణాలకు ఏర్పడిన తక్షణ ప్రమాదాన్ని నివారించడం కోసం లేదా తీవ్రగాయాల నుంచి రక్షించుకోవడం కోసం విధిలేక కాల్పులు జరిపామనీ నిరూపించుకోవాల్సిన బాధ్యత ముద్దాయిలైన పోలీసులపై ఉంటుందని సెక్షన్ 105 ప్రకారం చెప్పవచ్చు. అంటే ఆత్మరక్షణ అనేది కోర్టులో ముద్దాయికి లభ్యమయ్యే డిఫెన్స్ తప్ప కేసులో నేర పరిశోధనా కాలంలో అందుబాటులో ఉండే డిఫెన్స్ కాదు. కానీ ఎన్‌కౌంటర్ కేసులు నమోదౌతున్న తీరు దీనికి సరిగ్గా విరుద్ధం. ఎన్‌కౌంటర్ మరణాలకు కారకులైన పోలీసులే ఫిర్యాదు దారులు, హతులే ముద్దాయిలుగా కేసు నమోదు చేయడం, ముద్దాయి మరణించినందువల్ల కేసు ఫైలును మూసివేయడం ఇక్కడ ఆనవాయితీ అయింది. జాతీయ మావ హక్కుల కమీషన్ ఈ దురాచారాన్ని ఖండించింది. పౌరహక్కుల సంఘం తెలంగాణాలో జరిగిన ఇదు ఎన్‌కౌంటర్ కేసులను కమీషన్ దృష్టికి తేగా 1996లో అప్పటి కమీషన్ చైర్మన్ జస్టిస్ రంగనాథ మిశ్రా రాష్ట్రంలో పర్యటించి సాక్ష్యాధారాలను సేకరించారు. తర్వాత ఢిల్లీలో ఇరుపక్షాల వాదనలను కమీషన్ విన్నది. ఎన్‌కౌంటర్ కేసుల్లో మృతులనే ముద్దాయిలుగా చూపడాన్ని కె.జి. కన్నబిరన్ తప్పుపట్టారు. ఈ విషయమై చట్టం ఏం చెప్తుందో సెలవియ్యమని కమీషన్ బారత సొలిసిటర్ జనరల్‌ను రాష్ట్ర అడ్వకేట్ జనరల్‌ను కోరింది.  వారిద్దరు రాష్ట్ర పోలీసు దురాచారాన్ని చట్టప్రకారం సమర్థించలేక పోయారు. కన్నబిరన్ చేసిన వాదనే సబబన్నారు. తర్వాత కమీషన్ తన నివేదికలో ఇలా పేర్కొంది.

'మృతులనే ముద్దాయిలుగా పేర్కొని కేసు మూసివేయడాన్ని కన్నబిరన్ తీవ్రంగా సవాల్ చేశారు. అది చట్ట వ్యతిరేకమన్నారు. మేం సొలిసిటర్ జనరల్‌ను, అంధ్రప్రదేశ్ అడ్వకేట్ జనరల్‌ను ఈ పద్ధతి చట్టబద్ధమేనా? క్రిమినల్ న్యాయతత్వశాస్త్ర పరీక్షలో నెగ్గుతుందా?' అని అడిగాం. వారిద్దరూ దీన్ని చట్టబద్ధమేనని చెప్పలేకపోయారు. జరిగినవి నిజమైన ఎదురుకాల్పులేనని పోలీసులు చెప్తున్నది నిజమని అనుకున్నప్పటికీ, మృతులను ముద్దాయిలుగా

చూపరాదు. ఎందుకంటే ఎక్కువ కేసుల్లో ప్రాథమిక సాక్ష్యాధారాలను బట్టి మృతులు ముద్దాయిలయ్యే పని ఏమీ చేయలేదు.''

ఎన్‌కౌంటర్ కేసుల్లో చట్టప్రకారం ఏం చేయాలో కమీషన్ వివరించింది. ''ఎన్‌కౌంటర్లో ఎవరి ప్రాణాలైనా తీశామని పోలీసు అధికారి పోలీసు స్టేషన్‌లో సమాచారం ఇచ్చినప్పుడు, ఆ పోలీసు అధికారి దాన్ని నమోదు చేశాక నేరం జరిగిందని అనుమానించాలి. దాన్ని పరిశోధించేందుకు ఉపక్రమించాలి. ఇలా కాకపోతే ఎన్‌కౌంటర్ పేరిట ఎవరినైనా పోలీసులు చంపి ఆత్మరక్షణార్థమో, లేదా సిఆర్‌పిసిలోని 46వ సెక్షన్ ప్రకారమో వ్యవహరించామని చెప్పి ఎలాంటి శిక్ష లేకుండా తప్పించుకునేందుకు అది లైసెన్స్ అవుతుంది. అన్యాయమైన, అసమంజసమైన అహేతుకమైన ఈ పద్ధతి రాజ్యాంగంలోని 21వ అధికరణానికి లోబడి ఉందని చెప్పబూనుకోవడం సరికాదు.''

ఆ తర్వాత 1997 మార్చి 29న దేశంలోని అన్ని రాష్ట్రాల ముఖ్యమంత్రులకు అప్పటి కమీషన్ చైర్మన్ జస్టిస్ వెంకటాచలయ్య లేఖ రాశారు. ఎన్‌కౌంటర్ కేసుల్లో తాము సూచించిన విధంగా చట్టబద్ధమైన పద్ధతుల్లో కేసు నమోదు చేసి దర్యాప్తు జరిపించమని కోరారు. మృతుడినే ముద్దాయిగా చూపే పద్ధతికి స్వస్తిచెప్పి మృతుని మరణానికి కారకులైన పోలీసు అధికారులపై విధిగా హత్యకేసు నమోదు చేసి నేరపరిశోధన జరిపించమని కూడా కోరారు. అన్ని ఎన్‌కౌంటర్ కేసులను రాష్ట్ర సిఐడికి అప్పజెప్పమన్నారు. తమ రాష్ట్రాలలో పోలీసు స్టేషన్లకు ఈ మేరకు రాష్ట్ర డిజిపిలు ఆదేశాలు జారీ చేసేలా చూడమని ముఖ్యమంత్రులను కోరారు. ఇప్పుడు అక్కడక్కడా పక్క జిల్లా డియస్పీలతో కేసు నేరపరిశోధన జరిపిస్తున్నారు. నీ ఎన్‌కౌంటర్‌పై నా నేర పరిశోధన, నా దానిపై నీ పరిశోధన' పరిస్థితి నెలకొంది. కానీ, మృతులనే ముద్దాయిలుగా చూపే పద్ధతి మాత్రం పోలేదు.

## బూటకపు దర్యాప్తులకు స్వస్తి ఎన్నడు?

జాతీయ మానవ హక్కుల కమీషన్ చట్టాలకు భాష్యాన్ని మాత్రం సక్రమంగానే చెప్పింది. కానీ ఎన్‌కౌంటర్ కేసుల్లో రాష్ట్ర సి.ఐ.డి. దర్యాప్తు సూచన పనికిమాలినదని చెప్పక తప్పదు. ఇక పక్క జిల్లా డియస్పీ దర్యాప్తు మరీ ఘోరం. సి.ఐ.డి.కి గానీ, పక్క జిల్లా డియస్పీలకు గానీ స్వతంత్ర ప్రతిపత్తి లేకపోగా

సి.ఐ.డి. పోలీసు అధికార్లు, డియస్పీలు ఎన్‌కౌంటర్ కేసుల్లో నిందితులుగా ఉండే అవకాశంమెండు. నేను ఎన్‌కౌంటర్ చేస్తే నువ్వు దర్యాప్తు చెయ్యి, నువ్వు ఎన్‌కౌంటర్ చేస్తే నేను దర్యాప్తు చేస్తాను అన్న చందం దర్యాప్తులు బూటకంగా మారతాయి. ఇప్పటివరకూ ఏ ఒక్క ఎన్‌కౌంటర్ కేసులో కూడా హత్యకేసు నమోదు చేయడంగానీ, దర్యాప్తు అనంతరం పోలీసులను ముద్దాయిలుగా చూపుతూ ఛార్జిషీటు దాఖలు చేయడంగానీ జరగలేదు. సి.ఐ.డి.కి బదులు సి.బి.ఐ. దర్యాప్తు కొంతలో కొంతమెరుగు. బూటకపు ఎన్‌కౌంటర్లను నేరుగా నిరోధించలేకపోయినా, వాటిపై బూటకపు కేసులను, బూటకపు దర్యాప్తులను ఆపితే, వాటికి కళ్ళెం వేసినట్లవుతుంది. మేజిస్ట్రేట్లు కూడా తమవద్ద దాఖలైన ఎఫ్ఐఆర్‌లను ఐపిసి 302 సెక్షన్ కింద స్వీకరించి ఎన్‌కౌంటర్‌లో పాల్గొన్న పోలీసు అధికారులకు అరెస్టు వారెంట్లు జారీచేయవచ్చు. కేసును సెషన్స్ న్యాయస్థానానికి పంపవచ్చు. హక్కుల కమీషన్, న్యాయ వ్యవస్థ మరింత చురుకుగా వ్యవహరిస్తే పరిస్థితిలో మార్పు రావచ్చు. చట్టాన్ని మోసపుచ్చి తన పని తాను చేసుకుపోలేమని పోలీసు యంత్రాంగం గ్రహించేలా చేసే మనోసంకల్పం చట్టసభకు, న్యాయవ్యవస్థకు ఏర్పడే కృషి ప్రజాపక్షంగా ఇంకా జరగాల్సేవుంది.

**నవంబరు 14, 2002 - ఆంధ్రజ్యోతి**

# 20. ప్రభుత్వ సొమ్ముతో ప్రపంచీకరణపై పోరాటమా?! డబ్ల్యు ఎస్ ఎఫ్ ఒక లాలూచీ కుస్తీ

హైదరాబాద్ నగరంలో వచ్చే జనవరిలో ఆసియా సోషల్ ఫోరం పేరిట విదేశీ నిధుల ప్రభుత్వేతర సంస్థల (ఎన్‌జివోల) మేళా జరగబోతోంది. అమెరికాకు చెందిన మహా కార్పొరేట్ సంస్థ ఫోర్డ్ కంపెనీ నెలకొల్పిన ఫోర్డ్ ఫౌండేషన్, జర్మనీకి చెందిన హెయిన్‌రిక్ బోల్ ఫౌండేషన్, ఇంగ్లాండ్‌లోని అతిపెద్ద ఫండింగ్ సంస్థ ఆక్స్‌ఫామ్ మరి ఏడు సంస్థల భాగస్వామ్యంలో బ్రెజిల్‌లో నెలకొల్పిన ప్రపంచ సోషల్ ఫోరం కార్యకలాపాల కొనసాగింపే ఇది.

విదేశీ పెట్టుబడులకు, విదేశీ నిధులతో నడిచే ఎన్‌జివోల కార్యకలాపాలకు మనదేశం కేంద్ర స్థావరమౌతోంది. ప్రపంచీకరణా, దాని వ్యతిరేకత పేరిట కార్యకలాపాలూ - రెండూ విదేశీ పెట్టుబడులతో నడుస్తున్నాయి. ఈ రెంటి కార్యాచరణ ఫలితంగా మనబోటి మూడవ ప్రపంచ దేశాలు పునర్వలసీకరణకు గురౌతున్నాయి. రాజ్యం స్థానంలో మార్కెట్‌ను, రాజకీయ పార్టీ స్థానంలో పౌర సమాజ సంస్థలుగా అభివర్ణించుకునే ఎన్‌జివోలను ప్రపంచీకరణ తెచ్చిపెడుతుంది. ఈ కొత్త తరహా పునర్వలసీకరణను వ్యతిరేకించి నిర్వలసీకరణను (decolonisation) ప్రతిపాదించనివారు విదేశీ పెట్టుబడి ప్రయోజనాలను కాపాడుతూ, ప్రపంచీకరణకు దోహదం చేస్తారు.

ఉత్తరాది దేశాలనుంచి దక్షిణాది దేశాలకు ప్రవహించే పెట్టుబడికే కాదు, ధర్మభిక్షకు కూడా అవే ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక లక్ష్యాలు ఉంటాయన్న విషయాన్ని తీవ్రంగా పరిగణించాల్సి ఉండగా కనీసంగానైనా పట్టించుకున్న దాఖలా మన సమాజంలో లేదు. అకడమిక్ రీసెర్చ్ పేరుతో పాశ్చాత్య దేశాల

పెట్టుబడులు ఇప్పటికే దాదాపు ప్రతి అకడమిక్ మేధావిని ఏదోఒక రూపంలో ప్రభావితం చేస్తూ వున్నాయి. వారి నుంచి పెద్దగా ఆశించేది కన్పించడంలేదు. రాజకీయ పార్టీలు కూడా ఈ విషయమై నోరు మెదపడం లేదు - ఒక బిజెపి మాత్రమే తన స్వప్రయోజనాల కోసం మాట్లాడటం మినహా. మన రాష్ట్రంలో ఒక మాస పత్రిక సంపాదకీయం, ఒకటి రెండు అనువదిత వ్యాసాలు మినహా సామాజిక విమర్శ పెద్దగా లేదు.

విదేశీ నిధులతో నడిచే ఎన్‌జివోలు వలసీకరణను వేగవంతం చేస్తాయి. సామూహికతను ధ్వంసించి ఆర్థిక మానవుడి (Homo Economicus) సృష్టికి దోహద పడతాయి. అభివృద్ధి, ప్రజాస్వామ్యం, మానవహక్కులు - ఈ పేరిట పాశ్చాత్య ఆర్థిక ప్రణాళికలను, నైతికతను, శాసన కార్యాచరణను ప్రజల జీవితాలలోకి ప్రవేశపెడతాయి. విద్య, వైద్యం వగైరాల ద్వారా పాశ్చాత్యుల జీవన విధానాన్ని, సంస్కృతిని రుద్దడం చేస్తాయి. ప్రపంచీకరణ దశలో అంతర్జాతీయ కార్పోరేట్ సంస్థల ఆధిపత్యానికి జాతి రాజ్యాన్ని బలిపెట్టేందుకు అవసరమైన పనులు చేస్తాయి. మన సంప్రదాయ వ్యవస్థలో ఉన్న దుర్మార్గాలపై పోరాటం పేరిట మనల్ని మనకు కాకుండా చేసే ప్రత్యేక పాశ్చాత్య ఏజెంట్లు ఎన్‌జివోలు. ఇటీవల పెద్దమొత్తం పెట్టుబడులతో పుట్టగొడుగుల్లా పుట్టుకొస్తున్న ఎన్‌జివోలు ప్రపంచీకరణలో మూడో ప్రపంచ దేశ ప్రజలను మనసా వాచా కర్మణా భాగస్వాములను చేస్తాయి. ఒక తరహా ప్రపంచీకరణ కాకపోతే మరో తరహాది. పెట్టుబడిదారీ ప్రపంచీకరణను వ్యతిరేకిస్తూ ప్రజాస్వామ్య ప్రపంచీకరణ గురించి మాట్లాడతాయి. అదేదో వేరే అన్నట్టు. రెంటిలో సమానాంశం పాశ్చాత్యీకరణ, వలసీకరణ.

ఈ ఏడాది మొదట్లో బ్రెజిల్‌లో ఎన్‌జివోల ఆధ్వర్యంలో జరిగిన ప్రపంచ సోషల్ ఫోరంలో పాల్గొన్న వారిలో అత్యధికులు తాము ప్రపంచీకరణకు వ్యతిరేకం కాదని ప్రకటించారు. ప్రపంచీకరణ జరిగితే మంచిదే కానీ దాని ఫలాలను అందరికీ సమానంగా పంచాలనీ, నిర్ణయాలలో సమాన ప్రాధాన్యం ఉండాలని వాదించారు. ప్రపంచ బ్యాంకు ప్రతినిధులు, ఐక్యరాజ్యసమితి అధికారులు అందులో పాల్గొన్నారు. 'ప్రపంచీకరణను అమలు చేస్తున్న ప్రభుత్వాలకు, ప్రభుత్వ

ప్రతినిధులకు, రాజకీయ పార్టీలకు సదస్సులో చోటు లేదు' అని సోషల్ ఫోరం నిర్వాహకుల ప్రకటన ఆశ్చర్యం కలిగిస్తుంది. ఆఫ్ఘనిస్తాన్‌లో అమెరికా మారణకాండను, ప్రపంచవ్యాప్తంగా అమెరికా దుశ్చర్యలను సమర్థించే రాజకీయ పార్టీలు కూడా సదస్సులో పాలు పంచుకున్నాయి. ఆఫ్ఘనిస్తాన్‌పై అమెరికా ఏకపక్ష బాంబుల వర్షాన్ని ఖండించని ఆమ్నెస్టీ ఇంటర్నేషనల్ అక్కడ సగౌరవంగా మానవహక్కుల గురించి మాట్లాడింది.

'మరో ప్రపంచం సాధ్యమే' అనే ఫోరం నిర్వాహకుల గావుకేకపై ఉన్న ఫోర్డు కంపెనీ ముద్రను మనం అర్థం చేసుకోవాల్సి వుంది. మరోప్రపంచం అంటే విదేశీ నిధులతో నిర్మించేదేనా? విదేశీ కార్పోరేట్ కంపెనీల కార్యకలాపాల వల్ల నిర్మితమయ్యేదా? వారి దయాభిక్ష వల్ల సాధ్యమయ్యేదా? ఆ మరో ప్రపంచంలో కార్పోరేట్ పెట్టుబడికి ఏ స్థానం ఉంటుంది? విదేశీ కార్పోరేట్ పెట్టుబడికిగానీ, పెట్టుబడిదారీ విధానానికి గానీ వ్యతిరేకంగా మీకు ఏదైనా కార్యాచరణ ఉందా? అన్ని రకాల ఆధిపత్యాలకు వ్యతిరేకమని ప్రకటించుకున్న ఫోరం నిర్వలసీకరణ నినాదం ఇస్తుందా? దాన్ని ఒక హక్కుగా గుర్తిస్తుందా? అలా అయితే విదేశీ నిధులతో నిర్వలసీకరణ సాధ్యం కాకపోగా వలసీకరణ మార్గం సుగమం కాదా? ఇత్యాది ప్రశ్నలకు ఫోరం యాజమానులైన ఫోర్డ్ కంపెనీ నుంచి సమాధానాలను ఆశించక పోయినా, వారి స్థానిక ఏజెంట్లు సమాధానం చెప్పాల్సి వుంది. ప్రపంచ బ్యాంకు, అంతర్జాతీయ ద్రవ్యసంస్థ, ప్రపంచ వ్యాపార సంస్థ లాంటి వాటితో పై స్థాయి మంతనాలు జరిపి 'మానవీయ ప్రపంచీకరణ'కు హామీలు పొందడం ద్వారా ఫోర్డు మార్కు మరో ప్రపంచం వస్తుందని నమ్మేవాళ్ళే ఎన్‌జివో ఫోరంలో ఎక్కువమంది. క్రమంగా ప్రజలను ప్రపంచీకరణకు అలవాటు చేయడం వీరి వంతు. ఈ పనంతా 'ప్రజల' పేరు మీద 'ప్రజా ఉద్యమం'గా నడిపిస్తారు. ఉత్తర దాతల దక్షిణ వ్యాపారమిది.

బ్రెజిల్‌లో జరిగిన ప్రపంచ సోషల్ ఫోరం కార్యక్రమాల గురించి ప్రజలకు సరైన సమాచారం లేదు. రెండు శిబిరాలుగా విడిపోయి రెండు ఫోరంలుగా బ్రెజిల్‌లో కార్యక్రమాలు నడిపారు. ప్రజలతో స్వల్ప సంబంధాలున్న ఎన్‌జివోలు, బోర్డు సంఘాలు, సంస్కరణవాద రాజకీయ పక్షాలు మైనారిటీ శిబిరంలో

ఉన్నారు. అదే అధికార సోషల్ ఫోరం. మెజారిటీ శిబిరం వామపక్ష విప్లవ సంస్థలకు, ఇతర ప్రజా ఉద్యమ శ్రేణులకు సంబంధించినది. ఈ అనధికార ఫోరం ప్రదర్శనలో యాభైవేలమంది పాల్గొనడం విశేషం. అధికార కార్యక్రమంలో పదివేలమంది వరకూ పాల్గొన్నారని అంచనా. 'రెండు ఫోరంల కథ' (A Tale of Two Forums) పేరిట జేమ్స్ పెట్రాస్ మంత్లీ రివ్యూ మాసపత్రికలో వీటి వివరాలు పేర్కొన్నారు.

హైద్రాబాద్‌లో ఆసియా సోషల్ ఫోరం నిర్వాహకులు మొదటి రకం వారు. ఫోరం యజమానులు ఫోర్డ్, హెచ్. బోల్, ఆక్స్‌ఫామ్ వగైరాలన్న విషయాన్ని వారు దాచి పెడుతున్నారు. లేదా చెప్పుకునేందుకు సిగ్గుపడుతున్నారు. బ్రెజిల్‌లో జరిగిన అనధికార సదస్సు విషయం కూడా వారు బయటికి వెల్లడించడం లేదు. శ్రీఘంటా చక్రపాణి 'వార్త' దినపత్రికలో ఆగస్టు 27న ప్రచురించిన వ్యాసంలోగానీ, జయతి ఘోష్ 'ఫ్రంట్‌లైన్' మార్చి 1 సంచికలో రాసిన వ్యాసంలోగానీ ఈ వివరాలు లేవు. పైగా ఎన్‌జివో సదస్సును వ్యతిరేకించిన ప్రజా ఉద్యమాల సదస్సులో పాల్గొన్న వారిని కూడా కలిపి బ్రెజిల్ సదస్సు విజయాన్ని లెక్క వేస్తున్నారు.

హైద్రాబాద్‌లో ఫోర్డ్ కంపెనీ కార్యక్రమానికి కొన్ని వామపక్ష సంస్థలు, మానవ హక్కుల సంస్థలు (దుకాణాల సంగతి సరేసరి) నిర్వహణ బాధ్యత చేపట్టాయి. అందులో అసహజత్వం ఏమీ లేదు. కానీ అది ప్రమాద సంకేతాలను ఎగరవేస్తోంది. తెలుగునేలపై జరుగనున్న చారిత్రక విషాదానికి సాధికారత వాటి ద్వారా ఈ కార్యక్రమానికి లభించబోతోందా లేక అవే సామాజిక గౌరవాన్ని పోగొట్టుకోనున్నాయా అన్న విషయాలు సదస్సు తర్వాతగానీ పూర్తిగా తేలవు. ఏది జరిగినా బాధాకరమే. ఈ కార్యక్రమ క్రమంలో వీరు వారై త్వమేవాహం స్థితి సంభవించే ప్రమాదం ఉంది.

పాశ్చాత్య దేశాలనుంచి వచ్చే నిధులతో నడిచే ఎన్‌జివోల కార్యక్రలాపాలను విమర్శించకుండా మనం ప్రపంచీకరణను, వలసీకరణను వ్యతిరేకించడం ఎలానో ఎన్‌జివోలతో జతగట్టిన వామపక్ష సంస్థల వాళ్ళూ, మానవహక్కుల నేతలు తెలుగు ప్రజలకు వివరణ ఇవ్వాల్సిన సమయం వచ్చింది. హక్కుల

భాష మాట్లాడుకున్నప్పటికీ, దక్షిణాది దేశాల ప్రజలకున్న నిర్వలసీకరణ హక్కుకు ఉత్తరాది దేశాల నిధులు పొందే ఎన్‌జివోల అస్థిత్వమే ముప్పు కాదా? అని వారిని అడగాలి. ప్రపంచీకరణ, వలసీకరణ రెండూ విడదీయలేని అంశాలన్న విషయం వారికి గుర్తుందా? అని కూడా అడగాలి.

ప్రతిఏటా నాలుగువేల కోట్ల రూపాయల విదేశీనిధులతో విస్తరించిన ఎన్‌జివోల కార్యకలాపాలపై సరైన అధ్యయనం లేదు. కొందరు ఎన్‌జివో అధినేతల (ఆడ/మగ) మెగాస్థాయి అవినీతి ప్రైవేటు సంభాషణలకు తప్ప బహిరంగ వేదికలపై చర్చనీయాంశం కావడం లేదు. నా ఉద్దేశం తక్షణం వ్యక్తులను టార్గెట్ చేయాలని కాదుగానీ, ఆ వ్యక్తులు ఎలా సంకేతీకరించ బడుతున్నారో, ఎలాంటి దుష్ప్రభావాలను ప్రజలమీద, ఉద్యమాల మీద ప్రసరిస్తున్నారో ఆలోచించడం అత్యవసరం రాజకీయ పార్టీ స్థానాన్ని ఎన్‌జివోలు ఆక్రమించుకుంటుంటే, రాజ్యం స్థానంలో మార్కెట్ ఆధిపత్యానికి మార్గం సుగమం అవుతోంది. ఎన్‌జివో కార్యకలాపాలపై విమర్శనాత్మక దృష్టి లోపంవల్ల ఇప్పటి వరకూ జరిగిన చారిత్రక తప్పిదాన్ని వెంటనే సరిచేసుకోని పక్షంలో రానున్న కాలంలో మన సమాజం తీవ్ర పరిణామాలను చవిచూడక తప్పదు.

ఎన్‌జివోలు నడిపే వారిలో చాలామంది గతంలో వామపక్ష ఉద్యమాలతో సంబంధం ఉన్నవారే. దళిత, మహిళా హక్కుల ప్రవచనంలో వారిప్పుడు భాగస్వాములు. వారితో వామపక్ష మేధావుల, మానవ హక్కుల ఉద్యమకారుల స్నేహ సంబంధాలు, వారివల్ల వీరు పొందే ఉపకారాలు ఎన్‌జివోల పట్ల ఉదారవైఖరికి దారి తీశాయి. ఎన్‌జివోలతో ఇతర ఉద్యమాల సహజీవనానికి దోహదం చేశాయి. కొందరు వామపక్ష మేధావులు, హక్కుల ఉద్యమకారులు ఎన్‌జివోల ఎజెండాలలో మంచిని దర్శిస్తుండటం, ఎన్‌జివోలకు వామపక్షాలకు మధ్య తాత్త్విక దృక్పథంలో సమాన సూచికలు ఉండటం కూడా ఈ సహజీవనానికి కారణం.

ఫ్రెంచి విప్లవ కర్తవ్యాల్లోని ఫ్యూడల్ విలువలను ధ్వంసం చేయడమనే పనిని పెట్టుబడిదారీ వర్గం రష్యా విప్లవానంతరం చేపట్టలేదని వాదించే మార్క్సిస్టులకు, లెనినిస్టులకు ఎన్‌జివో కార్యాచరణను ఎదిరించే తాత్విక పునాది

కరువౌతుంది. ఎన్‌జివో కార్యకలాపాలు పెట్టుబడి కర్తవ్యాలను పరిపూర్తి చేయడం ద్వారా సమాజాన్ని వలసీకరిస్తాయని వీరు గ్రహించడం కష్టం. కమ్యూనిస్టుల పాలన పెట్టుబడిదారీ అభివృద్ధికి ప్రపంచ వ్యాప్తంగా పైలెట్ ప్రాజెక్టుగా మారింది. దాదాపు అన్ని కమ్యూనిస్టు దేశాలూ పెట్టుబడికి మార్గం సుగమం చేస్తూ కూలిపోయాయి. కార్మికవర్గ ప్రపంచీకరణ అని ఫిడెల్ కాస్ట్రో చెప్తున్నది కూడా అలాంటిదే అనుకోక తప్పదు.

కమ్యూనిస్టు దేశాల నుంచి నిధులు పొందిన మన దేశ కమ్యూనిస్టు పార్టీలు ఎన్‌జివో కార్యాచరణను విమర్శించడానికి ఇబ్బంది పడతాయి. తమ గతాన్ని తప్పుగా ఒప్పుకుంటే తప్ప. కాబట్టే ఎన్‌జివోలు నిరాఘటంగా తమ కార్యకలాపాలను కొనసాగించగలుగుతున్నాయి.

ఇప్పటికైనా రాష్ట్రంలో ప్రజాపక్షం వహించే రాజకీయ పార్టీలు, సంస్థలు, ఇతర ప్రజా సంఘాలు విదేశీ నిధులతో నడిచే ఎన్‌జివోల గురించి తమ వైఖరిని స్పష్టపరిస్తే బాగుంటుంది. ఎన్‌జివోల వలసవాద లక్ష్యాల గురించిన లోతైన అధ్యయనానికి నాంది పలకాలి. విదేశీ పెట్టుబడులే కాదు, విదేశీ నిధులు కూడా ఈ గడ్డను వదిలి పోవాలని నినదించాలి. దయాభిక్షలను బహిష్కరించి, తెల్లరాజ్యాలు కొల్లగొట్టిన మన సంపదను మనకివ్వాలని ఉద్యమించాలి. పాశ్చాత్య ప్రేరేపిత భావజాలానికి, కార్యాచరణకు స్వస్తి చెప్పి స్వదేశీ ఉద్యమానికి, నిర్వలసీకరణకు దారులు వెతకాలి. అప్పుడే నిజంగా ప్రపంచీకరణను అడ్డుకోగలుగుతాం. ప్రపంచీకరణకు, ఫాసిజానికి దోహదం చేసే హిందుత్వ శక్తులను సైతం ఈ గడ్డపైనే ఓడించ గలుగుతాం. ఆసియా సోషల్ ఫోరం లాంటి కార్యక్రమాల నిజ రూపాన్ని గ్రహించగలుగుతాం. ఫోర్డ్ ప్రేరేపిత శక్తులు ఎంత మిలిటెంట్‌గా 'మరోప్రపంచం' అని పెడబొబ్బలు పెట్టినా, మాయావి హీరో వేషధారై మోసపుచ్చే 'పాతాళభైరవి'గా దాన్ని అర్థం చేసుకోగలుగుతాం. 'మరో ప్రపంచం' కోసం కాదది కొందరి 'మనీ ప్రపంచం' కోసం అని అర్థం చేసుకోగలుగుతాం. 'తెలియని ఏ తీవ్ర శక్తులో నడిపిస్తే నడిచి మనుష్యులు' అన్న చందంగా వ్యవహరించకుండా ఉండగలుగుతాం.

**డిసెంబరు 5, 2002 - జనపథం పక్ష పత్రిక**

# 21. ప్రపంచ సోషల్ ఫోరం నిర్మాతల్లో ఫోర్డ్

ఆంధ్రజ్యోతి దినపత్రికలో 'ప్రభువు సొమ్ముతో ప్రపంచీకరణపై పోరాటమా?' శీర్షికన నా వ్యాసం అచ్చయ్యాక ఇప్పటివరకూ ఆంధ్రప్రదేశ్‌కు చెందిన ఫోరం నిర్వాహకులెవరూ దాన్ని విమర్శిస్తూ వ్యాసంగానీ, కనీసం పాఠకలేఖగానీ రాయలేదు. మద్దాలి రాఘవరావు, తెనాలి అనే పేరిట ఒక ఆసామీ మాత్రం ఫోర్డ్ అనే పాపాల భైరవుడిని నేనే తెచ్చి డబ్ల్యూ.ఎస్.ఎఫ్.లో కూర్చోబెట్టానని విమర్శించారు. (ఆంధ్రజ్యోతి అక్టోబర్ 25). ఫోర్డ్‌కు డబ్ల్యూ.ఎస్.ఎఫ్.కు సంబంధంలేదని ప్రకటించారు. (ఇంకా నాపై పలు అభాండాలు వేశారు. నేనే డబ్ల్యు.ఎస్.ఎఫ్.కు కళంకాన్ని ఆపాదించానన్నారు. నేను దేశీయత గురించి మాట్లాడితే జాతీయతను అంటగట్టారు. నాది నైతికాహంకారం అన్నారు. వాటి గురించి అలా ఉంచుదాం).

వార్త దినపత్రికలో నవంబర్ 20న అచ్చయిన ఇంటర్వ్యూలో ఆసియా సోషల్ ఫోరం సెక్రెటేరియట్ సభ్యురాలు రుక్మిణీ మీనన్ "ఫోర్డు వంటి సంస్థల నుంచి డబ్ల్యూ.ఎస్.ఎఫ్. కార్యకలాపాలకు నిధులు తీసుకుంటున్నట్టు వస్తున్న వార్తల్లో నిజం" లేదన్నారు. "కార్పొరేట్ బహుళజాతి సంస్థల నుంచి నిధులు తీసుకోవడం లేద"ని తెలిపారు. అంతకుముందు హైదరాబాదులో అక్టోబర్ 21న ఒక ప్రెస్ కాన్ఫరెన్స్‌లో డాక్టర్ ఘంటా చక్రపాణి మాట్లాడుతూ "బహుళజాతి సంస్థల విరాళాలతో పనిచేస్తున్న ఎన్జీవోలకు... సమావేశాల్లో చోటు లేదని" చెప్పారు (ప్రజాశక్తి, అక్టోబరు 22).

ఫోర్డ్‌కు డబ్ల్యూ.ఎస్.ఎఫ్.కు సంబంధం ఉందా? లేదా అనేది తెలుగు ప్రజల ముందు కొచ్చింది. ఫోరం నిర్వాహకులేమో బహుళజాతి సంస్థల

విరాళాలతో పనిచేసే ఎన్జీవోలకు ఇందులో స్థానం లేదంటున్నారు. డబ్ల్యూఎస్.ఎఫ్ప ఏకంగా బహుళజాతి సంస్థల, క్రైస్తవ మతసంస్థల, పాశ్చాత్య ప్రభుత్వ ప్రోద్బలిత ఎన్జీవోలచే నిర్మితమైనదనే విషయాన్ని వారు మరుగనపడేట్టు చేస్తున్నారు. అబద్ధాలు ప్రచారం చేయడం ద్వారా కార్యక్రమాలను సజావుగా నిర్వహించే పని నిర్వాహకులు చేపట్టడం అన్యాయం.

ప్రపంచ సోషల్ ఫోరం, అధికారిక వెబ్‌సైట్ www.forum social mundial.org. పోర్చుగీస్, ఇంగ్లీషు, ఫ్రెంచి భాషల్లో దాని ఎడిషన్లు ఉన్నాయి. సెప్టెంబర్ నెలలో నేను దాని హోమ్ పేజీలో "Who are we" అనే చోట క్లిక్ చేస్తే "The Partners" అని వచ్చింది. దానిపై క్లిక్ చేస్తే "World Social Forum-who promotes and organises it" అని ఉండి డబ్ల్యూ.ఎస్.ఎఫ్. భాగస్వాములు (WSF Partners) అని ఈ క్రింది పేర్లు ఉన్నాయి.

1. DROITS ET DEMOCRATIC
2. FUNDACAO FORD (ఫోర్డ్ ఫౌండేషన్)
3. FUNDACAO H.BOLL (హెయిన్‌రిక్ బోల్ ఫౌండేషన్)
4. ICCO (ఇంటర్ చర్చి కో-ఆర్డినేషన్ కమిటీ ఫర్ డెవెలప్‌మెంట్ ప్రాజెక్టు)
5. LE MODE DEPLOMATIQUE
6. OXFAM (ఆక్స్ ఫాం)
7. RITS
8. GOVERNO DO ESTADO DE RIO GANDO DOSUL
9. PREFEITURA DE PORTO ALEGRE
10. WORLD FORUM FOR ALTERNATIVES

ఈ పది సంస్థలు డబ్ల్యూ.ఎస్.ఎఫ్. ప్రమోటర్లు, భాగస్వాములు, నిర్వాహకులు అన్న విషయాన్ని అలా అధికారికంగా ధృవీకరించుకున్నాక నేను వ్యాసం రాశాను. వెబ్‌సైట్‌లో నేను చూసిన దాన్ని మానవహక్కుల వేదికకు చెందిన ఎ. చంద్రశేఖర్‌గారికి (లెక్చరర్, అనంతపూర్) కూడా చూపించాను. అలా చూపించడం మంచిదయింది. ఎందుకంటే ఇప్పుడా విషయాలు

వెబ్‌సైట్‌లో కనిపించడం లేదు. అక్టోబర్ చివరికల్లా అవి మాయమైనట్టు కనిపెట్టాను. వెబ్‌సైట్లో దాచినంత మాత్రాన సాక్ష్యాలు మాసిపోవు.

నేను మరో మార్గంలో ప్రయత్నించాను. ఫోర్డ్ ఫౌండేషన్ వెబ్‌సైట్ వెతికాను. ప్రపంచ సోషల్ ఫోరంకు ఫోర్డ్ ఫౌండేషన్ వారిచ్చిన రొఖ్ఖం పద్దు రాసుకున్నారు. సోషల్ ఫోరం అంతర్జాతీయ కౌన్సిల్‌లో సభ్యురాలిగా ఉంటూ పోర్టో ఎలెగ్రెలో రెండు సార్లు ఫోరం మీటింగుల నిర్వహణలో చురుకైన పాత్ర నిర్వహించిన ఎబాంగ్ (బ్రెజిలియన్ అసోసియేషన్ ఆఫ్ ఎన్జీవోస్) సంస్థ పేరిట ఫోర్డ్ ఫౌండేషన్ పెద్ద మొత్తం డబ్బు విడుదల చేసింది. మరో మహిళా సంఘం పేరిట కూడా ఒకసారి డబ్బిచ్చింది. ఖాతా వివరాలు పట్టికలో చూడండి.

| వరుస సంఖ్య | ఎవరి పేరిట | ఎందుకోసం | ఎన్ని యుఎస్ డాలర్లు | రూపాయల్లో సుమారుగా |
|---|---|---|---|---|
| 1. | బ్రెజిలియన్ అసోసియేషన్ ఆఫ్ ఎన్జీవోస్ (ఎబాంగ్) | డబ్ల్యూ.ఎస్.ఎఫ్-2001 సభల నిర్వహణకు | 1,00,000 | 50,00,000 |
| 2. | డిటో | డబ్ల్యూ.ఎస్.ఎఫ్-2002లో సెమినార్ నిర్వహణకు | 40,000 | 20,00,000 |
| 3. | ఫెమినిస్ట్ స్టడీస్ అండ్ అసిస్టెన్స్ సెంటర్ | డిటో | 65,000 | 32,00,000 |
| 4. | బ్రెజిలియన్ అసోసియేషన్ ఆఫ్ ఎన్జీవోస్ (ఎబాంగ్) | విధాన నిర్ణయాలను గైకొనే సంస్థగా డబ్ల్యూ.ఎస్.ఎఫ్, అంతర్జాతీయ కౌన్సిల్‌ను బలోపేతం చేసేందుకు | 1,23,000 | 61,00,000 |
| | గత 22 నెలలో ఫోర్డ్ నుంచి డబ్ల్యూ.ఎస్.ఎఫ్. కార్యకలాపాలకు అందిన మొత్తం | | 3,28,000 | 1,63,00,000 |

అంతేగాక ఎబాంగ్‌కు ఈ కాలంలో అంతర్జాతీయ ఎన్జీవోలతో చర్చలు జరిపేందుకు 20వేల డాలర్లు, సభ్యుల సమన్వయం పేరిట రెండున్నర లక్షల డాలర్లు పోర్డ్ ఫౌండేషన్ ఇచ్చింది. అంటే కోటీ ముప్పైలక్షల రూపాయలన్నమాట. పట్టికలో పేర్కొన్న డబ్బుతో కలిపి గత రెండేళ్ళలో పోర్డ్ ఫౌండేషన్ సుమారు మూడు కోట్ల రూపాయలు ఎబాంగ్‌కు ఇచ్చిందన్నమాట.

ఈ డబ్బును పోర్డ్ ఫౌండేషన్ 'శాంతి, సామాజిక న్యాయం' ఖాతాలో ఇచ్చింది. పోర్డ్ గారి 'సామాజిక న్యాయం'లో ప్రపంచీకరణ భాగం. వారి వెబ్‌సైట్లో ప్రపంచీకరణ 21వ శతాబ్దంలో మహత్తర అవకాశంగా అభివర్ణించారు. ప్రపంచీకరణ కోసమే వారు డబ్ల్యూ.ఎస్.ఎఫ్.పై డబ్బు ఖర్చుపెడుతున్నారని వేరే చెప్పనక్కరలేదు.

మనదేశంపై అమెరికా న్యాయవ్యవస్థను రుద్దే రేసిస్ట్ ప్రయత్నాన్ని ఫోర్డ్ సంస్థ 1960లలో అమెరికా ప్రభుత్వంతో కలిసి చేసింది. 'కంపీటింగ్ ఈక్వాలిటీస్' గ్రంథ రచయితగా ప్రసిద్ధుడైన మార్క్ గాలంటర్ ఈ ప్రాజెక్టు చేపట్టాడు. ఆయన విఫలమై తీసిన గుణపాఠాలను ప్రపంచబ్యాంకు వాడుకొంటోంది - న్యాయవ్యవస్థ ప్రపంచీకరణ కోసం.

అమెరికా ప్రభుత్వం 1960లలో ఫిలిప్పీన్స్‌లో కమ్యూనిస్టు రైతాంగ ఉద్యమాలను ధ్వంసించేందుకు సి.ఐ.ఏనూ, యు.ఎస్. ఎయిడ్‌ను ఉపయోగించింది. ఫోర్డ్, రాక్‌ఫెల్లర్, ఆసియా ఫౌండేషన్లను సి.ఐ.ఏ. యు.ఎస్. ఎయిడ్‌లు రంగంలోకి దించాయని గెరాల్డ్, క్లర్క్ 'ద పాలిటిక్స్ ఆఫ్ ఎన్జీవోస్ ఇన్ సౌత్ ఈస్ట్ ఏషియా' గ్రంథంలో రాశారు. దాన్ని రౌట్‌లెడ్జ్ 1998లో ప్రచురించింది.

ఫోర్డ్, రాక్ ఫెల్లర్, కార్నిగీ ఫౌండేషన్లు మూడవ ప్రపంచ దేశాల యువకులకు అమెరికా చదువులకిచ్చే స్కాలర్‌షిప్‌ల ఉద్దేశాల్లో ముఖ్యమైనది పాశ్చాత్య విలువలను గౌరవించేవాళ్ళుగా  పెట్టుబడి చట్రంలో సుశిక్షితులైన వారిగా తయారు చేయడం. (చూడండి బ్రియాన్ స్మిత్ రాసిన 'మోర్‌దాన్ ఆల్ట్రూయిజం' - ప్రిన్స్‌టన్ యూనివర్సిటీ ప్రెస్, 1990). అమెరికా ప్రభుత్వ పన్ను రాయితీలు కూడా ఫోర్డ్ ఫౌండేషన్ పొందుతోంది.

డబ్ల్యూ.ఎస్.ఎఫ్.భాగస్వాముల్లో ఒకటైన ఆక్స్‌ఫాం పదకొండు సంస్థల కలయిక. బ్రిటన్, అమెరికా, కెనడా, న్యూజిలాండ్, నెదర్లాండ్స్ వగైరా దేశాల్లోకి ఆక్స్‌ఫాం సంస్థలు, నెదర్లాండ్స్‌లోని మరో సంస్థ నోవిబ్ కలిసి ఏర్పడినవి. ఆయా దేశాల ప్రభుత్వాల రాయితీలు, నిధులు, ఇతరత్రా అండదండలు వీటికున్నాయి. ఆక్స్‌ఫాంకు ఫోర్డ్ నిధులిచ్చిన సందర్భాలున్నాయి. ఆక్స్‌ఫాం డబ్ల్యూ.ఎస్.ఎఫ్.

అంతర్జాతీయ కౌన్సిల్ సభ్యురాలు కూడా. గ్లోబలైజేషన్‌ను వ్యతిరేకించే వారిని గ్లోబాఫోబ్స్ అని ఈ సంస్థ దూషించింది. (చూడండి న్యూలెఫ్ట్ రివ్యూ- జూలై, ఆగస్టు-2002లో వాల్డెన్ బెల్లోతో ఇంటర్వ్యూ)

డబ్ల్యూ.ఎస్.ఎఫ్.లో మరో భాగస్వామి ఐ.సి.సి.ఓ (ఇంటర్ చర్చ్ కో-ఆర్డినేషన్ ఫర్ డెవలప్‌మెంట్ ప్రాజెక్ట్స్). నెదర్లాండ్స్‌కు చెందిన ఈ ప్రొటెస్టంట్ క్రైస్తవ మత సంస్థ నిధుల్లో సింహభాగం నెదర్లాండ్స్ ప్రభుత్వమిచ్చేవే. విదేశాల్లో తమ ప్రభుత్వం అప్పజెప్పే పనుల్ని చేసే ప్రైవేట్ కాంట్రాక్టర్స్‌గా నెదర్లాండ్స్ ఎన్‌జీవోలు అవతరించాయి. అక్కడి విదేశీ వ్యవహారాల శాఖ ఎన్జీవోల ద్వారానే నిధులు ఖర్చు పెడుతుంది. వేరే యంత్రాంగం దానికి లేదు.

పాశ్చాత్య దేశ ప్రభుత్వాలకు మారు ముసుగు సంస్థలుగా (surrogates) ఎన్జీవోలను చెప్పవచ్చు. నిజానికి వీటిలో అధిక భాగం జీవోలే. ఇతర దేశాల ప్రభుత్వాలు అనుమతి ఇచ్చినా, ఇవ్వకపోయినా కూడా చాపకింద నీరులా సమాజాలను తొలిచే పనిముట్లుగా ఎన్జీవోలను పాశ్చాత్య దేశాల ప్రభుత్వాలు పరిగణిస్తాయి. అమెరికా, యూరప్ ప్రయోజనాలకు ఘర్షణ వచ్చినప్పుడవి తమ దేశాల విదేశాంగ విధానం ప్రకారం నడుచుకుంటాయి. అమెరికా, యూరప్ ఎన్జీవోలకు తేడాలుండవచ్చు - ప్రపంచీకరణను ఎవరికోసం వాడుకోవాలనే దానిపైనే.

ఎన్జీవోల కార్యకలాపాలు దాతృత్వ సామ్రాజ్యవాదం - (Philanthropic Imperialism) తప్ప మరేమీ కాదు. ఇంకా లోతుగా అధ్యయనం అవసరం ఉందని గుర్తిద్దాం. పారా హుషార్!

**డిసెంబరు 05, 2002, జనపథం పక్ష పత్రిక**

# 22. ASF ప్రకటించని కఠోర సత్యాలు

**‘ఆవు - పులి’ లేదా ‘జస్టిస్ బి.పి. జీవన్ రెడ్డి - ప్రపంచీకరణ-సంఘ పరివార్ - ఎన్జీవోలు - పోటా - విదేశీ లాయర్లు - చిన్న పార్టీలు - ఆసియా సామాజిక వేదిక’ - అను ప్రజా వ్యతిరేక కథా-కమామిషు.**

ప్రపంచీకరణలో ప్రజలను భాగస్వాములను చేసే ఉద్దేశంతో మెస్సర్స్ ఫోర్డు, ఆక్స్‌ఫాం, హెచ్. బోల్, ఇకొ తదితర పాశ్చాత్య కార్పొరేట్, ప్రభుత్వ సంస్థల భాగస్వామ్యంలో ఏర్పడిన ప్రపంచ సామాజిక వేదిక ముద్దుబిడ్డ ఆసియా సామాజిక వేదిక (ASF) హైద్రాబాద్‌లో జనవరి 2 నుంచి 7 వరకూ జరుపుతున్న ఎన్జీవో కుంభమేళా రిసెప్షెన్ కమిటీ అధ్యక్షుడిగా జస్టిస్ బి.పి. జీవన్‌రెడ్డిగారు ఉన్నారు.

జస్టిస్‌రెడ్డిగారు గతంలో కొన్ని కార్మిక-అనుకూల తీర్పులు ఇచ్చి లెఫ్ట్ చే కొనియాడబడ్డారు. తర్వాత వీరు లా కమీషన్ ఛైర్మన్‌గా నియమితులయ్యారు. మతోన్మాద బిజెపి ప్రభుత్వానికి, వారి హిందుత్వ ఎజెండాకు, ప్రపంచీకరణకు కావలసిన అనేక పనులను వీరు ఎంతో నైపుణ్యంతో చేసి హిందుత్వ శక్తులచే శభాష్ అనిపించుకున్నారు. వీరి ముఖ్యకార్యక్రమాలు:

**1. పోటా (POTA) రచన :**

వీరు దుర్మార్గమైన భయానక టెర్రరిస్టు చట్టాన్ని రచించారు లేదా మెరుగులు దిద్దారు. కొన్ని సవరణలతో పోటా (POTA)గా ఆ దుశ్శాసనం దేశంపైకి లంఘించిన విషయం అందరికీ తెలిసిందే. స్వామిని మించిన స్వామి భక్తి ప్రదర్శించిన ఈ పోటా రచయిత కోరిక మాత్రం అలానే మిగిలిపోయింది. అదేంటంటే, శాశ్వతంగా ఈ దేశానికి పోటా అవసరమని వీరు సిఫార్సు చేశారు.

కానీ ప్రజలు వ్యతిరేకించగా పార్లమెంటు మూడేళ్ళ కాలపరిమితిని విధించింది. వీరు కోరుకున్న విధంగా ఆ చట్టం శాశ్వత ప్రాతిపదికన జారీ అయితే ఈ దేశ ప్రజలు ఘోరమైన బాధలు పడాల్సి వచ్చేది. చివరికి బిజెపి తన మనిషిగా భావించిన మానవ హక్కుల కమీషన్ ఛైర్మన్ జె.ఎస్.వర్మ సైతం గట్టిగా వ్యతిరేకించినప్పటికీ, ఈ లెఫ్టిస్టు మాత్రం పోటా వేపే నిలబడి సంఘ్‌పరివార్ శక్తులతో సెబాష్ అనిపించుకున్నారు. ఆసియా సోషల్ ఫోరం ప్రతినిధులకు ఈ దుశ్శాసన రచయిత స్వాగతం చెప్తున్నారు. ప్రజలారా జాగ్రత్త!

## 2. చిన్న పార్టీలను చంపడం :

జస్టిస్ రెడ్డిగారికి బీదా, బిక్కి, పేద, సాదా మనుషులు, దళిత, మైనారిటీ పార్టీలు, గిరిజనుల చిల్లర పార్టీలు చూస్తే ఎందుకో చెప్పరాని కోపం. అసహనం. దేశంలో రెండు లేదా మూడు జాతీయ పార్టీలు ఉంటే చాలునట. ఆదిశగా తక్షణం వెళ్ళాలని ఆయనకు వుంది గానీ వెంటనే వెళ్ళడం సాధ్యంకాదు కాబట్టి చిన్న పార్టీలను చంపేందుకు ఒక పథకాన్ని సూచించారు. అందుకోసం 200 పేజీల నివేదిక రాశారు. (కులం, ప్రాంతం మొదలయిన పాక్షిక ప్రయోజనాలు గల పార్టీలు వుండటం కూడా స్థిరత్వానికి దెబ్బ అట). ఈ పథకం ప్రకారం, ఒక పార్టీకి రాష్ట్రం మొత్తం మీద ఐదు శాతం ఓట్లు రాని పక్షంలో ఆ పార్టీ తరపున కొన్ని నియోజక వర్గాల్లో గెలిచిన అభ్యర్థులను సైతం ఇంటికి పంపాలట. వారికి రెండవ స్థానంలో ఉన్న అభ్యర్థులను శాసన సభ్యులుగా ప్రకటించాలట. ఇలా చిన్న పార్టీలను రూపుమాపే 'జాతీయవాది'గా వీరు కాషాయ పార్టీవారి మన్ననలకు పాత్రులయ్యారు.

## 3. విదేశీ లాయర్లకు తలుపులు తెరవడం :

ప్రపంచీకరణలో భాగంగా అమెరికాకు, యూరప్ దేశాలకు చెందిన కార్పొరేట్ లా కంపెనీలు మూడో ప్రపంచ దేశాల మార్కెట్లను ఆక్రమించ బోతున్నాయి. లాయర్లు, డాక్టర్లు, ఆడిటర్ల లాంటి సేవారంగాలలో విదేశాలకు తలుపులు తెరవమని చెప్పగానే,మన జీవన్ రెడ్డిగారు దాన్ని తన పవిత్ర కర్తవ్యంగా స్వీకరించారు. 'నేను సైతం సమిధనొకటి ఆహుతిస్తాను' స్టైల్లో వారు ఈ దేశ న్యాయవాద వృత్తిని ప్రపంచీకరణకు సమిధగా ఆహుతి చేయబూనుకున్నారు.

అందుకోసం ఈ దేశంలోకి విదేశీ లాయర్లను అనుమతించవసిందనీ, వ్యాపారంగా న్యాయవాదాన్ని తీర్చిదిద్దే దిశగా మల్టీ డిసిప్లినరీ ప్రాక్టీసు పేరిట లాయర్లు కాని వాళ్ళతో లాయర్లు భాగస్వాములు కావచ్చునీ వీరు సిఫార్సు చేశారు. ఈ విషయమై ఢిల్లీలోని 'ఇండియన్ లా ఇన్‌స్టిట్యూట్'లో వీరు ఒక సెమినార్ నిర్వహించగా అది వీరికి పీడకలగా మారింది. సెమినార్‌లోకి ఢిల్లీ బార్ అసోసియేషన్ న్యాయవాదులు వందమంది దూసుకెళ్ళి ఈ జస్టిస్‌ను చెప్పరాని భాషలో బూతులు తిట్టారు. ఈ గడ్డపై మరోసారి విదేశీ లాయర్ల ప్రస్తావన తెస్తే వూరుకోమని హెచ్చరించి సభను భగ్నం చేశారు. (ఆధునిక కాలంలో క్రూరత్వం చాలా నాజూకుగాను, 'ప్రజాస్వామికం'గానూ, దానిపై నిరసన చాలా మొరటుగాను ఉంటుంది కదా!). దీని గురించిన వివరాలను 'Lawyers heckle Law Panel Chief' పేరుతో స్టేట్స్‌మన్ దినపత్రిక 23.1.2000 నాడు ప్రకటించింది.

ఈ ఘనుడికి, సంఘ్ పరివార్‌కు, ప్రపంచీకరణకు, పోటా చట్టానికి, మానవహక్కుల ఎన్జీవోలకు, ఆసియా సోషల్ ఫోరంకు ఉన్న సంబంధాన్ని, ప్రజలారా! అర్థం చేసుకోండి. కార్ల కంపెనీ ఫోర్డు, నెదర్లాండ్స్ ప్రభుత్వం ('ఇకో' ద్వారా), ఆక్స్‌ఫాం, హెచ్.బోల్ తదితర సంస్థలు స్థాపించిన ప్రపంచ సోషల్ ఫోరం వారి ASF ప్రతినిధులకు ఆయన ఎందుకు స్వాగతం పలుకుతున్నారో అవగాహన చేసుకోండి.

**డిసెంబర్ 30, 2002 - రాతప్రతి**

# 23. లోక్‌సత్తా చూపవలసిన సత్తా

## ప్రజాస్వామ్య వ్యాపారీకరణ, వలసీకరణల కోసం కాదు

రాజకీయ ప్రజాస్వామ్య ప్రక్రియను సంస్కరించేందుకు స్వేచ్ఛగా, నిర్భయంగా, విజ్ఞతతో ప్రజలు ఓటు చేసేందుకు గత కొన్నేళ్ళుగా మన రాష్ట్రంలో "లోక్‌సత్తా" పనిచేస్తోంది. రాజకీయ ప్రజాస్వామ్యాన్ని భ్రష్టుపట్టిస్తున్న అనేకానేక రుగ్మతలపై లోక్‌సత్తా చేపట్టిన కార్యక్రమాలకు మనరాష్ట్రంలో బుద్ధి జీవులు కొందరు ఆకర్షితులు అవుతున్నారు. అదే సమయంలో ప్రపంచీకరణకు, అందులో భాగంగా జరుగుతున్న ప్రైవేటీకరణకు, ప్రపంచబ్యాంకు దోపిడీకి వ్యతిరేకంగా జరిగిన ఏ ఉద్యమంలోనూ లోక్‌సత్తా పాలు పంచుకోలేదన్న విషయాన్ని రాష్ట్ర ప్రజలు గమనిస్తున్నారు. లోక్‌సత్తా అధినేత డా॥ జయప్రకాష్ నారాయణ్ ప్రైవేటీకరణను సమర్థిస్తున్నారు. ప్రపంచీకరణ మూలవిరాట్టయిన అమెరికా సమాజాన్ని కీర్తిస్తున్నారు. ప్రపంచ బ్యాంకు షరతుల గురించి, దాని ఆర్థిక దోపిడీ గురించి వారు విస్మరించారు.

ప్రపంచీకరణను సమర్థించేవారు రాజకీయ ప్రజాస్వామ్యం గురించి ఇంతగా ఆరాట పడటం ఎందుకు జరుగుతోంది అన్నది మనముందున్న ప్రశ్న. లోక్‌సత్తానే కాదు, ప్రపంచబ్యాంకు సైతం మూడో ప్రపంచదేశాలు సంచరించుకోవాల్సిన ఉన్నతాశయంగా ప్రజాస్వామ్యాన్ని గురించి ఎందుకు ప్రచారం చేస్తోంది అన్నది దానితో పాటు ఉత్పన్నమయ్యే మరో అనుబంధ ప్రశ్న.

ప్రపంచీకరణ నేపథ్యంలో జాతి-రాజ్యం, సార్వభౌమత్వం అనే రెండు ముఖ్యమైన భావనలను కాలం చెల్లినవిగా ప్రపంచ పెట్టుబడి ప్రకటిస్తోంది.

ప్రపంచరాజ్యం, ప్రపంచపాలన అనేవి సరికొత్త భావనలుగా రూపుదాలుస్తున్నాయి. సరిహద్దులు లేనితనం కొత్త విలువగా ముందుకు తేబడుతోంది. మన చట్టసభలు చేసే నిర్ణయాల్లో ప్రధానమైనది ప్రపంచబ్యాంకు షరతులకు, ప్రపంచ వాణిజ్య సంస్థ (W.T.O) ఒప్పందానికి లోబడి చేసుకునేవే అనే విషయంలో సందేహానికి తావులేని పరిస్థితి నెలకొంది. బడ్జెట్ తయారిలో సైతం ప్రపంచబ్యాంకు ప్రచ్ఛన్న హస్తం ఉంటోంది. మన భవితవ్యం దేశ, రాష్ట్ర రాజధానీ నగరాల్లో కాకుండా వాషింగ్టన్‌లోనో, మరెక్కడో నిర్ణయించబడుతోంది. ఈ విధమైన పరిస్థితిలో మనం ఎన్నుకునే ప్రజాప్రతినిధులకు నిర్ణయాలు చేసేందుకు ఏ పాటి అధికారం/హక్కు/స్వేచ్ఛ ఉన్నాయో మనం అర్థం చేసుకోవచ్చు. అంటే ప్రజాప్రాతినిధ్యానికి నిజ విలువ క్రమంగా తగ్గిపోతోందన్నమాట. ఓటరు తన విజ్ఞత ద్వారా ఎన్నుకునే ప్రభుత్వాలకున్న ప్రభుత్వతత్వం క్రమంగా సన్నగిల్లుతూ దేశ విదేశ పెట్టుబడి కనుసన్నల్లోనూ, వారి ఆజ్ఞల మేరకు నడిచే పరిస్థితి ఏర్పడిందన్నమాట. రాజ్యాంగ అత్యున్నతత్వం ఆవిరయిపోయి అట్లాంటిక్ సముద్రానికి ఆవలనో, ఈవలనో ఉన్న సంపన్న పాశ్చాత్య దేశాల బహుళజాతి కంపెనీల, ప్రపంచబ్యాంకు, ఐఎంఎఫ్, డబ్ల్యుటివో లాంటి సంస్థల నిర్ణయాల్లో నిక్షిప్తమైంది. మనకిప్పుడు రాజ్యాంగంకన్నా డబ్ల్యుటివో ఒప్పందం, ప్రపంచ బ్యాంకు షరతులు అత్యున్నతమైనవి. శిరోధార్యాలు. రాజ్యాంగ ఆదేశిక సూత్రాలు మార్కెట్ తుంగలో తొక్కబడుతున్నాయి. దేశంలో ప్రజాస్వామ్యాన్ని, చట్టబద్ధ పాలనను, రాజ్యాంగ అత్యున్నతత్వాన్ని కాపాడాల్సిన ఉన్నత న్యాయస్థానాలు సైతం దీనికి అనుగుణంగా ప్రవర్తించుకుంటున్నాయి.

ఈ పరిస్థితిలో ప్రపంచబ్యాంకు షరతులకు, డబ్ల్యుటివో ఒప్పందానికి లొంగి పాలించ గలిగిన సామంతరాజ్య పాలకులను ఎన్నుకోవడం మన ప్రజాస్వామ్య టెంకెలో మిగిలిన గుజ్జు. ఇక మహిళలు, దళితులు, బి.సి.లు వారి వారి కోరికలు చట్టబద్ధ హక్కుల గుర్రాలై మన చట్టసభల్లో ప్రాబల్యం పెంచుకొనే నాటికి మిగులబోయేది ఏమిటి అనే ప్రశ్న వేసుకుంటే బాగుంటుంది. పైగా ప్రపంచీకరణ శక్తులకు వ్యతిరేక కార్యక్రమాన్ని నిర్దేశించుకోని బిసి, దళిత శక్తులకు చెందిన కొన్ని ప్రముఖ పార్టీలు చేయగలిగేది ఏమిటి అని కూడా

మనం ఆలోచించాల్సి ఉంది.

సరిగ్గా ఈ పరిస్థితిలో, ప్రపంచీకరణ ప్రక్రియను వేగవంతం చేసే శక్తులు, దాన్ని సమర్థించే సంస్థలు మనబోటి దేశాల్లో ప్రజాస్వామ్యాన్ని సంస్కరించే పనిని చేపట్టాయి. ప్రపంచబ్యాంకు ఉప్పుతింటున్న వ్రాయసగాళ్ళు ప్రజాస్వామ్యం గురించి, చట్టబద్ధ పాలన గురించి పుంఖాను పుంఖాలుగా రచించారు. ప్రపంచబ్యాంకు విధానాలను ఏ మాత్రం విమర్శించని వారు, ప్రైవేటీకరణను పూర్తిగా సమర్థించేవారు ప్రజాస్వామ్యాన్ని నిలబెట్టేందుకు తమ సత్తా చూపుతున్నారు. ఒకవైపు జాతిరాజ్యాన్ని కుళ్ళబొడిచే శక్తులు, సార్వభౌమత్వాన్ని మింగేసే మాయావులు స్థానిక ప్రజాస్వామ్యాన్ని, జిల్లాస్థాయి అభివృద్ధి ప్రణాళికలను గురించి మాట్లాడుతుంటే వీరు వంతపాడుతున్నారు. దేశ సార్వభౌమత్వాన్ని సరిహద్దులు దాటిస్తున్న కాలంలో రాజకీయ ప్రజాస్వామ్య ప్రక్రియలో ప్రజలు మరింత విజ్ఞత ప్రదర్శించడం గురించి పిలుపునిస్తున్నారు. ప్రపంచీకరణ పల్లకీమోస్తున్న వారే ప్రజాస్వామ్యం గురించి మాట్లాడుతున్నారు.

ప్రపంచబ్యాంకుకు మన ప్రజాస్వామ్యం మీద ప్రేమను మన ప్రజల బాగోగుల మీది ప్రేమ అని భ్రమపడరాదు. ప్రపంచబ్యాంకు మేథోప్రవచనంలో ప్రజాస్వామ్య ఆవశ్యకత ఎందుకంటే అదిలేనిచోట మార్కెట్‌శక్తులు అంతిమంగా అనభివృద్ధికిలోనయ్యే అవకాశాలున్నాయి కాబట్టి. ఏనాడో హాబ్స్ మహాశయుడు తన లీవియాథన్ గ్రంథంలో చట్టబద్ధంగా పరిపాలన సాగని చోట వ్యాపారం వృద్ధిచెందజాలదని ఉద్బోధించాడు. కాబట్టి వ్యాపార ప్రయోజనాల కోసం ప్రజాస్వామ్యం అన్నది ప్రపంచ బ్యాంకు సూత్రం. ఇక్కడ ప్రజాస్వామ్యం ఒక రాజకీయ ఎన్నికల ప్రక్రియగా మాత్రమే కాక, సమాజాన్ని వ్యాపారీకరించే పనిముట్టుగా కూడా ప్రపంచబ్యాంకు చూస్తోంది. ఇదే దిశలో లోక్‌సత్తాలాంటి ఎన్జీవోలకు అది ఉత్ప్రేరకంగా పనిచేస్తుంది. అయితే ఏ విజ్ఞత ఓటర్లు ప్రదర్శించాలని ఈ ఎన్జీవోలు కోరుకుంటాయో ఆ విజ్ఞతకు ప్రపంచీకరణ విఘాతం అని మాత్రం అవి ప్రజలకు చెప్పవు, చెప్పజాలవు. ప్రపంచ బ్యాంకు/ డబ్ల్యుటివో కరులు మింగిన మన చట్టసభల నిర్ణయాధికారాలను, మనదేశప్రజల సార్వభౌమత్వాన్ని గురించి అవి ఏ ఉద్బోధా చేయవు. పైగా ఆ కరులకు లగ్నస్థానం అమెరికాను ఆదర్శదేశంగా అవి పదే పదే ఉదహరిస్తుంటాయి.

విజ్ఞతగల ఓటర్లు లేకపోవడంవల్లే ఈ దేశంలో ప్రజాస్వామ్యం అవినీతిపరులను, అధికార మధాంధులను , నేరచరితులను అందలమెక్కిస్తోందని అవి గుర్తిస్తుంటాయి. ఓటరు మహాశయులు ఎలాంటి ప్రలోభాలకు లొంగకుండా ఓటువేయాలి. జాతి, కులం, మతం, కుటుంబంలాంటి ప్రాచీనకాలం నుంచీ వస్తున్న మానవ సామూహికతల బారిపడకుండా ఓటరు ఏకాణుమాత్రుడై దేశ, ప్రపంచ రాజకీయాలను ఆకలింపు చేసుకొని సరైన వ్యక్తులను (వారు ప్రపంచీకరణకు అనుకూలురైతేనే ఓటరుకు విజ్ఞత ఉన్నట్టేమో?) చట్టసభలకు పంపాలి. ఇది లోక్‌సత్తా అధినేత ప్రధాన ప్రచార సారాంశం.

వినడానికి సొంపుగా ఉండే ఈ మాటలు ఆచరణలో ఈదేశంలో సాధ్యం కానివి అని వారు గుర్తించడం మంచిది. ప్రపంచీకరణ క్రమంలో ప్రజలు ఇలాంటి విజ్ఞత ప్రదర్శించడం మరీ అసాధ్యం.

వీరి ప్రకారం విజ్ఞతగల ఓటరు మహాశయుడు/మహాశయి తయారు కావాలంటే. అతను/ఆమె మొదటగా చదువుకున్న వారై ఉండాలి. లేకపోతే ప్రపంచ/దేశ రాజకీయాలను ఆకళింపు చేసుకోవడం సాధ్యంకాదు. కాబట్టి విజ్ఞతగల ఓటరు ఉత్పత్తిలో మొదటిదశ వ్రాయడం, చదవడం. అయితే మన ప్రభుత్వం దారి అక్షరాస్యతా కార్యక్రమంలో భాగంగా నేర్పబడే చదువు మాత్రమే సరిపోదు. ఎందుకంటే మన విజ్ఞతగల ఓటరుకు ఇంగ్లీషు పాండిత్యం కూడా ఉండాలి. (వీలుంటే హిందీ వచ్చివుంటే మంచిది). తెలుగు పాండిత్యం ద్వారా అంతర్జాతీయ, దేశ రాజకీయాలను అర్థం చేసుకోవడం సాధ్యంకాదు. కాబట్టి విజ్ఞతగల ఓటరు ఉత్పత్తికి ఇంగ్లీషు మీడియం చదువుసైతం అత్యవసరం. అదీ అల్లాటప్పా చదువుకాదు. డాక్టర్ జయప్రకాష్ నారాయణ్ లాగా ఉన్నత చదువులు (సైన్స్‌లో కాకపోయినా ఆర్ట్స్‌లో) చదివి వుండాలి. హాబ్స్, లాక్, అబ్రహం లింకన్ విన్‌స్టన్ చర్చిల్ లాంటి వారి గ్రంథభాగాలను ఉల్లేఖించగలిగి ఉండాలి. కాబట్టి విజ్ఞతగల ఓటరుగా మారాలంటే అతను ఉన్నతవిద్యాభ్యాసం చేయాలి. ప్రపంచీకరణ దశలో ఉన్నత విద్యతోసహా విద్యారంగం ప్రైవేటు భోజ్యం అవుతోందికాబట్టి ఓటరు విద్యావ్యాపారుల సరుకులకు, పుస్తకవిక్రేతలకు వినియోగదారుడిగా మారాలి. అందుకోసం నెలకు ఎంతలేదన్నా ఓ వెయ్యిరూపాయలు ఖర్చుపెట్టగలిగి ఉండాలి.

అంతేచాలదు. అతను/ఆమె కనీసం రెండు దినపత్రికలు (తెలుగు, ఇంగ్లీషు) చదవాలి. ప్రపంచీకరణ దిశగా వెళ్తున్న రాష్ట్రప్రభుత్వం గ్రంథాలయాలకు నిధులను తగ్గించి వాటి అంతు చూడాలనుకుంటోంది. కాబట్టి సదరు ఓటరు మహాశయుడు/మహాశయి సొంతగా దినపత్రికలకు చందాకట్టగలిగి ఉండాలి. దినపత్రికలతో పాటుగా ఒకటి లేదా రెండు ఇంగ్లీషు వార/పక్ష పత్రికలను తెప్పించుకుంటే మంచిది. కాబట్టి పత్రికల వినియోగదారుగా నెలకు మరో నూటయాభై రూపాయలు ఖర్చుపెట్టగలిగిన స్థోమత ఉండాలి. అంతేగాక సమాచార విప్లవంవల్ల వెబ్‌సైట్లలో సమాచారం నిక్షిప్తమౌతున్నందువల్ల విజ్ఞత సముపార్జన కోసం నెలకు అథవా మరో వందరూపాయలు అదనపు ఖర్చుగా సమాచార విప్లవసుంకం చెల్లించుకోవాల్సి ఉంటుంది. కేబుల్ కనెక్షన్ లేకపోతే ఇంగ్లీషు ఛానళ్ళద్వారా ప్రసారమయ్యే విజ్ఞత, అసెంబ్లీ పార్లమెంటు సమావేశాల ప్రత్యక్షప్రసారం ద్వారా సజీవంగా పొందే వర్చువల్ విజ్ఞత అందని పక్షంలో మన ఓటరు బోల్తాపడి విజ్ఞత కోల్పోయే ప్రమాదం ఉంది. దాన్ని నివారించడం కోసం అతను మరో నూటయాభై రూపాయలు కేబుల్ ఆపరేటర్‌కు సమర్పించుకోవాలి. విద్యుత్‌చార్జీల భారంవల్ల టీవికి అవసరమయ్యే విద్యుత్తుకు మరో యాభైరూపాయలు చెల్లించుకోగలిగిన సత్తా ఉండాలి. పైగా ఒక టెలివిజన్ సొంతంగా సమకూర్చుకోవాలి. అది రంగుల టివి కాకపోతే అతని విజ్ఞత తెలుపు/నలుపులో మెదడులోకి చేరి రంగుల ప్రపంచంలో ప్రజా ప్రతినిధిని సరిగా గుర్తు పట్టలేకపోయే ప్రమాదం ఉన్నందున విజ్ఞత సంతరించుకొనే ఓటరుకు రంగుల టివి తప్పనిసరి (ప్రజాస్వామ్యంలో పాలకుల ముఖారవిందం ద్వారా ఓటర్లకు లభ్యమయ్యే విజ్ఞతపై ప్రజాస్వామ్యాన్ని నిర్వచించిన అబ్రహం లింకన్ మహాశయుడికే చాలా నమ్మకముంది. ఆయన ఎన్నికల ప్రచారఘట్టంలో గడ్డం మీసాల గురించిన కథ గుర్తుకు తెచ్చుకోండి) ఇవన్నీ కాక రాజకీయాల్లో చురుకుగా పాల్గొనగలిగేందుకూ, ఎన్నికల బహిరంగ సభలకు వెళ్ళేందుకూ, లోకసత్తాలాంటి సంస్థల నేతల ఉపన్యాసాలు వినేందుకు అతను/ఆమె మరికొంత సమయం, ధనం వినియోగించగలిగి ఉండాలి. ఇవన్నీ ఉంటే చాలదు. ఓటరు సంచారజీవి అయివుండరాదు. దానివల్ల అతని విజ్ఞతకు విఘాతం కలిగే ప్రమాదం ఉంది. ఒకచోట స్థిరనివాసం ఏర్పరచుకొని

ఉండటమేకాక (బాగా డబ్బుంటే ఏటైనా తిరిగి రావచ్చుననుకోండి) పైన చెప్పిన లక్షణాలను సంతరించుకొనేందుకు అవసరమైన తీరికా, రాబడీ అతనికి/ఆమెకు ఉండాలి. లేని పక్షంలో విజ్ఞత సముపార్జనకు ఆటంకం కలుగుతుంది.

దీనివల్ల మనం గ్రహించగలిగేది ఏమిటంటే, ఈ దేశంలో నూటికి నలభై శాతంగా ఉన్న దరిద్రులకు 'విజ్ఞత' సంతరించుకొనే అవకాశాలు లేవు అని. రకరకాల వస్తువులకు, సేవలకు వినియోగదారులు కానివాళ్ళు విజ్ఞతగల ఓటర్లుగా మారే అవకాశాలు మృగ్యం. దరిద్రరేఖకు దిగువన ఉన్న 25 నుంచి 30 శాతం ప్రజల నెలసరి ఆదాయం గ్రామాల్లో నెలకు రూ.350/- గా, పట్టణాల్లో రూ.450/- గా ప్రణాళికా సంఘం అంచనావేసింది. వారు ఐదేళ్ళలో శాసనసభలకు, స్థానిక సంస్థలకు జరిగే ఎన్నికల రోజుల్లో ఆదాయం కోల్పోయి ఓటుకోసం క్యూలో నిలుచుండే స్థితిలో కూడా ఉండరు. ప్రపంచీకరణవల్ల, వలసీకరణవల్ల ఈ 'విజ్ఞత' సంతరణ శక్తి కోల్పోయేవాళ్ళ సంఖ్య పెరుగుతూ, కొద్దిమంది మాత్రం 'మహావిజ్ఞుల'య్యే అవకాశాలు పుష్కలంగా లభిస్తున్నాయి. వారిపట్ల విజ్ఞులైన ఓటర్లు అసహనం ప్రదర్శిస్తూ వారు డబ్బుకూ సారా పొట్లాలకూ మరెందుకో అమ్ముడుపోతారని కసిగా విమర్శిస్తుంటారు. కానీ, ఈ దేశాన్ని ఇప్పటివరకూ ఏలింది విజ్ఞత సంతరించుకోగలిగిన ధనిక వర్గాలవాళ్ళే. వారే ఈ దేశాన్ని ప్రపంచబ్యాంకుకు తాకట్టుపెట్టారని మాత్రం ఆ విమర్శకుల ఊహకు అందని విషయం. కట్టెలమ్మేచోట పూలమ్మిస్తున్నారనీ, కొబ్బరిబోండాలు, చెరకురసం బండ్లు తిరుగాడే నేలమీద బొగ్గుపులుసు వాయువు కలిపిన రంగునీళ్ళు 'కోలా'హాలంగా అమ్మిస్తున్నారనీ వారెప్పుడూ విమర్శించిన పాపానపోలేదు సరికదా అలాంటి చర్యలను ఆధునీకరణగా అభివృద్ధిగా కీర్తిస్తుంటారు. ఆధునిక పూర్వ సమాజ సామూహికతనుంచి నేర్చుకోకపోగా, దానిని ధ్వంసించే వలస ప్రజాస్వామ్యాన్ని ప్రజాస్వామ్యానికి ఉన్న ఏకైక నిర్వచనంగా చెప్తున్నారు.

ఇక్కడ ఇవాళ్టి ప్రజాస్వామ్య ప్రవచనం ప్రజలకోసం కాదు. విదేశీ సామ్రాట్టులకోసం. ప్రజాస్వామ్యం ద్వారా ఎన్నికయ్యే ప్రభుత్వాలున్నచోటే మార్కెట్ శక్తులు వేగంగా అభివృద్ధి చెందుతాయి కాబట్టి, ప్రపంచీకరణ శక్తుల మాయోపాయాలకు, ప్రలోభాలకు తేలిగ్గా లొంగగలవు కాబట్టి ఇక్కడ

ప్రజాస్వామ్య ప్రహసనం కావాలి. నియంతలుండి వాటికి సహకరిస్తే కూడా పర్వాలేదు. పనిచేయించుకుంటాయి. ఆ నియంత తమ మాట వినని పక్షంలో ప్రజాస్వామ్య పాట పాడతాయి. తమ గానామృతంలో ప్రజలను ఓలలాడించి, ఎన్జీవోల ద్వారా ఉద్యమాలకు సహకరించి చివరకు తాము చెప్పినట్టు వినే ప్రభుత్వాలున్న ప్రజాస్వామ్యాన్ని పునరుద్ధరిస్తాయి. లాటినమెరికాలో ఇలాంటి ఉదాహరణలు ఎన్నో. ఇరాక్‌లో ప్రజాస్వామ్యం అమెరికాకు అవసరం. చైనాలో ప్రజాస్వామ్యం అక్కడ మూసేసిన మార్కెట్ తలుపులు తెరిపించే అమెరికా గజదొంగ ఓపెన్ సెసేమ్ మంత్రం.

అందువల్ల రాజకీయ ప్రజాస్వామ్యం ఒక నాటకం, ఒక ప్రహసనం మాత్రమే కాదు. అది మనల్ని వలసీకరించే పనిముట్టు. ఆధునిక పూర్వ సమాజాలలో అసలేమాత్రం ప్రజాస్వామ్యం లేదని మనల్ని నమ్మించే పాశ్చాత్య వేటగాళ్ళకొక మంత్రదండం. దేశీయ సామూహికతను విచ్ఛిన్నం చేయగల మంత్రజాలం.

ఈ దేశం గురించీ ప్రజల గురించీ, ప్రజలే తమ దిశానిర్దేశకులయ్యే మార్గాలగురించీ అందుకు అవసరమైన రాజకీయ నిర్మాణాలగురించీ ఆర్తి ఉంటే మనం మొదటగా అందుకు అడ్డంకిగా ఉన్న ప్రపంచీకరణను, పాశ్చాత్యీకరణను ఓడించేందుకు స్వదేశీ ప్రాతిపదికన కృషి చేయాల్సివుంది. మనదైన మానవీయ రాజకీయ పాలనా నిర్మాణం/నిర్మాణాల కోసం అన్వేషణ జరపాలి. అందుకోసం మన శక్తియుక్తుల్ని, వనరుల్నీ వినియోగించాలి. ప్రజలకున్న సంప్రదాయ విజ్ఞతను గౌరవించేవిధంగా రాజకీయాలు రూపుదిద్దుకోవాలి.

**ఫిబ్రవరి 10, 11, 12, 2003 - ఆంధ్రప్రభ దినపత్రిక**

# 24. మాలిమత్ కమిటి: మనది కాని క్రిమినల్ న్యాయవ్యవస్థకు మనవి కాని సంస్కరణలు

నేర విచారణకు సంబంధించిన న్యాయ సంవిధానాన్ని సమీక్షించడం కోసం కేంద్ర ప్రభుత్వం ఇటీవల జస్టిస్ వి.ఎస్. మాలిమత్ కమిటీని నియమించింది.

న్యాయ సంవిధానం ప్రపంచీకరించబడాలనీ, ఇప్పటి రాజ్యశాసనం స్థానంలో మార్కెట్ శాసనం (lex markatoria) రావాలనీ, 'విపణి స్నేహిత న్యాయవ్యవస్థ' నెలకొనాలనీ, నేరాలను అదుపు చేసి మార్కెట్ శక్తుల పురోగతికి మూడవ ప్రపంచ దేశాలు న్యాయ వ్యవస్థలను సంస్కరించుకోవాలనీ ప్రపంచ బ్యాంకు పిలుపునిస్తున్న నేపథ్యంలో ఈ కమిటీ ప్రాముఖ్యత సంతరించుకుంటోంది.

మాలిమత్ కమిటీకి అప్పజెప్పిన పనులు ఇవి: నేరాల విచారణకు సంబంధించిన న్యాయ తత్వశాస్త్రం (Criminal Jurisprudence) లోని మౌలిక సూత్రాలను, సంబంధిత రాజ్యాంగ అధికరణలను పరిశీలించి మార్పులు, చేర్పులు సూచించడం; నేర విచారణ స్మృతి, భారతీయ సాక్ష్యాధారాల చట్టం, భారతీయ శిక్షాస్మృతులను వర్తమాన కాలానుగుణంగా, దేశప్రజల ఆకాంక్షలతో సరిపోయే విధంగా తిరిగి రాయాల్సిన అవసరాన్ని గుర్తించటం; న్యాయ విచారణా ప్రక్రియను క్లుప్తీకరించేందుకు, సామాన్యులకు సన్నిహితం చేసేందుకు, వేగవంతం చేసేందుకు, సులువైనదిగా, చౌకగా చేసేందుకు సిఫార్సులు చేయడం; క్రిమినల్ న్యాయ వ్యవస్థపై సాధారణ ప్రజల నమ్మకాన్ని పెంచేందుకై, అమాయకులను, నేర బాధితులను రక్షించి నేరస్థులను ఏ మాత్రం వదలకుండా శిక్షించేందుకు న్యాయ వ్యవస్థ, ప్రాసిక్యూషన్, పోలీసు వ్యవస్థల మధ్య

సమన్వయం ద్వారా వాటి శక్తిని పెంచేందుకు మార్గాలను సూచించడం; కేసులు పేరుకొని పోవడాన్ని నివారించే పద్ధతుల అన్వేషణ, కొన్ని అంతర్‌రాష్ట్ర, అంతర్‌జాతీయ నేరాలపై కేంద్ర ప్రభుత్వానికి రాజ్యాంగ పరంగా అధికారాలను కల్పించడం గురించిన సాధ్యాసాధ్యాలను పరిశీలించడం.

బ్రిటీషు సామ్రాజ్యవాదులు ప్రవేశపెట్టిన క్రిమినల్ న్యాయ వ్యవస్థ ఆంగ్లో-శాక్సన్ తరహాకు చెందినది. మనకు స్వాతంత్రం లభించిన తర్వాత కూడా దాన్నే మనం కొనసాగిస్తూ వచ్చాం. అది ఆదర్శవంతమైనదనీ, ఆధునిక పూర్వ సమాజాలలో ఉన్న నేర విచారణా సంవిధానాలకు భిన్నమైనదనీ, నాగరికమైనదనీ గొప్పలు చెప్పేందుకు దానికి ఆధారభూతమైన రెండు ప్రాథమిక సూత్రాలను తరచూ చూపిస్తుంటారు. ఒకటి: ఎలాంటి సందేహానికి తావు లేకుండా నిందితునిపై నేరం రుజువయ్యే వరకూ అతనిని/ఆమెను నిర్దోషిగా పరిగణించాలి. నేర విచారణా క్రమంలో ముద్దాయిని నిర్దోషిగా కోర్టు భావిస్తుంది. ఏ మాత్రం సందేహం లేకుండా నేరాన్ని నిరూపించే బాధ్యత ప్రాసిక్యూషన్‌దే. ప్రాసిక్యూషన్ కథనంపై ఒకే ఒక సందేహం తలెత్తినా ముద్దాయిని శిక్షించ వీల్లేదు. రెండవది నేరం ఒప్పించేందుకు ముద్దాయిని బలవంతపెట్టరాదు.

బ్రిటీషు వారు మన దేశాన్ని ఆక్రమించకముందు దేశంలోని వివిధ రకాల స్థానీయ న్యాయ సంవిధానాలు వుండేవి. వాటిని న్యూనతా భావంతో చూసే దృష్టి మనకు అలవర్చేందుకు శ్వేత జాతి పాలకులు ఈ రెండు ప్రాథమిక సూత్రాలను చూపారు. మన ఆధునిక శిష్ట వర్గీయులు వలస న్యాయవ్యవస్థ ప్రేమికులయ్యారు. సరిగ్గా ఇవాళ అవే ప్రాథమిక సూత్రాలను పునస్సమీక్షించాలని జస్టిస్ మాలిమత్ కమిటీని కేంద్ర ప్రభుత్వం కోరుతోంది.

ఈ ప్రాథమిక సూత్రాలకు ఇవాళ్టికే బాగా గౌరవం తగ్గివుంది. మాలిమత్ కమిటీ ద్వారా ఈ పరిస్థితిని చట్టబద్ధం చేసే వీలు కల్పించుకుంటున్నారు. క్రిమినల్ కేసుల్లో రాజీ ధోరణి పెరుగుతున్న కొద్దీ, తీవ్రమైన రాజకీయ నేరాలు పెరుగుతున్న కొద్దీ సాక్ష్యాధారాలు ఎంత బలహీనమైనవైనా తమ వ్యాఖ్యాన అధికారం ద్వారా శిక్షలు విధించే వైఖరి న్యాయ వ్యవస్థలో ప్రబలిపోయింది. అంతేగాక నేర నిరూపణ బాధ్యతను ప్రాసిక్యూషన్ నుంచి తప్పించి నిర్దోషిత్వ నిరూపణ బాధ్యతను ముద్దాయి భుజస్కంధాలపై వుంచుతూ ఇటీవల చట్టరచన

సాగుతోంది. స్త్రీలపై నేరాలకు సంబంధించిన చట్ట భాగాలు, మాదక ద్రవ్యాల చట్టం, నాటి టాడా, నేటి పోటా దుశ్శాసనాలు అందుకు ఉదాహరణలు. ఈ పరిస్థితినే అన్నిచట్టాలకూ విస్తరించదల్చుకున్నట్టు మాలిమత్ కమిటీ విడుదల చేసిన ప్రశ్నావళి చదివితే అనుమానం వస్తుంది. రాజ్యాంగ సమీక్షా సంఘం ఊహించ సాహసించని ప్రాథమిక హక్కుల సంస్కరణను సైతం సూచించే పనిని దానికి అప్పజెప్పారు.

ఇక రెండవ సూత్రానికి సైతం మాలిమత్ కమిటీ గండి కొట్టవచ్చని అనుకునే ఆస్కారం వుంది. ముద్దాయిలు పోలీసు అధికారులకు ఇచ్చే నేరం ఒప్పుకోలును సాక్ష్యంగా న్యాయస్థానాలు స్వీకరించవచ్చని ఇప్పటి పోటాలో అప్పటి టాడాలో నిబంధనలున్నాయి. రెండు వందల సంవత్సరాల వలస పాలనలో ఊహించ వీల్లేని విధంగా 1987లో జారీ అయిన టాడా చట్టంలో మొదటిసారి ఈ నిబంధనలను చేర్చారు. వీటిని అన్ని నేరాలకూ వర్తింపజేసే దిశగా జస్టిస్ మాలిమత్ కమిటీ సిఫార్సు చేస్తుందని దాని ప్రశ్నావళి సూచిస్తోంది. ఏ వ్యక్తినీ తనపై తానే సాక్ష్యం ఇచ్చుకోవలసిందని బలవంత పెట్టరాదన్న రాజ్యాంగంలోని 20(3) అధికరణాన్ని సైతం ఈ క్రమంలో సంస్కరించే అవకాశాలను కమిటీ వెతుకుతోంది.

ముద్దాయి మౌనం క్రిమినల్ కేసుల్లో సత్య నిర్ధారణకు అవరోధంగా ఉందని కమిటీ ప్రశ్నావళి పేర్కొంది. త్వరితగతిన నేరాల దర్యాప్తు, కేసు విచారణ జరిగి ఎక్కువమందికి శిక్షలు పడాలంటే నిర్దోషిత్వ నిరూపణ బాధ్యతను ముద్దాయిపై పెడితే సరిపోదు. అతనితో నేరం ఒప్పించే మార్గాలు వెతకాలి. దాన్నే సాక్ష్యంగా కోర్టులు శిక్ష విధించే అధికారాలు కావాలి. సత్యాన్ని ముద్దాయి పెదవులనుంచి పోలీసు రికార్డుల్లోకి, న్యాయస్థానాల్లోకి చేర్చాలి. ముద్దాయి మౌనభగ్నం దిశగా సంస్కరణలను సూచించమని కమిటీ దేశప్రజలను కోరుతోంది.

మన దేశంలో శిక్షించబడే ముద్దాయిల / కేసుల సంఖ్య చాలా తక్కువనీ, కాలహరణం జరుగుతోందనీ, పోలీసుల అధికార దుర్వినియోగం, వారిచే మానవహక్కుల హరణ పెంపొందిందనీ, క్రిమినల్ న్యాయవ్యవస్థ అసమర్థంగా, ఖరీదైనదిగా, అవినీతిమయంగా తయారైందనీ, అందువల్ల క్రిమినల్ న్యాయ సంవిధానాన్ని సమీక్షించే బాధ్యతను తన కిచ్చారనీ కమిటీ పేర్కొంటోంది. నేర

విచారణా ప్రక్రియను కుదించడం ద్వారా శిక్షల రేటును పెంచి అసమర్థతను కప్పి పుచ్చబోతున్నారు. మొదటి రెండు కారణాలు (శిక్షల రేటు స్వల్పం, కాలహరణం) చూపి ఆధునిక క్రిమినల్ న్యాయవ్యవస్థకు ఆధారభూతమైన రెండు ప్రాథమిక సూత్రాలను రద్దుచేసేందుకు పథకాలు తయారు చేస్తున్నారు. ఫలితంగా మిగిలిన రెండు కారణాలు (పోలీసుల అధికార దుర్వినియోగం, క్రిమినల్ న్యాయ వ్యవస్థలో అవినీతి వగైరా) పెంపొందే దిశగా సంస్కరణలను సూచించబోతున్నారు.

సమాజ స్థానంలో జరిగిన నేరాన్ని, సమాజ బాహ్యామైన న్యాయవ్యవస్థ విచారించబూను కోవడమే వలస క్రిమినల్ న్యాయ సంవిధానంలోని అసలైన లోపం. నేరానికి సమాజ స్థానంలో ఉన్న రుజువులను పరాయీకరించడమే దాని లక్షణం. అది దాని గొప్పతనానికి కారణంగా చూపుతారు.

ఆధునిక క్రిమినల్ న్యాయవ్యవస్థ చేసేపని గతంలో జరిగిన సంఘటనను పునర్నిర్మించే చరిత్రకారుడి పనిలాంటిదే. (కాకపోతే అందుకు బాధ్యులను శిక్షించేపనిని కూడా అది చేస్తుంది). అంటే నేరానికి సంబంధించిన సత్యాన్ని ఆవిష్కరించే పని చేస్తుందన్నమాట. ఇక్కడ సత్యం అఖండ సత్యమేమీ కాదు. అధికారికంగా చట్టాలకు లోబడి నిరూపితమయిన సత్యం (legal truth) మాత్రమే. ఇంకా అనేక సత్యాలు వుండవచ్చు. ఉంటాయి కూడా. (సినీనటి ప్రత్యూష కేసులో పరస్పర విరుద్ధమైన పలు సత్యాలు, వాటిని ప్రచారం చేసే అధికార, అనధికార పాత్రలూ సమాజానికి తారసిల్లాయి. చివరిగా సిబిఐ తన అధికార బలంతో మరో సత్యాన్ని ప్రకటించింది. దాంతో హైకోర్టు సంతృప్తి పడింది). కానీ తన సత్యానికి అఖండత్వాన్ని ఆపాదించుకునేందుకు న్యాయవ్యవస్థ అధికారంపై ఆధారపడుతుంది. అలా అది అధికారిక సత్యాన్ని ప్రకటిస్తుంది. అందువల్ల క్రిమినల్ న్యాయవ్యవస్థ (ఇతర రకాల న్యాయవ్యవస్థలు కూడా) అధికారిక సత్యాన్ని ఉత్పత్తి చేసే కేంద్రం. అలా సత్యాన్ని నిర్ధారించడం వ్యక్తుల స్వేచ్ఛను, ప్రాణాలను, ఆస్తులను హరించే పనితో ముడిపడి వుంటుంది. కాబట్టి న్యాయస్థానాల సత్యాన్వేషణకు, హింసకు అవినాభావ సంబంధం వుంది. మాలిమత్ కమిటీ ద్వారా అది మరింత ప్రస్ఫుటం కానుంది.

నేరానికి సంబంధించిన సత్యం ఎక్కడుందో దానికి దూరంగా ఆధునిక న్యాయస్థానం నెలకొని ఉంటుంది. దీన్నే ఆధునికత గొప్ప ఆదర్శంగా చూపుతుంది. ఎందుకంటే సత్యం స్థానంలో నెలకొని వున్న ఆవేశకావేశాలు, రాగ ద్వేషాలను దూరంగా వుంచుతూ (ఈ పనిని భారతీయ సాక్ష్యాధారాల చట్టం చేస్తుంది). నిరాపేక్షతో, హేతువే ప్రాతిపదికగా ఆధునిక న్యాయస్థానం సత్యాన్ని నిర్ధారించగలదని చెప్తారు. సమంజసమైన, సైన్సుపై ఆధారపడిన నేర విచారణా ప్రక్రియను అది చేపడుతుంది కాబట్టి నాగరికమని/ అభివృద్ధికరమైనదని చెప్తారు. నేర సత్యాన్ని స్థానభ్రంశం చేయకుండా, మానవసహజ లక్షణాల సమ్మిశ్రమంతో కూడిన ప్రక్రియ ద్వారా దాన్ని నిర్ధారించే ఆధునిక పూర్వ న్యాయ సంవిధానాలకు ఆధునిక న్యాయవ్యవస్థకు అవసరమైన ప్రక్రియా పరన్యాయం (Procedural Justice) అవసరం లేదు. అక్కడ నేర నిర్ధారణ చరిత్ర రచన కాదు. ఏ సమాజంలో నేరం జరిగిందో, అచ్చోట కాలాతీతం కాకుండా సత్యాన్ని నిర్ధారించే వీలు ఎక్కువగా ఉంది. సాక్షులు, ఇతర సాక్ష్యాధారాలు తమ ప్రాతినిధ్య స్థాయిలో/మార్మిక స్థాయిలో కాక తేటతెల్లంగా అందుబాటులో వుంటాయి. (రెండు న్యాయసం విధానాల్లోనూ ఆధిపత్య శక్తుల స్వప్రయోజనాలు పాత్ర వహిస్తాయని వేరే చెప్పనక్కర్లేదు).

ఇవాళ ఆధునిక న్యాయవ్యవస్థ పలుకుబడి పెంచే ప్రక్రియాపర న్యాయాన్నించి మాలిమత్ కమిటీ దానిని దూరం చేయబోతోంది. ప్రజల్లో న్యాయవ్యవస్థ ప్రతిష్ఠ పెంచడం పేరుతో దానిని మరింత పీడకురాలిగా మార్చబోతున్నారు. శిక్షలు పడే కేసుల సంఖ్య పెంచడం కోసం సత్య నిరూపణ బాధ్యతను ముద్దాయిపై నెట్టివేస్తున్నారు. న్యాయమూర్తుల, ప్రాసిక్యూటర్ల, పోలీసుల అధికారాలు మరింత విస్తృతమౌతాయి. ముద్దాయికి మౌనంగా వుండే హక్కును భగ్నం చేసి అతని/ఆమె నోట్లో సత్యాన్వేషణ చేస్తారు. ముద్దాయి పెదవి విప్పని పక్షంలో అతనికి/ఆమెకు నష్టకరమైన నిర్ణయాలు చేసే అధికారం కోర్టులకివ్వవచ్చా అని మాలిమత్ కమిటీ ప్రశ్నిస్తోంది. న్యాయమూర్తులను కేవలం న్యాయనిర్ణేతలుగా కాక సత్యశోధకులుగా మార్చవచ్చా అని అమాయక దేశ ప్రజలకు ప్రశ్నను సంధిస్తోంది.

యావజ్జీవ శిక్షను జీవితాంతం జైల్లో ఉంచడంగా నిర్వచించవచ్చా, నేరాలకు తప్పనిసరి కనీస శిక్ష సూచిస్తే బాగుంటుందా, శిక్ష విధింపులో కాఠిన్యం పెంచడం ఎలా, విచారణలో ఉన్న ఖైదీలతో సైతం శ్రమ చేయిస్తే ఎలా వుంటుంది అనే మాలిమత్ కమిటీ ప్రశ్నలు తయారుకానున్న దాని నివేదిక ఎలా ఉండబోతోందో సూచిస్తాయి.

నేరాలకు ఆర్థిక, సామాజిక కారణాల గురించి కమిటీకి అక్కర్లేదు. అందుగురించిన ప్రస్తావన ప్రశ్నావళిలో లేదు. దండధారుల ఘాతుక నేరాల గురించి కూడా దానికి పట్టదు. మనమూ, వారూ అంటే నేరస్తులు (we, the other) దృక్పథం దానికి శిరోధార్యం.

మాలిమత్ కమిటీ ద్వారా కేంద్రం తేనున్న న్యాయ సంవిధానం ప్రపంచీకరణ దశకు సంబంధించినది. అది మార్చదల్చుకున్నది బ్రిటీష్‌వారు మనకిచ్చిన వలస న్యాయ సంవిధానం. రెండూ మనవి కావు. ఇవాళ మనం ఆలోచించాల్సింది - మనదైన దేశీయ న్యాయసంవిధానాల గురించి. వాటిని మెరుగు పర్చడం ఎలానా అనీ, ఇప్పటికీ వాటినే అనుసరించే ప్రజలు ఈ దేశంలో హెచ్చు సంఖ్యలోనే ఉన్నారని గుర్తించడం గురించీ.

**ఫిబ్రవరి 05, 2003 - రాతప్రతి**

# 25. న్యాయవ్యవస్థ ప్రైవేటీకరణకే కొత్త సిపిసి

సివిల్ ప్రొసీజర్ కోడ్‌కు పార్లమెంటు చేసిన సవరణపై న్యాయవాదులు ఇటీవల దేశవ్యాప్తంగా సమ్మెచేశారు. ఢిల్లీ పోలీసులు వారిని బాగా కొట్టడం, దానిపై వారు నిరవధిక సమ్మెచేయడం జరిగాయి. ఈ నేపథ్యంలో సివిల్ ప్రొసీజర్ కోడ్‌కు జరిగిన సవరణలు న్యాయానికిగాని, న్యాయవాదులకుగాని ఏ విధంగా నష్టకరమో వివరించే వ్యాసం ఇది.

సివిల్ కేసుల విచారణలో జరుగుతున్న జాప్యాన్ని నివారించడం కోసం సవరణ చట్టం తెచ్చామని ప్రభుత్వం ప్రజల్లో ప్రచారం చేస్తోంది. ప్రజల దృష్టిలో లాయర్లు జాప్యానికి ప్రతిరూపాలు కాబట్టి ప్రభుత్వం సద్బుద్ధితోనే సవరణ చట్టం తెచ్చిందని ప్రజలు తేలిగ్గా నమ్మే అవకాశముంది. కానీ అసలు విషయం జాప్యం నివారణ కాదు, కోర్టుల్లో జరిగే న్యాయ ప్రక్రియను ప్రైవేటీకరించడం. భారత రాజ్యాంగం కంటే గాట్ ఒప్పందాన్ని, భారత పార్లమెంటు కంటే ప్రపంచ వాణిజ్య సంస్థను ఎక్కువ గౌరవించే పెద్ద మనుషులు చేస్తున్న దుష్క్రియగా సి.పి.సి. సవరణ చట్టాన్ని అర్థంచేసుకోవాలి.

సివిల్ కోర్టుల్లో ముఖ్యంగా దావాలను విచారించే ఒరిజినల్ జ్యూరిస్‌డిక్షన్ ఉన్న కోర్టుల్లో ముఖ్యమైన పని సాక్షుల విచారణ. ముప్పాతిక భాగం కోర్టుపని ఇదే. ఒక దావా విచారణలో కీలకమైన భాగం కూడా ఇదే. కానీ సవరణ చట్టం ఈ పనిని న్యాయస్థానాల వెలుపలికి నెట్టివేస్తుంది. సాక్షులు తాము చెప్పదలచుకున్న సాక్ష్యాన్ని కోర్టు వెలుపలే రాసి అఫిడెవిట్ రూపంలో సమర్పించే ఏర్పాటు చేసింది. ఆ సాక్షిని ఎదుటి పక్షం క్రాసు పరీక్ష చేయాల్సివస్తే అదికూడా న్యాయస్థానాల్లో జరుగదు.

ఆ పని చేసేందుకు కోర్టు ఎవరినో ఒక బయటివ్యక్తిని (ఎవరన్నది సవరణ చట్టం చెప్పలేదు కానీ, ఇప్పటి సంప్రదాయం ప్రకారం లాయర్లనే ఆ పనికి

నియమిస్తారని అనుకోవాల్సి ఉంది) నియమిస్తారు. ఇందుకయ్యే ఖర్చు (కమీషనర్ కివ్వాల్సిన డబ్బు)ను కక్షిదార్లనుంచే ఇప్పించేందుకు కూడా సవరణ చట్టం అనుమతిస్తుంది. అంటే కోర్టులు చేస్తున్న పనిలో ముప్పాతిక భాగం పనిని ప్రైవేటుపరం చేయనుందన్న మాట. (ఇలాచేస్తే జరిగే దురాగతాల గురించి ఎవరి భయాలు వారికున్నాయి. ఇరుపక్షాల లాయర్లు కుమ్మక్కయిన సందర్భాల్లో, కమీషనర్ ఒక పక్షం వహించిన సందర్భాల్లో క్రాసు పరీక్ష సరిగా నమోదయ్యే అవకాశం ఉండదు).

న్యాయస్థానాల పనిని ప్రైవేటీకరించే పని ఇంకోటి కూడా సవరణ చట్టంలో ఉంది. ఏ కేసులోనైనా పార్టీల మధ్య రాజీ కుదరగలదని న్యాయమూర్తి భావిస్తే, ఆ పని చేసేందుకు 'తగిన సంస్థను గానీ, వ్యక్తినిగానీ, నియమించవచ్చు. ఆ సంస్థకు, వ్యక్తికి ఉండాల్సిన అర్హతల గురించి ఈ చట్టం మౌనం వహిస్తుంది.ఆ సంస్థకు, వ్యక్తికి లోక్ అదాలత్‌గా చట్ట ప్రతిపత్తి కల్పించబడింది.

ఇప్పటి వరకూ లీగల్ సర్వీసెస్ అథారిటీస్ చట్టం కింద న్యాయమూర్తితో కూడిన లోక్ అదాలత్‌లు పనిచేస్తుండగా, సవరణ చట్టం ద్వారా పూర్తిగా ప్రైవేటు లోక్ అదాలత్‌లు అమలులోకి వస్తాయి. పైగా ఒకసారి కోర్టు ఇలాంటి లోక్ అదాలత్‌కు ఏ కేసునైనా పంపితే అది తేలేవరకూ విచారణను నిలిపివేయాల్సిందే.

సివిల్ దావాలకు సంబంధించిన సమన్లను ఎదుటి పక్షానికి అందజేసే బాధ్యత ఇప్పటివరకూ కోర్టులు నిర్వర్తిస్తుండగా, సవరణ చట్టం ప్రకారం అది దావా వేసిన వాది బాధ్యతగా మారింది. దావాను దాఖలు చేసిన ముప్పైరోజుల్లోగా తన బాధలు తానుపడి వాదే ప్రతివాదికి సమన్లను రిజిస్టర్ పోస్ట్ ద్వారాగానీ, స్పీడ్‌పోస్ట్, ఇ-మెయిల్, ఫ్యాక్స్, కొరియర్ ద్వారాగానీ అందజేయాల్సి ఉంటుంది.

(ట్రాన్స్‌మిషన్ ఓకే అని వచ్చిన ఫ్యాక్స్ మెసేజస్ అవతలివైపు ప్రింట్ కాకపోవచ్చు. ఇ-మెయిల్ ద్వారా సమన్లు పంపితే అది వెంటనే చూసుకోకపోవచ్చు. ఇ-మెయిల్, ఫ్యాక్స్‌లు సమన్లు పంపేందుకు సరైన పద్ధతులు కావని సవరణ చట్ట రచయిత బుర్రలకు తోచలేదు. ప్రైవేటు కొరియర్, ఎలక్ట్రానిక్ మెయిల్ సంస్థలకు మాత్రమే వారు లాభసాటి బేరాన్ని ఊహించి ఉంటారు).

ఇంతేకాక ప్రజల హక్కులను హరించే పలు సంస్కరణలను ఈ సవరణ చట్టం చేపట్టింది, అందులో ముఖ్యమైనవి - హైకోర్టులో రిట్‌పిటీషన్లు, అప్పీళ్ళు

వగైరాల్లో కేసు సింగిల్ జడ్జి ఇచ్చిన తీర్పుపై ఇద్దరు జడ్జిలతో కూడిన డివిజన్ బెంచిలకు అప్పీలు చేసే వీలుండదు. దీనివల్ల చాలామంది బాధితులుగా మిగలకతప్పదు. నేరుగా సుప్రీంకోర్టుకు వెళ్ళాలంటే అందరికీ వీలయ్యే పనికాదు.

సివిల్ దావాల్లో నోటీసు ముట్టిన ముప్పై రోజుల్లోగా ప్రతివాదులు తమ సమాధానాన్ని కోర్టులో దాఖలు చేయాలి. దానితోపాటు తమ ఏ దస్తావేజుల మీద ఆధారపడి వాదిస్తున్నాడో వాటి అసలు ప్రతులను, సాక్షుల పట్టీని కోర్టులో దాఖలు చేయాలి. ఆ దస్తావేజులను, సాక్షులను తప్ప కర్త వాటిని ప్రవేశపెట్టేందుకు అనుమతించరు. దీనివల్ల ప్రతివాదులు చాలా నష్టపోతారు.

వాది తనిష్టమొచ్చినంతకాలం కేటాయించుకొని దస్తావేజులు సేకరించుకొని సాక్షుల పట్టీ తయారు చేసుకొని దావా దాఖలు చేస్తే, ప్రతివాది మాత్రం ముప్పైరోజుల్లో ఆ పని చేయాల్సిరావడం అన్యాయమే కాక చాలా సందర్భాల్లో అసాధ్యం అవుతుంది. వాదులు కూడా దావాల్లో పేర్కొన్న సాక్షులను తప్ప వేరే సాక్షులను విచారించనివ్వరు. దావాతోపాటు అన్ని దస్తావేజుల అసలు ప్రతులు దాఖలు చేయాలి. ఒక్కోసారి అత్యవసరంగా దాఖలు చేసే దావాల్లో వాదులు నష్టపోయే అవకాశం ఉంది.

కోర్టుల్లో వ్యాజ్యాలకు ప్రధాన కారణం ప్రభుత్వం, దాని విధానాలు, దాని యంత్రాంగం వైఖరి, కొన్ని లక్షలకేసుల్లో ప్రభుత్వం ఏదో ఒక పక్షంలో ఉంటుంది. ప్రభుత్వం కూడా కాలహరణం చేస్తూ కేసుల జీవితాన్ని పొడిగించడం తరచుగా సంభవిస్తున్న విషయమని అందరికీ తెలుసు. అలాగే న్యాయవ్యవస్థ కూడా కేసుల జాప్యానికి మరో ముఖ్యకారణం. ఒక తరహా కేసులన్నింటినీ ఒకేసారి క్షుణ్ణంగా విని ఒక సమగ్ర తీర్పు ప్రకటించి పరిష్కరించడం చాలా సందర్భాల్లో చేయడం లేదు. న్యాయవాదులు కూడా స్వతహాగా వాయిదా ప్రేమికులు కావడం కూడా మరో ముఖ్యకారణం.

ఏదేమైనా సిపిసి సవరణ చట్టంపై చర్చ ఇప్పుడే ప్రారంభమైంది. కనుక దీనిని విస్తృతంగా చర్చించి, అందరి అభిప్రాయాలు తీసుకున్నాకే అమలులోకి తీసుకురావడం మంచిది. కొండనాలుకకు మందేస్తే ఉన్న నాలుక ఊడినట్టు కాకూడదు.

**మార్చి 03, 2003 - నీహార్ ఆన్‌లైన్.కామ్**

# 26. కథనపు ఎత్తుగడలు - శాసనేతర భూమికలు
## (చిలకలూరిపేట బస్ దహనం/చలపతి విజయవర్ధనం)

'నేరాన్ని చరిత్ర ఛేదించే బిందువే హత్య' అన్నాడు మిషేల్ ఫుకొ. 'నేరాన్ని వివరించే కథనం' ఆ ఛేదనా ప్రదేశం అధికారిక పత్రంలో అది ప్రజారంజక రూపంలో ప్రతిపాదించబడి ఉంటుంది. అది నేరస్థాయిని పెంచి చరిత్ర సూక్ష్మభాగాలను కంటికి కనిపించేవిగా చేసి ఆ కథనాన్ని సామాన్యులకు సైతం అందుబాటులో ఉంచుతుంది. ఈ విధంగా అలాంటి కథనాలు 'సుపరిచితమైన సాధారణ విషయాలకు చరిత్రకు మధ్య వినిమయంలో పాత్ర వహిస్తాయి. అన్ని సంస్కృతులు భరిస్తూ అల్పమైన విషయంగా మార్చిన సాధారణ హత్య సరిగ్గా ఈ విధమైన ప్రవచనాన్నే వాహకంగా చేసుకొని, యుద్ధంలో జరిగే 'అనామకగొంతు కోతల' నుంచి తనను వేరుచేసి అనిశ్చిత సరిహద్దులను దాటుకొని చరిత్రలోకి ప్రవేశిస్తుంది - చరిత్ర అంటే ఇక్కడ 'యజమానులు లేని చరిత్ర' హడావిడిగా జరిగే స్వయం చలిత సంఘటనలతో కిక్కిరిసిన చరిత్ర. అధికారానికి అధోభాగంలో జరిగే చరిత్ర. చట్టం మలినపర్చిన చరిత్ర'.

అలాంటి చరిత్ర చిలకలూరిపేట బస్ దహనం కేసు చరిత్ర. లేదా చలపతి విజయవర్ధనరావులపై ఉరిశిక్ష చరిత్ర.

* * * * *

చిలకలూరిపేట బస్ దహనంలో 23 మంది మరణించారు. ఇది 1993 మార్చిలో జరిగింది. ఇద్దరు నిందితులపై హత్యానేరం మోపి విచారణ జరిపారు. సంచలనాత్మకమైన ఈ కేసులో వారికి ఉరిశిక్ష విధించడం ఒక సంచలనం. ఉరితీత చివరి నిమిషంలో ఆగిపోవడం మరో సంచలనం. ఉరి రద్దుచేస్తూ వారిద్దరికీ భారత రాష్ట్రపతి క్షమాభిక్ష పెట్టడం ఇంకో సంచలనం.

సంఘటన జరిగిన వెంటనే నిందితులెవరో తెలియదు. గుర్తు తెలియని వ్యక్తులు బస్‌కు నిప్పంటించారని సాక్షుల కథనం. పాల్గొన్నది ఇద్దరా, నలుగురా అన్నది కూడా సందేహాస్పదమైంది. మరణ వాంగ్మూలాలలో దుండగుల సంఖ్య పలు విధాలుగా ఉంది. ఘటన ఎలా జరిగింది? ప్రమాదమా, కావాలని చేసిందా? దుండగులకు హత్యలు చేయాలనే మనో సంకల్పం ఉందా? ప్రయాణీకులు చనిపోతారనే స్పృహ ఉంటే వారు పెట్రోలు పోసి బెదిరించి దోచుకునే యత్నం చేశారా? లేదా యాదృచ్ఛికంగానో, అనుభవరాహిత్యం వల్ల బస్సుకు నిప్పంటుకుందా? ఈ విషయాలపై అప్పట్లో పత్రికలు పలు కథనాలు ప్రచురించాయి. ఏమైనప్పటికీ చివరికి నేరపరిశోధకుల పని గుర్తు తెలియని దుండగులను తెలుసుకునే ప్రయత్నంగా మారింది. అలా నేరస్తులు ఎవరో తనకు 'తెలియని తనం నుంచి 'తెలిసిన' తనం వరకూ రాజ్యప్రయాణమే ఈ కేసులో నేరపరిశోధన. అది ముగిశాక నేరం జరిగిన తీరుతెన్నులను వివరిస్తూ అభియోగ పత్రంలో రాజ్యం తన కథనాన్ని న్యాయస్థానం ముందుంచింది.

ఇదే దుర్ఘటనను వివరించే కథనాలు అనేకం ఉండవచ్చు. ఆమోదిత అంశాలతో సాహిత్యం, చరిత్ర ఇతర సామాజిక శాస్త్రాలు, తత్వశాస్త్రం ఇదే ఘటనను వివరించే కథనాలు నిర్మాణరీత్యా వేరువేరుగా ఉంటాయి. కథనం పాఠకులపై ప్రసరించదలుచుకున్న ప్రభావాన్ని అనుసరించి రచయితలు కథనపు ఎత్తుగడలను రూపొందించుకుంటారు.

భీభత్స రసప్రదాయక కథకులు ఈ ఘటనను వివరించే కథనంలో దుండగుల భయానక రూపాలను, బాధితుల భయకంపిత స్థితిని, మంటల్లో నిస్సహాయంగా మాడిమసైపోతూ హాహాకారాలు చేస్తూ మృతిచెందిన, గాయాలతో బయటపడిన ప్రయాణికుల పరిస్థితిని కళ్ళకు కట్టినట్టు వివరించడానికి ఎక్కువ ప్రాధాన్యమిస్తారు. అపరాధ పరిశోధక కథకులు మరో విధమైన కథనపు ఎత్తుగడను ప్రయోగిస్తారు. కథ ఎలా మొదలైనా కానీ నిందితులెవరో తెలియని విధంగా కథనాన్ని నడిపిస్తారు. ఉత్కంఠ రేకెత్తించేందుకోసం ఏ పాత్రపైనైనా అనుమానం వచ్చేవిధంగా కథనాన్ని తయారు చేస్తారు. సామాజిక ఆర్థిక తలం నుంచి కథనాన్ని నడిపించే మరో తరహా కథకులు నేరస్తుల ఆర్థిక సామాజిక స్థితిగతుల ఆధారంగా కథనాన్ని రూపొందిస్తారు. అదే తలంలోంచి బాధితుల స్థితిగతులు ప్రధానంగా వివరిస్తూ నేరస్తులపై జాలికాక ద్వేషం పుట్టిస్తూ కూడా

కథనాన్ని సృష్టించవచ్చు. ఎటూ తేల్చుకోలేని సందిగ్ధస్థితిని కూడా ఈ రెండు తరహా కథనాల సమ్మిశ్రమం ద్వారా సాధించవచ్చు. కాబట్టి పాఠకుల మెదళ్ళలో భీభత్సం! ఉత్కంఠ! సామాజిక - ఆర్థిక సహానుభూతి సృష్టించడం ఆయా కథనాల తీరుతెన్నులను బట్టి ఉంటుంది.

* * * * *

గుర్తుతెలియని నేరస్తులు చేసిన నేరం గురించిన కథనం వారి జాడ కనుగొనే ప్రయాణాన్ని ఘటనల వరుస క్రమంలో వివరించవచ్చు. సస్పెన్స్ థ్రిల్లర్ నవలలో లాగా కథనం సాగవచ్చు. లేదా ముందుగా నిందితులెవరో చెప్పివారి పరంగా కథను నడుపుతూ నేరం వరకూ ప్రయాణింప జేయవచ్చు.

చిలకలూరిపేట బస్ దహనం కేసులో రాజ్యం ఈ రెండవ తరహా కథనపు ఎత్తుగడను అనుసరించింది. నేరస్తుల గురించి చెప్పకుండా వారిని గుర్తించే ప్రయత్నాన్ని వివరించే తరహా కథనంతో దానికి ఇబ్బందులున్నాయి. నేరస్తులు వీరేనా అనే సంశయం పాఠక న్యాయమూర్తిలో కలిగే అవకాశానికి అందులో చోటుంటుంది. ముద్దాయిలపై ఎలాంటి సంశయం ఏర్పడకుండా ఉండే రెండవ తరహా కథనం రాజ్య ప్రయోజనాలకు అనుగుణమైనది. వారిని శిక్ష దిశగా నడిపించేందుకు అది తన వంతు పాత్రను నిర్వహిస్తుంది. కానీ, మొదటి తరహా కథనం వాస్తవానికి దగ్గరగా ఉంటుంది. అందులో నిజాయితీ కొంతమేరకైనా ఉంటుంది.

అధికారిక పత్రాల్లో పేర్కొన్న విషయాలను బట్టి సంఘటన తర్వాత అనేక రోజులకు పోలీసులకు అందిన సమాచారం ఇద్దరు ముద్దాయిల (చలపతి, విజయవర్ధన్) అరెస్టుకు కారణమైంది. అప్పటివరకు దుండగులెవరో తెలియదు. వారి సంఖ్య సైతం తెలియదు. పరస్పర విరుద్ధంగా ఇద్దరని కొందరంటే నలుగురని మరికొందరన్నారు. కానీ, అభియోగపత్రంలో పేర్కొన్న కథనం ఈ కేసు ప్రారంభం నుంచి అరెస్టు అయ్యే వరకూ దుండగులు ఎవరో తెలియదన్న విషయాన్ని ఎక్కడా ప్రస్తావించదు. సంఘటనలను వరుసక్రమంలో వివరించడం రాజ్యానికి ఇబ్బంది కావడమే అందుకు కారణం.

**అభియోగ పత్రం కథనం ఇలా ప్రారంభమౌతుంది**

‘‘ముద్దాయిలు గుంటూరు, కోబాల్ట్‌పేట నివాసులు. వారిద్దరూ సన్నిహిత స్నేహితులు. ఒకరిపై ఒకరికి మక్కువ’’.

“మొదటి ముద్దాయి (విజయవర్ధన్) రాడ్ బెండర్. రెండవ ముద్దాయి (చలపతిరావు) పెయింటర్. చాలీచాలని ఆదాయం వారిది. మొదటి ముద్దాయి అవివాహితుడు. తల్లిదండ్రులు లేరు. తన అన్నయ్యతో నివసిస్తున్నాడు.

“మొదటి ముద్దాయి రెండవ వానితో కలిసి తేలిగ్గా డబ్బు సంపాయిద్దామని నిర్ణయించు కున్నాడు. తన చాలీ చాలని ఆదాయంతో సంసారాన్ని ఈదేందుకు ఆర్థికంగా ఇబ్బందులకు గురౌతున్న రెండవ ముద్దాయి తేలిగ్గా డబ్బు సంపాయించేందుకు మొదట వానితో చేతులు కలిపాడు. దోపిడీలు, బందిపోటు దొంగతనాలు చేసి తేలిగ్గా డబ్బు సంపాయించేందుకు ఇద్దరూ కుట్రపన్నారు.

“1993 మార్చి 7 సాయంత్రం 6.30 గంటలకు గుంటూరు నుంచి ఇద్దరూ నర్సరావుపేటకు చేరుకున్నారు..”[2]

ఇలా ప్రారంభమైన కథనంలో ఆ తర్వాత నర్సరావుపేటలో వారేం చేసినది, పెట్రోలు డబ్బు సంపాయించి తెల్లవారుజామున బస్ ఎలా ఎక్కిందీ, తర్వాత బస్‌లో పెట్రోలు చల్లి కత్తితో బెదిరించి, అగ్గిపుల్లతో ముట్టించి, నేర స్థలంనుంచి పారిపోయిన విషయం పూసగుచ్చినట్టు వివరిస్తుంది. పారిపోతున్న ప్రయాణికులను దోచుకొని తిరిగి ఇంటికి చేరడంతో ముద్దాయిల పరంగా కథనం ముగుస్తుంది.

తర్వాత రాజ్యపరంగా కథనాన్ని నడిపారు. “1993 మార్చి 8న ఉదయం 6 గంటలకు కె. నారాయణ స్వామి (ప్రయాణికుడు) చిలకలూరిపేట రూరల్ పోలీసుస్టేషన్‌కు వచ్చి సంఘటన గురించి ఫిర్యాదు చేశాడు. హెడ్ కానిస్టేబుల్ దానిని ప్రాథమిక సమాచారంగా స్వీకరించి ఎఫ్.ఐ.ఆర్. నమోదు చేశాడు.”[3]

తర్వాత అపరాధ పరిశోధన ముద్దాయిలను అరెస్టు చేసిన వైనం ఆ కథనంలో తర్వాతి అంశాలు.

నేరపరిశోధన రాజ్యం నేరస్తుల గురించి ‘అజ్ఞాతం’ నుంచి ‘జ్ఞాతం’ వరకు చేసిన ప్రయాణం కాగా, రాజ్య కథనపు ఎత్తుగడ దాన్ని మార్మీకరించే దిశగా సాగుతుంది. నేరాలు చేయాలనే తలంపు వచ్చిన క్షణం నుంచీ ముద్దాయిలను సర్వాంతర్యామి రాజ్యం నీడలా వెంటాడుతూ గమనించిందన్నట్టుగా అభియోగపత్రంలోని కథనం రచించబడింది. గుంటూరు నుంచి నర్సరావుపేటకు వారి వెంట రాజ్యం ప్రయాణిస్తుంది. రాత్రంతా వారిని గమనిస్తూ తను బస్సెక్కి

ప్రయాణించి ఘోరఘటనను ప్రత్యక్షంగా చూసినట్టుగా ఉంటుందా కథనం. పాఠక న్యాయమూర్తిని కూడా అలా ప్రయాణింపజేస్తుంది.

* * * * *

బస్ దగ్ధం ఘటన రాజ్యానికి తెలిసింది, సంఘటన జరిగిన కొన్ని గంటల తర్వాత. కాబట్టి అభియోగ పత్రం కథనాన్ని తల్లకిందులు చేసి చూస్తే దానిలో మార్మికత తొలగిపోతుంది.

కేసులో సంఘటనలను వరుసక్రమంలో వివరించేందుకు అనేకచోట్ల ప్రారంభించవచ్చు. బాధితుడి పరంగా లేదా ముద్దాయి పరంగా. కానీ రాజ్యపరంగా చెప్తే మొదట రాజ్యం దృష్టికి ఈ నేరం వచ్చిన దగ్గర్నుంచి ప్రారంభించాలి.

చిలకలూరిపేట రూరల్ పోలీసుస్టేషన్‌లో కూర్చున్న ఒక హెడ్ కానిస్టేబుల్ ఈ ఘటన గురించి మొదటగా తెలుసుకున్న రాజ్యప్రతినిధి. నారాయణస్వామి అనే ప్రయాణికుడి వాంగ్మూలం ద్వారా అతనికి అది తెలిసింది. ఏం తెలిసింది? నలుగురు గుర్తు తెలియని వ్యక్తులు బస్ దగ్ధం చేసి ఘోరకలికి పాల్పడ్డారని.

ఈ విషయంతోనే అభియోగ పత్ర కథనం ప్రారంభం కావడం న్యాయం. కానీ రాజ్యానికి ఇలాంటి ప్రారంభంతో ఇబ్బందులున్నాయి. ప్రాథమిక సమాచారంలో దుండగుల పేర్లు లేకపోగా, కనీసం వారి గుర్తింపు వివరాలు సైతం లేవు. దుండగుల సంఖ్య రీత్యా నలుగురు అని ఉంది. కాబట్టి అభియోగ పత్ర కథనాన్ని దీంతో ప్రారంభించకుండా, నేరపరిశోధన ముగింపు నాటికి తేలిన విషయాలను మొదటికి తెచ్చి కథనాన్ని నడిపారు. ప్రాథమిక సమాచార నివేదికలో దుండగుల పేర్లు లేవని కానీ, గుర్తింపు వివరాలు లేనేలేవని కానీ, వారి సంఖ్య నాలుగు అని చెప్పబడిందనిగానీ ఎక్కడా అభియోగ పత్ర కథనంలో ప్రస్తావించలేదు. ఆ విధంగా వాటి గురించిన మౌనం అభియోగ పత్ర కథన రచనలో రాజ్యం ఎదుర్కొన్న ఇబ్బందికర క్షణాలను గుర్తుచేస్తుంది.

నేరానికి పాల్పడిన వారి సంఖ్య ప్రాథమిక సమాచారంలో ఉన్న 4 నుంచి నేరపరిశోధనలో 2గా దిగజారిన ఫలితంగా, ప్రాథమిక సమాచార నివేదికలో నలుగురు మనుషుల మధ్య జరిగిన నేర శ్రమ విభజనను ఇద్దరికే కుదించాల్సి రావడం వల్ల రాజ్యం మరింత ఇబ్బందికి లోనైంది. ఆ ఇబ్బందులను

అధిగమించేందుకు కథనపు టెత్తుగడలను రూపొందించారు. నేరానంతరం రాజ్యానికి ముద్దాయిల గురించి ఏర్పడిన జ్ఞానాన్ని దానికి ముందునుంచే ఏర్పడిన జ్ఞానంగా కథనాన్ని రూపొందించారు.

కేసు విచారణ జరిపిన న్యాయమూర్తి సైతం దాన్ని అంగీకరించక తప్పలేదు. ఆయన తీర్పులో ఇలా పేర్కొన్నారు.

“ఏమైనప్పటికీ, నేర పరిశోధక సంస్థ నేర పరిశోధన చివరి భాగంలో ఈ అసంబద్ధతను సమాధానపర్చడంలో విఫలమైందని నిజాయితీగా ఒప్పుకోకతప్పదు. నేరం చేయడంలో ఈ ఇద్దరు ముద్దాయిలు మాత్రమే పాల్గొన్నారనే నిర్ణయానికి అది ఎలా వచ్చిందనే విషయం పై స్పష్టమైన తన కథనంతో అది ముందుకు వచ్చి ఉండాల్సింది. నేర పరిశోధన దశలో దాన్ని స్పష్టీకరించేందుకు అది ఎలాంటి ప్రయత్నమూ చేయలేదు. కేసు విచారణ కాలంలో కూడా ప్రత్యక్షసాక్షుల ద్వారానైనా దాన్ని స్పష్టం చేసేందుకు ప్రాసిక్యూషన్ ప్రయత్నించలేదు.”

* * * * *

ఆధునిక క్రిమినల్ న్యాయవ్యవస్థలో కథనాల పాత్ర చాలా ఉంటుంది. న్యాయ నిర్ణయాన్ని ప్రభావితం చేసేందుకు ఇరుపక్షాలూ కథనాలను ఆశ్రయిస్తాయి. అందుకే క్రిమినల్ ట్రయిల్‌ను కథనాలపై పోరాటంగా ఎలైన్‌స్కారీ[4] అభివర్ణిస్తారు. తమ పక్షం తరపున ఆ పోరాటాన్ని అటు ప్రాసిక్యూటర్‌లు ఇటు డిఫెన్స్ న్యాయవాదులు నిర్వహిస్తారు.

ఆధునిక పూర్వన్యాయ నిర్ణయ ప్రక్రియలో కథనాలకు ఇలాంటి పాత్ర ఉండదు. ఆ ప్రక్రియ సత్యం స్థానంలో నెలకొని ఉన్నందున వాటికి కథనాలు, కథన ప్రతినిధులైన న్యాయవాదులూ, హేతువు, సైన్స్ అవసరం ఉండదు. సత్య స్థానం నుంచి న్యాయస్థానం దూరం పెరిగినకొద్దీ వాటి అవసరం పెరుగుతూ పోతుంది. హేతుబద్ధ కల్పన, కాల్పనిక హేతువు న్యాయ నిర్ణయ ప్రక్రియను పరివేష్టితం చేస్తాయి. న్యాయస్థానాలకు ప్రియమైన కాల్పనిక కథనాలు రాజ్యమేలుతాయి. రాజ్యమూ, నిందితులూ ఈ తరహా నైపుణ్యాన్ని సంతరించుకుంటారు. మనుషులపై నమ్మకాలు సడలిన ఆధునిక సమాజంలో సత్యం స్థానాన్ని కల్పన తరచూ ఆక్రమిస్తుంది. సత్యం కూడా కల్పనతో తోడు లేకుండా మనుగడ సాగించలేకపోతుంది.

ముద్దాయిల సామాజిక, ఆర్థిక నేపథ్యాన్ని వివరించే వాక్యాలతో అభియోగపత్ర కథనం ఎందుకు మొదలైంది?

మొత్తం కేసు రికార్డును పరిశీలిస్తే ముద్దాయిల ఆర్థిక, సామాజిక స్థితిగతులను వివరించే సందర్భాలు చాలా తక్కువగా కనిపిస్తాయి. అభియోగపత్రం శీర్షికలో ముద్దాయిల కులం ('హరిజన-మాల') ప్రస్తావించబడింది. మొత్తం కేసు రికార్డులో అక్కడొక్కచోట మాత్రమే - అక్కడైనా ప్రస్తావించాలన్నది శాసన ఆదేశం కానప్పటికీ - కులం ప్రస్తావన ఉంది. అది రాజ్య కథనపు ఎత్తుగడ. దానికీ ఒక ప్రయోజనం ఉంది. ముద్దాయిలు నేర ముద్ర కలవారని చెప్పడం దాని ధ్యేయం.

ఆర్థికవేత్త, సామాజిక శాస్త్రవేత్త, క్రిమినాలజిస్టు, చరిత్రకారుడు - వీరి దృక్పథం నుంచి చూస్తే అభియోగ పత్రంలోని మొదటి మూడు నేరాలు ఈ నేరానికి కారణభూతమైన సామాజిక ఆర్థిక శక్తుల వివిధ పార్శ్వాలను పరిశోధించేందుకు అవసరమైన కూపీని అందిస్తాయి. ఈ ఘోరకలిని మరో విధంగా అలా ఆవిష్కరించే వీలు కలిగిస్తాయి. 'కోబాల్టు పేట', 'రాడ్‌బెండర్', 'పెయింటర్', 'చాలీచాలని ఆదాయం', 'తల్లిదండ్రులు లేకపోవడం', 'కుటుంబ పోషణలో ఆర్థిక ఇబ్బందులు', 'తేలిగ్గా డబ్బు సంపాయించాలనే కోరిక', 'దోపిడీలు', 'బందిపోటు దొంగతనాలు' - ఇవన్నీ సామాజిక శాస్త్రాల ప్రవచనంలో మన సామాజిక, ఆర్థిక, నైతిక, న్యాయపర పునాదుల గురించిన విమర్శగా రూపొందుతాయి. ఈ పరిస్థితులన్నిటికీ రాజ్యం ఎలా బాధ్యురాలో నిరూపిస్తాయి.

కానీ, రాజ్య కథనానికి వేరే ప్రయోజనముంది. వేరే మనో సంకల్పముంది. కథన కల్పనలో రాజ్యం చేసేది చరిత్రకారుడి పని కానేకాదు. రాజ్యం సామాజిక శాస్త్రవేత్తాకాదు. క్రిమినాలజిస్టు కాదు. తత్వవేత్తా కాదు. ఆర్థిక శాస్త్రవేత్త అంతకన్నా కాదు. అది చేసేది నేరముద్రలున్న ఒక తరహా మనుషులను తన ఉక్కుపాదం కింద తొక్కి వేసేపని. జైళ్ళకు తరలించేపని, ఉరికంబం ఎక్కించే పని. అందుకు అది ముద్దాయిల సామాజిక, ఆర్థిక స్థితిగతుల కథనాన్ని ముందుకు తెచ్చింది. కేసు విచారణలో అందుగురించి ఇసుమంతైనా సాక్ష్యం చూపనప్పటికీ దాని ప్రయోజనం నెరవేరింది.క్రింది కోర్టు నుంచి అత్యున్నత న్యాయస్థానం వరకూ న్యాయమూర్తులు రాజ్యం ఎత్తుగడను అర్థం చేసుకోలేదు. తెలియకుండానే

దాని ప్రభావానికి లోనయ్యారు. తమకు తక్కువ శిక్ష విధించమని కోరుతూ ముద్దాయిలు కూడా తమ సామాజిక, ఆర్థిక నేపథ్యాన్ని చూపే యత్నం చేశారు. కానీ, దాన్ని న్యాయస్థానాలు పరిగణించలేదు. కానీ రాజ్యం మాత్రం తను ఆశించిన ప్రయోజనాన్ని మాత్రం ఈ నేపథ్య వివరణవల్ల పొందగలిగింది. ముద్దాయిల నేపథ్యం వారికి నేరం చేసే అవసరం, సందర్భం వారికి ఏర్పడ్డాయి అనేది నిరూపించడంలో అలా రాజ్యం విజయం సాధించింది.

* * * * *

ముద్దాయిలు నేరం చేశారని నిర్ధారించాక, శిక్ష ప్రకటించే ముందు న్యాయమూర్తి వారిని తమ 'గత ప్రవర్తనను, సామాజిక, ఆర్థిక నేపథ్యాన్ని, శిక్ష తగ్గించే వీలు కల్పించే పరిస్థితులను' న్యాయస్థానం ముందు ఉంచవలసిందిగా కోరారు. ముద్దాయిల స్పందన గురించి తీర్పులో ఇలా రాశారు.

"ముద్దాయిలను తమపై ప్రకటించాల్సిన శిక్ష గురించి ప్రశ్నించడం జరిగింది.

తన వయసు 23 సంవత్సరాలని, అవివాహితుడననీ, తన తల్లి వృద్ధురాలనీ మొదటి ముద్దాయి చెప్పాడు. రాడ్-బెండర్ వృత్తి చేస్తున్నానన్నాడు. తను నేరం చేయలేదన్నాడు. శిక్ష విషయమై కోర్టు దయతల్చాలన్నాడు.

తన వయసు 20 సంవత్సరాలనీ, తనకు పెళ్ళయిందనీ రెండవ ముద్దాయి చెప్పాడు. భార్య, పసిప్రాయంలో ఉన్న కూతురున్నారనీ, తల్లిదండ్రులు బాగా వృద్ధులనీ, తన కుటుంబ సభ్యులందరినీ తనే పోషించాల్సి ఉందన్నాడు. పెయింటర్‌గా పనిచేస్తున్నానన్నాడు.[5] నేరం చేయలేదని చెప్పాడు. శిక్ష గురించి కోర్టు దయతల్చాలని అభ్యర్థించాడు.

తాము దళితులమని ముద్దాయిలు చెప్పలేదు. అలా చెప్తే తమపై నేరముద్ర మరింతగా పడుతుందని వారు భయపడి ఉండవచ్చు. తమ పేదరికం గురించి సైతం వారు ప్రత్యేకంగా చెప్పలేదు. కేవలం తమ వృత్తుల గురించి మాత్రమే చెప్పారు. తమకు ఉపయోగకరమైన వృత్తులున్నాయి. కాబట్టి నేరం చేయాల్సిన అవసరం లేదని వారు చెప్పదల్చుకొని ఉండవచ్చు. వృత్తి గురించి చెప్పాక నేరం చేయలేదని చెప్పడం దాన్నే సూచిస్తుంది. వారి కథనం నుంచి

‘కులం’, ‘పేదరికం’ కనుమరుగయ్యాయి. వ్యక్తిగత ఆస్తి గురించిన హింసాత్మక నేరాల (దొంగతనం, దోపిడి వగైరా) కేసుల్లో ప్రాసిక్యూషన్ ఎప్పుడూ కులం, ఆర్థిక స్థితిగతుల మీద ఆధారపడి నేరస్తులు నేరం చేసే అవకాశం ఉందని, అలాంటి అవసరం వారికి ఏర్పడిందని నిరూపించే ప్రయత్నం చేస్తుంటుంది. డిఫెన్స్ లాయర్లు మాత్రం ముద్దాయిలకు ఆదాయవనరులిచ్చే గౌరవ ప్రదమైన వృత్తులున్నాయి. కాబట్టి వారికి వ్యక్తిగత ఆస్థిపై చేయి వేయాల్సిన అగత్యం లేదని వాదిస్తుంటారు. సరిగ్గా అలాంటి ఎత్తుగడలనే అటు ప్రాసిక్యూషన్, ఇటు ముద్దాయిలు తమ కథనాల్లో ప్రయోగించారు.

తమపై ఆధారపడిన కుటుంబాలు ఉన్నాయనే కథనంపై ముద్దాయిలు ఉరిశిక్ష నుంచి తప్పించుకునే ప్రయత్నం చేశారు. కానీ, అధికార కథనానిదే పై చేయి. ముద్దాయిలపై ఆధారపడిన కుటుంబాలుండటం కూడా వారు నేరస్తులేనన్న రాజ్య కథనాన్ని బలపర్చేదే. ఎందుకంటే, అదే వారి నేరానికి హేతువు అని రాజ్యభావన. నిజానికి, ఆర్థిక సామాజిక దృష్టి నుంచి చూస్తే యాభై ఏళ్ళ స్వతంత్ర భారతంలో ఒకానొక సంపన్న నగరంలో మురికివాడలో పెంటకుప్పలపై పెరిగిన దళిత ముద్దాయిలు హైస్కూలు చదువును దాటలేని దరిద్రంలో అసంఘటిత రంగంలో కూలీలుగా పనిచేస్తూ చాలీచాలని ఆదాయం పొందడం వారిని నేరానికి పురికొల్పిన ప్రధాన హేతువు. అలా రాజ్యమే వారి నేరానికి హేతువుల్లో ప్రధాన పాత్రధారి. (వ్యక్తులుగా వారి మనో సంకల్పానికి వారిని కూడా బాధ్యులుగా గుర్తించడం లేదని అపార్థం చేసుకోరాదు). కానీ రాజ్యహేతువు కోసం వారు శిక్షంచబడాలి. రాజ్యమే దానికోసం పరితపిస్తుంది. వారెంత తొందరగా, ఎంత ఎక్కువగా శిక్షించబడితే రాజ్యానికి అంత ఉపశమనం. ఎందుకంటే, తనే హేతువు అన్న విషయాన్ని వారి శిక్ష మార్మీకరిస్తుంది. ఈ మార్మికత రాజ్య అవసరం.

శిక్ష మోతాదుని నిర్ణయించేందుకు ముద్దాయిల ఆర్థిక, సామాజిక నేపథ్యాన్ని ఆహ్వానించిన న్యాయమూర్తి వారి కథనాలను నామమాత్రంగా కూడా అందుకు వినియోగించకపోవడం ఆశ్చర్యం. అవి శిక్ష మోతాదును తగ్గించలేవని కూడా ఆయన తీర్పులో పేర్కొనలేదు. చర్చించలేదు. ముద్దాయిల ‘లక్ష్యం ధనార్జనే’

అనే ప్రాసిక్యూషన్ కథనంపై తీర్పు ఆధారపడింది. ఈ ధనార్జనా సిద్ధాంతాన్ని నిరూపించేది వారి ఆర్థిక సామాజిక నేపథ్యం. అంటే, న్యాయమూర్తి వారికి ఉరిశిక్ష విధిస్తూ ఇలా రాశారు.

"ఇలాంటి తరహా మనుషులను మరణ శిక్ష నుండి తప్పించుకోనిస్తే అది న్యాయస్రావానికి దారితీస్తుంది. సామాన్యుడు న్యాయవ్యవస్థలో విశ్వాసం కోల్పోతాడు."[6]

* * * * *

ఆధునిక న్యాయవ్యవస్థలో సామాన్యుల విశ్వాసం, దాని అంతర్ధానం - రెండూ న్యాయమూర్తికి ప్రాథమిక విషయాలుగా శిక్ష ప్రకటించే సందర్భంలో కనిపించాయి.

ఈ 'సామాన్యుడు' ట్రయల్ న్యాయస్థానం తీర్పులోని చివరి పేజీకి ముందు పేజీలో దర్శనమిస్తాడు. కేసు రికార్డులో ఇంకెక్కడా అతనికి స్థానం లేదు. ఎవరీ 'సామాన్యుడు?' ఈ 'సామాన్యుడి' గురించి న్యాయమూర్తి 'న్యాయపరమైన జ్ఞానం'[7] ఎలా పొందగలిగాడు? ఈ అజ్ఞాత 'సామాన్యుడు', న్యాయపరంగా 'జ్ఞాతుడు' కాలేని 'సామాన్యుడు' న్యాయవ్యవస్థ గురించి ఏం ఆలోచిస్తాడో న్యాయమూర్తి ఎలా తెలుసుకోగలిగాడు! శాసనేతర భూమికలో ఉన్న తన ఈ 'సామాన్యుడి'కి న్యాయవ్యవస్థలో అప్పటికే విశ్వాసం ఉందని న్యాయమూర్తి ఎలా భావించగలిగాడు? ముద్దాయిలకు ఉరిశిక్ష వేయకపోతే ఆ 'సామాన్యుడు' న్యాయవ్యవస్థలో విశ్వాసం కోల్పోతాడని న్యాయమూర్తి ఎలా నిర్ధారించాడు? అలా విశ్వాసం కోల్పోతే ఏం జరుగుతుందని న్యాయమూర్తి భయపడ్డాడు?

ఈ ప్రశ్నలు హేతుబద్ధంగా ఉన్నప్పటికీ, న్యాయశాస్త్రానికి బయట ఉన్న వారికి అహేతుకంగా కనిపించవచ్చు. కానీ, న్యాయశాస్త్రంలో వీటికి చోటు ఉంది. ఖచ్చితమైన జాగా ఉంది. న్యాయశాస్త్రంలో సైతం ఈ జాగాను నిరాకరిస్తే, న్యాయశాస్త్రం శాసనేతర తలానికి తరలిపోతుంది. అప్పుడది న్యాయశాస్త్రంగా రద్దౌతుంది.

ఈ కేసులో న్యాయశాస్త్రం శాసనేతర పథంలో ప్రయాణించి శాసనేతర భూమికను చేరుకుంది. తన అంతిమ లక్ష్యమైన శిక్షను చేరుకొనేందుకు అది

కథనపు టెత్తుగడలను రంగంలోకి దించింది. ఇంకోవిధంగా చెప్పాలంటే, నేరానికి శిక్షకు ఉన్న శాసన సరళ రేఖను శాసనేతర భాగాలతో సంప్రదించింది. శాసన భాగాలు ఆ సరళరేఖను విచ్ఛిన్నం చేసి నేరాన్ని శిక్ష దగ్గరకు చేరకుండా చేస్తాయని న్యాయశాస్త్రం భయపడింది.

'నేరముద్రలు', 'సామాన్యుడి విశ్వాసం' అనే రెండు శాసనేతర విషయాలు ఈ కేసు మొత్తం న్యాయ నిర్ణయ కార్యాచరణలో ఆవరించాయి.[8] అందుకు కథనాలను, కల్పనను తోడు చేసుకున్నాయి.

న్యాయ నిర్ణయం జ్ఞానసిద్ధాంతానికి సంబంధించినది కాదనీ, అది అధికార బల ప్రదర్శనా ఫలితమని ఆధునిక న్యాయవ్యవస్థ మరోసారి నిరూపించింది.

* * * * *

ముద్దాయిలకు భారత రాష్ట్రపతి క్షమాభిక్ష పెట్టి ఉరిశిక్షని యావజ్జీవ కారాగారవాస శిక్షగా మార్చాక హిందూ దినపత్రిక సంపాదకీయంలో ఇలా రాసింది. "ఈ సంచలనాత్మక నేరం వెనుక నిజమైన ఉద్దేశాలను చూడటం రాష్ట్రపతి నిర్ణయాన్ని ప్రభావితం చేసి ఉంటుంది. నేరానికి దారి తీసిన పరిస్థితులను పరిగణించి అదే నిర్ధారణకు కోర్టులు వచ్చి ఉండవచ్చు కదా అని ఎవరైనా ఆశ్చర్యపోవచ్చు. మరణశిక్ష పట్ల సరైన దృక్పథం అనే ప్రశ్న ఇక్కడే ఉత్థానం అవుతుంది."

కానీ, శిక్ష విధించే నాటికి ఉన్న అధికార మనో సంకల్పం, శిక్ష తగ్గించే నాటికి మారింది. అది ఉరిశిక్ష వ్యతిరేక ఉద్యమం వల్ల జరిగింది. ముద్దాయిలు దళితులని దళిత ఉద్యమం ఘోషించడం వల్ల జరిగింది. శిక్ష విధించేనాటి 'సామాన్యుడు' అభేద్యుడు. వాడు మరణశిక్షే సరైన శిక్షగా భావించినవాడు. శిక్ష తగ్గించే నాటికి 'సామాన్యుడు' శకలాలయ్యాడు. సామాన్యులు అయ్యారు. న్యాయమూర్తిగారి 'సామాన్యుడు' తర్వాత బహువచనంలోకి మారిన సామాన్యులు ఒకరు కారు. ఉరిశిక్ష పట్ల మనసు మార్చుకున్నవారు. ఉరిశిక్ష అమలు పరిస్తే వ్యవస్థలో విశ్వాసం కోల్పోయేవారు. వారు 'చిలకలూరిపేట బస్ దహనం కేసు'ను దళిత కథనంతో 'చలపతి విజయవర్ధనం'గా పేరుమార్చిన వారు.

'సామాన్యుడు' న్యాయవ్యవస్థ గురించి ఏం ఆలోచిస్తాడు. అనేది ఊహించడం అహేతుకమైన అమాయకమైన ప్రశ్నలాగా కన్పించినప్పటికీ, అది అధికారం దట్టించి ఉన్న ప్రశ్న. ఈ కేసులో ఆ ప్రశ్నే చావు బతుకుల ప్రవచన సృష్టికర్త. న్యాయస్థానాల్లో కేసులు కేవలం కథనాలపై పోరాటాలేకాదు. న్యాయస్థానాల బయట అధికారంపై జరిగే పోరాటానికి ప్రతిఫలనాలు అని నిరూపించే ప్రశ్న.

**పాదసూచికలు**

1. రంజిత్ గుహ, చంద్రాస్ డెత్, సబాల్టన్ స్టడీస్ వాల్యూం.V (సం॥ రంజిత్ గుహ) (ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీ ప్రెస్, 1996) పేజీలు 139-140. ఇందులో వుల్లేఖించిన భాగాలు మిషేల్ ఫుకో విరచిత Mol, Pierre Riviere.... నుంచి.
2. గుంటూరు 3వ అదనపు సెషన్స్ న్యాయస్థానంలో విచారణ జరిగిన సెషన్స్ కేసు నెం.662/1993 కేసు ఛార్జి షీటు నుంచి ఈ కేసులో ట్రయల్ న్యాయస్థానం 1995 సెప్టెంబర్ 7న తీర్పు వెలువరించింది.
3. అదే.
4. Elaines Carry, Speech Acts in Criminal Cases in Laws stories, Ed. by Peter Brooks and Paul Gevertz, Yale University Press, 1996 (167)
5. గుంటూరు 3వ అదనపు సెషన్స్ న్యాయస్థానంలో విచారణ జరిగిన సెషన్స్ కేసు నెం.662/1993 కేసు ఛార్జి షీటు నుంచి ఈ కేసులో ట్రయల్ న్యాయస్థానం 1995 సెప్టెంబర్ 7న తీర్పు వెలువరించింది.
6. అదే.
7. కొన్ని విషయాలను న్యాయస్థానాలు ఎలాంటి సాక్ష్యాధారాలు లేకుండానే పరిగణించ వచ్చని భారత సాక్ష్యాధారాల చట్టంలోని 57వ సెక్షన్ చెప్తుంది. అలా పరిగణించడాన్ని Judicial Notice తీసుకోవడం అంటారు. ఉదాహరణకు, సూర్యుడు తూర్పున ఉదయిస్తాడనీ, పశ్చిమాన అస్తమిస్తాడనీ, కుక్క పెంపుడు జంతువు అనీ ఇలాంటివి. కానీ, 'సామాన్యుడు' మాత్రం అలా జుడీషియల్ నోటీస్ పరిధిలోకి రాడు.
8. హైకోర్టు సైతం అలాంటి ప్రస్తావన చేసింది. కాకపోతే 'సామాన్యుడు' కాక 'పౌరులు' అని చెప్పింది. సుప్రీంకోర్టు కూడా ట్రయల్ న్యాయస్థానంలోని 'సామాన్యుడు' ఉన్న వాక్యాలను ఆమోదిస్తూ కోట్ చేసింది. హైకోర్టు తీర్పు కోసం-1996 CRI.L.J 703 సుప్రీంకోర్టు తీర్పు కోసం - (1996) 6 SCC 241 చూడండి.

**నవంబర్, 2003 - మిసిమి**

# 27. ప్రపంచ సోషల్ ఫోరం ఎందుకు?

ప్రపంచీకరణ పేరుమీద ఆర్థిక వ్యవస్థలను సరళీకృతం చేసే చర్యలు గత దశాబ్దకాలంలో ఊపందుకున్నాయి. ప్రభుత్వరంగ పరిశ్రమలను ప్రైవేటీకరించడం, విదేశీపెట్టుబడులకు ద్వారాలు తెరవడం లాంటి అనేక మౌలిక చర్యలను దశలవారీగా మూడవ ప్రపంచదేశాలలో చేపట్టారు. ప్రపంచంలోని ఆధిపత్య ఆర్థికశక్తుల, సంస్థల ఆదేశాలమేరకు ఈ 'సంస్కరణల'ను ముమ్మరం చేశారు. ఫలితంగా దేశీయ ఆర్థిక వ్యవస్థలు మునుపటికంటే మరింతగా పాశ్చాత్య దేశాలకు వలసలుగా మారాయి. దేశీయ పరిశ్రమలు సంక్షోభం దిశగా ప్రయాణించగా పలువర్గాల ప్రజలు అంచుకు విసిరివేయబడుతున్నారు. కొద్దిశాతం పై స్థాయి వినియోగదారులకు మాత్రం సకల సౌకర్యాలు, సంపదా లభిస్తున్నాయి. సాంస్కృతికరంగంలో కూడా మూడవ ప్రపంచ దేశాల ఉనికికి ప్రపంచీకరణ ముప్పుగా తయారౌతోంది. జాతి-రాజ్యం పాత చింతకాయ పచ్చడి అనే వాదన ముందుకొచ్చి ప్రపంచ రాజ్యం దిశగా ప్రయాణం సాగుతోంది.

ఈ నేపథ్యంలో ప్రజలలో పెల్లుబుకుతున్న అసంతృప్తి గత నాలుగైదేళ్ళలో తీవ్రరూపం దాల్చింది. సియాటెల్‌లో 1999లో ప్రపంచవాణిజ్య సంస్థ (W.T.O) సమావేశాలను 'ప్రదర్శకులు ముట్టడించి సంచలనం సృష్టించారు. ఆ తర్వాత ఏడాదిన్నర కాలం సియాటెల్ తరహా పోరాటాలు ప్రపంచ వ్యాప్తంగా పెల్లుబికాయి. ప్రపంచ ఆర్థిక నేతలు ఏ పేరిట ఎక్కడ సమావేశమైనప్పటికీ ప్రజల కోపాగ్నికి గురికావలసివచ్చింది. కొన్ని సమావేశాలు, అందువల్ల భగ్నం అయిన పరిస్థితి నెలకొన్నది. మిలటరీ, పోలీసు దండప్రయోగం సైతం ప్రదర్శకులను నిలువరించలేకపోయింది. ప్రపంచ ఆర్థిక నేతలు సమావేశమయ్యేందుకు ప్రపంచంలో ఎక్కడా కాస్తంత జాగా లేదని అమెరికాలోని

ఒక ప్రముఖ దినపత్రిక సంపాదకీయం రాయాల్సివచ్చిందంటే ఎంత తీవ్రపరిస్థితి ఏర్పడిందో అర్థం చేసుకోవచ్చు.

ఈ నిరసనకారులను మచ్చిక చేసుకొనేందుకై ప్రపంచ ఆర్థికనేతలు ప్రయత్నాలు ప్రారంభించారు. ఆ ప్రయత్నాల నుంచి ప్రపంచ సోషల్ ఫోరం (W.S.F) పుట్టింది. ఇది పైకి ప్రపంచీకరణ వ్యతిరేకిగా కన్పించినప్పటికీ, సారాంశంలో ప్రపంచీకరణ సజావుగా సాగేందుకు ఏర్పడిందే. ప్రపంచీకరణ మంచిదేననీ కొన్ని సవరణలు చేస్తే సరిపోతుందనీ నమ్మేవారు, క్రిందినుంచి ప్రపంచీకరణ చేయాలని చెప్పేవారు, భాగస్వామ్యయుత ప్రపంచీకరణ ను ప్రవచించేవారు, అసలు ప్రపంచీకరణే (Participatory Globalisation) వద్దని చెప్పేవాళ్ళూ ఇందులో ఉన్నారు.

'ప్రపంచీకరణ'కు వ్యతిరేకంగా 2001 జనవరిలో బ్రెజిల్‌లోని పోర్ట్ అలెగ్రె నగరంలో పెద్ద పెట్టున జనసమీకరణ జరిగింది. ప్రపంచం నలుమూలలనుండి పలు సంస్థలు, వేలాది వ్యక్తులు పాల్గొన్నారు. దాన్నే ప్రపంచ సోషల్ ఫోరం అని పిలుచుకున్నారు. ప్రపంచీకరణను ఎలా ముందుకు తీసుకెళ్ళాలనే విషయాన్నీ, బహుళజాతి కార్పోరేషన్ల సమస్యలను చర్చించేందుకు ప్రపంచ ఆర్థిక ఫోరం (WEF) స్విట్జర్లాండేలో సమావేశమౌతుంది. దానికి కాస్త ముందుగా WSF సభలు జరుగుతున్నాయి. సియాటెల్ తరహాలో WEF సమావేశం జరిగే ప్రదేశంలో నిరసన వ్యక్తం చేయడానికి బదులుగా, ఆ సమావేశ ప్రదేశానికి సుదూరంలో 'బ్రెజిల్‌లోని పోర్ట్‌అలెగ్రె నగరంలో 2001 నుంచీ సభలను జరుపుతున్నారు. ఈ ఏడాది WSF వేదిక ముంబాయి నగరం.

WSFను ఏర్పాటు చేసినప్పటి నుంచీ దాని క్రియారాహిత్యం పలువురిలో సందేహాలు రేకెత్తించింది. WSF నిర్వాహకుల ప్రవర్తన అనుమానాస్పదంగా చూడబడుతోంది. ప్రపంచీకరణకు WSF వ్యతిరేకమా కాదా? WSFను ఎవరు, ఎలా, ఎందుకు ఏర్పరిచారు? నిర్మాణ స్వరూపం ఏమిటి? ఇది సంస్థనా లేదా అదే చెప్పుకున్నట్లు ఒక 'క్రమం' మాత్రమేనా? నిర్ణయాలు ఎవరు తీసుకుంటున్నారు? WSF భారీఎత్తున నిధులు ఎలా, ఎక్కడి నుండి సేకరించుకొంటోంది? దీని దాతల, పోషకాల స్వభావమేమిటి?.... ఇలాంటి అనేకానేక ప్రశ్నలు WSFను వెంటాడుతూ వస్తున్నాయి. ప్రతి ఏటా మరింతగా

దాని నిజస్వరూపం మరింత ప్రస్ఫుటమౌతోంది.

గత ఏడాది జనవరిలో పదికోట్ల రూపాయల బడ్జెట్‌తో ఆసియా సోషల్ ఫోరం (ASF) పేరిట హైద్రాబాద్‌లో సభలను నిర్వహించారు. ఆ సందర్భంలో దీని భాగస్వాములు ఎవరో, దీని అంతర్యమేమిటో తెలుగు ప్రజలకు తేటతెల్లం చేస్తూ ఆంధ్రజ్యోతి దినపత్రికలో వ్యాసాలు ప్రచురితమయ్యాయి ప్రపంచ ఆర్థిక శక్తుల చేతుల్లో పనిముట్టయిన WSFను వ్యతిరేకిస్తూ, దాన్ని నిర్వహించే ఎన్జీవోలు దేశం నుంచి వెళ్ళిపోవాలని కోరుతూ కొన్ని సంస్థలు సభలు నిర్వహించాయి. నిరసన ప్రదర్శనలు చేసి ASF నిర్వాహకులను కలవరపెట్టాయి. అయినప్పటికీ, ఆంధ్రదేశంలో పేరెన్నికగన్న మేధావులు పలువురు ఈ సభల నిర్వహణలో భాగస్వాములయ్యారు.

గత సెప్టెంబర్‌లో ముంబాయిలోని 'రిసెర్చి యూనిట్ ఫర్ పొలిటికల్ ఎకానమీ' (RUPA) WSF నిజస్వరూపాన్ని మరింతగా బహిర్గతం చేస్తూ ఒక పుస్తకాన్ని అచ్చేసింది. దానిపేరు The Economics and Politics of the World Social Forum Lessons for the Struggle against Globalisation (ఈ పుస్తకం తెలుగు అనువాదాన్ని "వరల్డ్ సోషల్ ఫోరం ఆర్థిక రాజకీయాలు" పేరిట హైదరాబాద్‌లోని పర్‌స్పెక్టివ్స్ ప్రచురించింది). WSF గురించిన మరింత సమగ్ర సమాచారాన్ని ఈ పుస్తకం ప్రజలకు అందిస్తోంది. ఇందులో WSF పై విమర్శ సాంప్రదాయం మార్క్సిస్టు దృక్పథంనుంచి రూపొందింది. దానితో విభేదాలున్నప్పటికీ ఇది అందిస్తున్న సమాచారం WSF గురించిన అవగాహన పెంపొందించుకునేందుకు బాగా పనికొస్తుంది.

సియాటెల్ తరహా నిరసనకు వ్యతిరేక దిశలో WSF పుట్టుకను గమనించవచ్చు. సియాటెల్ తరహా పోరాటాలు సమగ్రమైనవి కావనీ ప్రపంచీకరణకు నిర్మాణాత్మక ప్రత్యామ్నాయాలను ప్రతిపాదించడంలో అవి విఫలం కావడంతో WSF పుట్టిందని దాని రూపశిల్పులు వాదిస్తున్నారు. కాని, వాస్తవానికి సియాటెల్ తరహా తలనొప్పులకు, ప్రపంచ పెట్టుబడి కనిపెట్టిన మందే WSF. నిరసనకారులతో చర్చలు జరిగే ఉమ్మడివేదిక కావాలనీ, తద్వారా ఆ పోరాటాలు తమని బాధించకుండా చూసుకోవచ్చనీ ప్రపంచ పెట్టుబడినేతలు ఆశించారు. మెల్‌బోర్న్‌లో ప్రదర్శకుల దిగ్బంధంలో ప్రపంచ ఆర్థికఫోరం (WEF)

వ్యవస్థాపకుడు క్లాస్ ష్వాబ్ ఇలా వ్యాఖ్యానించారు - "వ్యాపారవేత్తల, ప్రదర్శకుల మధ్య ఇక్కడ సంభాషణా వేదికను ఏర్పాటు చేస్తాను. ఆ సురక్షిత ప్రదేశంలో ఇరుపక్షాలూ ఆలోచనలను పంచుకుంటాయి" తను నిర్వహించే ప్రతి ప్రపంచస్థాయి సభల సందర్భంలోనూ అలాంటి సమావేశాలను ఎన్జీవోల ఆధ్వర్యంలో ఏర్పాటు చేయడం 1993 నుంచీ ఐక్యరాజ్యసమితికి ఆనవాయితీ అయింది. దానినే WSF లో అనుకరించారు. త్వరత్వరగా పావులు కదిపారు.

ఫ్రాన్స్‌కు చెందిన ఎన్జీవోల వేదిక ATTAC అధిపతి, బెర్నార్డ్ కాసెన్, బ్రెజిల్ పారిశ్రామిక వేత్తల నేత ఓడెడ్ గ్రాజూ, ఫ్రెంచి ఎన్జీవోల సమాఖ్య అధిపతి ఫ్రాన్సిస్కో విటేకర్ 2000 ఫిబ్రవరిలో 'ప్రపంచ పౌర సమాజ కూటమి'ని ఏర్పరిచేందుకు సమావేశమయ్యారు. ఆ ఏడాది మార్చినాటికి వారు బ్రెజిల్ వర్కర్స్ పార్టీ (ప్రస్తుత అధికారపార్టీ) అధికారంలో ఉన్న రియో రాష్ట్ర ప్రభుత్వం నుంచి మద్దతు సంపాయించారు. ఆ రాష్ట్ర ప్రభుత్వ ప్రతినిధే జెనీవాలో ప్రత్యామ్నాయ ఐక్యరాజ్యసమితి సమావేశంలో ఈ విషయం చెప్పి వారి మెప్పుపొందారు. WSF స్థాపన ఆరోజే జరిగిందని ప్రపంచ బ్యాంకు వెబ్‌సైట్ పేర్కొంది. సరికొత్త దృక్కోణం ఉన్న పౌరసమాజ సంస్థగా WSFను కొనియాడింది. ఆ తర్వాత వరుసగా WSF సభలు జరిగాయి. కేవలం చర్చలకు, ఉపన్యాసాలకు మాత్రమే వీలున్న వేదికగా రూపుదిద్దుకొంది. WSF ఏ విషయంపైనా ఏ తీర్మానమూ చేయరాదనీ, నిర్దిష్ట నిరసన కార్యాచరణ చేపట్టరాదనీ తనను తాను నిబంధించుకొంది. సియాటెల్ తరహా నిరసనకు భిన్నంగా ఆ నిరసనకు గురయ్యేవారు కూడా ఇందులో చక్కగా పాల్గొంటారు. ప్రపంచబ్యాంకు, ఐరాస ప్రతినిధులు, ప్రపంచ ఆర్థిక సంస్థలను సంస్కరిస్తే చాలని చెప్పేవాళ్ళూ, ఆఫ్ఘనిస్తాన్, ఇరాక్‌పై అమెరికా కూటమి దురాక్రమణ యుద్ధాల్లో తమ దేశం పాల్గొనేందుకై తమ ఓటు వేసిన పలు యూరోపియన్ దేశాల పార్లమెంటు సభ్యులు, మంత్రులు WSFలో పాల్గొంటున్నారు. క్రియారాహిత్యమే కార్యాచరణగా చేస్తున్న సంస్థ అది.

WSF వెబ్‌సైట్‌లో పేర్కొన్న వివరాల ప్రకారం దాని భాగస్వాములలో (ఇది WSF ఉపయోగించిన పదం) అమెరికా ఫోర్డ్ కార్ల కంపెనీ వారి ఫోర్డ్ ఫౌండేషన్, జర్మనీ విదేశాంగ శాఖ మంత్రి ఆధ్వర్యంలో నడిచే హెయిన్‌రిజ్

బోల్ ఫౌండేషన్, యూరప్‌లోని అతిపెద్ద ఫండింగ్ సంస్థలు - ఆక్స్‌ఫాం, నోవిబ్ (Novib), ఇకొ (ICCO) ఉన్నాయి. బ్రెజిల్‌లోని అతి పెద్ద ఆయిల్ కంపెనీ, ప్రపంచంలోనే 20 అతిపెద్ద ఆయిల్ కంపెనీల్లో ఒకటి అయిన పెట్రో బ్రెజిలికా కంపెని కూడా WSF 'స్పాన్సర్ల'లో ఉంది. WSF ఏర్పరచిన పార్లమెంటరీ సభ్యుల సమన్వయ వేదికకు యూరోపియన్ యూనియన్ పార్లమెంటు సమకూరుస్తుందంటే WSFకు దానికి మధ్య అనుబంధం ఎంతమేరకు ఉందో అర్థం చేసుకోవచ్చు. WSF సభలో మీడియా సెంటర్ నిర్వహణకు నిధులిచ్చే వారి జాబితాలో యూరప్‌కు చెందిన ఐదు దేశాల ప్రభుత్వాలు (జర్మనీ, డెన్మార్క్, ఇటలీ, నెదర్లాండ్స్, నార్వే), ఆరు ఐరాస అంగాలు ఉన్నాయి. "వరల్డ్ సోషల్ ఫోరం -2004 ప్రాజెక్టు" పేరిట వెలువరించిన పత్రంలో ముంబాయి సభలకు 29.7 మిలియన్ డాలర్లు (రూ.135 కోట్లు) ఖర్చవుతుందని WSF నిర్వాహకులు అంచనా వేశారు. ఈ నిధులన్నిటినీ పైన చెప్పుకున్న పద్ధతిలో నిర్వాహకులు సేకరిస్తారు. ఎవరికి వ్యతిరేకంగా ప్రపంచీకరణ వ్యతిరేక శక్తులు పోరాడాలో అవే WSF కు మహారాజ పోషకులు.

WSF నిబంధనల ప్రకారం రాజకీయ పార్టీలు నేరుగా అందులో పాల్గొనరాదు. (దీన్ని ముంబాయి సభల్లో కొంత సవరించారనిపిస్తోంది) అయితే రాజకీయ పార్టీల నేతలు వ్యక్తులుగా పాల్గొనవచ్చు. ఈ నిబంధనను అడ్డం పెట్టుకొని WSF నిర్వాహకులు తమ దాత అభీష్టాల మేరకు వ్యవహరిస్తూ వస్తున్నారు. తమకు ఇష్టమైన వారిని దొడ్డిదారిన 'వ్యక్తులు'గా ఆహ్వానిస్తున్నారు. ఇష్టం లేని వారిని (ముఖ్యంగా సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాల్లో ముమ్మరంగా సాయుధంగా పాల్గొంటున్న వారిని) బహిష్కరిస్తూ వచ్చారు. అమెరికాకు వ్యతిరేకంగా పోరాడుతున్న క్యూబా అధ్యక్షుడు ఫిడెల్ కాస్ట్రోను, వెనెజులా అధ్యక్షుడు చావేజ్‌ను బ్రెజిల్ WSF సభలకు ఆహ్వానించలేదు. ఒకసారి చావేజ్ వస్తే ఆయన్ను అధికారికంగా వక్తగా పిలవలేదు. సాయుధ సంస్థలకు సభల్లో పాల్గొనే అర్హత లేదంటూనే, సైన్యాలను పెంచిపోషించే ప్రభుత్వాల్లోని ప్రముఖులను దురాక్రమణ యుద్ధాలకు అనుకూలంగా ఓటు వేసిన వారికి పెద్దపీట వేశారు.

నిర్మాణరీత్యా WSF తనొక సంస్థను కానని బుకాయిస్తుంది. సంస్థ అని

చెప్పేందుకు అవసరమయిన అన్ని లక్షణాలు దానికి ఉన్నాయి. ఆధిపత్య అధినాయకత్వంలేని నేలబారు క్రమాన్ని (Horizontal Process) అని చెప్పుకుంటుంది. దానివల్ల తను ఒక సంస్థగా వ్యవహరించి తీర్మానాలు చేయనని చెప్తుంది. తీర్మానాలంటూ చేయాల్సివస్తే, ప్రపంచీకరణకు పూర్తిగా వ్యతిరేకంగానో, ప్రపంచబ్యాంకును, ప్రపంచ ద్రవ్యసంస్థ (IMF) ను రద్దు చేయాలనో, మూడవ ప్రపంచ రుణ విమోచన చేయాలనో సభల్లో తీర్మానించే 'ప్రమాదం' ఉంది. నేలబారు క్రమం అని చెప్పుకోవడం కూడా దానిమంచికే. ఎందుకంటే, ఎవరు నిర్ణయాలు చేస్తున్నారో తెలిసే అవకాశం ఉండదు. కొన్ని ఎన్జీవోలు, లేదా కొద్దిమంది WSF ప్రముఖులే తమ 'భాగస్వాముల' ఇష్టసిద్ధికై నిర్ణయాలు చేసి అందరిపై రుద్దే వీలు కలుగుతుంది. నిజానికి, ఇంటర్నేషనల్ కౌన్సిల్, బ్రెజిలియన్ ఆర్గనైజింగ్ కమిటీ అనేవి నిర్ణయాలు చేస్తుంటాయి. వాటిల్లో విదేశీ నిధులు పొందే ఎన్జీవోలదే పైచేయి.

ఈ విషయాలు తెలియని ప్రజలు WSF ప్రపంచీకరణ ప్రత్యామ్నాయం అనే భ్రమలో ఉన్నారు. దానివేపు ఆశగా చూస్తున్నారు. నోమ్ ఛోమ్స్కీ, అరుంధతీ రాయ్ లాంటి మేధావులు సైతం WSF లో పాల్గొని ప్రోత్సహించడం వల్ల ప్రజలు మరింతగా భ్రమలకు గురౌతున్నారు. కాకపోతే ముంబాయిలో జరిగిన WSF సభల్లో అరుంధతి రాయ్ ఉపన్యాసం కొంత ఊరట కలిగిస్తోంది. కేవలం చర్చలు, ఉపన్యాసాలకే పరిమితం కాక సామ్రాజ్యవాద దాడులకు వ్యతిరేకంగా క్రియాశీల కార్యక్రమాన్ని చేపట్టాలని ఆమె పిలుపునిచ్చారు. సరిగ్గా WSF ఏం నివారించాలని ఏర్పడిందో ఆ పనే చేయడం కోసం ఆమె పిలుపునిచ్చారు. ఆ పిలుపును పట్టించుకునే అవకాశాలు మృగ్యం. ఏ అమెరికా కంపెనీలనైతే దేశాలనుండి తరిమివేసేలా కార్యాచరణ చేపట్టాలని ఆమె కోరిందో అదే అమెరికా కంపెనీలే ఆమె ఉపన్యాసం చెప్పిన వేదికను ఏర్పాటు చేశాయి. ఆమె మాట్లాడిన మైకుకు డబ్బులిచ్చాయి. ఆమె పిలుపును WSF పట్టించుకుంటే ప్రపంచ ఆర్థికనేతలు, దాతలు, మహారాజ పోషకులతోపాటు మనమూ దాని గురించి పునర్మూల్యాంకన చేద్దాం.

**18 జనవరి, 2004 - రాత ప్రతి**

# 28. వినియోగ దేహయాత్ర

అన్ని నగరాల్లోలాగే ఇక్కడా వినియోగవస్తు ఆరాధన, వ్యామోహం ఇటీవలి కాలంలో బాగా పెరిగాయి. అందుకు పెట్టుబడి చేసే ప్రయత్నాలూ తీవ్రమయ్యాయి. ఇన్నిన్ని రకాల ఫ్రిజ్‌లు, టివిలు, సెల్‌ఫోన్‌లు, సినిమాలు, కంప్యూటర్లు, వాషింగ్ మెషిన్లు, గృహాలంకరణ సామాగ్రి ఇదివరకులేవు.

ప్రపంచీకరణ మొదలైన 1990 నుంచి క్రమేణా ఈ పరిణామం మన అనుభవంలోకి వచ్చింది. 1990 నాటికి నగరంలో అతిపెద్ద గృహోపకరణాల షోరూం రైల్వేస్టేషన్ రోడ్‌లోని లక్ష్మి ఎంటర్‌ప్రైజెస్ మాత్రమే. ఇవాళ అంతకన్నా ఎన్నోరెట్లు పెట్టుబడులతో అలాంటివెన్నో. గుంటూర్లో మొదటి బ్రెడ్‌స్టోర్ స్టార్ బేకరీ. అరండల్‌పేటలో పోస్టాఫీసు ఎదురుగా ఉండేది. తర్వాత తాలూకా ఎదురుగా మోడ్రన్ ఫుడ్ స్టోర్స్ వెలిసింది. తర్వాత బుక్ లవర్స్ పక్కన మరొకటి. ఇవాళ పాశ్చాత్య తిండికి తావులేని వీధిలేదంటే అతిశయోక్తి కాదు. 1990 నాటికి గుంటూరు-2లో ఒకే ఒక నాన్-వెజ్ రెస్టారెంట్ తాలూకా ఎదురుగా. రేమండ్స్ బిల్డింగ్ స్థలం ఖాళీగా. అరండల్‌పేట పద్నాలుగవ లైను మొదట్లో రోడ్డుపైకి చిన్న చిన్న షాపులు. లోపలికి పెద్ద నివాసగృహం. దాని ఎదురుగా ఇప్పటి కుబేరా టవర్స్ స్థానంలో మరోపాత మేడ. ఇవాళ్టి చిత్రం వేరు. వైన్ షాపులు బార్లు ఇబ్బడి ముబ్బడిగా పెరిగాయి. కూల్‌డ్రింక్ షాపులకు కొదువలేదు. విషపానీయ స్వీకారం హోదా అయింది. కిరాణా రంగంలో రిలయన్స్, స్పెన్సర్ వగైరా వచ్చేశాయి.

షాపులు జనంతో నిత్యం రద్దీ. ఏం తోచకపోతే షాపింగ్ ఉబుసుపోక వ్యవహారమై వ్యసనంగా మారిపోయింది. సంస్కృతి స్థాయికోసం ఉబలాట

పడుతోంది. సరుకులు కొనడం అనే ప్రక్రియలోనే ఆనందం పొందడం నగరాల్లో చూడవచ్చు. డబ్బులేకపోయినా సరే షాపుల్లో ఎగ్గిబిషన్ మాల్స్‌లో దూరి సరుకుల మధ్య కొంతసేపు తిరుగాడి తృప్తి పడటం జరుగుతోంది. దీన్నే 'విండో షాపింగ్' అంటారు. వినియోగ వస్తువులు కొనే శక్తిలేని వారికి 'వాయిదాల పద్ధతి' ఎరలో, స్పందనలాంటి మైక్రోక్రెడిట్ సంస్థల అప్పులు వాళ్ళను షాపింగ్‌వైపు లాక్కెళ్తున్నాయి. ప్రజలు అప్పులు చేసీ వస్తువులు కొనడానికి ఇష్టపడుతున్నారు. ఈ వస్తువుల వినియోగం, వస్తువ్యామోహం ఈ నగరాన్ని ఇంతకు ముందు కంటే సంతోషమయం చేస్తోందా?

మనుషులు ప్రకృతినుంచీ, సమూహం నుంచీ పరాయీకరణ (alien-ation )పొంది ఒంటరిగా బ్రతకడం నగరీకరణలో జరుగుతుంది. ఆ ఒంటరి తనంలోని లేమిని, అభద్రతను పోగొట్టుకునేందుకు సరుకులను ఆశ్రయిస్తాం. అలా వెలితిని పూరించుకో ప్రయత్నిస్తాం. సాముదాయికత, సమూహత్వం నాశనం కావడంవల్ల తానున్న స్థితినుంచి ఏర్పడిన అస్తిత్వ సంక్షోభంనుంచి అలా ఉపశమనం పొందుతాం. సరుకుల దుకాణాలు, వినియోగ సంస్కృతి పెరిగిందంటే అర్థం జీవితంలో వెలితి పెరిగిందనే. కానీ సరుకులు ఎప్పటికప్పుడు కొత్తకొత్తగా మారిపోతూ (ఉదా॥ సెల్‌ఫోన్లు) వెలితిని ఇంకా విస్తరిస్తాయి. ఈ స్థితి మన జీవితంలో ఒక అనిశ్చితత్వానికి దారితీస్తుంది. సరుకుల్లో అనిశ్చితత్వం అలా మనిషి జీవితంలోకి ప్రవేశిస్తుంది. సరుకులు ఎన్నికొన్నా, ఒక సంపూర్ణ జీవితాన్ని ప్రసాదించలేవని సరుకుల కొనేవాళ్ళకూ, అమ్మేవాళ్ళకూ తెలుసు. ఒక సరుకు కొనేలోపే మరో సరుకు వచ్చి మొదటిదాన్ని పాతదిగా చేస్తోంది. తిరిగి కొత్త సరుకు పొందితేనే జీవితంలో తృప్తి ఉందనుకుంటాం. దానికోసం వెంపర్లాట ప్రారంభిస్తాం. సెల్‌ఫోన్ల విషయంలో గత ఐదేళ్ళలో ఇది మన ప్రత్యక్షానుభవం. మొదట బ్లాక్ & వైట్, తర్వాత కలర్ మొబైల్, ఆ తర్వాత ఫోటో కం సెల్, తదుపరి విడియోసెల్ - ఇంకా .... టచ్‌స్క్రీన్ సెల్. ఇవాళ ఎఫ్.ఎం. రేడియోతో సెల్ వచ్చింది. (ఇక రేట్ల దొంగాట సరేసరి).

మనిషి తన మనిషి తనం తనలోనే ఉందనుకోవడం లేదు. సమూహంలో ఒకడిగా తాను మనిషిననే భావన కూడా కరువైంది. తాను వినియోగించే సరుకులను బట్టి తాను మనిషితనం పొందుతున్నాడు. కాబట్టి మనిషినుంచి

మనిషితనం సరుకులకు వెళ్ళిపోయింది. కాబట్టి ఎన్ని సరుకులకు ఒక వ్యక్తి వినియోగదారుడైతే అతను అంత మనిషిగా గుర్తింపు ఉంటోంది. కానీ సరుకులు కొత్తవి పాతవై మరో కొత్త బ్రాండ్ రావడం జరగడంవల్ల ఈ మనిషి తనాన్ని నిరంతరం కొత్త కొత్త సరుకులకు వినియోగదారులై మనం పొందుతూనే వుండాలి. ఇది పరుగు. ఇది జీవితంలో అనిశ్చితత్వం. ఇదే మన వెలితి పరిధిని విస్తరిస్తూ తను విస్తరిస్తున్న మార్కెట్ మాయాజాలం.

అందువల్ల నగర జీవితం నిరంతరం డబ్బు సంపానద కోసం పరుగు. వస్తుభరిత జీవితంకోసం వెంపర్లాట. అనిశ్చితత్వం. గమ్యం ఎప్పటికప్పుడు మారుతుంటుంది. దారులు ఎప్పటికప్పుడు విడిపోతుంటాయి. ఎక్కడ ఆగినా మనిషి కాకుండా పోయే సరుకులమాయ.

కానీ, సరుకుల వినియోగం గత మూడు నెలల్లో బాగా తగ్గింది. ఈ మూడునెలల్లో వెలితిని పోగొట్టుకునేందుకు నగరపౌరులు ప్రకృతిని, దేవుళ్ళను ఆశ్రయించడం కనిపిస్తుంది. అయ్యప్ప సంస్కృతి అన్ని నగరాల్లాగే ఈ నగరంలో ఈ ఏడాది బాగా పెరిగింది. (రికార్డు స్థాయిలో ఈ ఏడాది 3.5 కోట్ల మంది భక్తులు శబరిమలై సందర్శించారు). సంక్రాంతిని ఇదివరకెన్నడూ లేనంతగా జనం తమ స్వస్థలాల్లో జరుపుకున్నారు. (జంటనగరాలు ఖాళీకావడం ప్రముఖ వార్త అయింది).

కనీసం అయ్యప్ప దీక్షలోనో, సంక్రాంతి ఉత్సవాలకోసమో సరుకుల మాయనుంచి కొందరికైనా స్వల్ప విరామం సంతోషదాయకమే.

**జనవరి 18, 2004 - రాతప్రతి**

## 29. శిక్షలు తీవ్రంగా ఉంటే నేరాలు తగ్గుతాయా?

శ్రీలక్ష్మి హత్యను ఖండించాల్సిందే కానీ, ఆ కేసులో ముద్దాయికి ఉరిశిక్ష విధించటానికి నేను వ్యతిరేకం. యావజ్జీవ కారాగార శిక్ష శ్రీలక్ష్మి హంతకునికి సరిపోతుంది. నేరంలేని సమాజం ఒక తీయని కల మాత్రమే. అలాంటి సమాజం ఒకటి గతంలో ఉండేదని, దాన్ని ఆదిమ సమాజం అంటారని చరిత్ర పుస్తకాల్లో చదువుకున్నాం. ఆ సమాజంలో వ్యక్తిగత ఆస్తి లేదు. కుటుంబం లేదు. కాబట్టి లైంగిక పరమైన ఆంక్షల ఉల్లంఘనలు లేవు. రాజ్యంలేదు కాబట్టి దానివల్ల జరిగే హింసలేదు. ఈ మూడింటిని తిరస్కరించగలిగిన చైతన్యం వచ్చిన రోజు నేరం లేని సమాజం ఆవిర్భవిస్తుందనే ఆశ మనిషికి ఇంకా ఉంది. తీవ్రమైన శిక్షలు విధించకుండా సంస్కరణల పేరిట నేరస్తుల పట్ల ఉదాసీన వైఖరి అవలంబించటం వల్ల భవిష్యత్తు నేరస్తులకు అలుసవుతుందనే వాదన ప్రమాదకరమైనది. నా నేరానికి నన్ను శిక్షించటమో లేదా సంస్కరించటమో చేయాలి. కానీ భవిష్యత్తు నేరస్తులకు ఉదాహరణ కోసం వారిని భయపెట్టడం కోసం నన్ను శిక్షించాలనుకోవటం ఘోరం. ప్రసన్నలక్ష్మి హత్య కేసులో నేరస్తునికి ఉరిశిక్ష అమలు జరిగి ఉంటే ఈ రోజు శ్రీలక్ష్మి హత్య జరిగేది కాదనటం అర్థంలేని వాదన. మరణశిక్ష ఉంటేనే హత్యలు ఆగుతాయని, అది లేకుంటే ప్రజలు చంపుకుంటారనే వాదన అర్థరహితం. నేరాలు తీవ్రమైతే రాజ్యానికి ఎక్కువ అధికారాలు కట్టబెట్టడానికి, దుర్మార్గ చట్టాలు చేయడానికి పౌరసమాజం అనుమతి ఇస్తుంది. మనం నేరస్తులం కామని, ఎవరో ఇతరుల గురించి మాట్లాడుతున్నామనే భావన నుంచి ఈ ప్రశ్న పుడుతుంది. నేరస్తుల గురించి మాట్లాడటమంటే మన గురించి మనం మాట్లాడుకుంటున్నామనే స్పృహ ఉండాలి. అలా ఉంటే మనం తీవ్ర శిక్షల గురించి నెమ్మదిగా ఆలోచించగలం.

18-19 శతాబ్దాల్లో ఇంగ్లాండ్‌లో చిన్న దొంగతనానికి కూడా ఉరిశిక్ష వేసి బహిరంగంగా ఉరి తీసేవాళ్ళు. ఉరి తీయడం చూడటానికి వచ్చే జనం జేబుల్లోని డబ్బు దొంగలించబడేది. నేరానికి ఉన్న సామాజిక మూలాలు వెతకాలి. దాన్ని బలవంతంగా అణచాలని చేసే ప్రయత్నాలన్నీ నేరం కంటే శిక్షను భయానకంగా మారుస్తాయి. అలాగే ముద్దాయి తనకి ఇష్టమైన న్యాయవాది సేవలు పొందే హక్కు కూడా రాజ్యాంగంలోని ప్రాథమిక హక్కే. ఒక బృందం తన ప్రాథమిక హక్కును మరో వ్యక్తి ప్రాథమిక హక్కును హరించేందుకు ఉపయోగించటం అన్యాయం. ముద్దాయిలు డబ్బున్నవారైతే ఈ తీర్మానాలు అమలు కావు. బ్రిటీషువారి న్యాయవ్యవస్థను ఈ దేశంపై రుద్ది ముద్దాయిలకు న్యాయవాదులు వాదించ రాదనటం చాలా అన్యాయం.

**జూన్ 27, 2004 - వార్త**

# 30 'సంఘాలు' దూరం పెట్టినా దళితులు నేనే కావాలన్నారు

దేశంలో దళితులపై ఊచకోత సంఘటనలు చాలా జరిగాయిగానీ, బాధ్యులకు శిక్షలు పడటం మాత్రం జరగలేదు. అందుకే చుండూరు తీర్పు చరిత్రాత్మకమూ, సంచలనమూ అయింది. తమ కేసును వాదించడానికి ఒక అగ్రవర్ణానికి చెందిన న్యాయవాదే కావాలని దళితులు పట్టుబట్టి సాధించుకోవడం, ఆయన వారి నమ్మకాన్ని నిలబెట్టి 56 మంది బాధ్యులకు శిక్షలు పడేలా వాదించడం కూడా చరిత్రాత్మకమే.

## 1991 ఆగస్టు 6న చుండూరులో ఏమైంది?

సుమారు 400 మంది రెడ్లు, తెలగవారు మధ్యాహ్నం పోలీసు స్టేషన్ ముందు పోగయ్యారు. వారు చుండూరు, మున్నంగివారి పాలెం, మోదుకూరు, వలివేరు గ్రామస్తులు. అప్పటికే పోలీసులు మాలపల్లెపై దాడిచేసి మగవాళ్ళను తరిమేయగా వారిలో కొందరు చుండూరు దక్షిణ రైలుగేటు దగ్గర, మరికొందరు చుండూరు-మోదుకూరు రోడ్డు పక్క పొలాల్లోకి పారిపోయి ఉన్నారు. అగ్రకుల దుండగులు పోలీసు స్టేషన్ నుంచి రైలు గేటు వద్దకు వచ్చారు. వారిలో కొందరు (సుమారు 70 మంది) చర్చిరోడ్డు గుండా ప్రయాణించి ట్రాక్టర్/ట్రెయిలర్‌లో చుండూరు- మోదుకూరు రోడ్డుమీద వెళ్లి పొలాల్లో ఉన్న దళితులను తుంగభద్ర మురుగుకాలువ వేపు తరిమి అక్కడ ముగ్గురిని (జాలాది ఇమానియేల్, జాలాది మత్తయ్య, మల్లెల సుబ్బారావు) దారుణంగా చంపి కాలువలోకి నెట్టేశారు. ఈ దృశ్యాన్ని చాలామంది దళితులు చుట్టుపక్కలవారు చూశారు. మారణకాండ అనంతరం తిరిగి ట్రాక్టర్/ట్రెయిలర్ ఎక్కి మోదుకూరు వేపు ప్రయాణించారు. మరోవేపు దక్షిణ రైలు గేటు దగ్గరికి వెళ్ళిన మిగిలిన దుండగులు అక్కడి దళితులను వెంట తరమగా వారు కొత్తకాలువ గట్టున (మద్రాస్-హౌరా రైల్వే

ట్రాక్‌ల సమాంతరంగా ఉంటుంది) ప్రాణభీతితో పరుగెత్తారు. మోదుకూరు సమీపంలో ఒకటవ నెంబరు పిల్ల కాలువ దగ్గర మండ్రు రమేష్‌ను చంపి శవాన్ని కాలవలోకి తోసేశారు. మళ్ళీ మిగతా వారిని వెంట తరుముతూ మోదుకూరు రైలుగేటు వద్దకు చేరారు. మరోవేపు, (మల్లె తోట హంతకులు కూడా ట్రాక్టర్‌తో మోదుకూరు చేరుకొని అక్కడి గ్రామ కేంద్రంలో తానా బంతల ఆదాం (క్షతగాత్రుడు)పై దాడిచేసి అతన్ని అంగలకుదురు రాజమోహన్‌ను మరికొందరినీ మోదుకూరు గేటువేపు తరిమారు. రెండువైపులా వచ్చిన దుండగులు కలిసి మోదుకూరు రైలు గేటు దగ్గర రైల్వేస్టేషన్ రోడ్డులో నలుగురు దళితులను (జాలాది ఇసాక్, అంగలకుదురు రాజమోహన్, సంకురు సంసోను, దేవరపల్లి జయంత్)లను హతమార్చారు. వారి శవాలను అక్కడవున్న ఒక ముద్దాయి గొడ్ల చావిడిలోకి మోసుకెళ్ళడం సాక్షులు చూశారు. తర్వాత జాలాది ఇసాక్, అంగలకుదురు రాజమోహన్ శవాలు గోతాల్లో కుక్కబడి ఒకటి, కొత్తకాలువలో మరొకటి కన్పించాయి. మిగిలిన రెండు శవాలను కూడా కొత్తకాలువలో వేయగా ఆరెమండ బ్రాంచి కాలువలో దొరికాయి. సంకురు సంసోను శవానికి కనుగుడ్లు లేవు.

నలుగురినీ హతమార్చిన దృశ్యం చూసిన కొందరు దళితులు మోదుకూరు రైల్వేగేటు నుంచి మోపర్రు రోడ్డుపై పరిగెత్తి కందపాడు గ్రామం దాటి వెళ్తుండగా కొందరు ముద్దాయిలు మోదుకూరు రైల్వేగేట్ దగ్గర మారణాయుధాలు చేతపట్టి అటువేపు వస్తున్న ఆర్‌టిసి బస్సు ఎక్కి, అక్కడికి వచ్చారు. సాలు చింతచెట్ల వద్ద బస్సు దిగి దళితులను తరిమారు. బోరుగడ్డ సాంబయ్య, పంతగాని జక్రయ్యలపై హత్యా ప్రయత్నంచేసి గాయపర్చారు. దాయిరి ధనరాజ్‌పై హత్యాప్రయత్నం చేశారు. అతన్ని కొట్టుకుంటూ పొలాల్లో సుమారు ఏడుకిలోమీటర్లు నడిపించి చుండూరు గ్రామ శివార్లలో ఒక అరటితోటలో ఉంచారు. దారిలో మంచినీళ్ళు అడిగితే నోట్లో మూత్రం పోశారు. అరటితోటల్లో పడుకోబెట్టి సిరంజితో రక్తం తీశారు. తర్వాత అతను వారి నుంచి తప్పించుకొని సాయంత్రానికి కాలువలో ఈదుకుంటూ వస్తుంటే బట్టలు ఉతికే దళిత మహిళలు అతన్ని రక్షించి ఇంటికి తీసుకెళ్ళారు. చీకటి పడ్డాక చీరకట్టి రహస్యంగా రైలెక్కించి తెనాలి పంపగా అతను అక్కడి హాస్పిటల్లో చేరాడు. మద్దు దశరయ్య అనే దళితుడు మోదుకూరులో ఒక గడ్డివామిలో దాక్కొంటే, అతనిపై దాడిచేసి

స్పృహ తప్పేవరకూ కొట్టివెళ్ళారు. మొత్తం ఎనిమిది మంది దళితులు హత్యకు గురికాగా చాలామంది గాయపడ్డారు.

**ఇంత జరుగుతుంటే పోలీసులు ఏం చేస్తున్నారు?**

గ్రామంలో అప్పటికి సుమారు నెలరోజులుగా అటు దళితులపై అగ్రకులస్తుల దాడులు, ఇటు దళితులు కొందరు అగ్రకులస్తులపై దాడులు చేస్తున్న ఘటనలు జరుగుతూ ఉద్రిక్త వాతావరణం నెలకొంది. అదనపు పోలీసు బలగాలను రప్పించారు. 144వ సెక్షన్ పెట్టారు. తెనాలి రూరల్ సిఐ క్యాంపు చేశారు. చాలామంది ఎస్ఐలు వచ్చారు. పోలీసు పికెట్లు పెట్టారు. అయినా 400 మంది మారణాయుధాలతో పోలీసు స్టేషన్ ముందుగా వచ్చే దళితులను వెంట తరుముతుంటే వాళ్ళు ఏమీ చేయలేదు. నిజానికి దళితులను పల్లెనించి బయటికి తరిమి వారిపై దాడిని పోలీసులే సులభతరం చేశారని అప్పట్లో ఆరోపణలు వెల్లువెత్తాయి. ఆరవతేదీ రాత్రి పైఅధికారులకు సి.ఐ. పంపిన వర్తమానంలో గ్రామం ప్రశాంతంగా ఉందనీ, ఎలాంటి అవాంఛనీయ ఘటనా జరగలేదని పేర్కొన్నారు. అదే సి.ఐ. (ఇప్పుడాయన ఈలోకంలో లేరు) నుంచి తర్వాత డిఎస్పి నేరపరిశోధనలో భాగంగా వాంగ్మూలం నమోదు చేయగా దళితులను వెంట తరుముతున్న రెడ్లను తాను తన బలగాలతో కొత్తకాలువపై ఒక ఫర్లాంగు దూరం వరకూ వెంట తరిమాననీ తర్వాత ఊళ్లో శాంతిభద్రతల పరిరక్షణకోసం వెనుదిరిగి వచ్చామని సి.ఐ. చెప్పాడు. అంతవరకు పర్వాలేదు. అగ్రకుల దుండగుల్లో యాభైమందిని వెనక్కు తెచ్చి వదిలేశామని చెప్పాడు. కోర్టులో అప్పుడున్న ఎస్.ఐ. సాక్ష్యం చెప్తూ ఆ యాభై మందిని వారి వద్దనున్న మారణాయుధాలతో సహా సి.ఐ. వెంటనే పంపించి వేశారనీ, వారిపేర్లూ వివరాలు కూడా రాసుకోలేదనీ చెప్పారు. నూటనలభై నాలుగో సెక్షన్ అమలులో ఉన్నప్పటికీ వాళ్లను అరెస్టు చేయకపోవడం, వారి వద్దనున్న మారణాయుధాలను స్వాధీనం చేసుకోకపోవడం విచిత్రం.

చట్టవిరుద్ధంగా గుమికూడినవారిని చెదరగొట్టేందుకు ఏ చర్యలు పోలీసులు చేపట్టలేదు. సిఐ సక్రమంగా వ్యవహరిస్తే మారణకాండ నివారించబడి ఉండేదని న్యాయమూర్తి తన తీర్పులో అభిప్రాయపడ్డారు. అది నూటికి నూరుపాళ్లూ నిజం. ఆగస్టు 4న జరిగిన కుట్ర గురించి కూడా పోలీసులు నిర్లక్ష్యంగా

ప్రవర్తించారు. మొదటి ముద్దాయి ఇంటివద్ద జరిగిన కుట్రలో 200 మంది పాల్గొన్నట్లు బీట్ కానిస్టేబుళ్ళ పోలీసు రికార్డులలో ఉంది. కానీ ఎలాంటి చర్యలు చేపట్టలేదు. కేసు నమోదు చేయలేదు. మారణకాండ అనంతరం ఆగస్టు 10న డిఎస్పికి కుట్ర గురించి తెలిసినట్టుగా రికార్డులో ఉంది. ఫలితంగా కుట్రను న్యాయమూర్తి నమ్మలేదు.

**కనీసం నేర పరిశోధనలోనైనా పోలీసులు సరిగ్గా వ్యవహరించారా?**

లేదు. ఘోరమైన లోపాల పుట్టగా రికార్డును తీర్చిదిద్దారు. సాక్షులు కథనాలను నమ్మశక్యం కాకుండా ఉండేందుకు ప్రయత్నించారు. కావాలని రికార్డు నిండా అఘాతాలు, మందుపాతరలు పేర్చారు. ఎక్కడ కాలుపెట్టినా ప్రాసిక్యూషన్ ప్రమాదానికి లోనయ్యేలా చేశారని నేను కోర్టులో వాదించాను. కానీ ముద్దాయిలకు అనుకూలంగా లోపభూయిష్టంగా తయారైన ఇలాంటి రికార్డును పక్కనబెట్టి కోర్టులో సాక్షుల వాంగ్మూలాలకే ప్రాముఖ్యత ఇచ్చి కేసులో తీర్పు చెప్పాలని సుప్రీంకోర్టు పలుకేసుల్లో చెప్పింది. ఆ కేసులను ఉదహరించి ప్రాసిక్యూషన్ కేసును నిరూపించగలిగింది.

**ఈ విధంగా పోలీసులకు వ్యతిరేకంగా వాదించాల్సి రావడం మిమ్మల్ని ఇబ్బంది పెట్టిందా?**

లేదు. కొంత అసౌకర్యం అనిపించింది. కానీ పోలీసుల తప్పిదాలను, కాపాడాల్సిన బాధ్యత ప్రాసిక్యూటర్‌లది కాదు. వారు స్వతంత్రులు. ఆ స్వేచ్ఛను నేను ఈ కేసులో పూర్తిస్థాయిలో వినియోగించుకోగలిగాను.

**మీకు ఆ కేసు చేపట్టాలని ఎందుకు అనిపించింది?**

నాకుకాదు. బాధితులకు అనిపించింది. వారు ప్రభుత్వానికి అర్జీపెట్టారు. ఐదేళ్ళు తటపటాయించి 2000లో నన్ను, అసిస్టెంట్ స్పెషల్ పి.పి. జి.శివనాగేశ్వరరావు (తెనాలి న్యాయవాది)ను నియమించారు. మరో రెండున్నరేళ్ళకు మాకు ఆర్డర్ కాపీ చేతులో పెట్టారు. ఇది ఒక ప్రభుత్వ విధిగా మేం భావించాము. దళితులు మాపై ఉంచిన నమ్మకానికి అబ్బుర పడ్డాం. కేసు చేశాం.

**కేసులో సాక్షులను నిలపడంలో మీరు ఎదుర్కొన్న ఇబ్బందులు? మీకు ఎవరెవరి సహకారం అందింది?**

సాక్షులను నిలపడం మా బాధ్యతకాదు. చుండూరు మారణకాండ దళిత బాధితుల కమిటీ, కులనిర్మూలన పోరాట సమితి చాలా కృషిచేశాయి. సాక్షుల్లో ఆత్మస్థైర్యం నిలిపాయి. గ్రామంలోనే కోర్టు ఏర్పాటు చేయడం వల్ల కూడా సాక్షులు ప్రాసిక్యూషన్‌కు బాగా సహకరించ గలిగారు.

మొదట్లో పోలీసుశాఖ మరో వైఖరి అవలంబించినప్పటికీ ప్రత్యక్షసాక్షుల విచారణ తర్వాత వాళ్లు మాకు బాగా సహకరించారు. పలువురు సాక్షులు స్వచ్ఛందంగా ముందుకొచ్చి నిలబడ్డారు. అసిస్టెంట్ స్పెషల్ పి.పి. శివనాగేశ్వరరావు నాతోపాటు అనేక రోజులు నిద్రలేని రాత్రులు గడిపాడు. నేను అగ్రకులస్థుడినని సహకరించని 'దళిత బాంధవులు' ఉన్నారు.

ముద్దాయిలతో కుమ్మక్కై సాక్షులను అమ్మకానికి పెట్టిన దళిత ప్రబుద్ధుల గురించి చుండూరు దళితులకు బాగా తెలుసు.

**తీర్పు సంతృప్తికరంగా ఉందా?**

బాగానే సంతృప్తినిచ్చింది. మొత్తం కేసు పరిస్థితిలో ఇది గొప్ప విజయమే. అయితే ఈ కేసులో మరణశిక్ష విధించకపోవడం ప్రాసిక్యూటర్లుగా మాకు అసంతృప్తినిచ్చింది. మరికొందరిపై సాక్ష్యాలున్నా వారికి శిక్షలు పడలేదు. ఒక సంవత్సరం జైలు శిక్ష పడిన వాళ్ళను కూడా హత్యకేసుల్లో శిక్షించాల్సి వుంది. కానీ అలా జరగలేదు. కేసు తీర్పులో సాంకేతిక లోపాలు చాలా ఉన్నాయి. వాటన్నిటినీ వివరిస్తూ తీర్పుపై రాష్ట్ర ప్రభుత్వానికి మా అభిప్రాయం నివేదించాం. మొత్తం 179 మంది ముద్దాయిల్లో 63 మందిపై సాక్ష్యాధారాలు సరిగా కాదు కదా అసలే లేవు. వారిని మినహాయించి మిగిలిన 116 మందిపై అప్పీలు దాఖలు చేయాలని ప్రభుత్వానికి సిఫార్సు చేశాం.

**సామాజిక కార్యకర్తగా, న్యాయవాదిగా విషయాలను మీరు పరిశీలిస్తారు. మరి ఈ కేసులో మీ పాత్రను ఎలా బాలన్స్ చేసుకున్నారు?**

సామాజిక శాస్త్రాల్లో ప్రవేశం న్యాయవాదిగా నాకు కొంత లాభించింది. న్యాయశాస్త్రాన్ని ఆ దృష్టితో చూస్తే వాదనలో రాజ్యం వ్యవహరించిన తీరు గురించి వాదించాను. న్యాయమూర్తి పాత్రను చరిత్రకారుడి పాత్రతో పోల్చి చెప్పాను. చరిత్ర కారుడికి లేని వెసులుబాటు న్యాయమూర్తికి ఉంది. చరిత్రకారుడు గత ఘటనలను పునర్నిర్మిస్తే, న్యాయవాది ఆపని చేయడమేకాక,

చరిత్రలో నేరాలకు పాల్పడిన వారిని శిక్షించే అధికారాలను కూడా వినియోగించేందుకు వీలుంది. ఇలాంటివే కొన్ని సందర్భాల్లో చెప్పగలిగాను.

మీ ప్రశ్నకు జవాబు మరోరకంగా చెప్తాను. సామాజిక విషయపరిజ్ఞానం, సామాజిక స్పృహ ఉద్యమ గతం ఉన్న వ్యక్తిగానూ, అన్నిటికి మించి ఒక మానవుడిగా నేను ఈ కేసులో బాధితుల పట్ల సహానుభూతితో ఉన్నాను. కేసుతో వ్యక్తిగతంగా ఐడెంటిఫై అవుతున్నానని డిఫెన్స్ లాయర్లు ఆరోపించిన సందర్భాలున్నాయి. నేను కూడా ఘటనలకు స్పందించి, ఉద్వేగానికి లోనయ్యానని అనిపించిన సందర్భాలున్నాయి. ఇది ప్రాసిక్యూటర్ లక్షణం కాదేమో అని అనిపించిందొకసారి. నా సీనియర్ కన్నబిరాన్‌ని అడిగాను. అలా అనిపించడం మనిషి లక్షణమనీ గొప్ప విషయమనీ ఆయన చెప్పారు. ఒక కేసులో వాస్తవాలకు స్పందించకుండా కేసు చేస్తే మానవ లక్షణాలను కోల్పోయి యంత్రంగా మారినట్టు అని ఆయన చెప్పారు. ప్రాసిక్యూటర్ బాధ్యత సామాజిక కార్యకర్త బాధ్యత కలిసిపోయిన సందర్భంనాది.

**చుండూరు కేసులాంటివి చాలావున్నాయి. ప్రస్తుత న్యాయవ్యవస్థ జవాబు చెప్పగలదా?**

చట్టంలో అన్నిటికీ పరిష్కారాలు దొరకవు. పైగా ఆంగ్లో-శాక్సన్ న్యాయవ్యవస్థ ప్రజా సమూహం నుంచి విడివడిన ఒక అమూర్త వలస నిర్మాణం. దాని ముందు సత్యనిరూపణ మహాకష్టం. నేరానికి సంబంధించిన సత్యాన్ని సమస్య చేసిన ఆధునిక సమాజ సృష్టి అది. ఆధునిక పూర్వ సమాజాల్లో నేరానికి సంబంధించిన సత్యం సమస్యేకాదు. శిక్ష సమస్య. మను ధర్మశాస్త్రం కులాన్ని బట్టి, జెండర్‌నుబట్టి నేరాన్ని, శిక్ష పరిమాణాన్ని నిర్వచిస్తుంది. కానీ, ఇవాళ న్యాయవ్యవస్థలో సత్యమూ, శిక్షా - రెండూ సమస్యలే కాబట్టి, ఏ కేసులో ఏం జరుగుతుందో ఇతమిద్ధంగా చెప్పలేం. పైగా మానవులు ఆర్థిక వెంపర్లాటలో హోమో ఎకనమిక్‌గా మారిన గ్లోబల్ సందర్భంలో సత్యం మార్కెట్‌లో సరుకైంది. కేసుల్లో రాజీలో, క్రిమినల్ న్యాయవ్యవస్థలో వివిధ పాత్రధారుల అవినీతి కేసులు కొట్టేయడానికి దోహదం చేస్తుంది. ఏమైనా న్యాయం కోసం చట్టాన్ని నమ్ముకోవడం తెలివితక్కువ తనం. శుద్ధ అవివేకం, ఎంతో కష్టపడితే ఎప్పుడో ఒకసారి తప్ప బలహీనులకు దొరకని విషయమది.

**మీరు 'శాక్కో-వాంజెట్టి' పుస్తక రచయిత కదా! ఈ కేసులో మరణ శిక్షకోసం వాదించడాన్ని ఎలా సమర్ధించుకుంటారు?**

వ్యక్తిగతంగా నేనూ, అసిస్టెంట్ పి.పి. ఇద్దరం మరణశిక్షకు వ్యతిరేకులమే. పబ్లిక్ ప్రాసిక్యూటర్లుగా మా విధి నిర్వహణలో భాగంగా మా వాదనలు కోర్టులో వినిపించాలి. వ్యక్తిగత అభిప్రాయాలకు తావులేదు. చట్టపరంగా కేసులో ఏం శిక్షవేయాలో వాదించాలి కదా. అందుకే మా విధి మేం నిర్వహించాం. కృష్ణయ్యర్ లాంటి వారుసైతం కొన్ని తీర్పుల్లో మరణ శిక్షను ఖరారుచేసిన విషయం తెలిసిందేకదా!

నిజానికి, మరోశిక్షకోసం మేం వాదించబోమనీ అందుకు అభ్యంతరం ఉంటే మమ్మల్ని కాకుండా మరొకరిని ప్రాసిక్యూటర్లుగా ఎంచుకోవలసిందనీ దళిత బాధితులకు 1995లోనే విడమరచి చెప్పాము. వారు దానికి అంగీకరించే మమ్మల్ని ఎంచుకున్నారు. మరణశిక్ష పట్ల మాకున్న అభిప్రాయాలే వారికీ ఉన్నాయి. కాకపోతే, విధి నిర్వహణలో భాగంగా చాలా తీవ్రంగానే మేం మరణశిక్షను కోరాల్సివచ్చింది. దీనికి మేం ఏమాత్రం చింతించడం లేదు. చుండూరు అగ్రకులస్తులకు ఉరిశిక్ష పడితే, ఉరిశిక్ష రద్దుకోసం పెద్ద ఉద్యమం ఉండేది. అలానయినా ఉరిశిక్ష రద్దయ్యేదేమో!

**చుండూరు బాధితులను కేసుకు ముందూ తర్వాతా చూశారు. తీర్పు వాళ్ళలో ఆత్మగౌరవాన్ని పెంచిందా?**

అవును, ఖచ్చితంగా వాళ్ళలోనే కాదు, రాష్ట్రవ్యాప్తంగా సగటు దళితులకు ఆత్మస్థైర్యాన్నిచ్చిన తీర్పుగా ఇది చరిత్రలో నిలిచిపోతుంది. చట్టం ప్రమేయం లేకుండానే, తీర్పు వెలువడిన వెంటనే గుంటూరు, పలుచోట్ల దళితులు బాణా సంచాపేల్చారంటే వారి ఆనందానికి అవధుల్లేవనిపించింది. తీర్పు తర్వాత చుండూరు దళితులు చాలాఉత్సాహంగా కన్పించారు. ముద్దాయిలను జైలుకు తీసుకెళ్ళే దృశ్యాన్ని చూడటం కోసం వర్షాన్ని లెక్క చేయకుండా వందలాదిమంది దళితులు తీర్పు రోజు రాత్రి కోర్టుదగ్గర వేచివున్నారు. ఇలాంటి తీర్పు రాకపోతే గ్రామంలో తమ పరిస్థితి మరింత అధ్వాన్నమయ్యేదని వారు చెప్పారు.

**ఇంటర్వ్యూ : ఎం.ఎ. వనజ**

**సెప్టెంబర్ 2007- తర్జని మాసపత్రిక**

# 31. నిజమే పవన్! ఏమిటీ వెలితి?

విజయదశమి మరుసటిరోజు సినీనటుడు పవన్‌కళ్యాణ్ ఒక సామాజిక సేవాసంస్థ (కామన్ ప్రొటెక్షన్ ఫోర్స్)ను స్థాపించి దానికి కోటి రూపాయల విరాళం ప్రకటించి వార్తలకెక్కారు. అయితే అదేరోజు ఆయన హృదయాంతరాళం నుంచి అలవోకగా జాలువారిన జీవిత అస్తిత్వవేదనను మీడియా అంతగా పట్టించుకోలేదు. తనదైన శైలిలో రివాల్వర్ చేబూని, ఆ నిర్జీవ ఆయుధాన్ని ఆయన ముద్దుపెట్టుకున్న దృశ్యాల మధ్య యువకథానాయకుడి అంతర్వేదన కనుమరుగైంది. 'ఇరవై ఏళ్ళుగా సినీపరిశ్రమలో ఉన్నా, అద్దాల మేడల్లో ఉంటున్నా, లక్షల రూపాయల విలువచేసే కార్లలో తిరుగుతున్నా నిత్యం ఏదో వెలితిగానే ఉంది' అన్నారు పవన్‌కళ్యాణ్.

అలాస్కాలో 20వ శతాబ్ది మొదట్లో బంగారం కోసం పరుగెత్తిన అమెరికన్ల 'గోల్డ్‌రష్' లాంటి సంపద లాలసతో పరుగుపందెంలో జీవితాలు కోల్పోతున్న ఆధునిక తెలుగు ప్రజలు, ముఖ్యంగా హైదరాబాదీల ప్రతి ఒక్కరి జీవితానుభవానికి రూపం ఇచ్చిన పవన్‌కళ్యాణ్‌ను మెచ్చుకోవాల్సివుంది.

ఏమిటి వెలితి? ఖరీదైన కార్లున్నా, అద్దాల మేడలున్నా జీవితంలో వెలితి ఎందుకు వెంటాడుతోంది? సంపద పెంపొందే కొద్దీ రాజకీయ నేతలు బాకాలూదే అభివృద్ధి అనుభవంలోకి వచ్చేకొద్దీ, శాస్త్రసాంకేతిక పరిజ్ఞానం పరివ్యాప్తమయ్యే కొద్దీ ఈ వెలితి విస్తరిస్తూ అగాధంలా వ్యాపిస్తోంది ఎందువల్ల? పవన్‌కళ్యాణ్ చెప్పినట్లు అది ప్రతినిత్యం మనల్ని ఎందుకు ఆవరించి, ఆవహించి ఉంటోంది?

సమాజాన్ని అభివృద్ధి దిశగా తీసుకెళ్తున్నామని చెప్తున్న రాజకీయవేత్తలు ఈ ప్రశ్నలకు సమాధానం చెప్పాల్సివుంది. ధనార్జనలోనో, అధికారాన్ని నిలబెట్టుకోవడంలోనో, భూ బకాసుర జీవితంలోనో సతమతమయ్యే ప్రభువులూ,

వారి అవినీతికి కాపలాదార్లుగా మారి అధికారాన్ని తిరిగి అందుకోవాలనే ప్రయత్నంలో నిమగ్నమైన ప్రతిపక్షనేతలూ ఇలాంటి ప్రశ్నలను పట్టించుకున్న పాపాన పోవడం లేదు. సంపద అధికారం చుట్టూ ప్రదక్షిణ చేస్తున్న మన రైట్, లెఫ్ట్ రాజకీయ ప్రపంచంలో పవన్‌కళ్యాణ్ చెప్పిన జీవితంలో వెలితి ఇంకా ప్రవేశించాల్సే ఉంది. ఈ వెలితి సృష్టికర్తలు వాళ్ళే. కుటుంబ సంబంధ సంక్షోభం వల్లా, కోల్పోతున్న ఇమేజ్‌ను తిరిగి పొందేందుకూ సామాజిక సేవను పవన్‌కళ్యాణ్ ఒక ఎత్తుగడగా ప్రయోగిస్తున్నారని సందేహించే వారున్నారు కానీ, నిత్య జీవిత వేదనను వ్యక్తీకరించినప్పుడు ఇది 'గుండె గొంతుకలోన కొట్లాడుతున్నాది!' అన్న విధంగా ప్రతిధ్వనించిన విషయాన్ని ఎవరూ కాదనలేరు.

ఇది ఆయన అనుభవంలోనిదే కాదు. సమూహ జీవితాన్ని విసర్జించడమే స్వేచ్ఛగా భ్రమించి అణుమాత్రం వ్యక్తులమై, ఆర్థిక మానవులమై, ప్రకృతినుంచి దూరమై, ప్లాస్టిక్ జీవితాన్ని, వర్చువల్ ప్రపంచాన్ని వరించి చివరకి వస్తువుల వినియోగదారులుగా తప్ప మరే గుర్తింపుకు నోచుకోని అధమాధమ జీవితాలను గడుపుతున్న మన ప్రతి ఒక్కరి అనుభవంలోనిదే ఈ వెలితి.

పదిహేడు, పద్దెనిమిదవ శతాబ్దాల్లో పారిశ్రామిక విప్లవంతో పాశ్చాత్య దేశాల్లో ప్రారంభమైన ఆధునికత మనిషికీ మనిషికీ మధ్యపేగు సంబంధాన్ని తెంచి ఆర్థిక సంబంధాలను ప్రతిష్టించింది. అంతకు ముందున్న సమూహ జీవితాన్ని విచ్ఛిన్నంచేసి ప్రకృతి నుంచి మనిషిని వేరుచేసింది. షెల్లీ, బైరాన్, కీట్స్ లాంటి రొమాంటిక్ కవులు తమ కవితల ద్వారా ఈ సమూహజీవిత విచ్ఛిన్నం పై నిరసన గళాలను విప్పారు. నీషేలాంటి తత్వవేత్తలు దేవుడు మరణించాడనీ, దేవుడిని మానవుడే చంపేశాడని ఆక్రోశించారు. ఈ సందర్భం గురించే - కారల్ మార్క్స్ తన తొలి రచనల్లో మానవజాతి ఆవిర్భావం తర్వాత అత్యంత బాధాకరమైన అనుభవంగా సామూహికత విచ్ఛిన్నాన్నీ, వ్యక్తి ఆవిర్భావాన్నీ అభివర్ణించారు. అందుకే తిరిగి సమూహ జీవితాన్ని ఎలా ప్రతిష్టించాలన్నదే తర్వాతికాలంలో అన్ని రాజకీయ సిద్ధాంతాల గమ్యంగా మారింది.

కాపిటలిజం అనేది భూస్వామ్యం, రాచరికం లాంటి అంతకు ముందున్న సమాజాల తర్వాత వచ్చిన ఒకానొక ఆర్థిక వ్యవస్థమాత్రమే కాదు. మనుషులను కలిపి ఉంచిన బంధాలను తుంచేసి వ్యక్తిగత లాభాపేక్షగల మనుషులను

సృష్టించి యంత్ర అవసరాలకు మానవ అవసరాలను లోబర్చిన మహమ్మారి అని ప్రేమ్ శంకర్ ఝా, అశిష్‌నంది లాంటి మేధావులు ప్రకటించారు.

మానవజాతి లక్షణమైన సమూహత్వం నశించడం మనుషులను ఒంటరి వాళ్లను చేసింది. దాన్నే స్వేచ్ఛ పేరిట పైకెత్తారు. డబ్బు తప్ప ఏ ఆప్యాయ మానవ సంబంధాన్ని కూడా సహించలేని ఆధునికత ఎన్నో వెర్రితలలు వేసింది. గత కాలం నాటి స్మృతులను చెరిపింది. మతపరమైన, సాంస్కృతికపరమైన, ఆత్మిక సంబంధమైన ప్రతి రంగాన్నీ ఆర్థిక కార్యాచరణకు లోబడేలా చేసింది. సెన్సెక్స్ ఉత్థానపతనాల్లో, జాతీయ సర్థాల ఆదాయంలో అభివృద్ధిని చూసుకుంటూ మురిసేలా చేసింది. ఆధునిక బాధలు సృష్టించి వాటికి నివారణోపాయాలను మార్కెట్‌గా మలిచింది ఆధునికతే.

బ్రిటీష్‌వారి వలసపాలనలో మనకు దిగుమతైన ఆధునికతకు దేశం యావత్తూ బలైంది. జాతిమూలాల నుంచి తుంచి వేయబడిన అణుమాత్ర మానవులు, పాశ్చాత్య ఆధునిక వృక్షానికి అంటుగట్టిన బతుకులు-ఇవి దేశ విద్రోహ చిత్రపటంలో భాగమయ్యాయి. నాటి రాజారామ మోహన్‌రాయ్, కందుకూరి, గురజాడ నుంచి నేటి మన్మోహన్‌సింగ్, చంద్రబాబు, వైయస్ వరకూ సంస్కర్తలు అందరూ ఈ క్రమాన్ని ముందుకు తీసుకెళ్తున్న వాళ్ళే తప్ప దీన్ని నిలువరించిన వారు లేరు. వామపక్ష రాజకీయాలు సైతం ఈ క్రమానికి మరో పార్శ్వం మాత్రమే. మావోయిస్టులు మినహాయింపుకారు. క్రమంగా జాతి హీనులుగా పాశ్చాత్య నాగరికతను అనుకరించే నకిలీలుగా మనం తయారయ్యాం. ఈ క్రమం స్వాతంత్ర్యానంతరం కొనసాగేందుకు అవసరమైన ఆంగ్ల మానసపుత్రులూ ఆధునిక పాలనా చట్రాలూ తయారయ్యాకనే ప్రత్యక్ష వలసపాలనను బ్రిటీష్‌వారు ముగించారు. గ్రామస్వరాజ్యాలను, స్వయం సంపూర్ణ ఆర్థిక వ్యవస్థను కలలుగన్న గాంధీజీని ఆధునిక భారత రాజ్యపాలన పక్కకు పెట్టింది. గాంధీలోని అహింసామూర్తికి మాత్రమే తగు ప్రచారం కల్పించారు. (ఇటీవల గాంధీగారి గురించిన సినిమాలన్నీ ఈ కోవలోవే)

ప్రపంచీకరణ, మన ఆర్థిక విధానాలలో ప్రపంచ బ్యాంకు జోక్యం ఈ క్రమాన్ని వేగవంతం చేసింది. కాంక్రీట్ నిర్మాణాల్లో జీవ సమాధులు నిర్మించుకుంటూ సైబర్ కేఫుల్లో మెదళ్ళు పోగొట్టుకుంటూ ప్రకృతిని పరిహరిస్తూ

పంచభూతాలను శాసించేందుకు ఉవ్విళ్లూరుతున్నాం. సెల్‌ఫోన్‌ను చేబూని ప్రపంచమంతా నా గుప్పెట్లోనే అనే ఐడియాతో విర్రవీగుతున్నాం.

ఇప్పుడు మనం నిరంతరం పరిగెడుతున్నాం. **ఎలిస్ ఇన్ ది వండర్ లాండ్**లో చెప్పినట్లుగా ఉన్నచోట ఉండాలంటే పరుగెత్తాల్సిన సమాజాన్ని సృష్టించుకున్నాం. మరింత ముందుకు వెళ్ళాలంటే రెండింతలు పరిగెట్టాలి. అలిసిన వాళ్లను సేదదీర్చడం కొనుగోలు సరుకైంది. ఆప్యాయత కరువైంది. వందల టీవీ ఛానళ్లు, సినిమాలు మనకు సాంస్కృతిక తృప్తిని ఇవ్వలేని పరిస్థితి నెలకొంది.

ఆధునిక జీవితంలో వెలితి గురించి పవన్ కళ్యాణ్ పామర భాషలో చెప్పినదే ఆధునిక భారత నిర్మాత పండిట్ జవహర్‌లాల్ నెహ్రూకు సైతం అనుభవంలోకి వచ్చింది. తన అస్తిత్వ వేదనను ఆత్మకథలో ఇలా చెప్పారు. "నేను ప్రాక్ పశ్చిమ సంస్కృతిలో మిశ్రమాన్ని. సర్వత్రా బహిష్కృతుడిని. ఎక్కడా సుఖంలేనివాణ్ణి. జీవితం గురించిన నా ఆలోచనలు, దృక్కోణాలు ప్రాచ్యం కంటే బహుశా పశ్చిమానికి దగ్గరివి. కానీ భారతదేశం తన బిడ్డలందరిలాగే పలు విధాలుగా నన్ను అంటిపెట్టుకుని ఉంటుంది. నేను ఆ వారసత్వాన్ని వదులుకోలేను. ఇటీవల సముపార్జించిన ఆధునికతను వదులుకోలేను. పాశ్చాత్యానికి ఆగంతకుడిని, పరాయివాడిని. దానిలో ఎప్పటికీ భాగం కాలేను. కానీ నా స్వదేశంలోనూ ప్రవాసినే అనే భావన కొన్నిసార్లు కలుగుతోంది."

మనదేశంలో మనమే ప్రవాసులమైన స్థితి పవన్‌కళ్యాణ్ చెప్పిన వెలితికి కారణం. ఈ వెలితిని పూరించుకునేందుకు పాశ్చాత్య అభివృద్ధిమార్గంలో మరింతగా ప్రయాణిస్తూ పోయాం. వెలితి పరిధిని అలా విస్తరించుకుంటూ పోతున్నాం. వంటగ్యాస్‌నే కాదు జీవితాన్ని సైతం ప్రైవేటీకరించుకుంటున్నాం. వినియోగవస్తు వ్యామోహంతో వస్తువుల యజమానులుగా జీవితంలో అసంపూర్తిని పరిష్కరించుకోవాలనే నిరంతర తపనతో వేగిపోతున్నాం. వినియోగ మార్కెట్‌లో ఇవాల్టిది రేపటికి పాతదయ్యే అనిశ్చితత్వం మన జీవితాల్లోకి వస్తువ్యామోహంతో ప్రవేశిస్తుంది.

ఉమ్మడి కుటుంబాలకు చరమగీతం పాడాం. పరమాణు కుటుంబాలను స్వాగతించాం. ఇప్పుడిక ఎవరి పడగ్గదిలో వాళ్ళం పక్కపక్కనే కాలం గడుపుతూ ఆప్యాయతానురాగాలకే కాదు సంభాషణకు కూడా వీడ్కోలు పలికాం.

సంతానాన్ని అమెరికా విమానం ఎక్కించి వారు పంపే డాలర్లకు కాపలాగా మారి జీవిత సాయంసంధ్యలో మాట్లాడే మనుషుల కోసం వెంపర్లాడి వృద్ధాశ్రమాలను నిర్మించుకుంటున్నాం. ధనార్జనే ధ్యేయంగా విదేశీ విషపూరిత పానీయాల ప్రచారానికి సైతం ఒడిగట్టి పండ్లరసాల మాధుర్యాన్ని మర్చిపోయేలా చేస్తున్నాం. మనసుకు ఓదార్పునిచ్చే విశ్వాసాల సేతువులను కూల్చేసి కూలిపోయే వంతెనలను హేతుబలంతో కట్టుకుంటున్నాం. ప్రకృతిని పెద్ద పెట్టున ధ్వంసిస్తూ కుండీలో పూలమొక్కలకు నీళ్లు పోస్తూ తృప్తిపడుతున్నాం. మన భాషను తుడిచిపెట్టే పాశ్చాత్య మాయాప్రపంచాన్ని వరించి ప్రాచీన భాష హోదా పోటీలో తెలుగును నిలబెడుతున్నాం. క్రికెట్ వినోదానికి చొంగకారుస్తూ దేశీయ క్రీడలను మట్టుపెడుతున్నాం. విదేశీ మందుల కంపెనీలకు శరీరాలను అప్పజెప్పి పెరట్లో ఉన్న స్వదేశీ వైద్యానికి తిలోదకాలిస్తున్నాం. నిజజీవితాన్ని నిజం కాదని భావించి ఇమేజెస్‌లో జీవిస్తున్నాం. ప్రతిరంగాన్ని పాశ్చాత్యీకరించుకున్నాం.

పవన్‌కళ్యాణ్ చెప్పిన వెలితి మనం నిర్మించుకున్న పాశ్చాత్య ప్రపంచం నుంచి దిగుమతౌతున్నదే. ఈ వెలితి ప్రకృతి నుంచి మనం దూరంగా జరగగా వచ్చినదే. సమూహ జీవితం విచ్ఛిన్నం కావడంవల్ల ఏర్పడిందే. దేశీయ, సాంస్కృతిక జీవితాన్ని కోల్పోవడంవల్ల వచ్చిందే. ఈ వెలితికి మరోపేరు అభివృద్ధి. దాని లెఫ్ట్ నామం అభ్యుదయం, విప్లవం. ఈ వెలితి విస్తరణపైనే పాశ్చాత్య ప్రపంచం ప్రపంచ మార్కెట్ ఆధారపడి ఉన్నాయి.

భౌతిక సంపద లాలస, ధనార్జన పరాయణత్వం, పాశ్చాత్య సంస్కృతి అనుకరణ ఎప్పటికీ పాశ్చాత్యులతో సమానంగా నిలపలేవు. వారిది రైలు ఇంజనైతే మిగిలిన దేశాల ఆర్థిక వ్యవస్థలు అన్నీ దాని బోగిలే, బోగిలెప్పటికీ రైలింజన్‌లు కాలేవు. రైలింజన్ మాత్రమే ప్రతిసారీ ముందుంటుంది. అలా ఎప్పటికీ ఆధునిక పరుగు పందెంలో మనం వెనుకనే ఉంటాం. ఈ పరుగుకు విరామంలేదు. గమ్యం ఎప్పటికప్పుడు దూరంగా జరుగుతూ ఉంటుంది.

స్వదేశీ ప్రాతిపదికన దేశీయ ఆధునిక జీవిత పునర్నిర్మాణం ద్వారా, పాశ్చాత్య నాగరికతను విసర్జించడం ద్వారా మనం జీవితంలో వెలితిని పోగొట్టుకోవచ్చు. వినియోగప్రపంచాన్ని జీవితం నుండి బహిష్కరించడం ద్వారా తిరిగి పొందవచ్చు. రాజకీయ వ్యాకరణాన్ని సవరించి తాత్వికతను, జీవిత దర్శనాన్ని రాజకీయాల్లో

భాగంచేసి తత్వదారిద్ర్యాన్ని రాజకీయ రంగం నుంచి పారదోలడంతో వెలితికి పరిష్కారం దొరుకుతుంది.

జవహర్‌లాల్ నెహ్రూ చెప్పినట్లు ఆధునికతను వదిలించుకోవడం కష్టం కావచ్చు. గౌతమ బుద్ధుడు రాజ్యాన్నీ, భార్యాపుత్రులనూ వదిలేసి రాజ ప్రసాదం నుంచి నిశిరాత్రి బయటకు నడిచిన విధంగా జరగకపోవచ్చు. కానీ ఆధునికతను మన ప్రధాన శత్రువుగా గుర్తించడం ఆ దిశగా ఒక ముందడుగు అవుతుంది. పవన్‌కళ్యాణ్ అన్నట్లు ఒక మనిషి బతకడానికి ఇంతింత సంపదలు అవసరమా! అని ప్రశ్నించుకోవడం అందుకు దోహదం చేస్తుంది. సంపదే జీవితంగా మారిన స్థితి నుంచి, సామూహికతే సంపదగా జీవించే స్థితికి మారే ప్రయత్నం చేయాల్సివుంది. మనదికాని బ్రతుకును వదిలేసి, నేలమీద కాళ్ళూని బతకడంలో ఆనందాన్ని అనుభవించి పలవరించాల్సివుంది.

**నవంబర్ 20, 2007 - ఆంధ్రజ్యోతి దినపత్రిక**

# 32. ఆధునిక గాలం... ఆకుపచ్చగాయం

## బహుళజాతి సంస్థలకు నల్లమల తాకట్టు?

తెలుగు మేథోవీధుల్లో ఆయన ఇప్పుడొక ఒంటరి చైతన్యం. ఆధునిక పూర్వ సమూహజీవనాన్ని సృష్టిస్తున్న Sovereign individual పౌరహక్కుల పోరాటంలో, మానవహక్కుల ఉద్యమంలో 18 ఏళ్ళు అతడే ఓ సైన్యమై ఉరికాడు. మార్క్సిజంతో మమేకమయ్యాడు. అంతర్జాతీయ వేదికలపై కూడా తన అనర్గళ గళాన్ని వినిపించాడు. అయితే మానవ హక్కుల భాష ప్రపంచ పెట్టుబడి భాష అని గ్రహించాడు. వరల్డ్ సోషల్ ఫోరాల నుంచి ప్రస్తుతం మానవజాతి అభ్యున్నతికై అహర్నిశలు శ్రమిస్తున్న స్వచ్ఛందసంస్థల బండారాన్ని 'ఎన్జీవో కథ' ద్వారా బట్టబయలు చేశాడు. ఆధునిక వ్యాపార సంబంధాలకు అడ్డదారులు వేసే మానవహక్కుల భాగోతాన్ని విడమరిచే రచనల్లో ఇప్పుడు నిమగ్నమయ్యాడు. మార్క్సిజానికి, ఆధునికతకి కూడా తాత్వికంగా దూరమయ్యాడు. పరిణామశీలం, ప్రవాహతత్వం సహజంగానే ఆయన సహజాతాలు. గుంటూరులో సుమారు రెండు దశాబ్దాలుగా నిర్వహిస్తున్న న్యాయవాద వృత్తి ఆయన ప్రవృత్తికి భిన్నమైందికాదు. దేశంలోనే సంచలనం సృష్టించిన చుండూరు మారణహోమంలో బాధితుల పక్షాన ఆసాంతం నిలిచి (బాధిత దళితుల ఉద్యమ ఫలితంగా ఆ కేసులో స్పెషల్ పబ్లిక్ ప్రాసిక్యూటర్‌గా నియమితులై) న్యాయాన్ని గెలిపించాడు. ఉరిశిక్ష అంటే రాజ్యం పకడ్బందీగా చేస్తున్న హత్య అని వాదించి, చిలకలూరిపేట బస్సు దహనం కేసులో చలపతి, విజయవర్ధనమ్ తరపున వాదించి వారిని ఉరినుంచి తప్పించాడు. 20వ శతాబ్దం రెండవ దశకంలో అమెరికాని పట్టికుదిపిన జంటహత్యల కేసు నిందితులు ఇటాలియన్ ప్రవాసులు శాక్కో వాంజెట్టీల విచారణ, ఉరితీతలపై విశేష

పరిశోధన చేసి రచించిన 'శాక్కో-వాంజెట్టీ' చంద్రశేఖర్ మాగ్నమ్ ఓపస్. ఆంధ్రప్రదేశ్‌లోని ఐదు జిల్లాల్లో విస్తరించిన పులుల అభయారణ్యమైన నల్లమల అటవీప్రాంతం ఒకప్పుడు గిరిజనులకు, వన్యప్రాణులకు నిలయమైతే... 1990 నుంచి మావోయిస్టులకూ, వారిని వెంటాడే పోలీసు బలగాలకూ, గిరిజనోద్ధారక ప్రభుత్వ కార్యకలాపాలకూ ఆలవాలమైంది.

గిరిజనులను, మావోయిస్టులను నల్లమల నుంచి తరిమేసే పనిని ప్రభుత్వాలు గత కొన్నేళ్ళుగా ముమ్మరం చేశాయి. గత రెండేళ్ళ కాలంలో నల్లమల పై కేంద్రీకరించిన పోలీసు బలగాలు సుమారు 50 మంది మావోయిస్టులను (వారిలో కొందరు రాష్ట్రస్థాయి నాయకు లున్నారు) ఎన్‌కౌంటర్ల పేరిట హతమార్చాయి. (అతివాదాన్ని అణచివేసి ప్రజాస్వామ్య పాలన కొనసాగించేందుకై ఈ పనిచేస్తున్నామని ప్రభుత్వాలు చెప్పుకుంటున్నాయి.) అదే సమయంలో అభివృద్ధి, నాగరికత పేరిట చెంచులను నల్లమల నుంచి బయటికి తెచ్చే ప్రక్రియను పౌర పాలనా యంత్రాంగం చురుగ్గా చేపట్టింది. (ఈ క్రమంలో దాగున్న హింసను, ప్రతిఘటనను ప్రముఖ సాహిత్యకారుడు డా॥ వి. చంద్రశేఖరరావు ఇటీవల 'ఆకుపచ్చని గాయం' పేరిట నవలీకరించారు) అక్టోబర్ నెలలో నల్లమల గురించిన మూడు గమనించదగ్గ వార్తా కథనాలు దినపత్రికలలో ప్రచురితమయ్యాయి.

మొదటిది - నల్లమలలోని ఆంధ్ర ప్రాంతంలో ఇంకా 70మంది మావోయిస్టు గెరిల్లాలు సంచరిస్తున్నారు. ఇప్పటివరకూ పోలీసులకు చిక్కని మావోయిస్టు అగ్రనేత సాంబశివుడి నేతృత్వంలో వారు కార్యకలాపాలు సాగిస్తున్నారు. వారిని మట్టుబెట్టే 'ఆపరేషన్ సాంబ'కు రాష్ట్ర ప్రభుత్వం శ్రీకారం చుట్టింది. పలువురు పోలీసు ఉన్నతాధికారులతో ఒక టాస్క్‌ఫోర్స్‌ను అందుకోసం ప్రత్యేకంగా ఏర్పరచింది. నల్లమలను నక్సలైట్ ఫ్రీ జోన్‌గా చేసే దిశగా ప్రభుత్వం చర్యలు చేపట్టింది.

రెండవది - నల్లమల నుంచి చెంచులను బయటికి రప్పించి రాష్ట్రప్రభుత్వం ప్రత్యేక పథకాలను అమలుచేయబూనుకుంది. అందుకు పెద్దమొత్తంలో నిధులు కేటాయించింది. చెంచుల ఆవాస ప్రాంతాలైన నల్లమల పెంటలను ఖాళీచేసి అడవి నుంచి బయటికి వచ్చే ప్రతి చెంచు కుటుంబానికి పది లక్షల డబ్బు,

ఐదెకరాల మెట్ట లేదా రెండున్నర ఎకరాల మాగాణితోపాటు - రెండు పోర్షన్ల ఇల్లును సైతం ఇచ్చేందుకు ప్రభుత్వం సంసిద్ధమైంది. అవసరమైతే రాజధాని శివార్లలో చెంచులకు ఇళ్ళు నిర్మించాలని యోచిస్తోంది. అందుకోసం రంగారెడ్డి జిల్లా తుక్కుగూడ ప్రాంతంలో 150 ఎకరాల భూమిని గుర్తించినట్టు సమాచారం.

మూడవది-నల్లమల అటవీ ప్రాంతం పలు విలువైన ఖనిజాలకు నిలయం. వజ్రాలు, బంగారం, ప్లాటినం, వెండి, రాగి, నికెల్ లాంటి ఖనిజ సంపద ఆ అడవి గర్భంలో దాగున్నదని బహుళజాతి సంస్థలు పసిగట్టాయి. మైనింగ్ హక్కులకోసం కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలపై అవి వత్తిడి తెస్తున్నాయి. ఇప్పటికే ఆంధ్రప్రదేశ్ గనుల శాఖ రిమోట్ సెన్సింగ్ సర్వేను చేపట్టింది. ఒక్క ప్రకాశం జిల్లాలోనే 20 వేల కోట్ల రూపాయల ఖనిజాలు నల్లమల ప్రాంతంలో లభ్యమవ్వ గలవని అంచనా వేశాయి. ఆంగ్లో-అమెరికన్ ఎక్స్ప్లోరేషన్ (ప్రైవేట్) లిమిటెడ్ అనే సంస్థ రాగి, నికెల్ ఖనిజాల మైనింగ్ హక్కుల కోసం... అడ్మాస్ ఇండియా (ప్రైవేట్) లిమిటెడ్ అనే మరోసంస్థ బంగారం, వెండి, ప్లాటినం మైనింగ్ కోసం ప్రభుత్వానికి అభ్యర్థనలు పంపాయి.

మూడవ వార్త మొదటి రెండు వార్తల అంతరార్థాన్ని విప్పిచెప్పింది. నల్లమలలో నక్సలైట్లు, చెంచులు లేకుండా చేయడం ప్రభుత్వం ప్రకటించిన 'ఉన్నత ఆదర్శాల' భాగమా? లేక బహుళ జాతి కంపెనీలకు నల్లమలను ధారాదత్తం చేసి అడవి తల్లిగర్భాన్ని చీల్చి వజ్రాలను, ఖనిజ సంపదనూ అవి దోచుకొనేందుకు సహకరించడమా?

ఎందరో పౌర పాలనాధికారులు చెంచుల అభివృద్ధికోసం నిజాయితీగా కృషిచేసి ఉంటారు. వారిని చీకటి నుంచి వెలుతురులోకి, అనాగరికతలోంచి నాగరికతకి నడింపిచే పనిలో చిత్తశుద్ధితో నిమగ్నమై తాము సామాజిక సేవలో భాగస్వాములమని తమను తామే అభినందించుకొంటారు. ఎందరో పోలీసు అధికారులు ప్రాణాలను సైతం లెక్కచేయక మావోయిస్టుల కోసం అడవి తల్లిని జల్లెడపట్టి కొందరిని మట్టుబెట్టి, మరికొందరిని లొంగదీసి కట్టుకథలల్లి తృప్తిపడివుంటారు. అణచివేయడం వంటి చర్యలు పెట్టుబడికి వారందిస్తున్న సేవలని వారికి ఈ వార్తా కథనాల వల్ల బోధపడితే బాగుంటుంది. నాగరిక జీవితంలో అమానుషత్వానికి, స్వార్థ చింతనకు, లాభాపేక్షకు, మనిషి మనిషికి

మధ్య ఉన్న ఆర్థిక సంబంధాలకు గిరిజనులు చాలా దూరం. వారు ప్రకృతి ఒడిలో బతుకుతుంటారు. వారిని ఆధునిక ప్రపంచంలోకి ఈడ్చే దారుణానికి ముద్దు పేర్లే నాగరీకరించడం, అభివృద్ధి. గతంలో బ్రిటీష్ వలసవాదులు మనలను నాగరికతలోకి నడిపించే 'సదుద్దేశాని'కి వైట్‌మాన్స్ బర్డెన్ అని పేరుపెట్టుకొని జాత్యహంకారాన్ని ప్రదర్శించారు. హింసాత్మక విధానాలతో మనలను ఆధునిక జీవన విధానాలకు అలవాటు చేశారు. వారి మార్కెట్ అవసరాలకు అనుగుణంగా మన జీవితాలను తీర్చిదిద్దారు. ఇవాళ నల్లమలలో చెంచులపట్ల (ఆ మాటకొస్తే మొత్తం ఆదివాసీల పట్ల) ఆంగ్ల మానసపుత్రులైన రాష్ట్ర ప్రభుత్వ అధికారులు వలసవాద దృక్పథాన్నే ప్రదర్శిస్తున్నారు. నక్సలైట్లు, గిరిజనులు లేని నల్లమలలో పెట్టుబడి ప్రవేశించడానికి అలా మార్గం సుగమం చేస్తున్నామన్న స్పృహ వారికి ఏ కోశానా లేదు.

చెంచుల లాంటి ఆదివాసీల సంస్కృతి నుంచి, జీవన విధానాల నుంచి నాగరిక సమాజం నేర్చుకోవాల్సింది చాలానే ఉంది. సమూహ జీవితం, ప్రకృతిలో భాగంగా జీవించడంలో ఉన్న ఆనందం, 'ఇకచాలు' అనుకునే జీవితాల్లోని తృప్తి - ఇవి కొన్ని ఉదాహరణలు మాత్రమే. సంపదల పరుగు పందెంలో జీవితాన్ని కోల్పోతున్న మాయ నగరాలకు చెంచులను తేవడం మహాపాపం. మన సమాజం ఏ రుగ్మతలతోనైతే బాధపడుతుందో వాటికి పరిష్కారం చెంచు జనపద జీవితంలో ఉంది. అడవితల్లినుంచి చెంచులను బయటికి రప్పించి, నక్సలైట్లను తరిమేసి బహుళజాతి సంస్థల చెరలో నల్లమలను ఉంచే దుష్కార్యంలో భాగస్వామ్యాన్ని నిజాయితీ పరులైన ప్రభుత్వాధికారులైనా నిరసించాలని కోరుకోవడంలో తప్పులేదు.

మనం ఈ విషయంలో హక్కుల భాష మాట్లాడకపోవడం అవసరం. మానవ హక్కుల భాష ప్రపంచ పెట్టుబడి మాతృభాష. ఆ భాష బహుళజాతి సంస్థలకే లాభదాయకమైంది. చెంచులకు అభివృద్ధి హక్కుఅనీ, సమగ్ర గిరిజనాభివృద్ధిసంస్థ (ఐ.టి.డి.ఎ)ద్వారా నాగరీకులవ్వడం, ఆధునిక వ్యాపార సంబంధాల్లోకి ప్రవేశించడం వారి హక్కుఅనీ హక్కుల పరిభాష చెప్తుంది. (శ్రీకాకుళం పోరాటం సాధించిన విజయాల్లో ఐ.టి.డి.ఎ. స్థాపన కూడా ఒకటని ఇటీవల ఒక ప్రముఖ మానవహక్కుల నేత ఒక దినపత్రికలో రాశారు). ఇలాంటి

హక్కులు చెంచులకు జన్మతః వచ్చేవి. అవి వారినుంచి విడదీయరానివి. వాటిని వదులుకునే హక్కు వారికి సైతం లేదు. భారత రాజ్యాంగంలోని 21వ అధికరణలోని జీవించే హక్కులో అది భాగమైనది. కాబట్టి చెంచులు కాదన్నప్పటికీ వారిని ఆధునీకరించి ఆ హక్కులను అనుభవించేలా కృషిచేయాల్సిన బాధ్యత ప్రభుత్వాలపై ఉంది. చెంచుల అభివృద్ధికి శ్రేయో పథకాలు అమలుచేయడం రాజ్యాంగాన్ని అమలుపర్చడంలో భాగం. అలాగే ప్రజాస్వామ్యం రాజ్యాంగ హక్కు కాబట్టి నక్సల్స్ సాయుధ పోరాటాన్ని అణచివేయడం ఆ హక్కును కాపాడటమే. కాకపోతే అందుకోసం జీవించే హక్కును పణంగా పెట్టి బూటకపు ఎనెకౌంటర్లకు, చిత్రహింసలకు పాల్పడకుండా చట్టబద్ధంగా వ్యవహరిస్తే సరి! అభివృద్ధిపేరిట, వలసీకరణలో భాగంగా పలు జాతులు ధ్వంసం కావడం, సంస్కృతులు, భాషలు అంతం కావడం లేదా వికృతీకరించబడటం, గతకాలం నాటి సామూహికతలు ధ్వంసమై లాభాపేక్ష గలిగిన అణుమాత్ర మానవులు ఏర్పడి వారు బతుకు పరుగుపందెంలో అలసిపోయారు. వినియోగ వస్తువులకు యజమానులుగా తప్ప మరే గుర్తింపుకు నోచుకోకపోవడం పెట్టుబడి పాపమే కాదు. అది మానవ హక్కుల పాపం కూడా.

చెంచులు అడవిలో భాగం. అడవికి బయట చెంచుల జీవితాన్ని ఊహించడం అసాధ్యం. అడవి నుంచి నగరానికి వచ్చిన చెంచులు అమూర్త ఆధునిక మానవులౌతారే తప్ప ఆదివాసీ సామూహిక జీవులు మాత్రం ఎప్పటికీ కారు. అలా చెంచు తత్వాన్ని కోల్పోయి అన్ని అవలక్షణాలకు ఆలవాలమై ఆధునిక వినియోగదారులుగా వారు అంతమౌతారు. కాబట్టి చెంచులను నల్లమల నుంచి బయటికి తేవడం జాతి విధ్వంసం (జెనోసైడ్)తో సమానం.

ఆధునిక సమాజం మనిషిని ఇంతకు మున్నెన్నడూ లేనంత హీనస్థితికి దిగజార్చింది. దీని గురించిన తాత్విక చర్చ రాజకీయాల్లో భాగం కావడంలేదు. ఆధునికుల అస్తిత్వ వేదనకు సారవంతమైన రూపం ఇచ్చిన దాఖలాలు ఇటీవల కానరావు. కేవలం ఆర్థిక జీవితం గడుపుతూ, వినిమయ మాయా ప్రపంచంలో నకిలీ బ్రతుకులు బ్రతుకుతూ సాంస్కృతిక దారిద్ర్యంలో కొట్టుమిట్టాడుతున్న ఆధునికులు అడవి పుత్రుల జోలికి పోవడం క్షమించరాని విషయం. ప్రభుత్వం ఒక రకంగా మావోయిస్టులు మరో రకంగా అదేపని చేస్తున్నారు. ఇరుపక్షాలూ

తమదైన శైలిలో గిరిజనులను ఆధునీకరిస్తున్నారు. ఇరుపక్షాల దృక్పథమూ ఆధునిక దృక్పథమే. కాకపోతే గిరిజనేతరుల దోపిడీ దౌర్జన్యాలను నిజాయితీగా నక్సలైట్లు ఎదుర్కొంటున్నారు కాబట్టి వారికి గిరిజనుల్లో ఆదరణ ఉంది. పనిలో పనిగా వారు తమ ఇతర కార్యకలాపాలకు అడవిని ఉపయోగించుకుంటారు. గిరిజన ఉద్ధరణలో భాగంగా ప్రపంచ బ్యాంకు వెయ్యికోట్ల రుణం ఇచ్చి అటవీ భూములను అమ్మకపు సరుకుగా మార్చే క్రమానికి తొలిమెట్టు వేసుకుంది. గిరిజనులకు భూమిపై హక్కుల పేరిట అడవి భూమిని సరుకుగా మార్చి అలా వ్యాపార సంస్కృతిని గిరిజనులకు పంచిపెట్టింది. అడవులను ప్రైవేటీకరించేందుకు గిరిజనుల జీవితాన్ని ప్రైవేటీకరించడం తొలిమెట్టు. తర్వాత ఆభూములు ఎలాగూ బహుళజాతి కంపెనీలపరమౌతాయి.

గిరిజనులను ఎవరూ ఉద్ధరించనక్కర్లేదు. ఉద్ధారకులు తమ దగ్గరికి రాకపోవడమే వారికి కావాలి. వారిచే ఉద్ధరించబడాల్సిన హీనస్థితిలో ఉన్నది మనమే. వారిది మనకంటే మంచి బ్రతుకే. ఫారెస్టు రిసార్టులలో గుడిసెలలో ఉండేందుకు రోజుకు వేలాది రూపాయలు ఖర్చుపెట్టేందుకు సిద్ధమౌతున్న మనం గిరిజన జీవితంలోని ఆనందాన్ని వారి జీవన సౌందర్యాన్ని, వారి సంతృప్తిని చూసి ఈర్ష్యపడాల్సి ఉంది. కానీ అటు అభివృద్ధి పేరిటో, ఇటు విప్లవం పేరిటో వారి సంస్కృతికి జీవన విధానానికి ముప్పు తెస్తున్నాం.

నల్లమల అడవిని అన్ని రకాల ఆధునికతల నుంచి రక్షించే బృహత్తర కార్యక్రమానికి ఇప్పటికైనా ఆలోచనాపరులైన మేధావులు శ్రీకారంచుట్టాలి. ఆకుపచ్చని గాయాలకు చరమగీతం పాడాలి.

**నవంబర్ 25, 2007- ది సండే ఇండియన్ పక్షపత్రిక**

# 33. ఏ సత్యం కీ సాక్షి?

రంగుల దిన పత్రిక 'సాక్షి' మహాపర్వం మార్చి 24న ప్రారంభమైంది. 'సత్యమేవ జయతే' అన్న ఆర్యోక్తిని పతాకధ్వజంపై సగౌరవంగా ధరించింది సాక్షి.

పత్రికలు సత్యాలను ప్రకటించాలని ప్రజలు కోరుకుంటారు. సత్యానికి ప్రపంచంలో ఇంకా గిరాకీ ఉంది. మనం ఎంత అబద్ధాలకోరులమైనా, సత్యాన్ని ప్రకటిస్తున్నామని చెప్పుకొని మాత్రమే బ్రతకగలం. సత్యానికి వున్న శక్తి అలాంటిది. కాబట్టి ఇష్టమున్నా లేకపోయినా 'సత్యమేవ జయతే' అని నినదించడం అవసరం.

కొన్ని దినపత్రికలు ఒక వేపు సత్యాలను మాత్రమే తవ్విపోస్తూ అస్మదీయులకొక న్యాయం, తస్మదీయులకొక న్యాయం అన్న విధంగా వ్యవహరించి పాలకుల, వారి అభిమాన పాఠకుల మనసు గాయపర్చడానికి తెలుగు పాఠకులే సాక్షి. తత్ఫలితంగా ఎదుటివారి సత్యాలను తవ్విపోసే ప్రొక్లెయిన్ లేదా డ్రెడ్జెర్ ఒకటి ఉంటే బాగుంటుందనే అభిప్రాయం కలిగి వైఎస్ 'సాక్షి'ని రంగభూమిపైకి తెచ్చాడు. పదవీకాంక్ష, రామోజీపై తీర్చుకోవాల్సిన కక్ష వెరసి సాక్ష దినపత్రికగా మారాయి. వైఎస్. తన సత్యాన్ని ప్రకటించుకోడానికిది వేదిక. ఆరోపణల ఖండనలకు వేదిక.

అన్నీ ప్రైవేటు పరం అయినట్టుగానే ఇవాళ సత్యం కూడా ప్రైవేటీకరణ బారినపడింది. సత్యం ఖండ ఖండాలుగా కనిపిస్తోంది. శకలాలుగా అగుపిస్తోంది. ఇప్పుడు ఏ వ్యక్తి సత్యం ఆ వ్యక్తిదే. ఏ పార్టీ సత్యం దానిదే. ఏ కులం సత్యం ఆ కులానిదే. సత్యం ప్రాంతీకరణ చెందింది. తెలంగాణా సత్యం వేరు, ఆంధ్ర సత్యం వేరు. సత్యానికి కాస్మోటిక్స్ వాసన అవసరమౌతోంది. సత్యం సెంటు వాసనలో మాత్రమే గుర్తించబడుతోంది.

ఏది సత్యం ఏదసత్యం అనే మీమాంస కూడా ప్రైవేటీకరించబడిందని వేరే చెప్పనక్కర్లేదు. ఒకరి సత్యం మరొకరికి అసత్యం. ఒకే విషయం ఒకరికి సత్యంలోనూ మరొకరికి అసత్యంలోనూ గోచరించే ఒకానొక పరిస్థితిలో మనం ఉన్నాం. దీన్నే పోస్ట్ మోడ్రన్ కండీషన్ (ఆధునికానంతర స్థితి) అంటున్నారు.

అందువల్ల వై.ఎస్. జగన్ తను దర్శించిన తనకు లాభం చేకూర్చే సత్యాన్ని మాత్రమే పాఠకులకు సందర్శింపజేసి వారిని తరింపజేయగలరు. అలాంటి స్వీయసత్యానికి మాత్రమే ఆయన జయతే చెప్పగలరు.

ఇది కేవలం ఒక జగన్, ఒక 'సాక్షి' చేసే పనే కాదు. చాలా పత్రికలు చేసే పని ఇదే. పత్రికలు సత్యాలు ప్రకటించవచ్చు. కానీ వాటికి నచ్చిన సత్యాలను మాత్రమే ప్రకటిస్తుంటాయి. జగన్ సత్యం, రామోజీ సత్యం, రాధాకృష్ణ సత్యం, సంఘీ సత్యం ఇలా చాలా బ్రాండుల సత్యాల ప్రాడక్ట్సు మార్కెట్‌లో లభ్యమౌతున్నాయి. ప్రతిపక్షాన్ని ఇష్టపడే పత్రికలో పాలకపక్ష దోషిత్వం సత్యమై ప్రత్యక్షమైతే, పాలకపక్ష పత్రికలో ప్రతిపక్ష బలహీనత సత్యమై అక్షర రూపం దాలుస్తుంది. కాస్త అటూఇటుగా ఉండేవి కూడా ఉంటాయనుకోండి. 'సాక్షి' వల్ల ఇప్పుడు ఒన్‌వే ట్రాఫిక్‌లో సత్యం ఇరుక్కుపోకుండా కొంతమేర ఉండగలదు. సత్యాల మార్కెట్‌లో కుల గుత్తాధిపత్యాన్ని పార్టీ గుత్తాధిపత్యాన్ని 'సాక్షి' దెబ్బతీసింది.

ఈ పరిణామాలు సత్యాల మార్కెట్‌కు వెళ్ళే వినియోగ దారుడికి అంటే పాఠకులకు కొంతలో కొంత ఉపశమనం. కాకపోతే పరస్పర వ్యతిరేక దినపత్రికలు రెండు కొంటేనే రెండు వైపులా సత్యాలు తెలిసే అవకాశం ఉంది.

మొన్న మంత్రి డి. శ్రీనివాస్‌ను ఢిల్లీకి పిలిపించి పిసిసి అధ్యక్ష కిరీటాన్ని వై.ఎస్. సమక్షంలో నెత్తినబెట్టారు. వై.ఎస్.కు అది ఇష్టం లేనిదని అందరికీ తెలిసిన విషయమే. వారిద్ధరి విభేదాల గురించి ఒక్క ముక్క కూడా 'సాక్షి'లో ప్రచురితం కాలేదు. ఆంధ్రజ్యోతి చూస్తే తప్ప అది అర్థం కాదు. ఐదేళ్ళనాటి ఫ్లాష్‌బ్యాక్ ఆంధ్రజ్యోతి జ్ఞప్తికి తెచ్చింది.

కడపజిల్లాలో రఘురాం సిమెంట్ ఫ్యాక్టరీ (జగన్‌ది) కోసం ఎన్ని కోట్లు పెట్టి అప్రోచ్ రోడ్ వేశారో 'ఆంధ్రజ్యోతి' సచిత్ర కథనం ప్రచురించింది. ఆ మరురోజు 'సాక్షి'లో ఆ రోడ్డు ఫ్యాక్టరీ వాళ్ళకోసం కాదని, పాయసంపల్లి -కోకటం

గ్రామాలకోసం వేసిందనీ ప్రకటించారు. ఫ్యాక్టరీ అప్రోచ్ రోడ్డును యాజమాన్యమే నిర్మించిందని ప్రకటించారు. ఫోటోలు అచ్చువేశారు.

ఏదేమైనప్పటికీ 'సాక్షి' బాధలు 'సాక్షి'కి ఉన్నాయి. ముఖ్యమంత్రి తనయుడి పేపర్ కాబట్టి ప్రజలు వార్తలను పట్టీపట్టీ చూసి సత్యమో కాదో పోల్చుకునే అవకాశం ఉంది. 'సత్యమేవ జయతే' అని నుదుట రాసుకున్నా తమ కంపెనీ ప్రొడక్టుగా రోజూ విడుదలయ్యే సత్యం వెర్షన్‌ను పాఠక ప్రజలు నమ్మదగినదిగా భావించకపోయే అవకాశాలు మెండు కాబట్టి సర్క్యులేషన్ బలుపుకాదు వాపు అని తేలవచ్చుననే అనుమానం సహజం. ఈ ప్రమాదాన్నించి పెట్టుబడిని రక్షించుకునేందుకు జగన్ దినపత్రికా ప్రచురణలో ఇటీవల పొడచూపుతున్న అనారోగ్య ధోరణులను 'సాక్షి'లో తారాస్థాయికి తీసుకెళ్ళారు. పేపర్‌ను చాకొలెట్‌లా తయారుచేశారు. అన్ని పేజీల్లో రంగులు వెదజల్లారు. వార్తల పేపర్‌కు సమానస్థాయిలో స్పెషల్ ఫీచర్స్ పేరిట అందాలను రోజూ ఆరబోస్తున్నారు. కొంచెం డెబనీర్, కొంచెం ఫెమీనా, కొంచెం స్వాతి కలిపికొట్టి అచ్చేసిన 'సాక్షి'ని మెగా మెట్రో స్టోర్స్‌కు వెళ్ళి సరుకులు కొనుగోలు చేసేవాళ్ళు బాస్కెట్‌లో వేసుకోవాలనిపించేలా వెబ్ రిపోర్టర్ తరహాలో సింగారించారు. వార్తలు ఎలా ఉన్నా ఇతర విశేషాల కోసమైనా 'రెండ్రూపాయలే కదా కాలక్షేపం కోసం కొందాం' అన్న ఆసక్తిని వినియోగ పాఠకులలకు కలిగించేలా రూపుదిద్దారు.

సత్యాన్ని సరుకుగా అమ్మలేకపోతే, సరుకుని సత్యంగా మార్చి 'సాక్షి'ని నిలబెట్టడానికే ఈ ప్రయత్నం. సత్యమేవ జయతే కాకపోతే సరుకుమేవ జయతే అన్నది జగన్‌సూత్రం.

పత్రికా రచన సత్య ప్రవచనం నుంచి మార్కెట్ ప్రవచనంగా మరింతగా మారిందనడానికి సాక్షి 'సాక్షి'. వాణిజ్య ప్రకటనల గాలాలకు చిక్కుకుపోయి సరుకుల మాయలో పడే పాఠకులు మాత్రమే అసలు సత్యం. అందుకు మీరే సాక్షి.

**మార్చి 28, 2008 - రాతప్రతి**

## 34. ప్రపంచీకరణ - మానవ సంబంధ బాంధవ్యాలు

నమస్కారం. మధ్యాహ్నం రెండు గంటలకు ప్రారంభం కావలసిన సమావేశం. ఇప్పుడు మూడున్నరయింది. వాస్తవానికి ఈ సమయంలో నేను కోర్టు ఎగ్గొట్టి నిద్రపోతుంటాను. మనదేశాన్ని బ్రిటీష్‌వాడు పరిపాలించకపోతే, నిద్రపోయే సమయంలో, బహుశ ఇప్పుడు ఈ మీటింగ్ ఉండేది కాదు. ఉష్ణ మండలంలో వున్న మనదేశంలో పొద్దున్నే లేచి అరక దున్నడంగాని లేదా ఏదైనా పని పదకొండు గంటల వరకు చేసి మంచి పెరుగన్నంతో కడుపునిండా తిని తర్వాత చెట్టుకింద విశ్రాంతి తీసుకునేవారు. మళ్ళీ పొద్దు కుంగేటప్పుడు లేచి రాత్రి పదిగంటల వరకు పనిచేసుకుంటూ ఆరోగ్యంగా ఉండేవారు. అలాంటి దినచర్య ఈ దేశంలో బ్రిటీష్‌వాళ్ళు రాకముందు ఉండేది. బ్రిటీష్ వాళ్ళు రావడంతోనే ఆ దినచర్యను ఉదయం పదిగంటల నుంచి సాయంత్రం ఐదు గంటల దాక ఆఫీసు పనివేళలుగా కుదించారు. ఇలా కుదించడానికి గల కారణమేమంటే లండన్‌లో చలికాలం ఉదయం తొమ్మిదన్నరకు సూర్యుడు వచ్చి సాయంత్రం ఐదు గంటలకి అస్తమిస్తాడు. ఆ మధ్య ఏదైతే కాలం ఉందో ఆ కాలాన్ని తీసుకొని వాళ్లు ఆఫీసు టైంగా ఫిక్స్ చేసుకున్నారు. ఈ సమయం వాళ్ళకి చాలా అనుకూలం. బ్రిటీష్‌వాళ్లు ఎక్కడ పరిపాలిస్తే అక్కడ, అక్కడి మనుషుల సంప్రదాయాలతో, వాళ్ళు నిద్రించే సమయమా అనే దానితో సంబంధం లేకుండా టైమ్ ఫిక్స్ చేశారు కాబట్టి మీకు నా లెక్చర్ వినక తప్పని పరిస్థితి ఏర్పడింది. మనకు కాలం అనే దానితో ఉన్న సంబంధాన్ని ప్రపంచీకరణ ఎట్లా మార్చిందన్నదానికి ఇదే ఉదాహరణ.

మన కాలంతో, మన అలవాట్లతో, మన సంప్రదాయాలతో, మన అవసరాలతో మనకున్న సంబంధాన్ని ఈ ప్రపంచీకరణ, వలసవాదం

ప్రపంచంలోని ప్రజల సంస్కృతులను ధ్వంసం చేసింది. అలవాట్లను మార్చేసింది. దీనివల్ల పాఠశాలల్లో మధ్యాహ్నం పిల్లలు నిద్రపోతుంటారు. మా నాగార్జున యూనివర్సిటీ విద్యార్థులకు ప్రొద్దున పదింటికల్లా పెరుగన్నం పెడతారు. దీనితో విద్యార్థులు పదికొండింటికే నిద్రావస్థలో ఉంటారు. అలాంటివారు పరిశోధనలు చేయడమనేది సాధ్యం కాదు. అందుకనే మా నాగార్జున యూనివర్శిటీలో పెద్ద పరిశోధనలేవీ రాలేదు.

మా గుంటూరులో ఒక కాలేజీలో ఇంటర్మీడియట్ చదివే అమ్మాయి ఆత్మహత్య చేసుకుంటూ ఇలా వ్రాసింది. టీచర్ నాకు నిద్ర వస్తుంది. నా ఒంటి తత్వం అది. నేను క్లాస్‌రూంలో నిద్రపోతున్నానని ఇష్టమొచ్చినట్లు మాట్లాడారు. నేను చచ్చిపోతున్నాను అని రాసి చచ్చిపోయింది. అలాంటి సందర్భాలు ఏర్పడుతున్నాయి. మన అలవాట్లతో మనకున్న సంబంధాన్ని, మన సంస్కృతితో మనకున్న సంబంధాన్ని ప్రపంచీకరణ అనేది చాలా తీవ్రంగా మార్చింది. అలాంటి మార్పు అనేది మానవ సంబంధాల్లో కూడా వచ్చింది.

మనిషికి కాలంతో ఉన్న సంబంధం, మనిషికి పెట్టుబడికి ఉన్న సంబంధం, శ్రమకి సమాజానికి ఉన్న సంబంధం ఇలా అనేక సంబంధాల్ని అతలాకుతలం చేసిన ప్రపంచీకరణ ఇవ్వాళ జరుగుతున్నది. మనం ఏమాలోచిస్తున్నాం. మన పిల్లలు ఏమాలోచిస్తున్నారు. యువతరం ఏమాలోచిస్తున్నారు. సమాజం ఎట్లా ఉన్నది. వస్తువులు ఏమున్నాయి అన్న విషయాలలో గత పదేళ్ళలో పెనుమార్పులు చోటు చేసుకున్నాయి. మనం చాలా విషయాల్లో మార్పులకి లోనవుతున్నాం. ఆ మార్పులు విద్యారంగం మీదకి కూడా ప్రసరిస్తున్నాయి. ఇవ్వాళ ఇంగ్లీషు ఎడ్యుకేషన్‌ని పెద్ద ఎత్తున తీసుకురావడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి.

చంద్రబాబు అధికారంలో ఉన్నప్పుడు ప్రపంచబ్యాంకు ఛైర్మన్ ఉల్ఫెన్‌సన్‌కు తన సంతకంతో కూడిన లేఖ వ్రాశాడు. ఆ లేఖలో సర్‌సిల్క్ ఫ్యాక్టరీ ఎప్పుడు మూసేస్తాం లేకపోతే ఆర్.టి.సి. ఎప్పుడు విభజిస్తాం, ఇట్లా ఒక టైం షెడ్యూల్‌ను ప్రపంచబ్యాంకు ఫిక్స్ చేస్తే ఆ టైమ్ షెడ్యూల్ మొత్తాన్ని అంగీకరిస్తూ చంద్రబాబు సంతకం పెట్టాడు. ప్రభుత్వరంగంలో పనిచేసే ఉద్యోగుల సంఖ్యని పదిహేను శాతం తగ్గించాలని ప్రపంచ బ్యాంకు కేంద్ర

రాష్ట్ర ప్రభుత్వాలకు కండీషన్ పెట్టింది. ఆ కండీషన్‌ను అమలుచేస్తాం అని చంద్రబాబు వ్రాశాడు. ప్రభుత్వ సెక్టర్లోని విద్యావైద్య రంగాల్లో పదిశాతం వర్క్‌ఫోర్స్‌ని పెంచమని ప్రపంచబ్యాంకు అడిగింది. దీనికి కూడా చంద్రబాబు సమ్మతిస్తూ సంతకం పెట్టాడు. ప్రభుత్వరంగంలో పర్మనెంట్ ఉద్యోగమనేది లేదు. అయిపోయింది. దానికి చెల్లుచీటి ఇచ్చారు. ప్రపంచీకరణ అంతా కాంట్రాక్ట్ ఉద్యోగాలే. ఉద్యోగులు రిటైర్ అయితే వాళ్ళ స్థానంలో మళ్ళీ పెట్టుకోరు. అలా ఉద్యోగుల సంఖ్యని తగ్గిస్తారు. ప్రభుత్వరంగంలో ప్రభుత్వ నిర్వహణని తక్కువ చేయడానికి ప్రయత్నం జరుగుతోంది. అయితే విద్యా వైద్య రంగాల్లో ప్రభుత్వ నిర్వహణని పెంచమని ప్రపంచబ్యాంకు కోరింది. ఎందుకంటే విద్య వైద్య రంగాలు ఇంకా పెట్టుబడి ప్రవేశించాల్సిన రంగాలు. రవిగాంచని చోట కవిగాంచున్ అంటారు కదా. ప్రపంచబ్యాంకు పెట్టుబడి ఇంకా చొచ్చుకొని పోవలసిన రెండు రంగాలున్నాయి. నూటికి నూరుశాతం మనుషులకి ఇంగ్లీషు మీడియం విద్యనేర్పి, సాంస్కృతికంగా వాళ్ళ అలవాట్ల నుండి బయటకు తీసుకొచ్చి, తల్లిదండ్రుల నుంచి వేరుచేసి, పాఠశాలల్లో పెట్టి మీలాంటి ఉపాధ్యాయుల ద్వారా వాళ్ళని 'కాలనైజ్' చేయడమనే కర్తవ్యం ప్రపంచబ్యాంకుకు ఇంకా మిగిలిపోయింది. ఆ మిగిలిపోయిన దానికోసం మనం ఉన్నాం.

మనం పెట్టుబడి సేవలో ఉన్నాం. ఈ దేశానికి, పెట్టుబడికి ఉపయోగపడే పనిముట్లం అనే ఒక అవగాహన మనకుండాలి. మీకు రావిశాస్త్రి గారి కథ చెపుతాను. కరణాలు రాజు గారికి వ్యతిరేకంగా సమ్మె చేస్తున్నారట. రాజుగారు సరిగా జీతాలివ్వడం లేదు. ఈ కరణాల వ్యవస్థ లేకపోతే రాజు ఎలా ఉంటాడని చెప్పేసి కరణాలంతా పెద్ద ఎత్తున సమ్మె చేస్తున్నారట. రాజుగారు వాళ్ళతో చర్చించాలని అన్నా వినకుండా సమ్మె కొనసాగిస్తుంటే రాజుగారు సైన్యాన్ని ప్రయోగించారు. దీనితో కరణాలు అండర్‌గ్రౌండ్‌కి వెళ్ళిపోయారట. అండర్‌గ్రౌండ్‌లోకి వెళ్ళిన కరణాలంతా కకావికలై గందరగోళంగా తయారైనారు వాళ్ళందరూ మళ్ళీ కూడగట్టుకొని గుహలో సమావేశమైనపుడు ఒకాయన అడిగాడట. అసలు ఇదంతా ఏమిటి? ఇంత సమ్మె చేస్తున్నాం కదా? అసలు మనం ఎవరం అనేది అర్థం చేసుకున్నామా అని. మనం ఎవరం అంటే రాజుగారు

ప్రజల్ని దోచుకోవడానికి ఉపయోగపడే పనిముట్లం. పనిముట్లు తిరగబడొచ్చా? పనిముట్లుగా వున్న మనకు ఈ విప్లవానికి సంబంధం ఏమిటి? ఇదంతా మనకొద్దు. మనం ఏదన్నా కావాలంటే ఒక రూపాయి పెంచమని అడిగితే ఆయన రూపాయి కాదు పావలా ఇస్తానంటే తీసుకొని బతిమిలాడి చేయించుకోవాలి తప్ప ఇదంతా మనకేమి సంబంధం అని చెప్పేసి వేతన శర్మ కథను చెప్పాడు. మనం అలా లేకపోయి ఉండవచ్చు. మీ సచ్ఛీలతని, మీ ఇంటెన్షన్‌ని ప్రశ్నించడం లేదు. నేను కూడా అలాంటి వాడినే.

నేను 'లా' లో కాలనైజేషన్ అయినవాడినే. మనం మన 'ఇన్‌టెన్షన్‌ని' ప్రశ్నించుకోనక్కరలేదు. మనకి తెలిసో తెలియకో, ఎక్కువ సందర్భాల్లో తెలియకో, మనం చేస్తున్న పని చాలా గొప్ప అని, విద్య నేర్పడమనే చాలా ఉన్నతమైన, గొప్ప ఆశయాన్ని నెరవేర్చుతున్నామనే ఒకానొక భ్రమలో పెట్టుబడి మనల్ని పెట్టి దానికి సేవ చేయించుకుంటున్నది. అది మనం గమనించాలి.

మనకు విద్యకు ఉన్న సంబంధం ఏమిటి? మనదేశానికి బ్రిటీషువాడు రాకముందు మనదేశంలో ఉన్నది మొత్తం అజ్ఞానమే అనే విధంగా ఏమి నిర్వహించాడు. అందరికీ విద్య కావాలి. విద్య అంటే ఏమి విద్య? ఏమి విద్య అని అడిగామా మనము? వాడు అందించిందే విద్య. చేపలు పట్టే ఆయన కొన్ని వేల సంవత్సరాల నుంచి చేపలు పడుతూనే ఉన్నారు. సముద్రపు రహస్యాలు వాళ్ళకు తెలుసు. దాన్ని బ్రిటీష్ వాడు విద్యగా గుర్తించాడా? అడవికి పోయే వాడికి అడవి రహస్యాలు మొత్తం తెలుసు. ఎక్కడ పిట్ట కూస్తే ఎక్కడ వర్షం పడుతుంది. ఎక్కడ పాము ఉంది. ఎక్కడ ఏమి ఉంది అనేది వాళ్ళకి తెలుసు. వాళ్ళ జ్ఞానాన్ని బ్రిటీష్ సామ్రాజ్యవాదం జ్ఞానంగా గుర్తించిందా? బ్రాహ్మణీయం కూడా గుర్తించలేదు. బ్రిటీషు సామ్రాజ్య వాదం వీటిని జ్ఞానాలనే విషయాన్ని రద్దుచేస్తూ చదవడం వ్రాయడం మాత్రమే విద్య అనే ఒకానొక నిర్వచనంతో ఈ దేశంలోని ప్రజలను అజ్ఞానులుగా చేసింది. ఈ దేశంలో ఉన్న అనేకానేక కులాల, వృత్తుల జ్ఞానాన్ని మొత్తాన్ని ధ్వంసం చేసింది. తను రాకముందు భారతదేశంలో ఉన్నది మొత్తం అజ్ఞానమే. ఇక్కడ చీకటి రాజ్యమేలుతున్నది. ఇక్కడ ఒక అనాగరికమైన భయానకమైన పరిస్థితి ఉంది. ఇక్కడ కులాలున్నాయి. కుల అణచివేత ఉంది. లేదని కాదు. ఆడవాళ్ళమీద

అణచివేత ఉంది. లేదని కాదు. బ్రిటన్, అమెరికాలు స్త్రీలకి ఓటుహక్కు ఆలస్యంగా 20వ శతాబ్దపు తొలి అర్ధ భాగంలో మాత్రమే కల్పించారనే వాస్తవాన్ని మనం ఈ సందర్భంలో గుర్తుంచుకోవాలి. అది కూడా చెప్పాలి వాళ్ళకి. ఇలాంటి ఒకానొక భయానక వాతావరణాన్ని సృష్టించి ఈ అజ్ఞానం అంధకారం నుంచి బయటపడేయడానికి బ్రిటీష్‌వాడు ఒక వెలుతురు రేఖను ఇక్కడికి తీసుకొని వచ్చినాడు. "That is called white man's burden" అని ముద్దుపేరు పెట్టుకున్నారు. అదే 'తెల్లవాడికొక బాధ్యత ఉంది.' ఈ రోజు బుష్‌కొక బాధ్యత వుంది. ఇరాక్ ప్రజలకి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలనిచ్చే బాధ్యత. అందుకనే అతడు దాడిచేశాడు. అలాంటి బాధ్యతను బ్రిటీష్‌వాడు మోసుకొచ్చాడు ఇక్కడికి. ఇక్కడి అజ్ఞానాన్ని అంధకారాన్ని పారద్రోలి వీళ్ళకి విద్య గరపాలని.

మొట్టమొదట సంస్కృత కళాశాలను పెట్టాడు. ఎందుకు పెట్టాడు? ఇక్కడి మనుషులతో మాట్లాడడానికి, ఇక్కడి పుస్తకాలు చదువుకొని, ప్రజలను అర్థం చేసుకోవడానికి సంస్కృతం అవసరమయింది. వాళ్ళకు సంస్కృత ఉద్యోగులు కావాలి. వీటితో పాటు వాళ్ళ ఆచార సంప్రదాయాలను తీసుకొచ్చాడు.

బ్రిటీష్ పార్లమెంటులో మెకాలె 1833లో ఇలా ఉపన్యాసమిచ్చాడు. భారతదేశంలో బ్రిటీష్‌వాళ్ళకి గొప్ప సుదినం ఎప్పుడైనా వస్తుందా? మన తరహా విద్యా సంస్థలను వాళ్ళే రూపొందించుకొని, మన భాష వాళ్ళు మాట్లాడుతూ, మనం లేకుండా వాళ్ళకి వాళ్ళే మన తరహాలో పరిపాలించుకునే ఒకానొక గొప్ప సుదినం ఎప్పుడు వస్తుందో ఆ రోజు బ్రిటీష్ సామ్రాజ్యం విజయం సాధించినట్లు అవుతుందిగాని అప్పటివరకు చెప్పకండని మెకాలె అన్నాడు. ప్రత్యక్షంగా మనం పరిపాలించకుండానే మనం పరిపాలించినట్టే పరిపాలించాలి. మన అవసరాలను తీర్చాలి. అలాంటి ఒకానొక జాతిని మనం సృష్టించి ఆ ప్రజలకి నాగరికత నేర్పేదశకు మనం ఎప్పుడొస్తామో అప్పుడు సుదినం. ప్రత్యక్షంగా తుపాకులు పట్టుకొని పోయి పరిపాలించేదే లేకుండా పరిపాలించాలి. వాళ్ళు మన అవసరాలను తీర్చే విధంగా పరిపాలించబడాలి అని చెప్పాడు. అది మినిట్స్‌లో రికార్డు చేయబడ్డాయి. అలాంటి సంబంధాన్ని సామ్రాజ్యవాదం ఈ దేశంతో కలిగియున్నది.

సీర్‌వాయ్ అనే రాజ్యాంగ పండితుడు భారత రాజ్యాంగం మీద మూడు వాల్యూమ్‌లు వ్రాశాడు. భారతదేశ సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తి పదవిని సీర్‌వాయ్‌కు అప్పగిస్తామని ప్రపోజ్ చేస్తే, నేను భారత రాజ్యాంగం మీద పుస్తకం వ్రాస్తున్నాను. అది వ్రాసేంతవరకు ఏ పదవిని చేపట్టను అని తిరస్కరించాడు. భారత రాజ్యాంగం గూర్చి వ్రాసిన పుస్తకంలో మొదటి పేజీలో ఈ విధంగా వ్రాశాడు. బ్రిటీష్ సామ్రాజ్యానికి ఆ సుదినం జనవరి 26, 1950న వచ్చింది. ఎందుకంటే భారత రాజ్యాంగాన్ని ఇంగ్లీషులో వ్రాసి ప్రచురించినందువల్ల వచ్చింది అని పేర్కొన్నాడు. మన మీటింగ్‌కు వచ్చిన ప్రధాన వక్తయైన అనిల్ సద్గోపాల్ ఇచ్చిన స్పీచ్‌లో "ప్రపంచ జ్ఞానానికి కిటికి ఇంగ్లీషు" అని వ్రాశాడు. ఇటువంటి తప్పుడు విషయాన్ని ఈ విధంగా ప్రచారం చేయడం గురించి నేనెంతో చింతిస్తున్నాను. ఇంగ్లీషు అనే కిటికీలోంచి చూస్తేనే ప్రపంచ జ్ఞానం అర్థం అవుతుంది అనే తప్పుడు విషయాన్ని ప్రపంచబ్యాంకు పనిగట్టుకొని పెద్ద ఎత్తున ప్రచారం చేస్తున్నది. రాడికల్ భావాలు కలిగిన వారు కూడా దీన్ని సమ్మతించడం బాధాకరం.

ఇంగ్లీషు కిటికీల్లోంచే ఎందుకు చూడాలి? ప్రపంచీకరణ జరుగుతున్నది. ప్రపంచీకరణను ఎవరూ ఆపలేరు? There is no alternative to this. దీనికి ప్రత్యామ్నాయమంటూ ఏదీ లేదు అని ప్రచారం చేసస్తూ అది ఒక్కటే విశ్వవ్యాప్తమయిందని, పెట్టుబడి సహజమైన లక్షణాలు కలిగిందని, అది ప్రవహిస్తూ పోతూ ఉంటే అన్ని కరిగిపోతూ ఉంటాయని, ఆపగలిగే శక్తి ఎవరికీ లేదని, దానికి తలవగ్గి మనం కూడా మన దేహాల్ని, మన భాషల్ని, మన సౌందర్యాన్ని, మన బట్టల్ని, మన ఇంటిలోని వస్తువుల్ని ఎడిట్ చేసుకుంటూ దానితోపాటు పరిగెత్తాలి అనే ఒకానొక భావాన్ని ఇవ్వాళ ప్రచారం చేస్తున్నారు. ఇలాంటి ఘోరమైన భావాన్ని కేపిటలిజం వచ్చినప్పుడు ఆధునికత అన్నారు.

నేను సమాజాన్ని రెండు రకాలుగా విభజించి చూస్తాను. ఆధునికత, ఆధునికత పూర్వదశ అని మాత్రమే మాట్లాడుతాను. ఆధునికత అంటే కాపిటలిజం. ఆధునికత అంటే పాశ్చాత్యీకరణ. ఆధునికత అంటే మనలాంటి దేశాలకు బ్రిటీష్‌వాడు తీసుకొచ్చి కుప్పలు తెప్పలుగా వెదజల్లిన నాగరికత. సోఫిస్టికేటెడ్ ఇంగ్లీషు మాట్లాడే ఒకాయన, ఇంకొక పక్క అచ్చమైన తెలుగు

మాట్లాడుతూ ఏమి చదువుకోనాయన. ఇట్లా అస్తవ్యస్తమైన భీభత్సమైన అచ్చులు పెచ్చులుగా ఆధునికత ఉంటుది. ఇలాంటి ఆధునికత ఈ దేశంలో ఉత్పత్తి అయింది కాదు. ఈ ఫ్యాషన్స్‌గాని, ఆధునికతగాని మొత్తం కూడా పాశ్చాత్యదేశాలు వారి అవసరాల రీత్యా మనకి ఎగుమతి చేశాయి. ఇలాంటి ఆధునికతను మనం కొనసాగిస్తున్నాం. అందుకే ఈ రోజు మానవ సంబంధాల్లో మనం చాలా ఘోరమైన ఫలితాలను చవిచూస్తున్నాం. వాటికి మనలని మనం నిందించుకుంటున్నాము. ప్రపంచీకరణ ప్రభావం వల్ల ఇలా తయారవుతున్నది.

ఇందాక 'స్కిట్' వేశారు. కొడుకులు తల్లిదండ్రులను చూసే పరిస్థితి లేదు. ఎందుకులేదు? వాళ్ళకి మనం స్వేచ్ఛ ఇచ్చాం అంటాను నేను. నేను మానవహక్కుల ప్రసంగాలకు గుడ్‌బై చెప్పాను. కాపిటలిజంలో ప్రాథమికంగా స్వేచ్ఛ అనేది చాలా దుర్మార్గమైనది. ఈ స్వేచ్ఛ అనేది లేకపోతే కాపిటలిజం మనజాలదు. ఈ స్వేచ్ఛ అనే ఒకానొక వస్తువు రావడం వల్ల మానవ సంబంధాలు భయానకమైన పరిస్థితికి చేరుకున్నాయి. ఈ ప్రపోజల్ మీకు చాలా వింతగా ఉంటుంది. నేను 24 సంవత్సరాలు మానవ హక్కుల సంఘంలో పనిచేశాక వచ్చిన నిర్ణయమిది. పెట్టుబడి స్వేచ్ఛ మీద మాత్రమే ఎందుకు బతుకుతుంది అని అంటే జిజెక్ అనే పోలిష్ రచయిత మానవహక్కులు అనేవి మూడురకాలుగా ఉంటాయి అని అంటాడు. మూడు పనులు చేస్తాయి అంటాడు.

ఒకటి, హక్కులు అనేవి సంప్రదాయం నుంచి మనిషికి స్వేచ్ఛని కోరతాయి అంటాడు. సంప్రదాయాల్ని ఛేదించుకుని మనుషులు బయటకు రావాలి. రెండవది, మనిషి యొక్క సుఖమైన జీవితం కోసం వాళ్ళని పనిచేసేట్లు చేస్తాయి అంటాడు. ఇక్కడ సుఖవంతమైన జీవితం అంటే కాపిటలిజంలో (కన్స్యూమర్ గూడ్స్) వినియోగ వస్తువులు. ఎన్ని వినియోగ వస్తువులుంటే అంత మనుషులం మనం. నన్నొక మారుతి కారు యజమానిగా ఒక ఇంగ్లీషు మాట్లాడే మనిషిగా, ఒకానొక ఎల్ఎల్‌యం విద్య చదివిన వినియోగదారునిగా లేకపోతే ఒక రేబాన్ గ్లాస్ పెట్టుకొనే వాడిగా, ఒక రేమాండ్స్ షోరూమ్‌లో కొన్న బట్టలు వేసుకునే మనిషిగా ఇవ్వన్నీ ఉన్నప్పుడు నా విలువకి, నేనొక సాధారణ పంచె కట్టుకొని, లాల్చీ వేసుకొని పోతున్నప్పుడు నా విలువకి తేడా వున్నప్పుడు నా మనిషితనం నాలోనుంచి నా వస్తువులకి మారింది. మనిషితనం వస్తువుకు మారిన తర్వాత

మానవ హక్కులు వస్తువులకుంటాయి. మనుషులకుండవు.

నా స్నేహితుడు, నాకంటే సీనియర్ లాయర్ కారు కొన్నాడు. నాకు పది సంవత్సరాల నుండి కారు ఉంది. ‘‘ఏం ఐజయ్య కారుకొన్నావట కదా’’ అని నేనడిగితే ‘‘కొన్నాను చంద్రశేఖర్, కారు లేకపోతే నన్ను మనిషిలాగా చూడడం లేదు’’ అన్నాడు. పదిహేను సంవత్సరాల నుండి లాయర్ అయివుండి కారు కూడా కొనకపోతే ఇతనికి సామర్థ్యం లేదని కన్స్యూమర్స్ (Consumers) రావడం మానేశారు. దానివల్ల అతనికి ప్రాక్టీసు తగ్గుతుందని భయమేసింది. మనిషిని కాదనుకుంటున్నారు. చంద్రశేఖర్ మనిషిగా గుర్తింపు పొందాలంటే కారుండాలి. ఇప్పుడు మానవహక్కు అనేది కారు హక్కే. కారుకు కొనబడే హక్కు మానవహక్కే. కాని అది కారుకుంది, మనిషికి కాదు. అలా మనిషి యొక్క మొత్తం మనిషితనాన్ని వినియోగపు వస్తువులకి మార్చిన సమాజంలో మనం ఇవాళ జీవిస్తున్నాం. అదే ఇవాల్టి ప్రాబ్లమ్. మనిషిని మనిషిగా ఎందుకు గుర్తించడం లేదంటే మనం అంతా మనుషులుగా ఇంటరాక్ట్ కావడంలేదు. మనం మనం పొందిన వస్తువులుగా interact అవుతున్నాం. ఫ్రెంచి తత్త్వవేత్త అయిన డెకార్ట్ I think therefore I am అన్నాడు. దీనికేమన్నా అర్థముందా అంటే I think అంటే నేను ఆలోచిస్తున్నాను. Therefore I am కాబట్టి నేనున్నాను. ఈ వ్యాఖ్యానం ఇప్పుడేమయిందంటే I consume therefore I am. నేను వినియోగిస్తున్నాను కాబట్టి నేనున్నాను. నేను వినియోగిస్తున్న మేరకే నేను జీవించియున్నాను. నా వినియోగం ఆగిపోయినపుడు నేను మనిషిని కాదు. నేను మనిషిని కాదు అనే భావన నాలో ఏర్పడుతుంది. కావున మానవ సంబంధాలు ఎలా ఉంటాయి? మానవ సంబంధాలుండవు. వస్తువుల మధ్య సంబంధాలు మాత్రమే నెలకొన్న సమాజంలో ఉండిపోయాము.

నిజానికి నా జీవితం విరామంలేని బిజిలైఫ్‌గా మారింది. నిరంతరం పరిగెత్తుతూ పనిచేసేవాళ్ళ మధ్య సంబంధాలు, సంభాషించుకోవడం ఎట్లా ఉంటాయి? పరిగెత్తకపోతే పడిపోతాం. పరిగెత్తడం అనేది ఒక సామర్థ్యం కింద మారిపోయింది. ఆగివుంటే అయిపోతాం. అందుకనే మన జీవితాల్లో "Alice in Wonderland" లాంటి పరిస్థితి ఏర్పడింది.

శ్రీజ ఢిల్లీలో పత్రికా విలేఖరుల సమావేశం పెట్టినపుడు, పవన్ కళ్యాణ్ బంజారాహిల్స్ పోలీస్ స్టేషన్‌లో తన ఆయుధాన్ని అప్పజెప్పేటప్పుడు అలౌకిక (trance) పరిస్థితిలో ఉన్నాడు. తుపాకిని తీసుకున్నాడు. ముద్దుపెట్టుకున్నాడు. తుపాకి నిర్జీవి ఇతను జీవి. తుపాకిని ముద్దుపెట్టుకొని పోలీస్ స్టేషన్‌లో పవన్ కల్యాణ్ అప్పజెప్పినప్పుడు పత్రికా విలేకర్లు అడిగితే ఈ విధంగా అన్నాడు: సంపదలున్నాయి. డబ్బు ఉంది. I Think నేను ఆలోచిస్తున్నాను. ఇన్ని సంపదలున్నా, అద్దాల మేడలో నివసిస్తున్నా, ఖరీదైన కార్లలో తిరుగుతున్నా జీవితంలో నిత్యం ఏదో వెలితి వెంటాడుతుంటుంది నన్ను. చాలా నిజాయితీగా అన్నాడనిపించింది. ఇంత డబ్బులు జీతాలు పెరిగినా, పిల్లలు అమెరికాలో ఉంటున్నా, అన్ని రకాల వస్తువులున్నా కూడా మనకి అభద్రత పెరిగింది. మనం నిరంతరం మనల్ని మనం అప్‌డేట్ చేసుకోవాలి. ఎందుకంటే వ్యర్థం (waste) అనేదే ఒక ఇండస్ట్రీ అయిపోయింది. డిస్పోజబుల్ పెన్నులు వచ్చినాయి. డిస్పోజబుల్ గ్లాసులు వచ్చాయి. ప్రతిదీ డిస్పోజ్ కావాలి. కారు కొననాయనను మనిషి కాదనుకున్నారు కదా. ఆయన మారుతి ఆల్టో కొన్నాడు. ఆల్టో కొన్న నాలుగు సంవత్సరాల తర్వాత మరల ఆయనను మనిషి కాదనుకుంటారు. ఏమిటి ఇన్నాళ్ళుగా ప్రాక్టీస్ చేస్తున్నాడు, హోండా సిటి కారు కొనలేదు. ఇంకా అదే డొక్కుకారులో తిరుగుతున్నాడు అనుకుంటారు. కాబట్టి దానిని అతను 'డిస్పోజ్' చేసి హోండా సిటి కారు కొనాలి. హోండా సిటి కొన్నాక దానికి పెట్రోల్ పోయాలి. లేదా కారు కిస్తీ కట్టకపోతే కారు లాక్కుపోవడం జరగవచ్చు. మనుషుల మధ్య కార్లో తిరగడం ద్వారా నీకో ఐలాండ్ సృష్టించుకుంటావు. ఎందుకంటే మనం మిగతా సమాజం నుండి భద్రతగా ఉండదల్చుకున్నాం కదా.

గ్లోబలైజేషన్ వస్తూనే మిలిటరైజ్‌డ్ వెహికల్స్ వచ్చినాయి. క్వాలిస్ ఒక మిలిటరైజ్‌డ్ వెహికల్. పౌరులు వాడే వాహనాలకు మిలిటరైజేషన్ జరిగింది. కారులో అద్దాలు పైకెత్తుకుని వెళుతుంటారు. ఎం.ఎల్.ఏ.లు వెహికల్స్‌లో పోతూ అభద్రతతో ఉంటారు కావున గ్లాసులు పైకెత్తుకుని పోతుంటారు. మనం మన చుట్టూ మనుషుల నుంచి ఐసోలేట్ అయి విడిగా ఉండదల్చుకున్నాం. అలాంటి గీత గీచుకునే పరిస్థితి ఏర్పడింది. ఇలా మనుషుల మధ్య మానవ సంబంధాలు ఉండకుండా పోవడం జరుగుతున్నది. పాశ్చాత్య దేశాలలో పాపులర్ అయిన

అలిస్ ఇన్ వండర్‌లాండ్ పుస్తకంలో If you want to be at the place where you are, you must run అనొక వాక్యం ఉన్నది. "మీరున్న చోట ఉండాలంటే మీరు పరుగెత్తాలి. మీరు పరుగెత్తకపోతే మీరున్న చోట ఉండరు" అంటే అర్థమేంటి. మన కాళ్ళకింద భూమి తొలుచుకుపోతున్నది. దాని మీద నిలబడి ఉన్నాం. నిరంతరం గ్లోబలైజేషన్ మూలంగా అనేక రకాల మార్పులు గందరగోళాలు జరుగుతున్నాయి. మనం పైన పరిగెత్తుతుంటే కింద గ్లోబ్ తిరుగుతుంది. అప్పుడు మనం ఉన్నచోట ఉంటాము. అలాంటి పరిస్థితి. If you want to move anywhere you have to run twice faster than earlier. మీరు ముందుకెళ్ళాలంటే మీరు పరిగెత్తుతున్న దానికంటే రెండింతలు వేగంగా పరిగెత్తాలి. నిలబడటమే లేదు. ఎవరైనా కాస్త విశ్రాంతి తీసుకొని ఒక సంవత్సరం నేను వేరే పనిచేసుకుంటాను, నేను పుస్తకాలు చదువుకుంటాను అనే పరిస్థితి ఉందా! పిల్లలతో గడిపే సమయముందా? మానవ సంబంధాలు ఎలా ఉంటాయి? మానవ సంబంధాల్లో రకరకాల సంబంధాలుండాలి. ఆ సంబంధాల్ని మొత్తంగా కాపిటలిజం తెంచేసింది. కాపిటలిజం మనిషి జాతి లక్షణాన్ని ధ్వంసం చేసింది.

పారిశ్రామిక విప్లవం రాకముందున్న సమాజాలు పాశ్చాత్య దేశాల్లో కూడా సాంప్రదాయక సమాజాలే. ఆ సమాజాలు మనలాంటి సమాజాలే. సామూహిక జీవనం ఉండేది. దానిలో అణచివేత ఉందా లేదా అంటే ఉంది కాని ఒక సమూహం ఉండేది. భారతదేశంలో కూడా కులవ్యవస్థ దొంతరలు, అణచివేత ఉండేది. కాని సమూహం ఉంది. ఆ సమూహం మధ్య empathy ఉండేది. పారిశ్రామిక విప్లవం పాశ్చాత్య దేశాలలో empathy ఉన్న సామూహిక జీవితాన్ని తొలచివేసింది. ఎందుకంటే పరిశ్రమల్ని పెట్టినపుడు దాంట్లోకి పనులు చేయడానికి మనుషులు కావాలి. వీళ్ళకి కావాల్సిన మనుషుల్ని భూస్వామ్యం బంధించి ఉంది. భూస్వామికి వారానికి కొన్ని రోజులు పనిచేయాలి. ఆయనకు వాళ్ళు శ్రమను వెచ్చిస్తే గాని వాళ్ళ భూమిని సాగుచేసుకోనివ్వడు. దాస్యం (serfdom) ఉండేది. ఆ దాస్య శృంఖలాల నుండి మనుషులు బయటకు రావాలంటే స్వేచ్ఛ, స్వాతంత్ర్యం, సమానత్వం అనే ఒక నినాదాన్ని ఇవ్వాల్సి వచ్చింది కాపిటలిజంకి. చరిత్రలో స్వేచ్ఛ అనే పేరుతో జరిగిన మొదటి మోసం.

భూస్వామ్యం నుండి బయటకు రాదలుచుకున్న వారికి మేము అణచివేతకు గురౌతున్నాం, మేము సంకెళ్ళతో ఉన్నామనే భావన ఉన్నది. వాళ్ళని ఆకట్టుకొని నగరాలకి లాగేసింది.

ఫ్రాన్స్ దేశంలో 1775 సం॥లో గ్రామాలలో సంక్షోభం నెలకొని డెబ్బయి ఐదువేలమంది వరకు దేశదిమ్మరులు (vagabonds) పారిస్‌కి చేరారు. వాళ్ళకి పనిలేదు. వాళ్ళు పనికోసం తహతహలాడి పని కొరకు శ్రమని అమ్ముకోవడానికి క్యూలు కట్టినపుడు కాపిటలిజం ఆవిర్భవిస్తూ పారిశ్రామిక విప్లవం వచ్చింది. అది ఇంటి నుండి ఉత్పత్తిని లాగేసి పరిశ్రమకి తరలించింది. ఇక్కడి నుండే మానవ సంబంధాలు క్షీణించాయి. (That is the first aspect where human relations got damaged). మార్క్స్ చెప్పినట్లు కాపిటలిజం గృహ ఉత్పత్తిలో, కుటీరపరిశ్రమలో వున్న మానవ సంబంధాలను తెంచేసి శ్రమని అమ్ముకునే శ్రామికుల వ్యవస్థని ఉత్పత్తిచేసి ఫ్యాక్టరీని నింపింది. అలా నింపబడిన వారికి ఏ భావన కలుగజేసింది? 'నేను వ్యక్తిని, నేను స్వతంత్రుణ్ణి, నేనేమైనా చేస్తాను' అనే భావన కలుగచేసింది. అంటే నేను సమూహంలో ఉండను. నా ఇష్టం వచ్చినట్లు చేస్తాను. నేను ఎక్కడికైనా పోగలను. నా శ్రమను అమ్ముకుంటాను. దీనిని కాపిటలిజం స్వేచ్ఛగా ప్రకటించింది. అలా సమూహంలో కలవని ఒంటరి 'వ్యక్తి'ని తయారుచేసింది. అంతకు ముందు వ్యక్తులు లేరు. మైకెల్ ఫోకో అనే ఫ్రెంచి తత్వవేత్త ఏమంటాడంటే 17వ శతాబ్దంలో మనిషి అనేవాడు పుట్టాడంటాడు. అంతకు ముందు మనిషి లేడు. జంతువులకి జాతి లక్షణాలు ఉంటాయి. మనిషికి జాతి లక్షణం సమూహ జీవనం. ఆ జాతి లక్షణం నుండి తుంచివేయబడిన వ్యక్తులు, కుటుంబం నుండి తుంచబడిన వ్యక్తులు (individuals), కుటుంబంతో సంబంధం లేకుండా ఎక్కడికైనా ప్రయాణించ గలిగిన వ్యక్తులను తయారుచేసింది. మీకు స్వేచ్ఛ ఉంది అని వాళ్ళకు చెప్పింది. వాళ్ళు తాము సార్వభౌమవ్యక్తులమనుకున్నారు. వారి సార్వభౌమత్వం ఏం లేదు. శ్రమని అమ్ముకోవడమే. శ్రమను ఏ ఫ్యాక్టరీ కావాలంటే ఆ ఫ్యాక్టరీకి అమ్ముకునే స్వేచ్ఛ ఉంది. కాని పనిగంటలు ఎక్కువ ఉంటాయి. రేట్లు తక్కువ వుంటాయి. కాపిటలిజం అట్లాంటి స్వేచ్ఛ కలిగిన లక్షలాది మందిని ఉత్పత్తి చేసింది. కాబట్టి రేట్లు తక్కువుంటాయి.

17వ శతాబ్దంలో యూరప్ దేశాల్లో భయానక చట్టాలను రూపొందించారు. నగరాల్లో తిరుగుబోతుతనాన్ని అదుపుచేసే చట్టాలు, పని లేకుండా పట్టణాల్లో ఉంటే వాళ్ళని జైల్లో పెట్టడం లేదా జరిమానాలు విధించడం, పది కి.మీ. ఆవలనే ఇటువంటి వారిని రాకుండా ఆపే చట్టాలను అమలుపరిచేవారు. లండన్‌లో ఈ చట్టాలు అమలుచేశారు. దొంగతనాలు, దోపిడీలు, హింస, నేరాలు నగరాల్లో పెరిగాయి. ఇలా నిండిపోయిన సమాజాల నుండి 'సార్వభౌమ వ్యక్తులు', అలానే మనిషి అనేవాడు పుట్టాడు. సమూహాలను తొలచి సమూహం నుండి పుట్టాడు. సంప్రదాయాన్ని కాదనుకొని సంప్రదాయం నుండి బయటకు వచ్చి 'మనిషి' పుట్టాడు. అలాంటి మనుషుల కలయిక ఎన్నటికీ సమూహం కాదు. అందుకే కారల్ మార్క్స్ మనిషి జాతి తత్వం సమూహత్వం అయినప్పుడు ఆ సమూహం నుండి మనిషిని ఒంటరివాణ్ణి చేసిన ఏకైక చారిత్రక సందర్భం కాపిటలిజం అన్నాడు. అంతకుముందు అనేక సందర్భాల్లో, బానిస సమాజాల నుండి ఫ్యూడలిజం వచ్చినా, అనేక మార్పులు సమాజాల్లో జరుగుతున్నా మనిషి సమూహత్వం నశించలేదు. ఇప్పుడు మనిషి సమూహత్వం నశించింది. ఆధునికత వచ్చినప్పుడు, కాపిటలిజం వచ్చినప్పుడు సంభవించిన ఈ వినాశనం చాలా బాధాకరమైన విషయం అని మార్క్స్ అన్నాడు. ప్రపంచంలో అత్యంత బాధాకరమైన క్షణం సమూహం నుండి మనిషి బయటకు రావడం అన్నాడు. ఇలాంటి మనిషిని తిరిగి సమూహంగా చేయడం కోసమే మార్క్స్ జీవితం మొత్తం అంకితమైనాడు. ఈ వేరుపడిన మనుషులని కమ్యూనిజంలో సమూహంగా చేయడానికి కమ్యూనిస్టు ప్రణాళికను రూపొందించాడు. స్వేచ్ఛా ప్రాతిపదిక మీద, సమానత్వ ప్రాతిపదిక మీద అంతరాలు లేని సమూహాన్ని తిరిగి నిర్మించాలని ఆయన ఆదిమ కమ్యూనిస్టు వ్యవస్థని ఆవాహన చేసుకున్నాడు.

కమ్యూనిజం ఎందుకంటే మనిషి సమూహత్వం నుండి ధ్వంసించబడ్డాడు. కొండను తొలిచి బయటకు తీసుకురాబడిన కంకరలాగా మనల్ని రకరకాల మనుషుల్లాగా విడగొట్టారు. మనకి కుటుంబాలతో సంబంధంలేదు. కులంతో సంబంధం లేదు. సంబంధం పెట్టుకుంటే నీచం. కులంతో సంబంధం పెట్టుకుంటే నీచం. లోక్‌సత్తా జయప్రకాష్ నారాయణ్‌గారు చెపుతుంటారు కదా. ఓటర్లు వారి విజ్ఞతతో ఓటెయ్యాలి. కులాన్ని పట్టించుకోవద్దు. మతాన్ని

పట్టించుకోవద్దు. పెద్దలు చెబితే పట్టించుకోకూడదని. అయితే వాళ్ళు ఏమై ఉండాలి? స్వతంత్ర మానవులై ఉండాలి. ఆ మానవులు ఎవరికి వారు ఆలోచించి ఓటెయ్యాలి. వాళ్ళు కులాన్ని మతాన్ని ఆలోచించడమనేది ప్రజాస్వామ్యానికి పనికిరాదు. అలా ప్రజాస్వామ్యమనే వ్యవస్థని కూడా కాలనైజ్ చేసింది. ఈ దేశంలో కాలనైజేషన్‌కి ప్రాతిపదిక ప్రజాస్వామ్యం కూడా. న్యాయవ్యవస్థ బ్రిటీష్‌వాడు ప్రవేశపెట్టిందే కొనసాగుతున్నది. పోలీసు వ్యవస్థ 1861 పోలీస్ చట్టం క్రిందనే నడుస్తున్నది. ఎందుకంటే ఈ ప్రజాస్వామ్యం కలోనియల్ ప్రజాస్వామ్యం. మనకున్న సాంప్రదాయ అస్థిత్వాలు మొత్తాన్ని ధ్వంసించి ఏకాకి మానవుల సమూహాన్ని ఓటర్లుగా భావించి ఇచ్చిన ప్రజాస్వామ్యం కదా! కాకపోతే అది జరగట్లేదు.

మా ఊర్లో, మా జిల్లాలో ఉన్న ఎరుకల, డక్కలి, యానాది, బుడబుక్కలంతా కలిసి ఒక సంఘాన్ని ఏర్పాటు చేసుకున్నారు. వాళ్ళు ముందు రాత్రి నిర్ణయం తీసుకుంటారు. వై.వి.రావ్ కెయ్యాలా లేక రాయపాటి సాంబశివరావు కెయ్యాలా? వాళ్ళ కులపెద్ద రాత్రి చెప్తాడు వై.వి.రావ్ కెయ్యాలని. వై.వి.రావ్‌కు ఓటేస్తారు. అంతే. వాళ్ళకేమి తెలియదు. వాళ్ళకు భారత రాజ్యాంగం ఉందని తెలియదు. ఢిల్లీ ఎంత దూరం ఉందని తెలియదు. మన రాజ్యాంగ హక్కుల గూర్చి తెలియదు. వాళ్ళకి తెలిసింది వాళ్ళ కులపెద్దే. ఆ కులపెద్ద మాట వింటే అతనెప్పుడైనా పోలీసోడు పట్టుకెళ్తే కాపాడతాడు. లేకపోతే గొడవలొస్తే కాపాడతాడు. అలాంటి సందర్భాల్లో వాళ్ళు కులపెద్దతో ఉంటారు. వాళ్ళు అందరూ కలిసి ఒకే వ్యక్తికి ఓటువేస్తారు. ఇదీ ప్రజాస్వామ్యం. డబ్బులు తీసుకుని ఓటేస్తారు. ప్రజాస్వామ్యమంటే ఏంటో వాళ్ళకి తెలియదు. మీకు తెలుసు ప్రజాస్వామ్యమంటే! కార్పొరేట్ కంపెనీల నుండి డబ్బులు తీసుకొని, ఓట్లతో గెలిచిన ఎంపీలు కంపెనీలకు అనుకూల చట్టాలు చేసే మన ప్రజాస్వామ్యం గూర్చి వాళ్ళకి తెలియదు.

ఆ మధ్య ఎన్నికలప్పుడు సోనియాగాంధీ రోడ్‌షోలో పాల్గొంటూ సడన్‌గా ఒక పేదోళ్ళ గుడిసెలోకి పోయింది. గుడిసెలో వాళ్ళకి సోనియాగాంధీ అని పరిచయం చేశారు. వాళ్ళు దండం పెట్టారు. ఏం కావాలో కోరుకొమ్మని సోనియాగాంధీ అంటే కాస్త పంచదార కార్డు ఇప్పించండి మాకు ఎం.ఆర్.వో

ఇవ్వడం లేదని అన్నారు. గబుక్కున దేవుడు ప్రత్యక్షమైనా పంచదార కార్డు కావాలని అడిగేట్టున్నారు జనం.

మన పురాణగాథల్లో దేవుని గూర్చి తపస్సు చేస్తే దేవుడు ప్రత్యక్షమైతే ప్రపంచానికి అధిపతి కావాలని గాని, గొప్పశక్తి రావాలని గాని కోరికలు కోరేవారు. అలాంటిదే 'సాక్షి' ఎడిటర్ అయిన పతంజలి 'జ్ఞాన గంధర్వుడు' అనే ఒక కథ వ్రాశాడు. గంధర్వ లోకంలో గంధర్వులు, యక్షులు, కిన్నెరులు ఉంటారు. గంధర్వులు చాలా గొప్పగా గానం చేస్తుంటారు. గంధర్వ లోకం నాట్యానికి, గానానికి ప్రతీతి. వారికి ఆకలైతే సీతాఫలం చెట్టు దగ్గరికెళ్ళి ఓ పాట పాడితే వెంటనే నాలుగు ఫలాలనిస్తుంది. వాటిని తింటారు. అలాగే ఆకాశం పైకెళ్ళి అక్కడ ఒక పద్యం పాడి అక్కడి మబ్బులను వర్షించమంటే వరుణుడు ఆ పాటకు మెచ్చి వర్షం కురిపిస్తే ఆ నీళ్ళను తాగుతారు. వాళ్ళ లోకంలో వాళ్ళు సంతోషంగా ఉంటారు.

ఇలాంటి గంధర్వలోకంలో ఒక గంధర్వుడు పెద్ద తపస్సు చేసి ఈశ్వరుణ్ణి మెప్పించి పెద్ద కోరిక కోరాలని తపస్సు చేస్తున్నాడు. దేవుడా! నువ్వు రా! రా! అని దేవుడి పేరు మీద చేస్తున్నాడు. శివుడు, బ్రహ్మ, అని ఏ దేవుని పేరు లేకుండా దేవుడా! అని చేస్తున్నాడు. వందల, వేల సంవత్సరాలు గడిచాయి. ఇతని జూనియర్లు తపస్సు చేస్తున్నారు. వాళ్ళు కోరుకున్న దేవతలు ప్రత్యక్షమవుతున్నారు. కోరికలు తీర్చుతున్నారు. మళ్ళీ కొత్త బ్యాచ్‌లు వస్తున్నాయి. గంధర్వుని కఠోర తపస్సును చూసి పార్వతీదేవి శివునితో ఆయన దేవుడా దేవుడా అని అంటుంటే ఎవరూ ప్రత్యక్షమవడంలేదు. నువ్వు భోళా శంకరుడివి కదా నువ్వు వెళ్ళు అన్నది. శివుడు ప్రత్యక్షమయ్యాడు. ప్రత్యక్షమై ఏం నాయనా! ఈ సారి తపస్సు చేస్తే దేవుని పేరుతో చేయి. ఈ తిప్పలుండవు. నేను భోళాశంకరుడిని కాబట్టి వచ్చాను. ఏం కావాలో కోరుకో అంటే అతను ప్రపంచంలో ఉన్న జ్ఞానం మొత్తం నాకే కావాలి స్వామి అంటాడు. ఏమన్నా సమస్యలు వస్తాయేమో ఆలోచించావా అంటాడు దేవుడు. సమస్యలేమిటి స్వామి జ్ఞానమన్నది స్వేచ్ఛకి, విజ్ఞానానికి తార్కాణం కదా! జ్ఞానం సమస్యలకు పరిష్కార మార్గం చూపిస్తుంది కదా! జ్ఞానం వల్ల సమస్యలు ఎట్లా వస్తాయి స్వామి మీరు కొత్తగా చెప్పకండి నాకు, నాకు మాత్రం మొత్తం సంపూర్ణమైన జ్ఞానం కావాలి అంటే శివుడు తథాస్తు

అని వెళ్ళిపోతాడు.

గంధర్వుడు లేచాడు. బాగా ఆకలేస్తుంది. ఈయన మొత్తం జ్ఞానాన్ని రంగరించి పాట పాడాడు. సీతాఫలం చెట్టు కరుణించడంలేదు. ఒక పాట పాడాడు. రెండు పాటలు పాడాడు. సీతాఫలం చెట్టు ఫలాలను ఇవ్వడంలేదు. ఈయనకు కోపం వచ్చింది. ఏం సీతాఫలం చెట్టు ఇదివరకు నేను ఒక్కపాట పాడితేనే ఇచ్చేదానివి, ఇప్పుడు రెండు పాటలు పాడాను ఒక ఫలం కూడా ఇవ్వడంలేదు అని అడిగాడు. ఇది వరకు నువ్వు పాటలు పాడినవి అర్థమయ్యేవి. ఇప్పుడు నువ్వు చెప్పేది అర్థం కావట్లేదు, నువ్వు పాడేది అర్థం కావట్లేదు, అప్పటి పాటలు చాలా గొప్పగా ఉండేవి అన్నది.

అదేంటమ్మా! నేను అజ్ఞానిగా ఉన్నప్పుడు ఏవో పిచ్చి పిచ్చి రాగాలతో అనేక పాటలు పాడినపుడు నువ్వు పులకరించిపోయి పండ్లు రాల్చావు. పరిపూర్ణ జ్ఞానవంతుడినై జ్ఞానాన్ని రంగరించి అద్భుతంగా తయారుచేసిన పాటలు నీకు వినిపిస్తుంటే నువ్వు స్పందించకపోవడం ఇదేం న్యాయం! అని అన్నాడు. దానికి సీతాఫలం చెట్టు నాకు అనవసరం అబ్బాయ్, నువ్వు నాకు అర్థం కావట్లేదు. నీ దారిన నువ్వుపో ఇటువైపు మాత్రం రాకు. ఇప్పుడు మాత్రం రెండు పండ్లు ఇస్తున్నా బాగా ఆకలిగా ఉన్నావు కాబట్టి అని అన్నది. ఆ గంధర్వుడు గంధర్వలోకంలోకి వెళతాడు. అతడు ఎవరికీ అర్థం కాడు. జ్ఞానపీడితుడైపోతాడు. అలాంటి వారిని, అలాంటి మనుషులు ఎవరైతే ప్రత్యేకమైన వ్యక్తులుగా (ఇండివిడ్యువల్ పర్సన్స్) ఉన్నారో వాళ్ళని పెట్టుబడిదారీ విధానం తయారుచేసింది. ఇలా ఏకాకిగా మారిన వ్యక్తులను స్వేచ్ఛ అనే హక్కుతో నింపి వదిలింది. వ్యక్తిగత స్వేచ్ఛ రాజ్యాంగంలో 21వ అధికరణంలో ఉన్నది. అలాంటి మనుషులు సామ్రాజ్యాన్ని జయిస్తారు. శ్రమను అమ్ముకుంటారు. తల్లిదండ్రులను వదిలేసి పోతారు. కుటుంబాన్ని వదిలేసి పోతారు. ఎక్కడెక్కడికో సముద్రాల్ని దాటిపోతారు. తల్లిదండ్రులు చచ్చిపోయినా వెనక్కి రారు.

ఈ మధ్య తెనాలిలో అలానే జరిగింది. కొడుకు అమెరికాలో ఉన్నాడు. తల్లి చనిపోతే కొరివి పెట్టడానికి తండ్రి రమ్మని అంటే ఏముంది మృత శరీరంకదా పారేయమన్నాడు. నేను వచ్చినా కూడా అదే కదా చేసేది, నువ్వే చేయమన్నాడు. అప్పుడు తండ్రికి జ్ఞానోదయమైంది. జ్ఞానోదయమై వెంటనే రెండవ పెళ్ళి

చేసుకున్నాడు. ఆస్తి మొత్తం రెండవ భార్య పేరుమీద వ్రాసి, కొంత వృద్ధాశ్రమాలకు వ్రాసి నాకు కొడుకు లేడండి మొన్ననే పెళ్ళిచేసుకున్నాను అని చెప్పాడు. అలాంటి పరిస్థితులు ఏర్పడుతున్నాయి.

బ్రిటీష్‌వాడి ద్వారా ఏ ఆధునికత అయితే దిగుమతి అయిందో దానిని చూసి మనం మూర్ఛపోయాం. రాజా రాంమోహన్‌రాయ్ లాంటి వారు అర్జీలిచ్చారు. వాళ్ళు వేగుచుక్కలయ్యారు. ఎందుకూ! భారతీయుల్ని జ్ఞానగంధర్వులిగా తయారుచేయమని బ్రిటీష్‌వాడికి అర్జీలిచ్చినందుకు రాజా రాంమోహన్‌రాయ్ గొప్ప జ్ఞాని అయిపోయాడు. గొప్ప సంస్కర్త అయిపోయాడు. ఒక్క రాజారాం మోహన్‌రాయ్ కాదు. ఇప్పుడు వై.ఎస్. రాజశేఖర రెడ్డి దాక ఈ సంస్కర్తలంతా చేస్తున్న పని అదే. వాళ్ళ అవసరాలకోసం సృష్టించిన హక్కులు వీళ్ళు అమలు చేస్తారు. వాళ్ళ హక్కులు మనకోసం కాదు.

అందరికీ ప్రాథమిక విద్య అనే హక్కు మనకోసం రాలేదు. మన పిల్లల్ని కాలనైజ్ చేయాలి. వాళ్ళ భావాలతో నింపాలి. సంప్రదాయవృత్తుల్నించి సంస్కృతుల్నించి పిల్లలని విధ్వంసం చేయాలి. అందుకని వాళ్ళని బయటకు లాగాలి. లాగి విద్య గొప్ప విషయంగా భావించాలి. బడిలో లేని వాళ్ళంతా బాల కార్మికులేనని శాంతాసిన్హా గొప్ప నినాదమిచ్చింది. బడిలో ఉన్న వాళ్ళంతా బాలకార్మికులే అని నేను అంటాను. ఎందుకంటే బాలకార్మికులు చేసే పనికన్నా ఎక్కువ పనులు బడులలో జరుగుతుంటే అది పట్టించుకోరు. ఎందుకంటే ఇది ఆధునికతకు అవసరం. సామ్రాజ్యవాదానికి అవసరం కాబట్టి. ఇది మానవహక్కుల చరిత్రలో ఉండదు. మానవహక్కుల చరిత్రలో ఏముంటుందంటే పిల్లవానిని బడికి పంపించని తండ్రికి పదివేల పెనాల్టీ . ఎందుకంటే అది ఆధునికతకు అవసరం. అందుకని శాంతాసిన్హా బడిలో లేని పిల్లలను పట్టుకొచ్చి బడిలో వేస్తున్నది. వాడు అయిదో తరగతో, ఏడో తరగతో చదువుతాడు. పెప్సికోలా తాగడం నేర్చుకుంటాడు. డబ్బులు ఎక్కడనుంచి వస్తాయి. తర్వాత చదవడానికి డబ్బులేవి? ఏంకావాలి వాడు?

అందుకు ఏ చేపలవేటో నేర్చుకుంటే, ఆ చేపల వేటకు పనికొచ్చే నీళ్ళను ప్రైవేటీకరించి, నదుల్ని ప్రైవేటీకరించి, ఆడవుల్ని ప్రైవేటీకరిస్తే ఈమె మాట్లాడదు. ఎన్.జి.వోలకు పట్టదు. వీళ్ళకు మాత్రం పిల్లలంతా బళ్ళలో ఉండాలి.

ప్రతి వాడికి ఇంగ్లీషు వైద్యం కావాలి. ఎందుకంటే ఆరోగ్యం జన్మహక్కైంది. ఇదివరకు ప్రకృతితో మనిషి కలిసి జీవించేవాడు. ఆధునికత దీన్ని తుంచేసింది. ప్రకృతితో సంబంధం లేకుండా మనల్ని బతికిస్తూ మన ఆయుర్వేదాన్ని మన యునానిని, ఆకుపసర్ని, శొంఠి వైద్యాన్ని మొత్తాన్ని ధ్వంసం చేసి, అల్లోపతి అనే మహా కథనంతో నింపింది ఈ దేశం. దాన్ని కొనసాగించేందుకు అమెరికా ఆరోగ్య శాఖ కార్యదర్శి మన దేశాన్ని సందర్శించాడు. హెల్త్ ఇన్సూరెన్స్ స్కీంలు రాబోతున్నాయి.

ప్రతి ఒక్కరిచే బలవంతంగా హెల్త్ ఇన్సూరెన్సు చేయించాలి. కార్లకి తప్పనిసరిగా ఇన్సూరెన్స్ ఉండాలి. ప్రతి మనిషికి తప్పనిసరిగా ఇన్సురెన్సుచేసి, మన దగ్గర డబ్బులు తీసుకుని, మీకు వైద్యం అపోలో హాస్పిటల్‌లోగాని, సూపర్ స్పెషాలిటీలోగాని లేదా అల్లోపతి హాస్పిటల్‌లో గాని చేయించుకుంటేనే అప్లై అవుతుందంటారు. హెల్త్ ఇన్సూరెన్స్‌కు మన జేబులోంచి పది రూపాయలు తీసుకొని అందులోంచి ఒక రూపాయి ఇన్సూరెన్స్ ఇస్తూ మిగతాది కాజేస్తున్నారు.

వైద్యరంగంలో ఇంకా శొంటి వాడే వాళ్ళున్నారు. దెబ్బ తగిలి రక్తం కారుతుంటే వెంటనే పసుపు పెట్టుకునే వాళ్ళున్నారు. వాళ్ళని పసుపు పెట్టుకోనీయకూడదు. వాళ్ళల్లో భయాన్ని సృష్టించి వాళ్ళు ఎం.బి.బి.ఎస్. డాక్టర్ వద్దకు పరిగెత్తుకొని వెళ్ళి యాభై రూపాయల ఫీజు చెల్లించేలా చేయాలి. అడవుల్లో మన ప్రజల దగ్గరకు ఇంగ్లీషు వైద్యం వెళ్ళలేదు. ప్రపంచ బ్యాంకు ప్రభుత్వాన్ని అదేశించింది. పారామెడికల్ స్టాఫ్‌ను పెట్టి గ్రామ సేవికలను పంపించి మందులను ఇవ్వమంది.

మన దేహాల్ని కాలనైజ్ చేస్తున్నది. మన దేశాల్నే కాదు మన దేహాల్ని కూడా మందులతో కాలనైజ్ చేసి దేహ రక్షణ వ్యవస్థను ఆంటిబయోటిక్ మందుల ద్వారా ధ్వంసం చేస్తున్నది. క్రిములులేని వాటర్ బాటిల్‌లోని నీటిని తాగి స్వయం ప్రతిఘటనా శక్తిని ధ్వంసం చేస్తే మనం చేతనావస్థలో పరాధీనంగా ఉంటాం.

ప్రపంచబ్యాంకు ప్రతి సంవత్సరం యు.ఎన్.డి.పి. (యునైటెడ్ నేషన్స్ డెవలప్‌మెంటు ప్రాజెక్టు)తో కలిసి ఒక నివేదికను తయారుచేస్తుంది. అది మానవహక్కుల అభివృద్ధి నివేదిక (Human Rights Development Report)

నాలుగేళ్ళ క్రితం సంచికలో మానవహక్కుల మీద ప్రత్యేక సంచిక వచ్చింది. ఈదేశం వాళ్ళకి వైద్యం సంపూర్ణంగా ఉండే హక్కు ప్రపంచంలో ఎన్నవ స్థానంలో ఉన్నదో ఒక పట్టిక ఇచ్చారు. ప్రపంచంలోని రెండువందల దేశాలలో భారతదేశం (105) నూట అయిదవ స్థానంలో ఉన్నది. ప్రపంచ బ్యాంకు ప్రభుత్వాన్ని ప్రశ్నిస్తుంది. వెంటనే మానవహక్కుల సంస్థలన్నీ బయలుదేరి ఆరోగ్యం జన్మహక్కైతే, ఆరోగ్య హక్కు గూర్చి ప్రభుత్వాలు పట్టించుకోవడంలేదని ప్రచారం చేస్తాయి. ఆరోగ్య హక్కు నాశనమవుతున్నదని ఎన్.జి.వోలు పోరాడుతాయి. వెంటనే ప్రభుత్వం బడ్జెట్ కేటాయించి అల్లోపతి వైద్యశాలలను నెలకొల్పుతుంది.

105వ స్థానంలో ఉన్న మనదేశంలోని ప్రజలు ఆరోగ్యంగా లేరా? అమెరికాలోని మనుషులకంటే ఆరోగ్యంగానే ఉంటారు. వయగ్రాలు అమెరికాలో వాడినట్లు ఇక్కడ వాడడం లేదు. ఆరోగ్యంగానే ఉంటారు. కాని వాడికొక కొలబద్ద ఉంటుంది. ఆ కొలబద్ద ఏమిటంటే జలుబు జేయగానే క్వాలిఫైడ్ డాక్టర్ దగ్గరకు వెళ్తున్నాడా? లేదా? మిగతావారు క్వాలిఫైడ్ కాదు. వైద్యం మీద పర్‌క్యాపిటా ఎంత ఖర్చు పెడుతున్నారు. దేశంలోని ప్రజలు అల్లోపతి వైద్యం మీద ఖర్చు పెడుతున్నదాన్ని జనాభాతో భాగిస్తే పర్‌క్యాపిటా ఎంత ఖర్చు చేస్తున్నారో వస్తుంది. అమెరికాలో ప్రతి సంవత్సరం మనుషులు పది డాలర్లు ఖర్చు పెడుతుంటే మనదేశంలో పదిసెంట్లు కూడా ఖర్చు పెట్టడంలేదు. ఎందుకంటే జలుబు చేస్తే శొంటి వాడుతుంటారు. తగ్గిపోతుంది. కావున సూచిక 105 ఉంటుంది.

1990లో ఆర్థిక సంస్కరణలు, గ్లోబలైజేషన్ ప్రారంభ సమయంలో బ్యాంకాక్‌లో ఒక సమావేశం జరిగింది. ఆ సమావేశంలో ప్రపంచ బ్యాంకు ప్రతినిధులు ఉన్నారు. భూటాన్ రాజు జిగ్‌మే సింగ్‌మే వాంగ్‌చుక్ కూడా ఉన్నాడు. ప్రపంచబ్యాంకు ప్రతినిధులు భూటాన్ రాజును చూచి భూటాన్ దేశం వెనుకబడిన దేశం. అన్ని అడవులు ఉన్నాయి. ఇక్కడ పారిశ్రామికాభివృద్ధి సున్న. ప్రపంచంలో పారిశ్రామికాభివృద్ధిలో ఈ దేశం 198వ స్థానంలో ఉన్నది. రెండే దేశాలు దీనికన్న క్రింద ఉన్నాయి. వీళ్ళు అనాగరికమైన పరిస్థితుల్లో బ్రతుకుతున్నారు అని కించపరుస్తూ మాట్లాడారు. భూటాన్ దేశంలో (జి.ఎన్.పి.) అతి తక్కువ అని అన్నారు. దీనికి సమాధానంగా భూటాన్ రాజు ఈ విధంగా చెప్పాడు. అయ్యా, మీరు అమెరికా నుంచి వచ్చారు. మీ అమెరికాలో నూటికి

58 పెళ్లిళ్ళు పెటాకులవుతున్నాయి. (విడాకులవుతున్నాయి.) మా దేశంలో రెండు పెళ్ళిళ్ళే పెటాకులవుతున్నాయి. మీ దేశంలో ప్రతి వేయిమందికి పదిమంది జైలులో ఉన్నారు. మా దేశంలో ప్రతి లక్షకి ఐదుగురు కూడా లేరు. మీ దేశంలో ప్రతి లక్ష జనాభాకి యాభైఐదు నేరాలు ఏటా రిపోర్ట్ అవుతున్నాయి. మా దేశంలో ప్రతి పది లక్షల మందికి ఒక నేరం కూడా రిపోర్ట్ కావడంలేదు. మాకు జి.ఎన్.పి (గ్రాస్ నేషనల్ ప్రోడక్ట్) అనేది అవసరం లేదు. మావాళ్ళు అడవుల్లో, కొండల్లో ఆడుకుంటూ ఆనందంగా, ఒక రకమైన సాంస్కృతిక చైతన్యంతో ఉన్నారు. మావాళ్ళకు కావలసింది జి.ఎన్.హెచ్ (గ్రాస్ నేషనల్ హాపినెస్). అది బ్రహ్మాండంగా ఉన్నది. జి.ఎన్.హెచ్.లో మీ దేశం 200వ స్థానంలో కూడా ఉండదు అని అన్నాడు.

మన జీవితాల్లో కూడా ఈ సంతోషం ఏది? ఎందుకు అదృశ్యమైంది. అంటే సార్వభౌమ వ్యక్తులుగా ఉన్నవాళ్ళం సంస్కృతినుండి, భాషనుంచి, బట్టలనుండి తెగ్గొట్టబడ్డవాళ్ళం. సామ్రాజ్యవాదం బట్టల్లో చాలా మార్పును తీసుకొచ్చింది. ఐకాన్స్ అయ్యారు.

పిల్లలకు తల్లిదండ్రులతో ఎందుకు సంబంధాలు లేకుండా ఉన్నాయి. మా అబ్బాయి మొన్న ఒక పెద్ద ఆర్ట్ ఎగ్జిబిషన్‌కు వెళ్ళాడు. అక్కడ ప్రముఖుడైన పట్నాయక్‌ను కలిశాడు. మావాడిని ఆయన ఆదివారం రమ్మన్నాడు. నేను ఫలానా ఆయన అబ్బాయినని చెప్పావా? అని అడిగాను. మావాడు ఏమన్నాడంటే I don't want to tell. ఎందుకంటే నేను స్వతంత్రంగా బతుక దలుచుకున్నాను. నా వ్యక్తిత్వం మీద ఆధారపడి మాత్రమే బతకదలుచుకున్నాను. నీ ఇమేజ్ నీడలో బతకదలచుకోలేదు. అలాంటి పిల్లలకు హీరోహోండా మోటరు సైకిల్ వేసుకొని పోయి ఒక అమ్మాయితో మాట్లాడం సంతోషం. ఎందుకంటే హీరోహోండా పల్సర్ అనేది చాలా కండలు కలిగింది. అది మగతనానికి చిహ్నం. దానితో గుర్తింపు (identity) పొందుతారు. పిల్లలకు స్వేచ్ఛనిస్తే గొప్ప మానవ సంబంధాలుంటాయి. స్వేచ్ఛ అనేది కాపిటలిజంకు నీళ్ళలాంటిది. ఆ నీళ్ళలోనే కాపిటలిజం బతుకుతుంది.

అల్ ఖయిదా వాళ్ళు అమెరికాలోని ప్రపంచవాణిజ్య సంస్థ (వరల్డ్ ట్రేడ్ సెంటర్) యొక్క ట్విన్ టవర్స్‌పై దాడి చేసి పగులగొడితే వారం రోజులు

మనుషులెవరూ విమానంలో తిరగలేదు. భయపడిపోయారు. ఏ విమానాల్లో ఎవరున్నారో, ఏ మానవబాంబున్నాడో, ఏ అల్‌ఖయిదా వాడున్నాడో ఎందుకొచ్చిన గోల అని అందరు ఇళ్ళలోనే ఉండిపోయారు. విమానయాన పరిశ్రమ దాదాపు కుప్పకూలిపోయే పరిస్థితి వచ్చింది. విమానయాన పరిశ్రమ వాళ్ళంతా కలిసి బిల్‌క్లింటన్ వద్దకు వెళ్ళారు. విమాన పరిశ్రమను ఆదుకొమ్మని అడిగారు. మూడు విమానాలను ఏర్పాటు చేయమని అనగా చేశారు. బిల్‌క్లింటన్ ఆ విమానాలలో 24 గంటలు దేశం మొత్తం తిరిగి విమానాల్లో తిరగడం సేఫ్ (భద్రత) కాబట్టి ప్రజలారా మీరందరూ విమానాల్లో తిరగండి అన్నాడు. నేనిది కథగా చెప్పడంలేదు. నిజంగా ఇది జరిగింది. మాజీ అధ్యక్షుడు బిల్ క్లింటన్ విమానాల్లో 24 గంటలు తిరిగి విమానాల్లో తిరగడం సేఫ్ ఇంక అల్ ఖయిద వాళ్ళు ఏం చేయ్యలేరన్నాడు. అయినా ప్రజలు భయపడ్డారు.

బుష్ పోయి బంకర్లో దాక్కున్నాడు. బుష్‌కి ఎంత భయం. నిజానికి చిలీ అధ్యక్షుడిగా అలెండీ ఎన్నికైనాక, అలెండీ ప్రాసాదంపై అమెరికా గన్‌షిప్ వచ్చి దాడిచేసింది. అలెండీ పారిపోకుండా తుపాకి పట్టుకుని కిటికీలోంచి కాలుస్తూ జాతినుద్దేశించి రేడియోలో ప్రసంగించాడు. ఇది గొప్ప పని. బుష్ పోయి బంకర్లో దాక్కున్నాడు. అధ్యక్షుడే దిక్కులేక బంకర్లో దాక్కున్నాడు. క్లింటన్ ఎక్కిన విమానంలో ఒక గడ్డపు మనిషి వున్నాడు, సిక్కో, ముస్లిమో తెలియదు అని ఎవరూ ఎక్కడం లేదు. విమాన సిబ్బందిని తీసివేసే పరిస్థితి వచ్చింది. వాళ్ళు బుష్ వద్దకు వెళ్ళారు. దేశాధ్యక్షుడిగా నువ్వు మమ్ములను కాపాడాలి అన్నారు. ఏమిటంటే జనం ఎగరడం లేదు. ఎగరడానికి స్వేచ్ఛ ఉన్నది కాని ఎగరడం లేదు. స్వేచ్ఛను వాడుకుంటేనే మాకు డబ్బులొస్తాయి.

బుష్ చికాగో ఇంటర్నేషనల్ ఏర్‌పోర్ట్‌లో రన్‌వే మీద నిలబడి ప్రసంగించాడు. సిఎన్ఎన్‌లో ప్రత్యక్ష ప్రసారమైంది. స్వేచ్ఛ చాలా గొప్పది. అమెరికా ప్రజలు స్వేచ్ఛాప్రియులు. విమానంలో ఎగిరే స్వేచ్ఛ చాలా గొప్పది. దాన్ని వాడుకోండి. అని ఒక స్వేచ్ఛా ఉపదేశం చేశాడు. అమెరికాలో స్వేచ్ఛా ప్రతిమ బ్రహ్మాండంగా ఉంటుంది. ఎందుకు? కాపిటలిజానికి గొప్ప సంకేతం.

ఇవ్వాళ పిల్లలకి సంప్రదాయం నుంచి స్వేచ్ఛకావాలి. ప్రతి మనిషికి సంప్రదాయం నుండి స్వేచ్ఛకావాలి. సంప్రదాయం నుండి బయటకు వచ్చిన

తర్వాత ఏముంటుంది? మార్కెటుంటుంది. మనల్ని మార్కెట్ మానిప్యులేట్ చేస్తుంది. తల్లిదండ్రుల నిబంధనల నుండి తప్పించుకొని బయటపడ్డ పిల్లలందరూ మార్కెట్ కబంధహస్తాల్లోకి పోతున్నారు. దాన్ని వారు స్వేచ్ఛగా భ్రమిస్తున్నారు. అనేక వినిమయ వస్తువులకు వాళ్ళు వినియోగదారులై వస్తువులను కొనుక్కుంటూ, కొనుక్కుంటూ దాన్ని ఒక వ్యసనంగా మార్చేసుకున్నారు. కొనటమే జీవితం. ఉన్నది పారేసి కొత్తది కొనటమే జీవితం. పెట్టుబడి ప్రతి ఒక్కరిని కన్స్యూమర్ బీయింగ్‌నెస్ (consumer beingness) కి మారేలా మానిప్యులేట్ చేస్తుంది.

సంప్రదాయం నుంచి స్వేచ్ఛ మానవహక్కులనిస్తే, ఆ మానవహక్కులు నన్ను consumer beingness లోకి నెట్టి నానుంచి మానవహక్కులన్నింటిని బదిలీ చేశాయి. ఆక్స్‌ఫర్డ్ లండన్ నుండి Lectures on Human Rights అనే పుస్తకం వచ్చింది. అందులో ఫ్రెంచి తత్వవేత్త బోదిలార్ ఈ విధంగా చెప్పాడు. ఎందుకు మానవ హక్కులు కావాలి? నువ్వు మానవుడివి కాదు కాబట్టి, ఎందుకు నువ్వు మానవుడివి కాదు? నువ్వు Sub Human అనే feeling లో ఉన్నావు. నువ్వు సమూహం నుండి బయటకు వచ్చినప్పుడల్లా నీ భద్రతే నీకు కష్టమైపోయింది. సమూహంలో ఉన్నప్పుడు నీకు భద్రత ఉండేది. సంప్రదాయంలో ఉన్నప్పుడు భద్రత ఉన్నది. సమూహం నుండి, సంప్రదాయం నుండి, కుటుంబం నుంచి బయటకు వచ్చి వేరుపడిన పిదప నీకు ఆ భద్రత పోయింది. నువ్వు మానవుడివన్న భావన కలగడం లేదు. మార్క్స్ చెప్పినట్లు మనిషి జాతి లక్షణం సమూహం. ఆ సమూహం నుండి బయటకు రాగానే మనిషికి భయం పట్టుకొంది. ఆ భయాన్ని పోగొట్టుకోవడానికి వస్తువులను కొంటున్నాడు. ఈ కారుని కొన్నాను కదా నేను మనిషిని అనే భావనను మార్కెట్టు నిలుపదు. ఎందుకంటే ఒకసారి కారుకొంటే మార్కెట్టుకు చాలదు కదా. ఆ కారు పాతదైందని అమ్మేసి కొత్త బ్రాండ్ కారు కొంటేనే మార్కెట్ మనగలుగుతుంది. మార్కెట్ కూడా పరుగులో ఉంది. మార్కెట్ ఎక్కడ ఆగకూడదు. అది పరిగెత్తుతుండాలి. కొత్త బ్రాండ్ రావాలి. అది అమ్మాలి. మళ్ళీ అమ్మాలి. మళ్ళీ రావాలి. ఈ బ్రాండ్ అనే అనిశ్చిత స్థితిలో మార్కెట్ ఉంటుంది. ఇది మన జీవితంలో అలాగనే ప్రవేశిస్తుంది. కావున మనలో మానవహక్కుల కోసం వెంపర్లాట

మొదలైందంటాడు బాదిలార్. అందుకే మనుషుల మధ్య సంబంధాలు లేవు. కేవలం వస్తువుల మధ్య సంబంధాలు ఉన్నాయి.

పాశ్చాత్య దేశాలలోని నగరాలలో మనుషుల మధ్య అభద్రతా భావనవల్ల ఏ చిన్న తప్పు జరిగినా సహనం లేకుండా దావాలు వేయడం రివాజు. అమెరికా దేశాన్ని 'జూరిస్ట్ మానియా' అంటారు. ఒకాయన కుక్కను పట్టుకొని పోతుండగా ఆ కుక్క సడన్‌గా ఇంకో మనిషిని కరిస్తే దాని మీద దావా వేస్తారు. ఒకాయన సిగరెట్టు తాగుతుంటే ఎదుటి వ్యక్తికి దగ్గొస్తే దావా. ఏమన్నా డబ్బులొస్తాయేమో! ఒక వెయ్యి డాలర్లు వస్తే కేసినోబార్‌లో కెళ్ళి 50 డాలర్లు సిగరెట్లు, మత్తుమందులకి, 50 డాలర్లతో టిన్‌ఫుడ్ (డబ్బా ఆహారం) కొనుక్కొని తింటూ జీవిస్తుంటారు. దీనితో సెక్స్ కూడా కొనుక్కోవచ్చు. ఆ సెక్సును కూడా కొనుక్కొని జీవిస్తుంటారు. అలా దావాల మీద దావాలు వేస్తుంటారు. ఇలాంటిది సమాజంలో ఎందుకొచ్చిందంటే ఒకరినొకరు తెలియని మనుషుల మధ్య ఏం సంబంధాలుంటాయి. మనం వెళుతూవుంటే ఏం వెంకయ్య, పుల్లయ్య బాగున్నావా? ఏం బావా? ఏం మావ! అనే సంబోధనలుంటాయి. అంత పెద్ద హత్యాకాండ జరిగిన చుండూరులో కూడా వరుసలు పిల్చుకుంటారు. They are very safe. గ్రామాలలో అత్యాచారాలు జరగవని కాదు. అణచివేత లేదని కాదు. వాటిని పోగొట్టుకోవడానికి పాశ్చాత్యదేశాల పైత్యాలను తెచ్చుకోనక్కరలేదు. ఇండియాలో కూడా బసవన్నలాంటి కుల నిర్మూలన, సమానత్వ సిద్ధాంతాలు చాలా ఉన్నాయి. మన జాతి ఉద్యమాల నుండి రాలేదు. మనం పాశ్చాత్య దేశాల నుండి దిగుమతి చేసుకొని క్రమంగా పాశ్చాత్య వ్యక్తులు (Western Individuals) గా మారిపోతున్నాం. అలవాట్లు మారిపోయి, ఆహారం నుండి దూరమై, ప్రకృతి నుండి దూరమై అన్నిటికి దూరమై జాతి హీనులమైన ఒక 'genetically modified' 'BT' లము అయిపోయినాము. జన్యుమార్పిడి అయిన మనుషులం అయిపోయాం. మనం కాలనైజ్ అయిపోయి సమస్యలో ఒక భాగంగా మారాం. నేను సమస్యలో భాగం చేయబడి సమస్యలో భాగంగా ఉంటూ దాంట్లోంచి బయటకు రాలేని తనాన్ని అనుభవిస్తున్నాననే గుర్తింపు రావాలి.

మార్కెట్టులోకి వస్తున్న వస్తువులకిస్తున్న నినాదాలలాగానే అందమైన నినాదాల క్రింద మానవ హక్కుల ప్యాకేజీలు వస్తున్నాయి. ఈ మానవహక్కుల ప్యాకేజీలను ఎన్.జీ.వో.లు బ్రహ్మాండంగా పులుముతుంటాయి. ఇటువంటి ప్రతి మానవ హక్కుల ప్యాకేజీపై దాడి చేయాలి. నాలో ఉన్న పాశ్చాత్యీకరణ అనేది ఏదైతే ఉందో దానికి వ్యతిరేకంగా పోరాడాలి.

రాజ్యాధికారంలోఇప్పుడు రాజ్యం వేరు, అధికారం వేరు. రెండూ విడాకులు పుచ్చుకున్నాయి. అధికారం మార్కెట్టు దగ్గరున్నది, రాజ్యం రాజకీయ నాయకుల చేతుల్లో ఉంది. మొన్న రతన్ టాటా కొత్తకారు 'నానో'ను తయారుచేశాడు. రాహుల్‌గాంధి ఈ కొత్తకారును (నానో) చాలా సీరియస్‌గా చూస్తున్నాడు. నానో కారు డోర్ తెరచి సీట్లు ఎలా ఉన్నాయి అని రాహుల్ చూస్తుంటే రతన్ టాటా చాలా ఉల్లాసంగా చూస్తున్నాడు. ఈ ఫోటో పేపర్లో వస్తే నాకనిపించింది "There is something wrong".

మొన్న చంద్రబాబునాయుడు పత్రికా సమావేశం పెట్టి తను చేసిన పనిగూర్చి చెప్పుకున్నాడు: ఇవాళ వై.ఎస్. రాజశేఖరరెడ్డి  ఐ.టి. (I.T) గూర్చి మాట్లాడుతున్నాడు పెద్ద ఎత్తున.  కాని మేము ఐ.టి. గూర్చి ఎంతో కష్టపడ్డాం. అప్పుడు మమ్మల్ని విమర్శించారు అన్నాడు. నేను ముఖ్యమంత్రిగా ఉన్నప్పుడు బిల్‌గేట్స్ ఢిల్లీకి వస్తున్నాడని తెలిసి ఢిల్లీకి పోయి అతని అపాయింట్‌మెంట్ అడిగాను అన్నాడు. ఒక ముఖ్యమంత్రి ఒక కంపెనీ యజమాని. ఆ కంపెనీకి ఎన్నో వేల కోట్లు వున్నాయి. మనుషుల్ని డబ్బుతో కొలిస్తే వాళ్ళు చాలా పైనుంటారు. ఇప్పుడు చంద్రబాబు, వై.ఎస్. రాజశేఖరరెడ్డిలకు ఒకే కొలమానం డబ్బు. డబ్బు కొలమానం అయినపుడు వేయికోట్లు ఉన్నవానికి వందకోట్లు ఉన్నవానికి జమిందారుకి పాలేరుకున్న సంబంధం ఉంటుంది. అలాంటి సంబంధంలోనే చంద్రబాబు వెళ్ళాడు. చెప్పుకున్నాడు సిగ్గులేకుండా అడిగితే బిల్‌గేట్స్ 'నో' అన్నాడని. బతిమిలాడి, బతిమిలాడగా 9.00 గం॥లకు మందుపార్టీ ఉన్నది అక్కడికి రమ్మన్నాడట. ఇదంతా పేపర్లో వ్రాశారు.

మందు పార్టీ కాక ప్రైవేటుగా టైమిస్తే తనవద్దనున్న ల్యాప్‌టాప్ ద్వారా వివరిస్తానంటే 8.20 ని॥ల నుండి 8.40 ని॥ల వరకు 20 ని॥ల సమయం ఇచ్చాడు. ఆ తర్వాత టైమ్ ఇవ్వనన్నాడు. అయితే 20 ని॥ల సమయం 40

నిమిషాలు అయిందట. అంత అద్భుతంగా బిల్‌గేట్స్‌ని మెప్పించి మైక్రోసాఫ్ట్‌ని హైద్రాబాద్‌కి తీసుకొచ్చాం. ఇంత కష్టపడ్డాం అని చెప్పాడు. సిగ్గుండాలి.

1982 వరకు ఢిల్లీ కాంగ్రెస్ నాయకులు ఇష్టం వచ్చినట్లు ముఖ్యమంత్రులను మార్చేవారు. ఇందిరాగాంధి అపాయింట్ మెంట్ ముఖ్యమంత్రులకు ఇచ్చేదికాదు. ఆంధ్రజాతికి అవమానం అని ఈనాడు పేపర్‌వాడు వ్రాసేవాడు. తెలుగుజాతి యొక్క ఆత్మగౌరవాన్ని పెద్ద ఎత్తున ఫోకస్ చేస్తూ ఎన్.టి.రామారావు అధికారంలోకి వచ్చాడు. అదే పార్టీకి చెందిన ముఖ్యమంత్రి ఒక ప్రైవేటు కంపెనీ హెడ్ దగ్గర ఇంటర్వ్యూ కోసం పడిగాపులు పడి బతిమాలుకొని 20 నిమిషాలు మాట్లాడడానికి రెండు రోజులు ఉండి వచ్చాడు. ఆ విషయాన్ని సిగ్గు లేకుండా చెపుతున్నాడు. ఎందుకంటే సమాజానికి సున్నితత్వం పోయింది. కాబట్టి రాజ్యం, అధికారం విడాకులు తీసుకున్నాయి.

నా ఫ్రెండ్ ఒకాయన ఎం.ఎల్.ఏ. నేనొచ్చే రైల్లో వస్తూ మాట్లాడాడు. నేనాయనతో ఈ కార్పొరేట్ సెక్టర్ వాళ్ళు ఎం.పి. లకు లంచాలిచ్చి ప్రశ్నలడిగించుకుని తిప్పలు పడుతున్నారు కదా! ఇప్పుడు వాళ్ళకు వేలకోట్ల రూపాయలొచ్చినాయి కదా! రేపటి ఎన్నికల్లో కార్పొరేట్ సెక్టర్‌నుండి ప్రత్యక్షంగా 200 మంది దాక వచ్చి ఎం.పి.లుగా నిలబడతారేమోనని అన్నాను. దానికి అతనన్నాడు. ఛీ! దీనికి వాళ్ళురారు. ఇది వాళ్ళకు చాలా తక్కువ. నిజం. నేచురల్ రియాక్షన్ ఆఫ్ ఆన్ ఎం.ఎల్.ఏ. ఇది చాలా తక్కువ. ఇట్లాంటి నీచమైన వాటికి రారు. వాళ్ళు మమ్మల్ని హీనంగా చూస్తారు అన్నాడు. అంటే రాజ్యానికి, అధికారానికి విడాకులయిపోయాయి.

మనం రాజ్యాధికారం కోసం పోరాడాలంటే రాజకీయాల్లో ఉన్నవాళ్ళమీద కాదు. మార్కెట్ మీద పోరాటం చేయండి. మార్కెట్ మీద ఎట్లా పోరాటం చేస్తామంటే మార్కెట్‌ను మన జీవితాల్లోంచి బహిష్కరించినప్పుడు. అమెరికా మీద దాడి జరిగినప్పుడు 'స్వేచ్ఛ' మీద దాడి అన్నాడు బుష్. నిజం 'స్వేచ్ఛ' మీద దాడే. స్వేచ్ఛ మీద దాడిచేసి, నా వినియోగపు స్వేచ్ఛను వినియోగించుకోకపోతే, నేను వినియోగదారుడిగా నీ వస్తువుని కొనకపోతే నువ్వు రద్దవుతావు. నేను వినిమయ సంస్కృతికి వ్యతిరేకంగా పోరాడి, స్వదేశీ అనే ప్రాతిపదిక మీద నన్ను నేను పునర్నిర్మించుకుంటే నీ మార్కెట్ ఇక్కడ

కుప్పకూలిపోతుంది. ఈ విధంగా పోరాడితేనే మళ్ళీ మానవ సంబంధాలు పునరుద్ధరించబడతాయి. లేకపోతే తల్లిదండ్రులకు 'కొరివి' పెట్టడానికి అమెరికా నుంచి రారు. డాలర్లు లెక్క బెట్టుకుంటారు. వాళ్ళు యాంత్రిక మనుషులై పోయారు. ఈ మానవ సంబంధాలు అత్యంత నిరాశాపూరితమైన స్థితికి వచ్చాయి. ఎవరు ఎవరిని నిందించే పరిస్థితి లేదు.

సామాజిక మార్పు కావాలి. ఆ మార్పు కలోనియలిజమ్ ప్రవేశపెట్టిన మార్పుకాదు. మనకి మనమే దిశను నిర్ణయించుకునే విధంగా రావాలి. ఈ దేశంలో మనుషులకి, సంస్కృతికీ మధ్య, ఈ దేశంలో వచ్చే మార్పుకి మధ్య ఒక సజీవ సంబంధం (organic link) కావాలి. ఒక సజీవ సంబంధం ఉన్న మార్పు మాత్రమే ఈ దేశంలో రావాలి. అలారాని పక్షంలో మనం జాతిహీనులమై అంటు కట్టబడిన పాశ్చాత్య మానవులమైపోతాము. ఇలాంటి ఆత్మిక వేదన అస్థిత్వ వేదన నాకు వచ్చింది. నేను పాశ్చాత్యుడినై పోయాను. నా సంస్కృతి పట్ల నాకు ప్రేముంది. ఇలాంటి అస్థిత్వ వేదన ఈ దేశాన్ని ఘోరంగా ముంచిన నెహ్రూకి కూడా వచ్చింది. నెహ్రూ తన ఆత్మకథలో వ్రాసుకున్నాడు.

నెహ్రూ ఆధునికతను తీసుకొచ్చి ప్రవేశపెట్టాడు. డ్యాములు కట్టించాడు. బ్రహ్మాండంగా కట్టించాడు. అప్పట్లో ఆధునికత అంటే సిమెంటు, కాంక్రీట్ డ్యాములు. ఇప్పటి ఆధునికత అంటే ల్యాప్‌టాప్, కంప్యూటర్, సైబర్ స్పేస్ మరియు ఎరేజబుల్ టేప్. అప్పట్లో నెహ్రూ కాలంలో ఫోటోగ్రాఫ్ తీసి ప్రింట్ చేస్తే ఇంకొకసారి ప్రింట్ చేసే అవకాశం లేదు. ఇప్పుడు ఎరేజబుల్ టేప్ వచ్చింది ఇప్పుడు నన్ను ఆయన నిమిషంలో ఫొటో తీస్తాడు. ఆ ఫొటోని ఉంచుతాడని ఏం లేదు. తర్వాత నిమిషంలో దాన్ని చెరిపేయవచ్చు. దీన్నే 'ద్రవ ఆధునికత' (liquid modernity) (second modernity) అంటారు. గ్లోబలైజేషన్ తర్వాత వచ్చిన దశని జిగ్మంట్ బౌమన్ 'ద్రవ ఆధునికత' అని అన్నాడు.

ఇదివరలో పెద్ద పెద్ద కాంక్రీట్ నిర్మాణాలు, డ్యాములుండేవి. నాగార్జునసాగర్‌ను చూపించి ఎంత అభివృద్ధి చెందామో అని చూపించేవారు. ఇప్పుడు ఐ.టి. చూడండి, సైబర్ స్పేస్ చూడండి అని చెప్తున్నారు. ఇదివరకు పెట్టుబడి పెద్ద ఎత్తున రావాలి. కార్మికులను తీసుకొని మనుషులను తీసుకుని సిమెంటు బస్తాలతో వచ్చేది. ఇప్పుడు పెట్టుబడి సులువుగా (లైట్)గా

ప్రయాణిస్తుంది. ఒక్క ల్యాప్‌టాప్ కంప్యూటర్ పట్టుకొని వస్తాడు. వాడు ఎక్కడైనా కోట్లపెట్టుబడిని పెట్టిపోవచ్చు. ఆ పెట్టుబడిని ఉపసంహరించడం కూడా అంతే వేగంగా ఉపసంహరించుకోవచ్చు. పెట్టుబడి అలా ద్రవీకరణం చెందింది. ఆ ద్రవీకరణ వ్యవస్థలో మనం ఉన్నాం. ఆ ద్రవం ప్రవహిస్తూ కరిగిస్తూ పోతూఉన్నది.

పండిట్ నెహ్రూ ఏమన్నాడంటే నేను ప్రాచ్యానికి చెందిన వాణ్ణి కాదు పశ్చిమానికి చెందిన వాణ్ణి కాదు. "(I neither belong to east nor to the west)." నెహ్రూ బాగా పాశ్చాత్యుడు ధనవంతుడు. లండన్‌లో విలాసవంతమైన జీవితం గడిపాడు. నెహ్రూ మేధావియే, చరిత్ర చదివాడు. జైల్లో ఉన్నప్పుడు ఇందిరా ప్రియదర్శినికి ఉత్తరాలు వ్రాశాడు. ఇదంతా చేసినాక అతనికి ఆధునికత పట్ల వ్యతిరేకత, ఒక రకమైన వెలితి ఏర్పడ్డాయి. అస్థిత్వ ప్రశ్న బయలుదేరింది. దీన్ని గురించి కె.యన్. ఫణిక్కర్ Modernity and Hegemony అనే వ్యాసంలో పేర్కొన్నాడు. నేను ప్రాచ్యానికి చెందినవాణ్ణి కాదు. పశ్చిమానికి చెందినవాణ్ణి కాదు. నేను రెంటికి చెడ్డ రేవడినయ్యాను. నేనెన్ని తప్పులు చేసినా నా మాతృభూమి నన్ను అంటిపెట్టుకొని ఉంటుంది. ఎందుకంటే ఇది మాతృభూమి కదా!

మనం ఎన్ని వేషాలేసినా, ఎంత ఇంగ్లీషు మాట్లాడినా ఇంగ్లీషువాడి దగ్గరకు పోతే వానిలాగా మాట్లాడలేం. నెహ్రూ బాధపడి, ఎవరు నేను? ఎందుకిట్లా అయిపోయాను. కాని నన్ను వేల పద్ధతుల్లో నా మాతృభూమి ఇంకా నన్ను వేయి హస్తాలతో కౌగిలించుకున్నట్టుగా ఉంది అని వ్రాసుకున్నాడు.

రాజా రాంమోహన్‌రాయ్ గూర్చి ప్రస్తావన వచ్చింది కదా! లాటిన్ అమెరికాలోని ఒక దేశాన్ని స్పెయిన్ వాళ్ళు ఆక్రమించి, తమ రాజ్యాంగాన్ని ప్రకటించి, ఆ దేశాన్ని వీళ్ళు ఆక్రమించే ముందు ఆ దేశంలో రాజుపాలన వుంది. కావున ఆక్రమించి రిపబ్లిక్‌గా ప్రకటించామని అన్నారు. స్పెయిన్ దురాక్రమణను ఖండించకుండా రాజా రామ్మోహన్‌రాయ్ ఏమన్నాడంటే “ఇది చాలా గొప్ప చర్య, చాలా ముందడుగు. అభివృద్ధి” అన్నాడు. కలకత్తాలోని బ్రిటీష్ స్నేహితులను పిలిచి విందు ఇచ్చాడు. వాళ్ళు ఆక్రమించే ముందు ఆ దేశంలో రాజు పాలన ఉంది కావున ఆక్రమించి రిపబ్లిక్‌గా ప్రకటించామని అన్నారు. స్పెయిన్ ఆ దేశంలోని రాజరికాన్ని రద్దు చేసి రిపబ్లిక్‌గా ప్రకటించింది

కావున పార్టీ ఇస్తున్నాను అని ఇచ్చాడు. కాలనైజేషన్ అయితే ఫర్వాలేదు. ఎవడో వేరే దేశంవాడు ఆక్రమిస్తే ఫర్వాలేదు. అమెరికా వాడు ఇరాక్‌కి వచ్చి ఆక్రమిస్తే ఫర్వాలేదు. వాడు ప్రజాప్రభుత్వాన్ని స్థాపిస్తే పర్వాలేదు. అలాంటి రాజా రాంమోహన్‌రాయ్‌కి రెండు ఇండ్లు ఉండేవట. బ్రాహ్మణుడు కదా! జమీందారీ కుటుంబం నుండి వచ్చిన వాడు. పూర్వీకులు యిచ్చిన పెద్ద పెంకుటిల్లు ఒకటుండేది. ఆ ఇల్లు బెంగాలీ స్టైల్లో కట్టిన పెద్ద ఇల్లు. ఆ ఇంట్లో అమ్మా, నాన్నలు, భార్య, పిల్లలుండేవారు.

బ్రిటీష్ స్నేహితులు వచ్చినపుడు పార్టీ ఇవ్వడానికి ఒక ఆధునిక భవనం కట్టిచ్చాడట. తన పాత ఇంటికి దూరంగా. ఇలాంటి పార్టీలిచ్చేటప్పుడు వాళ్ళందరిని ఆహ్వానించి అక్కడుంటాడు. వాళ్ళతోపాటు మందుకొడతాడు. ఇంటికొచ్చినపుడు ఇంట్లో వాళ్ళతో గడిపే ఆయన మీద ఒక జోక్ ఉండేదట. "In his traditional house he is the only western person and in his modern house he is the only eastern person." ఆయన కొత్త ఇంట్లో అందరూ బ్రిటీష్ వాళ్ళు ఉండేటప్పుడు ఇతనొక్కడే ఇండియన్, ఆయనింట్లోనేమో అందరూ ఇండియన్స్ ఈయనొక్కడే పాశ్చాత్యుడు. ఇప్పటి మన పరిస్థితి ఇలాగే ఉన్నది. (This is presisely our situation). Thank you.

**మార్చి - ఏప్రిల్ 2008 - అధ్యాపక జ్వాల**

# 35. స్వయంకృత గ్రీష్మ తాపం

ఎండాకాలం వచ్చింది. ధరలూ మండుతున్నాయి. ప్రపంచబ్యాంకు రుణంతో నిర్మించిన సిమెంట్‌రోడ్లు, నగరంలో పొగలు సెగలు కక్కుతున్నాయి. కాంక్రీటు దుస్వప్న భవనాలు కణకణలాడిపోతున్నాయి.

ఇప్పుడు మనకు ప్రకృతి చల్లదనం గుర్తొస్తుంది. హార్స్‌లీహిల్స్, ఊటీ, కొడైకెనాల్, కాశ్మీర్ మంచు జ్ఞప్తికొస్తాయి. శరీరాన్ని చల్లబర్చే నీటిజలల నిరంతరప్రవాహం గురించి ఆలోచిస్తాం. వానజల్లుల పరిమళాల గురించి కలలు కంటాం. వేసవి ఆవలి ఒడ్డుకు చేర్చే పడవల గురించి స్వప్నిస్తాం. చలువ యంత్రాలు ఖరీదు చేస్తాం. చలువ పెట్టెల్లోకి పదే పదే తొంగిచూస్తాం. పేదవాళ్ళమైతే అంచుల్లో చలువ పందిళ్ళను ఆశ్రయిస్తాం. చలివేంద్రాలకోసం వెతుక్కుంటాం. దేశీయ పానీయాలైన మజ్జిగ, కొబ్బరినీళ్ళు, చెరుకురసం వీధి అంచుల్లో మెల్లగా వెలుస్తాయి. పెప్సీ, కోకాకోలాలు, ఖరీదైన షాపుల్లో చల్లగా ఉంటాయి.

మనిషికి ప్రకృతితో ఉన్న సంబంధం వేల ఏళ్ళుగా ప్రకృతి పరంగా నిర్వచించబడింది. కానీ గత రెండువందల ఏళ్ల ఆధునికత దాన్ని మనిషి పరంగా, లాభాపేక్షపరంగా నిర్వచించడం ప్రారంభించింది. పాశ్చాత్యదేశాల్లో తొలుత వచ్చిన ఈ పరిణామం మానవజాతి వినాశనానికి దారితీస్తోంది. ఇది పడమటి నుంచి తూర్పుకి క్రమేణా విస్తరించింది. బ్రిటీషువారి రాకతో ఇక్కడ స్థిరపడింది. ప్రపంచీకరణ కాలాంతక వైఖరిని వేగవంతం చేసింది.

ప్రకృతిపై ఆధిపత్య ధోరణి ఈ వైఖరి పరాకాష్ట. ప్రకృతిని, దానిలో భాగమైన మనిషినీ యంత్ర అవసరాల కోసం లాభాల పంటల కోసం లొంగదీయడం

జరుగుతూ వచ్చింది. ఇది సరైనదేనా అని ఈ ఎండాకాలపు వడగాల్పులు మనకు గుర్తుచేస్తున్నట్టున్నాయి.

ప్రకృతితో మన సంబంధం మనకు కాలంతో ఉన్న సంబంధాన్ని నిర్వచిస్తుంది. అదే మన దినచర్యను నిర్దేశిస్తుంది. ఈ దినచర్య నిర్దేశం ఆయాదేశాల ప్రకృతి, వాతావరణ పరిస్థితులు వల్ల జరుగుతుంది. ఇది నిన్నటిమాట.

వేడి దేశాల్లో ముఖ్యంగా మన ప్రాంతాల్లో దినచర్య తెల్లవారుజామున ప్రారంభమై 12 గంటల నుంచీ పొద్దువాలే వరకూ, మధ్యాహ్నం నిద్రతో విశ్రాంతి, తర్వాత మళ్ళీ పని ఎనిమిది తర్వాత నిద్ర. ఆనవాయితీ. ఇది ఆరోగ్యకరమైనది కూడా.

ఇవాళ చిత్రం ఇది కాదు. బ్రిటీష్‌వాళ్ళు మనకు ప్రకృతితో కాలంతో ఉన్న ఆ సంబంధాన్ని విచ్ఛిన్నం చేశారు. ఉదయం తొమ్మిదిన్నరకు సూర్యుడు ఉదయించి సాయంత్రం నాలుగు గంటలకు అస్తమించే బ్రిటీష్ చలికాలపు పగటిని ఈ వేడిదేశంపై కూడా రుద్దారు. ఎండలో వగరుస్తూ కూడా ఆఫీసుల్లో కునారిల్లుతుంటాం. విద్యార్థులు మధ్యాహ్నం క్లాసురూములో నిద్రలో జోగుతుంటారు. తిట్లుతింటారు.

ప్రకృతిని పారిశ్రామిక అవసరాలకోసం ధ్వంసించిన ఆధునికత మరో కొన్ని డిగ్రీల ఎండాకాలానికి కారకురాలు. ఓజోన్‌పొర ధ్వంసమై ధృవప్రాంత మంచుకరిగి ఎండాకాలం నానాటికీ భయం గొలుపుతోంది.

ఈ పరిస్థితికి తోడు బ్రిటీష్ వలసవాదులు వారి బట్టల పరిశ్రమ అవసరాలకోసం చలిదేశపు బట్టలను మనపై రుద్దారు. వేడిదేశాల్లో చల్లటి పంచెకట్టును లాల్చీపైజమాను హీనంగా చూడటం సంస్కృతిగా మార్చారు. ఎండాకాలపు తాపానికి మన టక్‌లు, మన జర్కిన్లు, సూటు బూట్లు తోడై మరింతగా ఉక్కపెడుతుంటాయి. ప్రముఖ న్యూస్ టివి స్టార్ చెమటలు కక్కుతూకూడా కోటుధరించి వివిధ ఛానళ్ళల్లో ఇంటర్వ్యూలు చేయడం మనం చూశాం. చెమట కంపు కొట్టినా పర్వాలేదు. ఖాళీ మెదళ్ళకు మేధోలుక్ ఇచ్చే కోటు మాత్రం డాక్టర్లకు లాభం, లాయర్లకు వరం. దేశ కాలమాన ప్రాకృతిక

పరిస్థితులకూ ఈ దుస్తులకు సంబంధంలేదు. వేషభాషలు ప్రపంచీకరణ చెందాయి కదా! ఈ దుస్తులు ఎండాకాలాన్ని మరింత ఎండాకాలంగా మారుస్తాయి.

వేసవికాలంలో సైతం విద్యార్థులకు విరామంలేదు. గతంలో వలె పల్లెపట్టులకువెళ్ళి తాతయ్యలతో, నానమ్మలతో, అమ్మమ్మలతో గడిపే వ్యవధి లేదు. ఒకప్పటిలా ప్రకృతితో కలిసి ఆటపాటల కాలక్షేపం అసలేలేదు.

దీనివల్ల మనుష్యుల మధ్య సంబంధాలు బాగా దెబ్బతింటున్నాయి. తల్లిదండ్రులకు తాత, అవ్వలకు, పిల్లలకు మధ్య ఎడం పెరిగిపోతున్నది. దీని విషఫలితాలు మనకీ ఇప్పుడు అనుభవంలోకి వస్తున్నాయి. వృద్ధాశ్రమాలు విరివికావడమే దానికి చిహ్నం. తల్లిదండ్రుల ఆలనాపాలనా పట్టించుకోని పిల్లలపై కొరడాల్లాంటి శాసనాన్ని భారత్ పార్లమెంటు ఆమోదించడం దేశం సిగ్గుపడాల్సిన విషయం. ఎండాకాలంలో విద్యార్థులందరికీ నిజమైన సెలవు దినాలను ప్రకటించి వారిని కుటుంబ సభ్యులతో గడపనిస్తే పరిస్థితి కొంత వేరుగా ఉండవచ్చు.

ఈ ఎండాకాలం చల్లబడాలంటే ప్రకృతి సంపదని మనం పరిరక్షించుకోవాలి. సిమెంటు కోసమో ఇతర పారిశ్రామిక అవసరాలకోసమో కొండలను, కోనలను ఇతర ప్రకృతి సంపదను ధ్వంసించడం మానేయాలి. యంత్రాల వాడకాన్ని కనీసస్థాయికి తగ్గించుకోవాలి. మట్టిమిద్దెలను పూరిగుడిసెలను, వనవిహారాలను, సెలయేటి నీటిగలగలలను మన జీవితంలోకి ఆహ్వానించాలి. నిమ్మలంగా నింపాదిగా బ్రతకడం మనం నేర్చుకొని ముందు తరాలకూ నేర్పాలి. అప్పుడు ఎండాకాలం భయపెట్టదు. అది ఒకానొక కాలం మాత్రమే అవుతుంది. అప్పుడు మనం కాలానికి నమస్కరిస్తాం. కాలపురుషుడికీ నమస్కరిస్తాము.

**మే 17, 2008 - సిటివ్యూ**

## 36. ఈ విద్యాసంస్థల వాతావరణం మంచిదేనా...?

### బాహ్య పరిసరాల నుంచీ వేరు చేయడం

సమాజం నుంచీ నేరముద్రవేసి కొందరిని జైల్లో విడిగా ఉంచినట్లుగా బాహ్యప్రపంచం నుంచీ విద్యార్థిని దూరంగా ఉంచుతారు. బాహ్య పరిసరాల ప్రభావం విద్యార్థిపై పడి చదువు నుంచీ అతని/ఆమె దృష్టి మరలకుండా ఉండేందుకే ఈ ఏర్పాటు. ప్రయోగశాలలో అవసరమైన వాతావరణాన్ని సృష్టించినట్టుగా.

ఇది విద్యార్థిని విద్య నుంచీ దృష్టి మరల్చనీయకుండా గుర్రపు కళ్ళగంతల్లాగా ఉపయోగపడుతుంది. సినిమాలు/టివి/సాహిత్యం/దినపత్రికలు/రాజకీయాలు/ప్రేమ వగైరా ప్రభావాలు విద్యార్థిపై పడకుండా ఉపయోగపడుతుంది. ఈ నిర్బంధ ప్రక్రియ తల్లిదండ్రులకు చాలా ఇష్టమైనది. చివరికి ఆటలు, వ్యాయామం నుంచీ కూడా తమ పిల్లలను దూరంగా ఉంచితే మంచిదని భావించే తల్లిదండ్రులు మెజారిటీగా ఉన్నందువల్లే అనేక ప్రైవేటు రెసిడెన్షియల్ కళాశాలల్లో ఆటస్థలాలు ఉండవు. భారీఫీజులు చెల్లించి చదివే చదువు గిట్టుబాటు కావాలంటే ప్రతినిమిషం సద్వినియోగం కావాలి. మెదడు పూర్తిగా చదువుకే అంకితం చేయించే యాజమాన్యానికి మార్కెట్లో గిరాకీ ఉంది.

### ప్రతి నిమిషం కార్యనిర్దేశం

టైంటేబుల్ ఉపయోగించి విద్యార్థి జీవితాన్ని ప్రతిక్షణం నిర్దేశించడం, శాసించడం ఇందులో భాగం. తెల్లవారు జామున నాలుగ్గంటలకు నిద్రలేస్తే రాత్రి పదకొండు గంటల వరకూ ఏ నిమిషంలో ఏం చేయాలో నిర్దేశిస్తూ తరుముకునే నిర్బంధ విధానమిది. విద్యార్థిని గానుగెద్దుగా విద్యాసైనికుడిగా

మార్చడం దీనిపని. సైన్యంలో ఇలాంటి ప్రతినిమిషకార్యనిర్దేశం ఉంటుంది. కొంతవరకూ జైళ్ళలో కూడా. ఆదేశాలమేరకే నిద్రపోవడం అనే అత్యంత విషాదభరిత పరిస్థితిని ఈ క్రోనోమేనియా సృష్టిస్తుంది. కాలానికి డబ్బుకు మధ్య ఆధునికతలో ఏర్పడిన లింకువల్ల ఆ నిర్భంధ పద్ధతి గిట్టుబాటులో భాగం.

**స్థానీకరణ**

బాగా ప్రతిభ కలిగిన వారిని - అంటే బాగా బట్టీకొట్టి అప్పజెప్పగలవారిని ప్రత్యేకంగా చూడటం, అలాంటి వారిని మిగిలిన విద్యార్థుల నుంచి విడదీసి ప్రత్యేక శిక్షణ ఇవ్వడం, దీనివల్ల మిగిలిన వారిలో తాము వెనుకబడి పోతున్నామనే భావన కలుగుతుంది. వారు ఆందోళన పడి నిర్భంధానికి మరింతగా తలవంచి చదువుపై ధ్యాస పెడతారని ఈ పద్ధతి నమ్ముతుంది. ఇలాగే 'ప్రతిభ' గల వారికి బాగా శిక్షణ ఇస్తే కాలేజీకి ర్యాంకుల పంట పండుతుంది.

**పదే పదే వల్లె వేయించడం**

ఒక విషయాన్ని పదే పదే చెప్పడం, వల్లెవేయించడం వల్ల విద్యార్థి యాంత్రికంగా మారిపోయి కమాండ్స్‌కు ఆటోమేటిక్‌గా స్పందించే లక్షణం అలవర్చుకుంటాడు. అలాచేస్తే ఎంట్రెన్స్‌లో మంచిమార్కులు తెచ్చుకునే అవకాశం ఉందని ఈ నిర్భంధ రూపాన్ని ప్రయోగిస్తారు. ప్రతి వారం పరీక్షలు, వాటికోసం విద్యార్థి మళ్ళీమళ్ళీ చదివినవే చదవడం చేయాల్సి వుంటుంది.

**సాధారణీకరణ**

'సరైన' విద్యార్థులను ఎంపికచేసి వారిని అభినందించడం, ప్రోత్సహించడం, వల్ల తాము కూడా ఆ విద్యార్థుల మాదిరిగా తయారవ్వాలని మిగిలినవారు కూడా భావించేటట్టుచేసే పద్ధతి ఇది. అలా భావించని విద్యార్థులను, వెనుకబడిన వారిని క్రమశిక్షణా రహితులుగా నెగెటివ్ అర్థంలో అసాధారణమైన వారుగా, మొద్దులుగా ముద్రవేయడం.

**ప్రతిక్షణం నిఘా**

విద్యార్థి చర్యలను యాజమాన్యం అనుక్షణం కనిపెట్టి ఉండటం, బెత్తం పట్టుకొని అటు ఇటూ తిరుగుతూ విద్యార్థులను చదివించే ట్యూటర్లు రెసిడెన్సియల్ కళాశాలల్లో సాధారణ దృశ్యం. జైళ్ళలో ఖైదీలపై నిఘాకోసం

రూపొందిన పాన్ ఆప్టికన్‌కు ఆధునిక రూపమైన వీడియో కెమెరాల నిఘా కొన్ని రెసిడెన్షియల్ కళాశాలల నిఘా ఏర్పాట్లలో భాగం

**లింగ విభజన**

ఆడ, మగకు విద్యాసంస్థలు కో-ఎడ్యుకేషన్ అయితే ప్రత్యేకసీట్లు. ఒకరితో మరొకరు స్వేచ్ఛగా ఇంటరాక్ట్ కాకుండా ఏర్పాట్లు. ఉత్తరాల సెన్సార్. ప్రేమలు వెల్లివిరిసే వయసులో, దేహంలో లైంగిక ప్రత్యేకతలు పుష్పించే, ఊహలు వికసించే వయసులో పిల్లల మెదళ్ళకు దళ్ళు కట్టడం. ఇది తల్లిదండ్రులు ఇష్టపడే మరో అంశం.

**భావప్రకటనా స్వేఛ్ఛారాహిత్యం**

తమ బాధల వ్యక్తీకరణకు, ఫిర్యాదు చేసేందుకు, నిరసన వ్యక్తం చేసేందుకు విద్యార్థులకు అవకాశాలు లేకపోవడం.

ఈ పద్ధతులు పోలీసు కస్టడీలో చావుల్లాంటి, ప్రత్తిరైతుల ఆత్మహత్యల్లాంటి, చేనేత కార్మికుల ఆకలి చావుల్లాంటి, వరకట్న మరణాల్లాంటి అసహజ మరణాలకు దారితీస్తున్నాయి. ఇదే విద్యనేర్పే సరైన పద్ధతులని భావించే తల్లిదండ్రులు, ఆ అభిప్రాయాన్ని సొమ్ముచేసుకునే యజమానులు, అందుకు ప్రోత్సహించే ప్రభుత్వాలు ఈ పాపంలో పాలు పంచుకోవడం లేదా?

**జూన్ 11, 2008 - సిటి వ్యూ**

# 37. ప్రపంచీకరణ భారతంలో పాలన పాలెగాళ్ళది - అధికారం అంగడిది

ప్రపంచవ్యాప్తంగా ప్రపంచీకరణ పెనుమార్పులకు దారితీస్తోంది. రాజకీయాలు దానికి మినహాయింపు కాదు. అందులో ప్రధానమైన మూడు పరిణామాలను ప్రస్తావించాలి. ఒకటి: రాజకీయాలు, అధికారం విడాకులు పుచ్చుకోవడం. రాజకీయాలనుంచి అధికారహంస మార్కెట్‌కు ఎగిరిపోవడం. దీన్ని ప్రఖ్యాత సామాజికశాస్త్రవేత్త జగ్మంట్ భౌమన్ తన పుస్తకం 'గ్లోబలైజేషన్ అండ్ హ్యూమన్ కాన్సీక్వెన్సెస్' (ప్రపంచీకరణ - మానవపరిణామాలు)లో వివరించారు. రెండవది:రాజకీయపార్టీలు కార్పొరేట్‌కంపెనీలను అనుకరించడం అనుసరించడం. 'కార్పొరేట్ పాలన'గా ప్రపంచబ్యాంకు విరచిత భావన మనకు చంద్రబాబు పాలనలో సుపరిచితమే. రాష్ట్రపాలన 'మేనేజ్‌మెంట్' స్థాయికి దిగజారడం. ఇక మూడవది: పౌరసమాజం వినియోగ సమాజంగా రూపుదిద్దుకోవడం. రాజకీయ పార్టీలు ప్రజలను పౌరులుగా కంటే ఓటర్లుగా, వినియోగదారులుగా మాత్రమే చూసే రాజకీయ సంస్కృతి నెలకొనడం వీటన్నిటి ఫలితంగా రాజ్యంవేరు, అధికారం వేరైన స్థితిలో రాజ్యాధికారం కోసం పోరాటం ద్విముఖంగా (అటు రాజ్యంపై, ఇటు మార్కెట్‌పై) జరగాల్సిన పరిస్థితి ఉత్పన్నమైంది.

కొద్దిరోజుల క్రితం మన రాష్ట్ర కాంగ్రెస్ వ్యవహారాల బాధ్యుడైన వీరప్పమొయిలీ హైద్రాబాద్‌లో మాట్లాడుతూ కాంగ్రెస్ కార్యకర్తలు 'సేల్స్‌మెన్'లా ప్రజలలోకి వెళ్ళాలన్నారు. మెగాస్టార్ చిరంజీవి రాజకీయ అరంగేట్రం చేసిన సభ ఏర్పాట్లను ఇవెంట్ మేనేజర్లకు అప్పగించారు-ఒక సినిమా విడుదల ఫంక్షన్

లాగా కాంగ్రెస్ పార్టీ తమ పార్టీ ఎన్నికల ప్రచారాన్ని కార్పోరేట్ కంపెనీల ద్వారా డిజైన్ చేయించి వాణిజ్య ప్రకటనల రూపంలో అచ్చేయించడం ప్రారంభించింది. చంద్రబాబు తమ పార్టీ కార్యాలయంలో నేతలకు బిజినెస్ మేనేజ్‌మెంట్ తరగతులు ఏనాడో నిర్వహించారు. రెండు నెలల క్రితం శ్రీ అబ్దుల్ కలామ్ అమెరికాలో పర్యటిస్తూ పార్లమెంటు సభ్యుల పదవీకాలాన్ని ఐదేళ్ళనుంచి ఆరేళ్ళకు పెంచి ఒక ఏడాది పాటు బిజినెస్ మేనేజ్‌మెంట్‌లో వారికి తర్ఫీదు ఇవ్వాలన్నారు.

రాజకీయాలు బిజినెస్ మేనేజ్‌మెంట్ స్థాయికి దిగజారాయి. రాజకీయ పార్టీలు కార్పోరేట్ కంపెనీల స్థాయికంటే కిందకి దిగజారి ప్రజలను మేనేజ్ చేయడంగా పతనమయ్యాయి. ఇవాళ 'పొలిటికల్ సైన్స్'ను 'పబ్లిక్ అడ్మినిస్ట్రేషన్'గా పిలవడం యాదృచ్ఛికం కాదు.

ఇవాళ్టి రాజకీయ పార్టీలు ప్రజలను వినియోగదారులుగా తప్ప మరేవిధంగా చూడలేవు. ప్రపంచీకరణ మూలంగా రాజ్యానికి సారంలేని సార్వభౌమత్వం మిగిలింది.ప్రపంచ పెట్టుబడి మార్గనిర్దేశకులైన ప్రపంచబ్యాంకు చెప్పిన పనులను చేయడం, కార్పోరేట్ కంపెనీల అవసరాలను తీర్చడం రాజ్యవిధులుగా మారాయి. సెజ్‌ల కోసం ప్రజల రక్తాన్ని కూడా తర్పణంగా వదిలేందుకు వామపక్ష ప్రభుత్వాలు సైతం వెనుకాడని స్థితిని మనం చూశాం.

రాజ్యం పరిధి కుంచించుకు పోతోంది. దాని అధికారాలు మార్కెట్‌కు బదలాయించబడుతున్నాయి. అందుకోసం ప్రపంచ ఆర్థిక సంస్థలైన ప్రపంచ బ్యాంకు, ఐఎంఎఫ్‌లు పెద్దపెట్టున ప్రపంచదేశాలపై వత్తిడి చేయాలని 1981లో అప్పటి అమెరికా అధ్యక్షుడు రోనాల్డ్ రీగన్, బ్రిటన్ ప్రధాని మార్గరెట్ థాచర్ ఆదేశించారు. తర్వాత ప్రపంచీకరణగా ముందుకొచ్చిన పరిణామాలు రాజ్యం పలు రంగాలనుంచి వైదొలిగిన క్రమాన్ని తెలియజెప్పాయి. భారత రాజ్యాంగం లోని 4వ విభాగంలోని ఆదేశికసూత్రాలు జాతీయకరణ దిశగా ప్రభుత్వ విధానాలు ఉండాలని నిర్దేశించినప్పటికీ బిజెపి ఆధ్వర్యంలోని ఎన్‌డిఎ ప్రభుత్వంలో అరుణ్‌శౌరి డిసిన్వెస్టెమెంట్ (ప్రభుత్వ సంస్థల అమ్మకాల) మంత్రిగా  పనిచేశారు. ఎన్నో ప్రభుత్వ సంస్థలను అమ్మారు. మన రాష్ట్రంలో

పలు ప్రభుత్వ రంగ సంస్థలను అమ్మకానికి పెట్టారు. కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు ప్రజల భూములను సైతం భూసేకరణ చట్టం ఉపయోగించి సేకరించి మరీ కార్పొరేట్ కంపెనీలకు ధారాదత్తం చేస్తున్నాయి. చివరికి అటవీ భూములను సైతం మానవనాగరికత వికాసం చెందిన తర్వాత మొదటి సారిగా ప్రైవేటీకరించడాన్ని వామపక్షాలు సైతం విప్లవాత్మక చర్యగా కొనియాడే దౌర్భాగ్యస్థితి నెలకొంది. గిరిజనుల హక్కుల పేరిట జరుగుతున్న ఈ తంతు చివరికి అడవులను కార్పొరేట్ కంపెనీలకు అప్పజెప్పే దిశగా వెళ్తుందన్న కనీస ఇంగితజ్ఞానాన్ని సైతం అవి కోల్పోయాయి.

మన సమాజం ఉత్పత్తి ప్రధాన సమాజం నుంచి వినియోగ ప్రధాన సమాజంగా రూపుదిద్దుకొంటోంది. మార్క్స్ భారతదేశం గురించి రాస్తూ ఇక్కడ బ్రిటీష్‌వారి రాకకుపూర్వం రాజ్యం కేవలం రెండువిధులు నిర్వహించేదని చెప్పారు. ఒకటి- పన్నులు వసూలు, రెండు-యుద్ధాలు చేయడం. తర్వాత రెండవ ప్రపంచ యుద్ధానంతరం వచ్చిన శ్రేయోరాజ్యస్థానంలో ప్రపంచీకరణ ఫలితంగా 'సుపరిపాలన', 'కార్పొరేట్ పాలన' వచ్చాయి. ఇవాళ రాజ్యవిధులు రెండే. ఒకటి- అప్పులు తెచ్చి కంపెనీలను మేపడం (పనిలో పనిగా రాజకీయనేతలు జేబులు నింపుకోవడం) రెండు వినియోగ సరుకుల నిరంతరం సరఫరాకు ఆటంకంకాని రీతిలో కార్పొరేట్ కంపెనీలకు ప్రభుత్వం సహకరించడం. ఇవి తప్ప ప్రజల జీవితాలను మార్చే ఏ ఇతర మౌలిక నిర్ణయాలను చేసే శక్తి పాలకుల వద్ద లేనేలేదు. ప్రజలు ఆందోళనచేస్తే (అవికూడా ఇటీవల బాగా తక్కువ స్థాయిలో, స్వల్ప వ్యవధిలో ముగుస్తున్నాయి) పోలీసు, పారామిలిటరీ బలగాల ద్వారా అణచివేయడం, ప్రజలు ఆత్మహత్యలు చేసుకుంటే నష్టపరిహారమిచ్చి బుజ్జగించడం - ఇలాంటి పనులకు ప్రభుత్వం పరిమితమౌతోంది.

ఒక రాష్ట్ర ముఖ్యమంత్రికన్నా ఒక కంపెనీ అధిపతి గొప్పగా కన్పించడం మొదలైంది. శ్రీనారా చంద్రబాబునాయుడు తను ముఖ్యమంత్రిగా ఉన్నప్పుడు ఢిల్లీ వెళ్ళి పడిగాపులుగాసి బ్రతిమాలి ఎలా బిల్‌గేట్స్ వద్ద ఇరవై నిమిషాల ఇంటర్వ్యూ సంపాయించాడో గొప్పగా చెప్పుకున్నారు. సీనియర్ ఐఏఎస్ అధికార్లు

సైతం ఇవాళ రాజీనామా చేసి కార్పొరేట్ సెక్టార్‌లో మేనేజర్లుగా వెళ్ళేందుకు సిద్ధపడటం మనం చూస్తున్నాం.

అందువల్ల ఏ కొత్త రాజకీయ పార్టీ వచ్చినా మెగాస్టార్ ప్రపంచబ్యాంకే. కార్పొరేట్ కంపెనీలే నక్షత్ర కిరీట ధారులు. సిల్వర్ స్క్రీన్ మెగాస్టార్‌లు సైతం వాటిముందు మెగాజీరోలే.

ప్రపంచ పెట్టుబడి మనపై రుద్దిన చట్రాన్ని ఛేదించే రాజకీయాలు కావాలి మనకు. రాజ్యపాలకులపై పోరాడేవాళ్ళకు కొదవలేదు. ఎటొచ్చీ మార్కెట్ శక్తులపై పోరాడే మహత్తర శక్తి ఇవాళ రాజకీయాలకు అవసరం. అంగడి ఆధిపత్యాన్ని దెబ్బతీసే కాలాంతకులకు ముందస్తు నమస్కారం.

**సెప్టెంబరు 1, 2008 - రాతప్రతి**

# 38. 800 ఏళ్లుగా పల్నాటి వీరోత్సవాలు

తెలుగునాట పౌరుషానికి పుట్టినిల్లు, వీరత్వానికి చిరునామా పల్నాడు. అక్కడ పన్నెండవ శతాబ్దిలో జరిగిన యుద్ధం పల్నాటి చరిత్ర పుటల్లోనేగాక తెలుగువాళ్ల చరిత్రలోనే శాశ్వత స్థానం సంపాదించుకుంది. బ్రహ్మనాయుడి చాపకూడు, నాయకురాలు నాగమ్మ కుతంత్రం, కన్నమదాసు శౌర్యం, అనపోతురాజు వీరత్వం, బాలచంద్రుడి పరాక్రమం, మగువ మాంచాల తెలివితేటలు ఇవన్నీ తెలుగు ప్రజలకు సుపరిచితాలు. ఇప్పటికీ పల్నాడులో ఆనాటి చారిత్రక అవశేషాలు కొల్లలుగా ఉన్నాయి. ఆ యుద్ధం వారికి ఈనాటికీ ఒక సజీవ దృశ్యమే. పల్నాటి వీరుల కథకు ఎనిమిది వందల వసంతాల అవిచ్ఛిన్న గాన చరిత్ర ఉంది. ఆనాటి మనుషులను పోలిన మనుషులు, ఆచారాలను పోలిన ఆచారాలు అక్కడ సజీవ సాక్ష్యాలుగా కనిపిస్తాయి. ప్రస్తుతం పిడుగురాళ్ళలో జరుగుతున్న 'పల్నాటి మహోత్సవాల' సందర్భంగా ఆ వీర సంప్రదాయం గురించి ఈ వారం కవర్ స్టోరీ.

గత 800 సంవత్సరాలుగా కారంపూడిలో వీరుల ఆరాధనోత్సవాలు జరుగుతున్నాయి. వీరుల సంస్కృతిని కొనియాడే ఈ ఉత్సవాల నిర్వహణ కోసం వీరాచార విద్యావంతులు (వీరగాథలు పాడే గాయకులు) ఉన్నారు. వారికి ఒక పీఠం ఉంది. వీరాచారం పాటించేవారు చాలమందే ఉన్నారు. వీరాచార సంప్రదాయం పేరిట ఏటా జరిగే ఉత్సవాలకు కృష్ణా, ప్రకాశం, నెల్లూరు, వరంగల్లుతో సహా పదకొండు జిల్లాల నుంచి వీరాచార విద్యావంతులు, వీరాచారులు కొణతాలతో (వీరుల ఆయుధాలు) వస్తారు. బహుశా ఆయా జిల్లాల నుంచి యుద్ధంలో పాల్గొని మరణించిన వీరుల స్మృతి వల్ల కాబోలు పదహారవ

శతాబ్దిలోనే ఓరుగల్లులో పల్నాటి వీరోత్సవాలు జరిగినట్లుగా వినుకొండ వల్లభరాయుడు క్రీడాభిరామంలో పేర్కొన్నాడు. వీరగాథలను ఓరుగల్లు వీధుల్లో ఆలపించడాన్ని ఆయన పద్యరూపంలో చిత్రించాడు. పలు జిల్లాల్లోనే కాక, గుంటూరు జిల్లాలోని తుళ్లూరులో కూడా వీరోత్సవాలు జరుగుతాయి. కాని అవన్నీ ముందుగా ముగించి కారంపూడి ఉత్సవాలకు అందరూ వస్తారు. వీరగాథను గానంచేస్తూ యుద్ధ దృశ్యాలను ఆవాహన చేస్తారు. మిత్రశత్రు సైనికులని లేదు. మరణించిన వీరులందరికీ నివాళి అర్పిస్తారు.

పల్నాటి యుద్ధానంతరం తమ బ్రహ్మైక్యం చెందిన గుత్తికొండ బిలం నుంచి నాటి కార్తీక పౌర్ణమి రాత్రి బ్రహ్మనాయుడు కారంపూడి వీరుల గుడికి వస్తాడని నమ్మకం. అక్కడ ఆయుధాల రూపంలో వీరుల మూర్తులు ఉంటాయి. నాగులేటి ఒడ్డునున్న ఈ గుడిలో బ్రహ్మన్న రాకను సూచించే శబ్దాలతో వీరోత్సవాలకు స్వాగతం పలుకుతారు. అదే రాత్రి వీరుల గుడిలో దీపారాధన చేస్తారు. గుడిలో ఉన్న పోతురాజు (దేవాలయాలకు, కోటలకు కాపలా ఉండే దేవుడు) బండకు 'పడిగెం' కడతారు (ఇరవై ఒక్కదారపు పోగులతో బండను అలంకరించడాన్నే పడిగెం కట్టడం అంటారు) గుడికి కాపలా ఉండమని ప్రార్థిస్తారు. బ్రహ్మనాయుడు, నాగమ్మల సంకేతాలను గుడి ఆవరణలో ఎగురవేస్తారు. ఈ గుడికి గోపురం లేదు. నిత్యనైవేద్య దీపారాధనలు లేవు. ఉత్సవకాలంలో మాత్రమే దీపారాధన చేస్తారు. వీరగంధాన్ని మాత్రమే అలంకరణకు వాడతారు. కార్తీక పౌర్ణమి తర్వాతి రోజు ఉదయం కారంపూడి వీర విద్యావంతుల పీఠం (దీన్నే వీరుల సేవాస్థానం అని కూడా అంటున్నారు) అధిపతి ఉత్సవాలకు ఆహ్వానాలను ఇచ్చి నలు దిక్కులా మాలదాసులను పంపుతారు. అలా ఉత్సవ సమాచారం గ్రామగ్రామానికి చేరుతుంది.

తర్వాత పదిహేను రోజులకు ఉత్సవాలు కార్తీక అమావాస్య రోజున ప్రారంభమవుతాయి. ఆ రోజుకు వీరాచారవంతులు కారంపూడి చేరుకుంటారు. వివిధ ప్రాంతాల నుంచి వచ్చేవారు తమ దైవాలను (అలంకరించిన ఆయుధాలు/ వీటినే కొణతాలు అంటారు) తెచ్చి నాగులేటిలో స్నానంచేయించి, అలంకరణ చేసి ఊరేగించి వీరుల గుడిలో, అంకమ్మ చెన్నకేశవ స్వామి దేవాలయాల్లో ఉంచుతారు.

ఐదురోజుల పాటు జరిగే ఈ ఉత్సవాల్లో ప్రతి రోజుకు ఒక సాంకేతిక నామం ఉంది - రాచగావు, రాయబారం, మందపోరు, కోడిపోరు, కల్లిపాడు. ప్రతిరోజూ కొణతాల ఊరేగింపులు, కత్తిసేవలు, వీరగాధలతో కారంపూడి పగలూ రాత్రీ మారుమోగుతుంది. జనం మొక్కుబడులు తీర్చుకుంటారు. పూనకాలొచ్చి ఊగుతారు. పెద్ద తిరునాళ్ల సందడి అన్ని కులాల సొత్తుగా కొలువుదీరే వీరాచారం అది. ప్రతిరోజూ వీరులగాధను జ్ఞప్తికి తెస్తూ పలు క్రతువులుంటాయి.

## 1. రాచగావు

పీఠాధిపతితో కలిసి వివిధ ప్రాంతాల వారు కొణతాలు తీసుకుని వీరులగుడిలో ప్రవేశిస్తారు. ఒక మనిషికి పోతురాజు అని పేరు పెట్టి కంకణం కడతారు. పీఠాధిపతి, మిగిలిన వీరాచార విద్యావంతులు కూడా కంకణాలు కట్టుకొని యుద్ధానికి సిద్ధమైన విధంగా ఎర్రజెండా ఎగురవేస్తారు. పోతురాజుకు మేకపోతును బలి ఇచ్చే సాంప్రదాయం గతంలో ఉండేది. మాల కులానికి చెందిన వీర విద్యావంతుడు మేకపోతు మెడను నోటితో కొరికి బలి ఇస్తాడు. రక్తాన్ని అన్నంలో కలిపి చుట్టూ చల్లుతారు. అరవై ఆరుగురు వీరుల స్మృతి చిహ్నంగా మాంసపు ముద్దలను గాలిలోకి విసురుతారు. ఆ రాత్రి వీరచరిత్ర గానం చేస్తారు. పోతురాజు, అంకమ్మతల్లి గురించిన గాధలు ప్రధానంగా ఉంటాయి.

## 2. రాయబారం

అరణ్యవాసం అనంతరం రాయబారిగా వెళ్లిన అలరాజును చెర్లగుడిపాడు వద్ద విష ప్రయోగంచేసి చంపిన కథను ప్రదర్శిస్తూ గానంచేస్తారు. కత్తిసేవ చేస్తారు.

## 3. మందపోరు

మూడవరోజు మందపోరు (బ్రహ్మన్న ఆలమందలపై నాగమ్మ ప్రేరేపిత దాడి) గురించిన కావ్యగాధను గానంచేస్తారు. గొల్లకాపరి లంకన్న మృతి గురించిన కథావిశేషాలుంటాయి. (నిజానికి మందపోరు తర్వాత చాలా కాలానికి గురజాల రాయబారం ఘట్టం జరుగుతుంది. కానీ ఇక్కడ ఉత్సవ క్రమం చరిత్రను అనుసరించి ఉండదు)

## 4. కోడిపోరు

నాల్గవ రోజు కొణతాలతో గుడి బయటికి వచ్చి తెల్లవారుజామున కోడిపందెం వేసి అప్పటినుంచి ఆ రోజు రాత్రి వరకు అన్ని వీధుల్లో ఊరేగిస్తారు (అరణ్యవాసానికి సూచికగా) వివిధ వీరాచారవంతులు వివిధ యుద్ధవీరుల పాత్రల్లో జీవిస్తూ వీరచరిత్ర గానం చేస్తూ కోడిపోరు ఘట్టాన్ని సాయంత్రం తిరిగి ప్రదర్శిస్తారు. పీఠాధిపతిది బ్రహ్మన్నపాత్ర తర్వాత నాగులేటి నీటిలోని గంగధారి మడుగులో (కారంపూడిని కాశీగా వర్ణిస్తూ శ్రీనాథుడు చెప్పిన పద్యంలో దీనిని మణికర్ణిక ఘట్టంతో పోల్చాడు) స్నానం ఆచరించి కొణతాలను అలంకరించి వీరులగుడిలో పెడతారు.

## 5. కల్లిపాడు

ఇది యుద్ధ బీభత్సాన్ని యుద్ధానంతర నిర్వేదనను సూచించే క్రతువు. వీరుల మృతిని అనుసరిస్తూ యుద్ధభూమిలో కొణతాలపై నిశ్చలంగా పరుండే దృశ్యాలు ఈ కల్లిపాడు ప్రత్యేకత. వీర్లగుడివద్ద 'లంకన్న ఒరుగు' బండమీద వీరాచారవంతుడిని నిశ్చలంగా పడుకోబెడతారు. అతనిపై ఆయుధాలు ఉంచుతారు. తర్వాత కొణతాలకు అలంకారాలు తీసేసి శంఖుతీర్థ మండపానికి వెళ్లి పీఠాధిపతి వద్ద తీర్థం పుచ్చుకుంటారు. బ్రహ్మన్న ఈ మండపం వద్దే వీరులకు తీర్థమిచ్చి యుద్ధానికి పంపాడని ప్రతీతి. తర్వాత 'కల్లితోరణం' ద్వారా పోతురాజు గుట్టకు వెళ్లి అక్కడ రెండు తంగేడు మండల మోపులపై కొణతాలతో సహా వీరాచారులు వాలిపోతారు. అంతటితో ఉత్సవాలు ముగుస్తాయి. అక్కడ నుండి కొణతాలను ఏ ఊరి వారు ఆ ఊరికి తీసుకువెళ్లి గుళ్లలో పెట్టుకుంటారు. తంగేడు మండలను వివిధ గ్రామాలవాళ్లు తీసుకవెళ్లి శుభ సూచకంగా ఇళ్లలో, పొలాల్లో పెట్టుకుంటారు.

ఈ క్రతువులలో కాలక్రమంలో కొన్ని మార్పులు చోటుచేసుకున్నాయి. గతంలో ఏడురోజుల ఉత్సవాలు జరిగేవి. ఆరవరోజుకు ఏ ప్రత్యేకతా లేదు కాని ఏడవ రోజు చాపకూడు పేరిట సహపంక్తి భోజనం చేసేవారు. ప్రతిరోజూ పల్నాటి చరిత్రగానం, అభినయం ఉంటాయి. కత్తిసేవలో కత్తులను కొబ్బరి నీళ్లతో మంత్రించడం, పూనకాలు, కత్తులతో ఛాతిపై కొట్టుకోవడం వంటి

దృశ్యాలుంటాయి. వివిధ బ్రాహ్మణేతర కులాల వారి ఈ వీర విద్యావంతుల సంస్కృతిలో పీఠాధిపతి మాత్రం బ్రాహ్మణ కులానికి చెందినవాడు.

పల్నాటి చరిత్రవీరగాథను 800 సంవత్సరాలుగా గానాభినయం చేస్తుండడం విశేషం. శ్రీనాథుడి కాలం నుండి దాన్ని వివిధ రూపాల్లో గ్రంథస్థం చేసినప్పటికీ వీరాచార పీఠం దృష్టిలో వీరవిద్యావంతులు మౌఖికంగా గానంచేసే కథే అధికారమైనది. దాన్ని 30 రాత్రులు గానంచేసే విద్యావంతులు పది కులాల్లో ఉన్నారు. వీరిలో మాలదాసులది ప్రత్యేకం. మహాభారతం, రామాయణం కావ్యాల తర్వాత అంతటి విస్తృతి గలది ఈ వీరగాథ మాత్రమేనని పండితాభిప్రాయం.

17వ శతాబ్ది మధ్యభాగంలో జీవించిన వీరభద్ర కవి పల్నాటి యుద్ధ చరిత్రను కావ్యంగా రాశారు. సిపిబ్రౌన్ వీరుల గాథను తాళపత్రరూపంలో కొంత సేకరించారు. శ్రీనాథ విరచిత పల్నాటి చరిత్రను అక్కిరాజు ఉమాకాంతం 1911లో ప్రచురించారు. ఆ తర్వాత 1961లో పింగళి లక్ష్మీకాంతం శ్రీనాథ కావ్యమూలంగా పల్నాటి చరిత్ర ద్విపదను వెలువరించారు. కార్తవీర్యార్జనుడు దేవలోకంలో బ్రహ్మన్న సంవాదాలు, నాగలోకంలో బ్రహ్మన్న బాల్యం, నారదుడు, శివపార్వతుల సంవాదం, అలుగురాజు తీర్థయాత్రలు, కల్యాణపురి (కర్ణాటక) విశేషాలు, అంకమ్మ అవతారంలో పార్వతి లీలలు, వాటితోపాటు మహిమలు, శక్తులు, అద్భుతాలు అనేకం ఉన్నాయి. ఈ చరిత్రలో బ్రహ్మన్న కోడి పుంజుతో సహా ప్రతిపాత్రకు ఎన్నో ఉపకథలు, సూక్ష్మాతి సూక్ష్మ జీవిత చిత్రణలు, అద్భుతమైన శృంగార ప్రేమగాథలున్నాయి. ప్రేమకోసం ప్రియుడితో కోటను వదిలి యుద్ధం చేసిన శివనాగరాణి గాథ ఆద్యంతం రసవత్తర ఘట్టం.

పిడుగురాళ్ల సమీపంలోని జానపాడుకు చెందిన అలిశెట్టి గాలెయ్యతో 30 రాత్రులు పాడించుకుని దాన్ని తెలుగు నుంచి ఇంగ్లీషులోకి జి.హెచ్ రొఘెయిర్ అనువదించారు. విస్కాన్సిన్ విశ్వవిద్యాలయ ఆచార్యుడైన వెల్చేరు నారాయణరావు ఆయనకు కొంతమేర సహకరించారు. నాగార్జునుడి నుంచి నాగార్జునసాగర్ దాకా పల్నాడుకు ఎంతో చరిత్ర ఉన్నప్పటికీ పల్నాటి యుద్ధంతోనే పల్నాటి ప్రజలు తమను తాము ఎక్కువగా గుర్తించుకుంటారని రొఘెయిర్ ఆ పుస్తకంలో అన్నారు. ఆక్స్‌ఫర్డ్ దాన్ని 1981లో 'ది ఎపిక్ ఆఫ్ పల్నాడు' పేరిట

ప్రచురించింది. అంతకు ముందు 1879లో క్లుప్తమైన ఆంగ్ల అనువాదం రాబర్ట్ సెవెల్ చేశాడు.

## సజీవ చరిత్ర

వీరగాథలో పేర్కొన్న పలు విశేషాలను ఇప్పటికీ పల్నాడులో చూడవచ్చు. ఇక్కడ దాదాపు ప్రతి ఊరికీ పల్నాటి యుద్ధంలో స్థానం ఉందని చెప్పవచ్చు. వీరగాథ సజీవత్వానికి ఇది ఒక కారణమేమో.

పల్నాటి యుద్ధకాలంనాటి గురజాల, మాచర్ల నేటికీ అవేపేర్లతో రాజకీయ పాలనా కేంద్రాలుగా భాసిల్లుతున్నాయి. గురజాలలో గంగగుడి, కోటసాని బావి, పల్నాటి వీరుల కోట(కోటగడ్డ), వీరభద్రుని గుడి, నాగమ్మ కొలిచిన పాత పాటమ్మ దేవళం ఉన్నాయి. మార్గశిర శుద్ధ పున్నమి రోజున జరిగే తిరునాళ్లలో వీరుల కథాగానం ఉంటుంది.

చంద్రవంక ఒడ్డునున్న మాచర్ల చెన్నకేశవ ఆలయం రాష్ట్రంలో సుప్రసిద్ధ వైష్ణవాలయం. అక్కడి శిల్పాలు బేలూరు శిల్ప కళాకృతులను పోలిఉంటాయని పురావస్తు శాస్త్రవేత్త ప్రొఫెసర్ శివాగిరెడ్డి అభిప్రాయం. బ్రహ్మన్న కర్ణాటక నుంచి వచ్చిన వాడనే వాదన కూడా ఉంది. మాచర్ల శివనాగస్తంభ శాసనం పల్నాటి హైహయరాజ వంశ పాలన గురించి చెబుతుంది. మాచర్ల సమీపంలో బ్రహ్మన్న అరణ్యవాసం చేసిన మండాది ఉంది. సత్రశాల శాసనం కూడా పల్నాటి రాజుల కాలం నాటిదే. అక్కడికి దగ్గర్లోని పాలువాయంలో 'వీర్ల బయళ్లు' ఉన్నాయి. కోడిపోరు ఇక్కడే జరిగిందని నమ్మకం (వీరగాథ ప్రకారం కోడి పందెం గురజాలలో జరిగింది). అక్కడి రాళ్ల గుట్టలు ఆనాటి వీక్షకుల ఆసనాలుగా భావిస్తారు.

నాయకురాలు నాగమ్మ జన్మస్థలం గామాలపాడు నేటికీ ఉంది. అక్కడ నాగమ్మ కోట, శివాలయం ఉన్నాయి. అలరాజు మరణించిన చర్లగుడిపాడులో 'అలరాజు ఒరుగు రాయి', అలరాజుపై విషం ప్రయోగించిన తంబళ్ల కొమ్మజియ్యరు విగ్రహం ఉన్నాయి.

ఇక కారంపూడి మొత్తం యుద్ధకావ్యమే. వీరత్వానికి భూమికగా నిల్చిన యుద్ధభూమి, వీరులగుడి అంకాళమ్మ, చెన్నకేశవ దేవాలయం లాంటి పలు

చారిత్రక, సాంస్కృతిక విశేషాలున్నాయి. ఇన్ని అవశేషాలు ఒకచోట సజీవంగా ఉండటమే ఒక విశేషమని పరిశోధకులు చెప్తారు. వీరులగుడిలో వీరులు వాడినట్లు చెప్పబడుతున్న కత్తులు, కటార్లు ఇతర ఆయుధాలున్నాయి. వాటిలో బ్రహ్మన్న ఆయుధం ప్రత్యేకం. అరవై ఆరుగురు వీరులకు చిహ్నంగా అరవై ఆరు లింగాలు గుళ్లోనూ ఉన్నాయి. అక్కడే స్తంభాలు, మండపాలు, పోతురాజు బండ, గంగ కాలభైరవ విగ్రహాలు, కళ్లె పోతురాజు, ఎరుకల శక్తి గుడి చుట్టూ నెలకొన్నాయి. వీరత్వం ఉప్పొంగి చనిపోయిన ఇద్దరు ముస్లిం సైనికుల సమాధులు సైతం వీరులగుడిలో పూజలందుకోవడం విశేషం. శంకుతీర్థ మండపం నాగులేటి సమీపంలో ఉంది. వీరులు యుద్ధానికి వెళ్లే ముందు బ్రహ్మన్న యిచ్చిన తీర్థం తాగిన వెంటనే వీరత్వం ఉప్పొంగేదని వీరగాథ చెపుతోంది. కారంపూడి వీర అంకమ్మ గుడిలో విగ్రహం యుద్ధ భూమిలో నేలకొరిగిన వీరులను చూసి దుఃఖిస్తున్నట్లుగా ఎడమ వైపు ఒరిగి యుద్ధభూమిని చూస్తుంటుంది. ప్రహరీ గోడకున్న రంధ్రం ద్వారా గుళ్లో నుండి యుద్ధ భూమిని చూడవచ్చు. కారంపూడి నామాల మండపం (బ్రహ్మన్న నామాలు దిద్దుకునే స్థలం) సమీపంలోని వీధిలో పొట్టేలు గిట్టల గుర్తులున్న రాతిని బాలచంద్రుడు పొట్టేలును దూకించిన స్థలంగా చెప్తారు. భైరవ ఖడ్గం వంటి జానపద దృశ్యాలనూ కారంపూడిలో మనం చూడగలం.

నాగమ్మ కోడి పుంజుకు కత్తిగట్టి మంత్రించిన మంత్రగాళ్ల ఊరు గంగవరం. దీన్ని కట్టుబోతు గంగవరం అని పిలుస్తారు. గురజాల సమీపంలో ఉంది. కథాక్రమంలో వచ్చే ఊళ్లన్నీ పల్నాడులో నేటికీ ఉన్నాయి.

వీరోత్సవాలను నిర్వహించే కారంపూడి పీఠాధిపతి బాలుడు. బాల దలైలామాగా చూడముచ్చటగా ఉండే పిడుగు తరుణ్ చెన్నకేశవ్ వయసు పది సంవత్సరాలే. పీఠాలను, సంప్రదాయాలను సమన్వయం చేసే పనిలో పిడుగు వంశస్థులు ముఖ్యంగా పిడుగు విజయకుమార్ నిమగ్నమయ్యారు.

పల్నాటి వీరోత్సవాల అనంతరం పల్నాడు మహోత్సవాల పేరిట మూడేళ్ల నుంచి గురజాల ఎమ్మెల్యే జంగా కృష్ణమూర్తి ప్రోద్బలంతో కొన్ని సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు. బ్రహ్మన్న, నాగమ్మ, కన్నమదాసుల విగ్రహ ప్రతిష్ట చేశారు. పల్నాడు చరిత్ర పరిరక్షణ, అభివృద్ధి కమిటీ పేరిట ఒక కమిటీ

ఏర్పడి ఉత్సవ నిర్వహణ బాధ్యత చేపట్టింది. గత ఏడాది 'పల్నాటి వైభవం' పేరిట సావనీరును కూడా ప్రచురించింది.

ఒకవైపు ఇదంతా జరుగుతుంటే మరోవైపు ప్రభుత్వం విచ్చలవిడిగా పల్నాడులో కొండలను, అటవీ భూములను సిమెంట్ ఫ్యాక్టరీలకు లీజుకు ఇస్తోంది. అమ్మేస్తోంది. ఎక్కడపడితే అక్కడ మైనింగ్ కార్యక్రమాలు, తవ్వకాలు నిర్వహిస్తున్నారు. చివరికి దైదబిళం లాంటి చారిత్రక, సాంస్కృతిక ప్రాధాన్యంగల శివాలయం నెలకొన్న అడవిని సైతం లీజుకు ఇవ్వడానికి పూనుకున్నట్లు వార్తలొస్తున్నాయి. ఇప్పటికే వ్యాపార పంటలు పల్నాటి ప్రజలకు యమపాశాలయ్యాయి. అభివృద్ధి పేరిట జరుగుతున్న ఈ భూభంగం పల్నాటి ప్రజల జీవనాధారాన్నే కాక చరిత్రను సంస్కృతిని కూడా దెబ్బతీసే ప్రమాదముంది.

**డిసెంబర్ 21, 2008 - ఆంధ్రజ్యోతి ఆదివారం సంచిక**

## 39. ఆధునికతపై అవిశ్వాస ప్రకటన భగ్న (శత్రు) ప్రేమికుడి కవితాలాపన

జర్మన్ తత్వవేత్త నీషే రచన జాయెస్ సైన్స్‌లో ఒక పిచ్చివాడు పట్టపగలే లాంతరు చేబూని దేవుడికోసం ప్రతిచోటా గాలిస్తాడు. కానీ దేవుడి జాడ కూడా కనిపించదు. దేవుడు మరణించాడని ప్రకటిస్తాడు. దేవుడిని మనమే హత్య చేశామని ఆక్రోశిస్తాడు. అతని మాటలను ప్రజలు పట్టించుకోరు. కానీ, అతని ప్రతిమూర్తి వారి మనో ఫలకాలపై ప్రస్ఫుటంగా ముద్రించ బడుతుంది. పారిశ్రామిక సమాజం సామూహికతను ధ్వంసించగా ఉద్భవించిన ఆధునిక అణుమాత్ర మానవుడే నీషే చెప్పిన దేవాంతకుడు. ప్రకృతి ప్రమాణంగా మానవ సమూహ జీవనాన్ని నిర్ణయించిన గతిని ధ్వంసించి మానవ హేతు ప్రామాణికతకు పట్టంగట్టి మానవుడిని ప్రపంచ సార్వభౌమ కేంద్రంగా ప్రతిష్ఠించిన ఆధునికత విశ్వరూపాన్ని నీషే సాక్షాత్కరించుకున్నాడు. దేవుడి హత్యను నీషే ప్రకటిస్తే, వలసీకరించబడటం ద్వారా మనం దాని పర్యవసానాలను ఎలా అనుభవిస్తున్నామో, పాశ్చాత్యం ఎలా మనల్ని మనం కోల్పోయేలా చేసిందో, ప్రాచీన ప్రపంచాన్ని ఎలా మట్టుబెట్టిందో పైడి తెరేష్‌బాబు అమోఘంగా కవిత్వీకరించాడు. ఆధునికత నుంచి వైదొలగి తన 'ప్రాచీన పౌరసత్వాన్ని' పునరుద్ధరించుకోవాలని తపనపడుతున్నాడు. మళ్ళీ నేను ఈ నేలలో కలిసి పోవడానికి ఎన్ని వందలయేళ్ళు పడుతుందో చెప్తావా? అని పాశ్చాత్య ప్రేయసిని ప్రశ్నిస్తున్నాడు.

**2**

పాశ్చాత్య ఆధునికత విముక్తి సామర్థ్యంలో ఎలాంటి సందేహాలకు తావులేని మన నమ్మకం పెచ్చురేగ్గొడుతూ, భ్రమాజనితమైన స్వేచ్ఛలో శ్లేష్మంలో ఈగల్లాంటి

మనందరి ఆత్మల వేదనను కవిత్వీకరించిన ఈ సుకవికి శతకోటి నమస్కారాలు. ఈ వేదన ఆధునికత హామీ ఇచ్చిన స్వర్గభూమిని పొందలేకపోవడంవల్ల కలిగేదే కాదు. అది పొంది మనం కోల్పోయిన దాని వల్ల ఏర్పడిన ఆత్మిక సంక్షోభానికీ, దైన్యానికీ వ్యక్తీకరణ. పాశ్చాత్య ప్రేయసిని, ఏ అంచున ముద్దాడినా మూతికాలుతూనే ఉంది అంటూ ఆధునికతని ద్వేషించిన మనదైన దృశ్యకావ్యం ఈనాటికి పుట్టింది - నేనూ నా వింతలమారి ప్రపంచం పేరిట. ఈ కవికి నమస్సుమాంజలులు. ఇతన్ని మనకు ఆప్తుడిగా గుర్తిద్దాం. ఈ కవి ఆర్తి మనందరిదీ. త్వమేవాహం. ఇతనూ మనమూ వేరుకాదు. అద్వైతం. ఈ కావ్యాన్ని మనం పట్టించుకోకపోయినా ఇతని కవితా ప్రతిమూర్తి మనని వెంటాడక తప్పదు.

**3**

వినవే చెలిపిలుపు అల్లదిగో! పూలతావి మోయిచున్న గాలిపైన తేలివచ్చెనే - తేనెసోనలై వేణుగానములో తూలి వచ్చెనే.... ఇది విన్నారా! వూహూ! అయితే... గజ్జెల సవ్వడి వినండి. డప్పువాదన వినండి. వేణునాదం వినండి. ఢమరుక వాద్యం వినండి - తప్పెట గుళ్లు, పల్లెపదాలు వినండి - కాకపోతే - డి.వి. సుబ్బారావు వారణాసి పద్యాన్ని ఆస్వాదించండి. రాగాల గొంతు నొక్కకండి. చెవులారా ఆరగించండి. మీరూ మీ ప్రాచీన ప్రపంచంలోకి వలసపోతారు. క్షణభంగురమైనా ప్రాచీన పౌరసత్వాన్ని పొందుతారు. రాగమార్తాండుడు డి.వి. సుబ్బారావు రాగ సంచారం, హిందూస్తానీ సరాగాల్లోకి జాలువారే గానగంధర్వుడు చీమకుర్తి నాగేశ్వరరావు సుమనోహర రంగస్థల పద్యరాగాలు-వాటి మత్తులో ఊగితూగుతున్న జానపదుల కోలాహలం ఇవన్నీ ఈ కవికి కావాలి. మనకూ కావాలి. వాటిని మనకు కాకుండా చేసిన పాశ్చాత్య ప్రేయసిని శపిస్తున్నాడితను. ఆధునికత జడలు విప్పినర్తిస్తున్న కాటినేలను దాటమంటున్నాడు. మృతకళేబరాల, కంకాళాల, మాంసపు ముద్దల, రుధిర ప్రవాహాల ఆధునిక వైతరణిని దాటి ప్రాచీన తీరాలకు చేరుకోమంటున్నాడు. అక్కడే మనకు ఊరట. దానిలో అసమానతలపై మనదైన బాణాలను ఎక్కుపెడదాం. కానీ ఆధునిక నరకకూపంలో మనకు విశ్రాంతిలేదు. బ్రతుకు లేదు - నకిలీ మనుషుల గత్తర జీవితం తప్ప.

**4**

ఈ కావ్యం చదివితే ఫ్రెంచి తత్వవేత్త మిషెల్ ఫుకో గుర్తొస్తున్నాడు. పూర్వ సమాజాలకన్నా ఆధునిక సమాజం ఎంత హింసాపూరితమో ఆయన నిరూపించాడు. (పదుల సంఖ్యలో జోగినిలుగా, దేవదాసిలుగా రద్దుపరచబడి పదులవేల సంఖ్యలో బాల్‌రూమ్ డాన్సర్లుగా ఆధునిక పునర్జన్మనెత్తిన ఆడపడుచుల గురించి ఆయన్ను చదివితే స్పష్టంగా అర్థమౌతుంది). ఈ కావ్యలోకంలో విహరిస్తుంటే ఆధునిక సమాజ జీవితాన్ని సూక్ష్మాతి సూక్ష్మంగా వివరించిన పోలిష్ సామాజిక శాస్త్రవేత్త జిగ్మంట్ బౌమన్ గుర్తొస్తాడు. ఎడ్వర్డ్ సెయిద్ ఓరియంటలిజం, ఎడ్వర్డో గిలియానో ఓపెన్ వెయిన్స్ ఆఫ్ లాటిన్ అమెరికా, గుగివా థియోంగో డీకాలనైజింగ్ మైండ్ జ్ఞప్తికొస్తున్నాయి. ఏస్టేవా గుస్టోవా, మధుసూరి ప్రకాష్ పోన్ట్-వెూడ్రన్ సొసైటీన్ (దీనికీ ఆధునికానంతరవాదానికీ ఏ సంబంధం లేదని అడ్డగీత సూచిస్తుంది) యాదికొస్తుంది. మూడో ప్రపంచపు మురికి జనం సైతం/తెల్లటి రక్తాన్ని స్రవించడం విషాదం అన్నప్పుడు ఫ్రాంజ్ ఫేనన్ బ్లాక్ స్కిన్స్, వైట్ మాస్క్స్ గుర్తొస్తుంది. ఒకానొక సాయంకాలం వేళ ఈ కవి మిత్రుడు ఒక దినపత్రిక కార్యాలయంలో తటస్థపడి తన కవితావిష్కరణ మరురోజు అని చెప్పినప్పుడు ఇతన్ని నేను తక్కువ అంచనావేయడం నా దౌర్భాగ్యమని ఇతని కవిత చదివాక నాకు బాగా తెలిసొచ్చింది. స్పష్టాస్పష్టాలు దాటి / సాధ్యాసాధ్యాలు దాటి / చేతనా చేతనాలు దాటి / నా ప్రపంచానికి నేను వలస వెళ్తాను అని ప్రకటిస్తున్న ఈ అసాధ్యుడికి నమోవాకాలు.

**5**

మహాకవి శ్రీశ్రీ ఆధునిక కవితా కాలాన్ని ఆవిష్కరిస్తే ఈ (అ)సామాన్యకవి ఆధునిక పూర్వకాలానికి తరలిపోతానంటున్నాడు. పాశ్చాత్య ఆధునికత తెచ్చిపెట్టిన ఏకాకితనంలో ఈ కవీశ్వరుడి కలం నిద్రలేని రాత్రి గడిపింది. ఈ శతాబ్దం నాది అని శ్రీశ్రీ ప్రకటిస్తే ఆ శతాబ్దం విధ్వంసించిన జీవితాన్ని ఈ కవి ఆవిష్కరిస్తున్నాడు. గతమంతా తడిసె రక్తమున / కాకుంటే కన్నీళ్ళతో అని శ్రీశ్రీ అంటే గతంలోకి వలసపోయేందుకు పూనుకున్న ఈ కవిని చూస్తే ఈ ఆధునికతలో ఇతను ఎంతగా గాయపడ్డ గేయకుడో అర్థమౌతుంది. పాశ్చాత్య

హేతువును దాని విముక్తిదాయకతపై గొప్ప నమ్మకమున్న శ్రీశ్రీ పదండి ముందుకు పదండి తోసుకు అంటే ఈ కవి ప్రగతి కింద చలామణి అయ్యే ప్రతిదీ ప్రమాదకర విన్యాసమే అని నిరసిస్తున్నాడు. రండి! ఈ కవి హృదయఘోష వినండి. ప్రగతి దారికి అడ్డంగా బారికేడ్లు నిర్మించి దాని భీభత్సానికి చరమగీతం పాడండి. అభ్యుదయం ఆనవాళ్లు లేకుండా తుడిపేయండి. నువ్వు నేనుగా మారే క్రమంలో నేను నేను కాకుండా పోతున్న దృశ్యాన్ని పాశ్చాత్య ప్రేయసి ముందు ఆవాహన చేయండి. ఆధునిక దుర్మార్గంపై ఈ కవి ఆలోచనాత్మక, తాత్విక ఆక్రోశాన్ని వినండి. ఏ వెల్తులకీ ప్రస్థానం అని నిలదీస్తున్న రెప్పలు కత్తిరించిన కాస్మోపాలిటన్ నేత్రాల కింద కునుకు కోల్పోయిన ఈ కవి సంవేదన మనదిగా స్వీకరిద్దాం. అభ్యుదయం, ప్రగతి రథచక్రాలను విరిచేసి పొయ్యిరాజేసి స్వదేశీ భోజనాన్ని కడుపారా ఆరగిద్దాం (కనీసం మనకు ఆధునిక మధుమేహం రాకుండా ఉంటుంది). పశువూ, మనిషీ కదంతొక్కి పదంపాడే నిరంతర నర్తనశాలకు చేరుకుందాం. ప్రాకృతిక జీవితానికి జేజేలు పలుకుదాం.

### 6

ఆధునికతను ఆర్థిక దృష్టితో మాత్రమే ఈ కవి చూడలేదు. వలసవాద ఆధునికత మనపై రుద్దిన బౌద్ధిక, సాంస్కృతిక, ఆత్మిక వినాశనాన్ని ప్రకరణాలుగా ప్రకటించిన ద్రష్ట ఇతను. తల్లీ తండ్రీ, పిల్లా జెల్లా, దేవుడూ దేశం / దేన్నయినాసరే / ఎడం కాల్తో తన్నడం ఎంత మధురం / కుడికాలితో నిన్ను కౌగిలించుకోవడం ఎంత మధురం అంటూ వ్యంగ్యంగా ప్రశ్నిస్తున్నాడు. ఒక వైపు స్వచ్ఛంద ధార్మికత, మరోవైపు ఎకె-47 తుపాకీల మావో ఘోష ప్రపంచ బ్యాంకు జగన్నాథ రథచక్రాలను ప్రజా ప్రగతిదారులంట నడిపిస్తుంటే ఏ ఆధునిక జగర్‌నాట్ ఏ భయంకర నరకలోక దారి వెంట మనల్ని నడిపిస్తున్నాయో నిలదీస్తున్నాడీ కవి. మెటీరియలిస్ట్ ఇండివిడ్యువల్స్ బతుకువేట గురించి చెప్పి జిగ్మంట్ బౌమన్ లిక్విడ్ మోడర్నిటీని వివరిస్తున్నాడు. ఒక్క కేబుల్ కనెక్షన్‌తో / నా నేలపై నీ సామ్రాజ్యాన్ని స్థాపించడం / నా ప్రపంచపు ఐదో వింత అంటున్నాడు. సైనిక దాడికన్నా సాంస్కృతిక దాడి ప్రమాదకరం అన్నప్పుడు అమెరికా మాజీ అటార్నీ జనరల్ రామ్‌సే క్లర్క్ ప్రకటన కన్స్యూమరిజం ఈజ్ మోర్ డేంజరస్ దేన్ మిలిటరీ అక్యుపేషన్ గుర్తొస్తుంది. అశిష్ నంది పుస్తకం ప్రియ శత్రువు తలపుకొస్తుంది.

ఇక్కడి రెటీనాపై / అక్కడి చైతన్యం విషాదం / పరాయీకరణకు పరిమితుల్లేవ్ అంటూ ఆధునిక మహాప్రస్థానానికి భరతవాక్యం పలుకుతున్నాడు.

**7**

లాల్‌గఢ్ పాఠశాలల్లో ప్రభుత్వ సాయుధ బలగాలు తిష్టవేయడం వల్ల గిరిజన బాలలు చదువు చట్టుబండలౌతుందని మావోయిస్టు అగ్రనేత పత్రికా ముఖంగా వాపోతుంటే, బడిపంతుళ్ళు అంకితభావంతో పనిచేయాలని వారి దళనేత ఉత్తరాంధ్ర మన్యంలో ఉద్బోధిస్తుంటే - వేయేల ప్రేయేసీ / నీకు పనికొచ్చే చదువు / నా దేశం నాకు నేర్పడం /బానిసత్వమే బతుకన్న నమ్మకంతో / నా పాఠశాల / నీ బానిసల ఉత్పత్తిశాలగా మారడం/ నా ప్రపంచపు మూడో వింత అన్న ఈ కవి సూక్ష్మదృష్టి, దూరదృష్టి తుపాకీగొట్టానికి అందనిది. నిరసించినవాడు/ నిరసించినదాన్ని / నిదానంగా/నింపాదిగా /నిండారా / స్వీకరించడం వింత. మెకాలే విద్యను ప్రాథమిక హక్కుగా మనం డిమాండ్ చేయడం, దాన్ని రాజ్యాంగ హక్కుగా పొందడం వింతల్లో వింత. ఇతనిలో గుగివా థియోంగో దాగున్నాడు. డీకాలనైజింగ్ మైండ్ సూక్ష్మరూపం ఈ కవితలో నిక్షిప్తం చేశాడు.

**8**

ప్రపంచ బ్యాంకు దగ్గర పట్టిన భిక్షాపాత్రతో రాత్రిని పగలు చేసుకున్న నగరంలో ఒకానొక మూలన ఈ కవి తనను పాశ్చాత్య ప్రేయసి ఏమార్చి మోసం చేసిందని ఏడుగురు మిత్రులతో గడిపిన దృశ్యకావ్యం ఈ పుస్తకం. జాయెస్ సైన్స్‌లో పిచ్చివాడిలా లాంతరు చేబూని ఆత్మ ఆనవాళ్లకోసం మన ఇళ్ళలో, గూళ్ళలో, మనం అందంగా పేర్చుకున్న పుస్తకాల దొంతరలలో వెతుకుతున్నాడు. మన హృదయవాటికల్లో దూరి కవాటాలను తెరచి మనల్ని మనం కోల్పోతున్న ఆనవాళ్ళకోసం తన కలంతో గెలుకుతున్న దృశ్యం అక్షరాలుగా జాలువారి ఈ కావ్యం ఉద్భవించింది. ఈ కవికి పాదాభివందనం. ఈ కావ్య కృషీవలుడికి ప్రణామాలు. నువ్వు నేనుగా మారే క్రమంలో / నేను నీవు కాకుండాపోవడం / నిన్ను బ్రతికించడం కోసం నేను చస్తూ బ్రతకడం - దీన్ని కవిత్వంలో బంధించాడు. కన్స్యూమరిస్టు కళాసర్పదష్టుణ్ణి / నింగికి నేలకు చెందని వాడిని అంటున్నాడు.

ఈ కావ్య పఠనం మనం కోల్పోతున్న మానవజాతి లక్షణాలను గుర్తుచేసి మనల్ని విషాదిస్తుంది. గోరటి వెంకన్న పల్లె కన్నీరు పెట్టిందో పాటను గుర్తుకు తెస్తుంది. పడ్డాం కదా / కొట్టుకుపోదాం అనే ప్రవాహ స్పృహ ఇతనికి అసహ్యం.

**9**

కవులు కాలాన్ని పట్టుకోగలరు. తేరేష్‌బాబు కాలానుగుణంగా వెలసిన కవీశ్వరుడు. మన విధ్వంసభరిత జీవితాన్ని, ఆధునికత చేసిన ద్రోహాన్ని కసికసిగా చిత్రికపట్టిన చిత్రదర్శనిని రూపొందించాడు. రవిగాంచనిచో కవిగాంచును అన్న నానుడిని నిజంచేసిన ఈ కవిని మన హృదయంలో పదిలపరుద్దాం. ఈయనకు కీర్తి పతాకాలు పడదాం. ఈయన్ని మన ఆలోచనల ఏనుగు అంబారీపై ఊరేగిద్దాం. ఇతన్ని కౌగలించుకొని ముద్దిద్దాం. ఈ సుకవిని కన్న మాతృమూర్తికి, జన్మనిచ్చిన నేలకూ నమస్కరిద్దాం. సమూహత్వాన్ని అపభ్రంశం చేయడమే అధోగతి. దాన్ని పునరుద్ధరించడమే పురోగతి. అందుకోసం ఈ నేలలో మనం కలిసిపోవడమే అసలు సిసలైన కాలగతి. ఈ కాలజ్ఞానాన్ని స్రవించిన పైడి పోతులూరి తెరేష్ వీరబ్రహ్మబాబు తత్వదర్శనం కోసం ఈ దృశ్యకావ్య జడివానలో మనం తడిసితీరాల్సిందే.

**సెప్టెంబర్ 20, 2009 - ది సండే ఇండియన్**

# 40. మాంసాహార పుష్పం

ఎన్ని జనపదాలను మూటగట్టుకుని ఈ నగరం తన దేహయాత్ర ప్రారంభించింది? ఎన్ని పల్లెల పాడిపంటలను పీల్చి ఒబేసిటీతో బలిసిందీ నగరం? ఎంత విధ్వంసం తర్వాత ఇది ఊపిరిపోసుకుంది?

సిటీలుక్ భేషజాన్ని పొందేందుకు ఎన్ని బ్రతుకులను సమాధి చేసిందిది? ఎందరి రక్తమాంసాలను కరిగించి కలల సామ్రాజ్యాన్ని సృష్టించుకుంది? వీధులు విశాలమయ్యేందుకు ఇచ్చోట ఎన్ని జీవితాలు కత్తిరించబడ్డాయి? మరెన్ని నిరుపేద కుటుంబాలు అంచుకు విసిరేయ బడ్డాయి?

శాసనాలకతీతంగా, చట్టాలకు ఆవల ఎన్ని బెదిరింపులు, ఎన్ని అపహరణలు, మరెన్ని పాపపు పంచాయితీలు, బలవంతపు పరిష్కారాలు, ఎన్నెన్ని బలవన్మరణాలు ఈ నగర సౌందర్యాన్ని తీర్చిదిద్దాయి? ఏ నల్లధనం ఏ బడుగు జీవితాలను ఛిద్రంచేసి ఇక్కడ మహా వ్యాపార కుడ్యాలుగా రూపుదాల్చి మనల్ని అబ్బుర పరుస్తోంది? ఏ కొండ కరిగిస్తే ఇక్కడ రోడ్డుగా పారుతోంది? ఈ సిమెంటు రహదార్లకోసం ప్రపంచ కాబూలీవాలాకు మనం రుణపడిందెంత? ఏ విదేశం దగ్గర మనం పట్టిన ఏ భిక్షాపాత్ర ఈ నగరపు రాత్రిని పగలు చేస్తోంది? ఏ తాకట్టు ఒడిలో ఈ నగరం సేద తీరుతోంది? ఏ సంకెళ్ళలో ఇది సోయగాలు పోతోంది?

ఎన్నెన్ని కలల ఆశలను కూల్చిందీ నగరం? జీవితపరుగుపందెంలో తరుముతూ ఎందరిని తన రహదారులపై రక్తపు మడుగులుగా మార్చిందీ నగరం? జీవన భృతికై వెంపర్లాడే మరెందరి పాదరక్షలను ఆరగించింది? ఎన్ని కళ్లను కాయలు కాయించింది? చదువు చట్టుబండల కింద ఎందరు చిన్నారుల

బాల్యం ఛిద్రమైంది? ఎన్నెన్ని శవాలకు వెంటిలేటర్ల ఊపిరిలూదుతున్నా రిచట? ఖాకీల కాట్లకు, నల్లకోట్ల వేట్లకు నగర దేహంపై ఏర్పడిన గాయాలెన్ని? స్వర్ణపిశాచితో రమిస్తున్న రాజకీయమ్మన్యులు ఎన్ని దుస్వప్నాలను ప్రసవిస్తున్నారిచట?

నగరమా! నీ పక్కన ఓ సముద్రమూ లేదు. రసాయన కాలుష్యం తప్ప జలజల పారే సెలయేరూ లేదు. కొండకోనల ఆనవాళ్లు లేవు. మానవ నాగరికత వికసించిన నీటి తావులూ లేవు. నీ పొందులో పిల్లతెమ్మెరా లేదు. ఓదార్చే స్నేహ హస్తమూ లేదు. కోమల హృదయం ఓపెన్ హార్ట్ సర్జరీ పాలయింది. నగరమా! నిన్ను నిర్మించిందెవరు? భయం గొలుపుతూ ఆక్టోపస్‌లా అడ్డదిడ్డంగా విస్తరిస్తున్నావు. నువ్వు ఆగిందెక్కడ? ఆలోచించిందెక్కడ?

250 కోట్ల సంవత్సరాల బండరాళ్ల ప్రకృతి సంపదను యాభైఏళ్ల ధనదాహం పిండిచేస్తే ఈ కాంక్రీటు జనారణ్యం సిమెంటు పూత పూసుకుంది. లక్షలాది ఏళ్ల నదీనదాలు తపేర్చిన గుండ్రాళ్లను స్టార్ హోటళ్ల వాకిట పారబోసిందీ నగరం. అరణ్యాల్లోని వృక్ష సంపదను హరించి డబుల్‌కాట్లపై నిద్రిస్తోంది ఈ మాయనగరం.

నగరమా! నువ్వెంత సొగసరివి? గడుసరివి? నువ్వెంత క్రూరురాలివి? నిర్దయివి? అందమైన రాక్షసివి. ఏమార్చే ఎండమావివి. డాలర్ వాలుకు పరుగెత్తే ద్రవానివి.

మహామాయావి మైక్రోసాఫ్ట్‌కు ఈ నగరం నుంచి క్రెడిట్ అవుతున్నవి ఎన్ని జీవితాలు? ఎన్ని సంతోషాలు? ఎన్ని పగళ్లు? ఎన్ని నిద్రలేని యవ్వనపు రాత్రులు? ఎన్ని టన్నుల సుఖశాంతులు? ఎన్ని ట్రిలియన్ ట్రిలియన్ల వీర్యకణాలు? సైబరాక్షసుడికి ప్రతినిత్యం ఆహారమౌతున్న పసిమెదళ్ళన్ని? అవుట్‌సోర్స్ అవుతున్న దేహాలెన్ని? కాల్ సెంటర్లలో కునికిపాట్లు పడుతున్న రెప్పలెన్ని? అంకుల్‌శ్యాం విషపు రంగునీళ్లకు అంకితమౌతున్న జవ్వనులెందరు? పురుగు మందులకు పాడౌతున్న ప్లాస్మా ఎన్ని కోట్ల మిలియన్ గ్యాలన్లు? పొగాకు బేహార్లు ఆక్రమించిన వూపిరితిత్తులు ఎన్ని బిలియన్ హెక్టార్లు? మధుపాత్రల్లో ప్రిజర్వ్ చేయబడుతున్న లివర్ స్పెసియన్లు ఎన్ని వేల టన్నులు? ఎన్ని కోట్ల యోజనాల శ్వాసకోశాల్లో

మస్కిటో మందుల పొగ రాత్రంతా లెజిటిమేట్ గెస్ట్‌గా ఉంటోందీ నగరంలో?

ఎన్ని ప్రాచీన అస్తిత్వాలను, మరెన్ని పురాతన జ్ఞాపకాలను, జ్ఞానాలను విసర్జింపజేయించి ఎందరికి వినియోగ దేహదారులుగా బాప్టిజాన్నిచ్చిందీ నగరం? బ్యాలెన్స్ షీట్ తయారుచేసేదెవరు? ఆడిట్ చేసేదెవరు? స్వార్థం తప్ప మరేదీ నడిపించని ఈ నగర అంతిమ లక్ష్యం ఏమిటి? ఈ మహాప్రస్థానానికి అర్థమేమిటి?

ఇక్కడ ఊరపిచ్చుకలు లేవు. గిజిగూళ్ల బాల్యం లేదు. పల్లెనుంచీ, ప్రకృతి నుంచీ కోయిల పాట నుంచీ, గుడ్లగూబ చూపు నుంచీ, గబ్బిలపు వాసన నుంచీ, తెలుగుదనపు తేట నుంచీ మనల్ని లాగేసిన మాయల మరాఠీ ఈ నగరం. మన పూర్వజ్ఞానాన్ని దోచి మనల్ని బంధించిన చెరసాల ఈ నగరం.

నగరమా! నువ్వు పచ్చదనపు ఛాయలకావల, సుస్వరానికి అవతల రణగొణ ధ్వనుల కాకొఫోనీవి. అమెరికా సామ్రాజ్య సాంస్కృతిక పిశాచి మరణానికి వగచే బూచీవి. నంగనాచివి.

ఇక్కడ సూర్యుడు ఉదయించాడు. అస్తమించాడు. అయినా సూర్యనమస్కారం దుర్లభం. సంధ్యావందనం సాధ్యంకాదు. చంద్రుడు వెబ్‌లో చిక్కుకుపోయాడు. ఆకాశం వర్చువల్ ఇమేజ్. మట్టిమిద్దెలు, కొరివిదయ్యాలు, వెన్నెల రాత్రులు, పేదరాసి పెద్దమ్మలు, చంద్రుడిలో రాట్నం వడికే అవ్వలు, అనంతాకాశంలోకి అనిశ్చిత దృక్కులు, భౌగోళ రహస్యాల గురించిన ఊహలు, ఊసులు, వాటి వెంటనంటి ఉండే తాత్విక క్షణాలు - అన్నింటినీ మింగిన మొసలి ఈ నగరం. ప్రాకృతిక జీవనాన్ని, జీవితాన్ని హరించిన కాంక్రీటు దుస్వప్నం. సైబర్ జీవుల వినియోగ యాత్రాస్థలి. అప్రాచ్య వేటగాడి బాణందెబ్బకు అనుక్షణం రక్తం ఓడుస్తున్న భయవిహ్వాల అనిశ్చితత్వం ఈ నగరం. ఇక్కడ సమూహం లేదు. అందరం ఒంటరివాళ్లమే. మన జాతి హోమోసెపియన్‌కాదు. హోయో ఎకనామికస్. మనం జాతి లక్షణాలు కోల్పోయిన జెనిటికల్లీ మోడిఫైడ్ బిటిలం.

**అక్టోబర్ 11, 2009- ఆంధ్రజ్యోతి దినపత్రిక, ఆదివారం సంచిక**

# 41. ‘మునెమ్మ’ నవల విశ్లేషణపై విమర్శ

Jung wants all myths to point towards his
own model of harmony.

- Laurence Coupe, 'Myth'

‘మునెమ్మ’ - ఓ ‘ఫండమెంటల్’ కథ!లోని (ద సండే ఇండియన్, 1 నవంబర్ 2009) విశ్లేషణ కథలో నిక్షిప్తమై ఉన్న Cosmos ని ప్రతిఫలించడం కాక తనదైన Cosmos ను సృష్టించే దిశగా సాగింది. తన మనోవల్మీకంలో విశ్లేషకుడు పసుపులేటి పూర్ణచంద్రరావు పెంచి పోషిస్తున్న పేను వంటి భావాలకు ఏనుగంటి రూపమివ్వడమేగాక దాన్ని మదగజంగా మార్చి విశ్లేషణ పేరిట నవలపైకి ఎగదోశారు. లైంగికత గురించిన తన ‘ఫండమెంటల్’ వ్యధను వాచకంలోకి దురాక్రమింప జేయించారు. లేనిపోని విషయాలు పాత్రలకు ఆపాదించారు. వాటి మెదళ్ళలోనికి ఆలోచనలు చొప్పించారు. వాటి ప్రవర్తనను తన భావనలకు అనుకూలంగా మలుచుకున్నారు (యూంగ్ లాగా). మౌఖిక సంప్రదాయంతో జానపదులూ, నవలీకరించే సమయంలో రచయిత చేర్చిన ‘చెత్త’ను శుభ్రపర్చి కడిగిన ముత్యంలాంటి తనదైన ‘మునెమ్మ’ను తయారుచేశారు. జిగ్మంట్ బౌమన్ చెప్పిన గార్డెనింగ్ వైఖరి ప్రదర్శించారు. తను ప్రకల్పించిన దత్తాంశాల ఆధారంగా వాచకం గురించి సూత్రీకరణలు చేశారు. నిజానికి ఆ దత్తాంశాలను ఆ సూత్రీకరణల కోసమే ఆయన కల్పించారని వేరే చెప్పనక్కర్లేదు.

భర్త రాకుండా గొడ్డు మాత్రమే తిరిగి వచ్చిన విషాద సందర్భాన్ని నవలలో ‘సినబ్బ’ పాత్ర చెప్తుంది. ‘ఆ రాత్రి మునెమ్మ ఇంట్లో పొయ్యి వెలగలేదు. మా ఇంట్లోంచే అన్నం కూర వచ్చింది. సాయమ్మత్త, మునెమ్మ తిన్న సాగించేసి చేతులు కడుక్కున్నారు. ఇరుగు పొరుగు వాళ్లు చాలామంది పలకరించడానికి వచ్చారు.

వచ్చిన వారందరికీ ఎవరికి తగినట్టు వారికి సాయమ్మత్తే సమాధానాలు చెప్పింది. మునెమ్మ మోకాళ్ళమీద తలవంచుకొని ఇంటి గడపమీద కూర్చుంది. ఆ కూర్చున్న భంగిమను, ఆ మౌనాన్ని చూసి ఆమెతో మాట్లాడటానికి ఎవరూ ప్రయత్నించలేదు. ఆమె ఒక్కసారి గూడా తలపైకెత్తలేదు!' (పేజీ-28). అంతకు ముందు బొల్లిగిత్త ఒకటే వచ్చిన వెంటనే మునెమ్మ ఎలా అవాక్కైంది, ప్రశ్నల భారంతో కూర్చుండి పోయిందీ వివరంగా నవలలో చెప్పబడింది (పేజీ 24-25). ఇంకా ముందు పీడకల మునెమ్మను ఎలా భయపెట్టి విషాదించింది రచయిత చెప్పారు. (పేజీలు 29-31). 'కన్నీటి గ్రంథులన్నీ ఇంకిపోయి, ఎండిపోయేదాక మునెమ్మ ఏడుస్తూనే ఉంది? తూర్పున గుడ్డి చుక్క పుట్టినప్పుడు ప్రారంభమైన ఏడుపు తొలికోడి కూశాకగానీ ఆగలేదు.'

కానీ మన విశ్లేషకుడికి జాలికలుగలేదు. నిర్దాక్షిణ్యంగా ఇలా, "కథ అడ్డం తిరిగి చంపదల్చుకున్నవాడు చచ్చి చావవలసిన గొడ్డు తిరిగిరాగానే, ముందు మునెమ్మ మనసులో కలిగింది ఆశ్చర్యంతోపాటుగా ఆనందం కూడా...!" అంతటితో ఆగక - "ఆ వెంటనే భర్త చనిపోయాడన్న 'కల్లో సూచన' లభించగానే, మునెమ్మ అందరి స్త్రీలలాగా ఏడుస్తూ జుట్టుపీక్కోలేదు. ఆమె పాత్రకు అతకని 'వీరనారి', 'పతివ్రత' గట్రా 'మాస్క్'ల్ని ధరించి ఇల్లు యలబారడానికి ముందే ఆవిడ 'ascertain' చేసుకుంది - కనీసం తనకి ఎద్దుదక్కినా చాలని - ఆవిడ మానసికానందానికి, ఆవిడ జీవనాధారానికీ రెంటికీ!"

ఇది Textual రీడింగ్ కాదు - ఇది పక్కా Sexual రీడింగ్. ఇలా రాయడం అధర్మం, అన్యాయం. సాహిత్య విశ్లేషణలో ప్రమాదకర ధోరణి. Textలో sub text అనో, text అనో within text అనో intertextuality ఆధునికానంతర మాయా పదజాలంతో సమర్థించుకోవాలన్నా వీలుపడని recklessness. అపచారం. పైకి మేధోపరంగా ఉన్నతమైన తలం నుంచి ప్రవహిస్తున్నట్టు భ్రమింపజేసే ఈ ప్రవచన కర్తకు పాఠకుల జ్ఞానంపైనా, జ్ఞాపకశక్తిపైనా అవిశ్వాసం మెండుగా లేకపోతే ఆయన ఇలాంటి దుస్సాహసానికి ఒడిగట్టేవారుకారు.

ఈ విశ్లేషకుడి మార్గంలో ప్రయాణిస్తే 'మునెమ్మ' నవలను ఎందుకు రాశానా అని రచయితనే సందేహంలో పడవచ్చు. నవలను అడ్డం పెట్టుకొని ఆ మార్గాన వెళ్ళి శివ పురాణాన్ని (జయరాముడు - శివుడు, మునెమ్మ-పార్వతి,

ఎద్దు-నందీశ్వరుడు) కూడా చెప్పవచ్చు. మునెమ్మ మొగుడికి స్త్రీత్వాన్ని, ఆమెకు పురుషత్వాన్ని, దాన్ని బట్టి ఎద్దుపై ప్రేమ/ద్వేషం భావనలను వ్యక్తీకరించవచ్చు. వాటిని విశ్లేషకుడు చెప్పిన ఈగో, ఆల్టర్ ఈగో పేరిటనే సలక్షణంగా వివరించవచ్చు. లేదా షాడో, ఎనిమా/ఎనిమస్ అనే యూంగియన్ ఆర్కిటైప్స్‌తో విశ్లేషించవచ్చు.

ఇలాంటి విశ్లేషణా క్రమంలో తన మనసులోని సూత్రీకరణల ఆధారంగా విశ్లేషకుడు నవలలోని పాత్రలకు subjectivityని ప్రసాదించారు. వాటికి రచయిత ఇచ్చిన subjectivity ని రద్దుచేశారు. Subjectivity అనేది identity కంటే బాగా విస్తృతమైనది. ఒక దాని బదులు ఒకటి వాడుకలో ఉన్నప్పటికీ subjectivity మనుషుల సామాజిక నిర్మితులనేగాక, వారి అస్తిత్వ స్పృహను కూడా ఇముడ్చుకొన్న విషయంగా చెప్తారు. విశ్లేషకుడు ఇలాంటి సంక్లిష్టమైనదాన్ని పాత్రలకు ప్రసాదించి మరో విధమైన నవల రాశారు. లైంగికత నమూనాను ఒకదాన్ని నిర్దిష్ట పాత్రలపై superimpose చేశారు. ఇది నేర పరిశోధనలో ఫోరెన్సిక్ సైంటిస్టుల పనిలాంటిది. గుర్తు తెలియని మనిషి పుర్రె ఫోటోపై మాయమైన మనిషి ఫోటో చేసి superimpose సరిపోల్చడం అనే ఫోరెన్సిక్ సైన్స్ టెక్నిక్ చేసే పనిని విశ్లేషకుడు చేశాడు. కానీ పొంతన కుదరలేదు. మునెమ్మ భావాల X-ray లేదా ఫోటో తన యూంగియన్ categories తో తయారు చేసినా అతుకుబాటు లేకపోయింది. తప్పుడు సాక్ష్యానికి పాల్పడ్డా ఫలితం శూన్యం.

కార్ల్ గుస్తావ్ యూంగ్ విశ్లేషించినది పాశ్చాత్య శ్వేతజాతీయుల స్వప్నాలు. అదీ, వారు మిగిలిన ప్రపంచాన్ని చాలావరకు హింసాపూరితంగా లోబర్చుకుని రెండు యుద్ధాల భీభత్సానికి కారకులూ, బాధితులూ అయిన కాలం నాటి స్వప్నాలు/దుస్వప్నాలు యూంగ్ విశ్లేషణా వస్తువులు. ఆయన సూత్రీకరణలను స్థల కాలాలతో సంబంధం లేకుండా ప్రాకృతిక/సామూహిక/అనాధునిక సమాజానికి చెందిన మునెమ్మ మీద/సీతాదేవి మీదా ప్రయోగించడంలోని ఔచిత్యం గురించి విశ్లేషకుడికి ఏ కోశానా సంకోచం కలగకపోవడం వింతకాదు. కలోనియల్ బెంట్ ఆఫ్ మైండ్ అలాంటిది.

ఇటీవల కాలంలో పురాణ పాత్రలకు (ముఖ్యంగా స్త్రీ పాత్రలకు) కొందరు రచయిత్రులు ఆధునిక వ్యక్తివాద ఉగ్గుపాలు పోసి పెద్దచేసి, హక్కుల లేమిని

బహూకరించి, victimhoodను ఆపాదించి అచ్చొత్తించి ఊరేగిస్తున్నారు. సంప్రదాయ సాంస్కృతిక వైవిధ్య వాస్తవికతను ధ్వంసించే ఈ పనిని సాహిత్య సేవగా కీర్తించుకుంటున్నారు. ఈ నైచ్యానికి తెల్లతోలు దేశాల నుంచి నేరుగానో, సాహిత్య అకాడమీ/యూజీసీ నుంచో సదరు రచయిత్రులకు కిరాయి డబ్బులు అందుతూనే ఉన్నాయి. కిరాయి రచన కాకున్నా విశ్లేషకుడిదీ అదే బాట. (ఆయన విదేశీ నిధుల ఎన్‌జీవోలతో సంబంధం సంగతి వేరే).

యూంగ్ దగ్గరికి మళ్ళీ వస్తే - తన ఆర్కిటైప్‌ను ఆయన ఒక fixed, eternal ప్రపంచంతో గుర్తించాడే కానీ చురుకైన, చారిత్రక ప్రపంచంతో కాదు (Laurence Coupe-'Myth'). ఆయన అంతిమ లక్ష్యం stasis of symbolism తప్ప 'dynamism of narrative' కాదు. [G.S.Kirk - Myth: Its meaning and function in Ancient and other cultures]. సంస్కృతి సంస్కృతికీ విభిన్నంగా ఉంటూ, వ్యక్తి వ్యక్తికీ భిన్నంగా ఉంటూ పదే పదే పునరావృతమయ్యే కొన్ని రకాల అనుభవాలకు సంబంధించిన images ను రూపొందించే, సంస్కరించే ఒక tendency గా 'ఆర్కిటైప్'ను ఫెమినిస్టులు పునర్నిర్వచించుకున్నారు. (Estella Lauter, Carol Schreier Rupprecht-Feminist Archetypal Theory: Interdisciplinary Revisions of Jungian Thought). కానీ, ఇవేమీ విశ్లేషకుడికి పట్టవు.

యూంగ్ ప్రధానంగా allegorist అని విమర్శించిన వాళ్ళున్నారు. "Indeed we have only to remind ourselves of the distinciton between the eternal archetype and the dialectic of type and anti-type to realise that Jung is above all allegorist" (Laurence Coupe - Myth).

అదలావుంచితే - విశ్లేషకుడు యూంగ్‌నీ/మునెమ్మనీ ఒకేసారి లైంగికత్వ భావనలమయం చేశాడు. ప్రతిదాన్నీ లైంగికతకు ముడిపెట్టి విశ్లేషించే ఫ్రాయిడ్‌తో యూంగ్ విభేదించి ఆయనకు దూరంగా జరిగాడు. వ్యక్తుల లైంగిక జీవితం కన్నా ఆత్మిక జీవితంపై ఆయనకు అమితాసక్తి. కానీ, విశ్లేషకుడి దృష్టి మాత్రం లైంగికతనే అంటకాగుతుంది. ఆర్కిటైప్స్ లేదా నిర్దిష్టంగా ఎనిమా/ఎనిమస్ (లాటిన్‌లో ఎనిమ అంటే Soul, లను లైంగికత భావనలను ప్రధానంగా చేసి యూంగ్ చూడలేదు. కానీ, మన విశ్లేషకుడు తనకు అర్థమైన రీతిలో యూంగ్‌ను, ఆయన విభేదించిన ఫ్రాయిడియన్ లైంగికతాపరమైన దృష్టికోణాన్ని కలిపి కాక్‌టైల్ తయారు చేశాడు. బ్రాండ్‌నేమ్ మాత్రం యూంగియనిజమ్.

యూంగ్ 'ఆర్కిటైప్స్' చేసేపని గురించి విశ్లేషకుడి అవగాహనారాహిత్యం సుస్పష్టం. ఆయన ప్రకారం పురుషుల్లో ఉండే ఎనిమా పని నచ్చిన ప్రతి స్త్రీ మీదా 'ఇష్టాన్ని' కలిగేలా చేయడం. ఎనిమస్ పని నచ్చిన ప్రతి పురుషుడి మీదా స్త్రీకి ఇష్టాన్ని కలగచేయడం. "అది వాటి మౌలిక ధర్మం. అతి ప్రాచీన ధర్మం" (ఇక్కడ ధర్మం అంటే property అనే అర్థం అనుకుంటున్నాను). తర్వాత తదనుగుణ సూత్రీకరణలున్నాయి. సమీక్షకు పునాదిగా వీటిని చెప్పవచ్చు. కానీ, యూంగ్ చెప్పిన ఆర్చ్‌టైప్స్ - ఎనిమ, ఎనిమస్, షాడోకు (undeveloped animal instincts of human personality- చీకటి లేదా నెగెటివ్ పార్శ్వం) విశ్లేషకుడు చెప్పిన పని ప్రధానమైనదీ లేదా మౌలికమైనది కానే కాదు. వ్యక్తీకరణే ప్రధానమైనపని. 'ఇష్టాన్ని' కలుగజేయడం గాక 'వ్యక్తీకరించడం' అని ఉంటే కొంతలో కొంత బాగుండేదా! కానేకాదు. పైన చెప్పుకున్నట్టుగా ఆర్కిటైప్స్‌ను ప్రధానంగా లైంగికతపరంగా వివరించడమే తగనిపని. యూంగ్ ఒప్పుకోనిది. (Andrew Edgar Key Concepts in Cultural Theory). ఆర్కిటైప్స్ విశ్వవ్యాప్తంగా ప్రతీకలను, ఇమేజరీని నిర్మితం చేసే క్రమాలు' అని పేర్కొన్నాడు. అలా అవి 'collective unconscious' అయ్యాయనీ ఆర్కిటైప్స్ సారం కంటే imaginary రూపాన్నే ఎక్కువగా నిర్ణయిస్తాయని అంటాడు Edgar కానీ మన విశ్లేషకుడి ఆర్కిటైప్స్ కోర్కెలను రేకెత్తిస్తాయి. వాటి సారాన్ని నిర్ణయిస్తాయి. అది వాటి మౌలిక ధర్మం!

ప్రతిదాన్నీ అమూర్తీకరించడం, హేతుబద్ధం చేయాలనుకోవడం ఆధునికత రేకెత్తించే దురాశ. ఇది order గురించి obsession వల్ల వస్తుందంటారు. (దీని వెనుక ఇంకా చాలా పెద్ద కథ ఉంది. వివరణకు ఇది సందర్భం కాదు). దీనివల్ల Myth కు వచ్చే అనర్థం ఏంటంటే విశ్లేషణ చేయబడుతున్న Myth తన చురుకుదనాన్ని, dynamism కోల్పోవడం. అంతేగాక, Myth అఖండ సత్యాలతో వేటాడబడి non-realistతనం కోల్పోయి, వాస్తవికత్వాన్ని సంతరించు కుంటుంది. మనోవైజ్ఞానిక రంగంలో 'సంప్రదాయ వాస్తవికతావాది'గా భావించబడిన యూంగ్‌ను ఆవాహన చేసిన మన విశ్లేషకుడు డాక్టర్ కేశవరెడ్డిగారి అద్భుత నవల 'మునెమ్మ'కు అదే గతి పట్టించాడు.

మరో విషయం. ఈగో కాన్షస్‌నెస్ కోసం అన్‌కాన్షస్‌ను తిరస్కరించే ఆధునిక ధోరణికి భిన్నంగా యూంగ్ ఆలోచించాడు. అన్‌కాన్షస్‌ను తిరస్కరించడంగానీ,

దానికి లొంగిపోవడం గానీ చేయరాదని భావించాడు. రెంటికీ మధ్య ఆయన పాటించిన సమదూరం విశ్లేషకుడిలో లోపించింది. అది విశ్లేషణను పూర్తిగా అయూంగ్‌గా దిగజార్చింది. అన్‌కాన్షస్ అన్నిటినీ నిర్ణయిస్తుందన్నట్టుగా విశ్లేషణ సాగింది.

ఇలాంటి విశ్లేషణా క్రమానికి పరాకాష్ట ఏంటంటే డా॥ కేశవరెడ్డిగారి వాచకం కూడా విశ్లేషకుడికి అభ్యంతరకరమైనది కావడం. ఒక అసలు కథను, మాతృకను (prototype) తర్వాత తర్వాత కథ చెప్పిన వాళ్లు 'కలగాపులగం చేయడం' విశ్లేషకుడికి చిరాకు కలిగించింది. ఆ మాతృకలో తాననుకున్న విధంగా మునెమ్మ లైంగికత ఉందని ఆయన భావించారు. "రెండు పరస్పర విరుద్ధమైన తత్వాలు, రసాలు ఈ మౌఖిక కథ కొనసాగించిన అరవై ఏళ్ళ లేదా అంతకు మించిన ప్రయాణంలో మునెమ్మ పాత్రలో కలగాపులగం అయ్యాయి! అనేక 'నోళ్ళు' మారడంలో, మైళ్ళు ఏళ్ళుగా ప్రయాణం చేయడంలో కథకులు తీసుకునే సహజమైన అనేక లిబర్టీలతో మునెమ్మ పాత్ర క్లిష్టతరమైంది. ఈ మార్పు చేర్పులన్నిటి నిజం రెడ్డిగారికే తెలుసు!". ఇలా రాయడమంటే Myth సహజాత లక్షణాలు, మౌలిక ధర్మాలూ దాన్ని పాడుచేసేవయ్యాయని అర్థం. ఒక prototype కోసం, అసలు కోసం, స్వచ్ఛమైన nascent/pristine దాన్ని పొందడం కోసం వెంపర్లాట దాన్ని అనుసరించే ఉంటుంది. నిజానికి ఇలాంటి ఆలోచన ఫ్రాయిడియన్ తప్ప యూంగియన్ కాదు.

"Every telling of Myth is part of that myth; there is no un-version, no authentic prototype, no true account" (Marina Warner - Managing Monsters: Six Myths of our time).

అంటే మన విశ్లేషకుడు పూర్తి తప్పు దోవపట్టాడని వేరే చెప్పాలా. ఆ తప్పుదోవలో ఒక prototype ను తానే సృష్టించాడు. విశ్లేషకుడు మునెమ్మకు పాతివ్రత్యరహిత, వీరత్వ రహిత తత్వాన్ని అంటగట్టాడు. ఇలా సృష్టి చేసి లైంగికతను తననుకున్న విధంగా ఆపాదించి ఆ మునెమ్మను డా॥ కేశవరెడ్డిగారి నవలలోని మునెమ్మతో పోటీ పెట్టాడు. కాలానుగుణంగా వచ్చిన మార్పుల గురించి చిరాకు పడ్డాడు. నవలా మునెమ్మ 'పాతివ్రత్యాన్ని', 'వీరనారి'త్వాన్ని పరిహరిస్తూనే తిరిగి ఆమె ఇల్లు ఎలబారేటప్పుడు అదే మాస్కులు తొడిగాడు. తర్వాత చించాడు. ఇలాంటివెన్నో చేసి తన వాదన నెగ్గిందనుకున్నాడు.

ఇంత ఘోరమైన విశ్లేషకుడి గురించి ఇంతకంటే ఎక్కువ చెప్పడం అనవసరం. కానీ ఒక్క మాట విశ్లేషణలో Myth ని అక్షరం ధ్వంసించడం ద్వారా ఆధునిక హేతువు కర్తవ్య పరిపూర్తికి ఆయన ప్రయత్నించాడు.

'ఫండమెంటల్'గా ఆలోచిస్తే, ఒక అనాధునిక ఆధునిక పూర్వకాలానికి చెందిన కథ, ఉద్వేగభరిత వ్యధ, వీరోచిత వ్యధార్థ గాధను ఆధునిక తూనికరాళ్ళతో తూకం వేయడం సాధ్యమా? ఆధునిక హేతు పరిశీలనకు అందనివి చాలా ఉన్నాయని 'హాబిటేషన్స్ ఆఫ్ మోడర్నిటీ'లో దిపేష్ చక్రవర్తి చెప్పింది మన అనుభవంలోకి ఇంకా రాలేదా?

**నవంబర్ 15, 2009 - ది సండే ఇండియన్**

# 42. మానవహక్కులు సామ్రాజ్య సాధనాలు: జిజెక్

హక్కుల ప్రవచనం మహాకథనంగా స్థిరపడింది. కొత్త పురాణగాథగా మనకి వీనులవిందు చేస్తోంది. హక్కుల వ్యామోహం వస్తువ్యామోహ స్థాయికి చేరి తన అంత్యదశను సమీపిస్తోంది. మానవహక్కుల ప్రవచనాన్ని కొందరు అప్రతిహత పురోగామ్యశక్తిగా సంభావిస్తున్నారు. విమర్శలకు అతీతమైన మానవహక్కుల మూలవిరాట్‌ను మనుషుల మెదళ్ళలో ప్రతిష్టిస్తున్నారు. ఏకైక విముక్తిదాయక శక్తిగా ఆరాధిస్తున్నారు. మానవ హక్కులు రాజ్యధిక్కార ప్రవచనంగా కాక రాజ్య సాధికారతా ప్రవచనంగా మారిన కాలమిది. ఏమైనప్పటికీ వలసవాద ఆధిపత్య సంబంధాల స్థిరీకరణకూ, ఆర్థిక మానవుల సృష్టికే వారి వినియోగదేహాత్మల సంచారానికి మానవ హక్కుల రంగభూమి తప్పనిసరి సహచరి అని పలు విశ్లేషణలు, విమర్శలు స్పష్టం చేస్తున్నాయి. హక్కుల ప్రవచనం విరోధాభాసల, సందిగ్ధాలమయం అంటాడు కోస్టాస్ డౌజినాస్ అనే బ్రిటీషు న్యాయ తత్వవేత్త. అధికార సాంకేతికతలకు (Micro Technologies of Power) సాధికారితను చేకూర్చే పనిముట్టుగా మానవ హక్కుల ప్రవచనాన్ని ఫ్రెంచి తత్వవేత్త మిషేల్ ఫుకొ చూశాడు.

మానవహక్కుల తాత్వికత పట్ల జిజెక్‌ది కూడా విమర్శనాత్మక దృక్కోణమే. అసంప్రదాయ మార్క్సిస్టు దృక్పథం నుంచి విశ్లేషించి మానవహక్కుల ప్రవచనంలోని అభాసలను ఎత్తిచూపి మనల్ని అప్రమత్తం చేస్తాడు జిజెక్.

జిజెక్ ప్రకారం మానవహక్కులు సాధారణంగా మూడు భావనల మీద ఆధారపడతాయి. ఒకటి: ఫండమెంటలిజాన్ని వ్యతిరేకించడం. రెండు ఎంచుకునే స్వేచ్ఛ- Freedom of Choice, సుఖాన్వేషణకు (Pursuit of pleasure) జీవితాన్ని

అంకితం చేసే హక్కు. మూడు అధికారానికి పరిమితులు విధించడం. ఈ మూడు మూలాధార భావనల బోలుతనాన్ని జిజెక్ మానవహక్కులపై 2005లో న్యూలెఫ్ట్ రివ్యూలో ప్రచురించిన Against Human Rights వ్యాసంలో వివరించాడు. ఫండమెంటలిజం అని చెప్పబడుతున్నది లిబరిలిజం సృష్టి. ఫండమెంటలిజం, మానవహక్కులు రెండూ నేటి ఆర్థిక వ్యవస్థ ఉత్పత్తులే. నేటి 'మతోన్మాద', 'సాంస్కృతికోన్మాద' రాజకీయాలకు అదే కారణం. నేడు నిజరాజకీయాల స్థానంలో గుర్తింపు ఉద్యమాల ఉత్తరరాజకీయం - Post-politics వర్థిల్లుతుంది. నిజరాజకీయాలను పాలనాపారంగతులకు అప్పజెప్పగా మిగిలిన మత, సాంస్కృతిక పరమైన వైరుధ్యాలు, జాతి వైషమ్యాలు లిబరలిజం ప్రేమించే ఉత్తర రాజకీయాలకు ఆమోదయోగ్యమైన పోరాటాలకు వనరులుగా మార్చబడ్డాయి. వర్తమాన లౌకిక సంస్కృతిది స్వానురాగ సుఖవాదం, (Narcistic Hedonism) దానిపై తిరుగుబాటు మతోన్మాదంగా భావించబడుతుంది. అది ఆత్మత్యాగాన్ని కోరుకుంటుంది. ఇవి రెండూ మనల్ని ఒక విషవలయంలో బంధిస్తాయని జిజెక్ భావిస్తాడు. జాతి మత ఘర్షణలు (మన కుల ప్రాంతీయతా పోరాటాలు) గ్లోబల్ పెట్టుబడికి తగిన పోరాట రూపాలు. అందువల్ల ఫండమెంటలిజం పై మానవహక్కుల పోరాటాన్ని అదే దృక్పథంతో అర్థంచేసుకోవాలని ఆయన భావన.

మానవహక్కులకు రెండవ ప్రాతిపదిక అయిన ఎంచుకునే స్వేచ్ఛ నిజానికి లేదని అది కేవల అభాస అని ప్రకటిస్తాడు జిజెక్. ముస్లిం మహిళలు బురఖా ధరించడం ఇష్టపూర్తిగా చేసిన సందర్భాల్లో కూడా హక్కుల సంస్థలు దాన్ని స్వేచ్ఛా రాహిత్యంగానే భావించడాన్ని జిజెక్ ఎత్తిచూపాడు. బురఖాను వదిలేయడం మాత్రమే హక్కుల ప్రవచనంలో ఎంపిక చేసుకునే స్వేచ్ఛను అనుభవించడం. బురఖాను ధరించాలనే ఎంపిక స్వేచ్ఛ ప్రవచనానికి విరుద్ధంగా భావించబడుతుంది.

సంక్షేమ రాజ్యాన్ని విధ్వంసించడంవల్ల ఏర్పడిన అభద్రతలనే కొత్త స్వేచ్ఛలుగా లిబరలిజం భ్రమింపజేస్తుంది. ఆకొత్త స్వేచ్ఛలను మనకు సరుకులుగా అమ్మజూపుతుంది అని జిజెక్ అవహేళన చేస్తాడు. కార్మిక చట్టాల సరళీకరణవల్ల ఉద్యోగభద్రత లేకపోవడాన్ని ప్రస్తావిస్తూ ఉద్యోగం ఊడటం

శాశ్వత ఉద్యోగం నుంచి కార్మికుడి విముక్తిగా భ్రమింపజేస్తారని చెప్తాడు. ఉద్యోగం కోల్పోయిన కార్మికుడు కొత్త అవకాశాలను వెతుక్కునే క్రమంలో తనలో కొంగ్రొత్త సామర్థ్యాలను, నైపుణ్యాలను కనుగొనే స్వేచ్ఛ పొందుతాడనీ, అది వ్యక్తి వికాసానికి దోహదం చేస్తుందనీ లిబరల్ హక్కులు వూరిస్తాయి. నిజానికి ఆ నిరుద్యోగి మార్కెట్ మృగాల బారిన పడటం అనేది శుద్ధ వాస్తవం. ఇలా స్వేచ్ఛ పేరిట మనుషులను మార్కెట్ బంధనాలలో ఇరికించే ప్రక్రియ మానవహక్కుల పేరిట నడుస్తుంది.

మానవహక్కులకు మూడవ ప్రాతిపదిక అధికారంపై ఆంక్షలు విధించడం. మార్క్సును ఉటంకిస్తూ - అధికారం అంటేనే దాన్ని అవసరమైన దాని కన్నా ఎక్కువ వాడటం అంటాడు జిజెక్. అధికారంపై ఆంక్షల పేరిట మానవహక్కుల ప్రవచనం సామాజిక రాజకీయ మార్పుకై జరిగే సామూహిక పోరాటాలపై ఆంక్షలు పెడుతుందంటాడు.

మనిషిని కేవల భౌతిక జీవితానికి పరిమితం చేసేది హక్కుల ప్రవచనం. 'సాధారణ మానవుడి'గా కుదించబడిన క్షణంలోనే మనిషికి హక్కుల లేమి సంప్రాప్తిస్తుంది. అలా మనిషి విశ్వమానవ హక్కుల వాహకుడిగా మార్చబడ్డాడు. అవసరంలేని దుస్తులను దానానికి వాడినట్టుగా పాశ్చాత్య సమాజాలకు అనవసరమైన హక్కులను విదేశాలకు ఎగుమతి చేస్తారు. మందులు, దుస్తులతో పాటుగా హక్కులు పంచబడతాయి. అప్పటికే ఆ ప్రజలు వాటిని అనుభవించకపోతే వాళ్ళ తరపున పలురూపాల్లో పాశ్చాత్యులే రంగంలోకి దిగుతారు. మానవతావాద జోక్యం పేరిట కొసావాలో బాంబులు వేసిన నాటో కూటమిని జిజెక్ గుర్తుచేస్తాడు. మన ఎన్‌జివోలను ఇక్కడ గుర్తుచేసుకోవచ్చు.

మూడవ ప్రపంచదేశాల బాధితప్రజల మానవ హక్కుల గురించి చెప్పాలంటే లెనినిస్టు పద్ధతి అవసరం అంటాడు జిజెక్. మానవహక్కులను కాపాడే పేరిట రాజకీయంగా, ఆర్థికంగా, సాంస్కృతికంగా, సైనికంగా మూడవ ప్రపంచదేశాల్లో తమ ఇష్టం వచ్చినట్టుగా జోక్యం చేసుకొనేందుకు పాశ్చాత్య దేశాలకు ఉన్న హక్కులుగా మాత్రమే వాటిని ప్రధానంగా చెప్పవచ్చు నంటాడు. విశ్వజనీనత సాధించిన తప్పుడు భావజాలంగా మానవహక్కులను జిజెక్

నిరసించాడు. పాశ్చాత్య సామ్రాజ్యవాద నిర్దిష్ట రాజకీయాలనూ, సైనిక జోక్యాన్ని, నయావలసవాదాన్ని కప్పిపుచ్చుతూ వాటికి జనామోదాన్ని మానవహక్కుల ప్రవచనం కల్పిస్తుంది. మార్క్సిస్టు జ్ఞానం మానవహక్కుల నిజరూపాన్ని దాని బూర్జువా భావజాలాన్ని బయటపెడుతుంది. తెల్లజాతి, పురుష ఆస్థిపరులు మార్కెట్‌లో స్వేచ్ఛగా మారకం చేసుకునేందుకు మానవహక్కులున్నాయి. కార్మికులను, స్త్రీలను దోచుకునేందుకు, రాజకీయ ఆధిపత్యాన్ని నెరపేందుకు మానవహక్కులు వీలుకల్పిస్తాయి.

మార్క్సిస్టులు సైతం మానవహక్కులవెంట పరిగెడుతూ మార్క్సిజాన్ని మరచిపోతున్న ఈ రోజుల్లో జిజెక్ మానహక్కుల ప్రవచనంపై వెలువరించిన అభిప్రాయాలు చర్చనీయాంశం కావాలని ఆశిద్దాం.

## గుర్తింపు ఉద్యమాలు-జిజెక్ భావనలు

గుర్తింపు ఉద్యమాలు నిర్దిష్ట కాలానికి చెందిన చారిత్రక పరిణామాలు. నిర్దిష్ట చారిత్రక క్షణానికి అనుసంధానించబడి ఉంటాయి. వాటిని వివరించడానికి ఒక మహాకథనం అవసరం. అందుకు జిజెక్ సహజంగా మార్క్సిజాన్ని ఆశ్రయిస్తాడు. ఆయన దృక్పథంలో గుర్తింపు రాజకీయాలు స్పష్టంగా ఉత్తరాధునిక రాజకీయాలు.

'కొత్తరంగాలకు (కులం, జెండర్, ప్రాంతం వగైరా) రాజకీయ భూమికను గుర్తింపు రాజకీయాలు విస్తరింపజేశాయి. ఆ క్రమంలో అవి "రాజకీయం" అనే నిర్దిష్ట భావననే బలహీనపర్చాయి కూడా' అంటాడు జిజెక్. బహుళ విషయిగతత్వాలతో (Multiple subjectivities) ఉత్తరాధునిక రాజకీయాలు స్పష్టంగా సరైనంత రాజకీయం కాదు. ఎందుకంటే అవి సమకాలీన ఆర్థిక సంబంధాల చట్రాన్ని సహజమైనదిగా భావిస్తాయి. విమర్శలేకుండా ఆమోదిస్తాయి. ఒక్కమాటలో గుర్తింపు ఉద్యమాలు పెట్టుబడిదారీ చట్రం పరిధిలో పనిచేస్తాయి. ఆ చట్రాన్ని సవాలు చేయాలని అనుకోవు. పెట్టుబడిదారీ మానవ సంబంధాలను మార్మీకరిస్తాయి. గుర్తింపు రాజకీయాలు తమను తాము ఖర్చుపెట్టుకొని విజయం సాధిస్తాయి. తమను సుసాధ్యం చేసిన పరిస్థితులను పట్టించుకోవు.

**జనవరి 6, 2010 - వార్త**

# 43. మనమున్నది ద్రవాధునికతలో..

## జిగ్మంట్ బౌమనీయం

రెండు షూ కంపెనీల తరపున ఇద్దరు సేల్స్‌మెన్ ఆఫ్రికాకు వెళ్లారట. మొదటివాడు అక్కడికి వెళ్లగానే తన కంపెనీకి కబురు పంపాడట - "ఇక్కడంతా చెప్పులు లేకుండానే నడుస్తున్నారు. సరుకు పంపకండి" అని రెండవ సేల్స్‌మాన్ కూడా తన కంపెనీకి వర్తమానం పంపాడట "ఇక్కడంతా చెప్పులు లేకుండానే నడుస్తున్నారు. వెంటనే కోటి జతల చెప్పులు, బూట్లు పంపండి" అని.

డిమాండ్‌కు తగ్గ సరఫరా అనే పాత వ్యాపార సూత్రానికి కాలం చెల్లిందన్న సంగతిని ఈ జోక్ తెలియజేస్తుందని అంటాడు ప్రఖ్యాత సామాజిక శాస్త్రవేత్త జిగ్మంట్ బౌమన్. డిమాండ్‌ను సృష్టించి వస్తువులు అమ్ముకోవడమే ఇప్పటి సరికొత్త వ్యాపార సూత్రం. అంతేకాదు కోరికలు ఎప్పటికీ తీరకుండా చూడడం కూడా సేల్స్ మేనేజ్‌మెంట్‌లో భాగం అంటాడాయన.

వస్తూత్పత్తిదారుల సమాజాన్ని వినియోగదారుల సమాజంగా ప్రపంచీకరణ మార్పు చెందించిందనీ, మొదటిది ప్రధానంగా కార్మికులను దోచుకొని లాభాలు గడిస్తే ఈనాటి సమాజం ప్రధానంగా వినియోగదారులను దోచుకొని లాభపడుతుందనేది బౌమన్ వాదన.

మన కళ్లముందే సమాజ చలన సూత్రాలు మార్పు చెందడాన్ని విశ్లేషించి సామాజిక మార్పు సూక్ష్మాలను ఎన్నిటినో బోధించే రుషివర్యుడు బౌమన్. ఆయన తాజా పుస్తకం 'లివింగ్ అన్ బారోడ్ టైమ్' ఈ ఏడాది వెలువడింది.

పోలెండ్‌లో పుట్టిన 82 ఏళ్ల బౌమన్ ఇప్పటివరకూ సుమారు 40 గ్రంథాలు రచించారు. ఆయన 1930ల నాటి గ్రేట్ డిప్రెషన్ నుంచి రెండేళ్ల క్రితం

అమెరికాలో మొదలై ప్రపంచ పరివ్యాప్తమైన ఆర్థిక సంక్షోభం వరకూ అన్నిటీ స్వయంగా చూసి అధ్యయనం చేస్తూ అక్షరీకరిస్తున్న 'ఎక్లెక్టిక్ సోషియాలజిస్టు' (Eclectic Sociologist). నాజీ ఆక్రమిత పోలెండ్ నుంచి రెండవ ప్రపంచ యుద్ధకాలంలో రష్యాకు వలస వెళ్లింది ఆయన కుటుంబం. అక్కడి స్టాలినిజాన్ని తప్పించుకొని తిరిగి పోలెండ్ వచ్చింది. అక్కడా బౌమన్‌కు బాధలు తప్పలేదు. కమ్యూనిస్టులు వెలివేసిన మార్క్సిస్టుగా ఇబ్బందులు పడి ఇంగ్లాండ్ చేరాడు. లీడ్స్ నగరంలో స్థిరపడి యూనివర్సిటీ ప్రొఫెసర్‌గా రిటైర్ అయ్యాడు. లీడ్స్ ఎయిర్‌పోర్ట్ టాక్సీస్టాండ్‌లో ఆయన పేరు చెప్తే చాలు నేరుగా ఇంటికి తీసుకెళ్తారు.

## మనకు మనం అర్థమవుతాం

లిక్విడ్ మోడర్నిటీ, లిక్విడ్ లవ్, లిక్విడ్ టైమ్స్, లిక్విడ్ ఫియర్, కన్స్యూమింగ్ లైఫ్, వేస్టెడ్ లైవ్స్. ఇలా 2000 నుంచి ఏటా ప్రపంచీకరణ యుగపు పోకడల, మానవ సంబంధాలలో వచ్చిన మార్పుల సజీవ చిత్రపటాన్ని కళ్లముందుంచే గ్రంథాలను వెలువరిస్తూ వచ్చాడు బౌమన్. ఆధునికతలోని ప్రతి రక్తనాళపు నిలువుకోత, అడ్డుకోతలను చూపిస్తున్నాడు. ఆయన పుస్తకాలు చదువుతుంటే మనకు మనం మరింతగా అర్థమవుతాం. మన జీవనశైలి, మన ఆలోచనా ధోరణులలో వచ్చిన, వస్తున్న పెనుమార్పుల స్కానింగ్ రిపోర్టులను గ్రంథరూపంలో దర్శిస్తాం.

బౌమన్‌తో సిట్‌లాలి రోవిరోజా-మాడ్రాజో జరిపిన సంభాషణల సమాహారమే. 'లివింగ్ ఆన్ బారోడ్ టైమ్'. నేటి కాల మహిమను పట్టుకొన్న అద్భుత గ్రంథం.

బ్యాంకింగ్ వ్యవస్థ వైఫల్యం వల్ల అమెరికాలో 'క్రెడిట్ క్రంచ్' వచ్చిందనే సాధారణ నమ్మకం తప్పంటాడు బౌమన్. బ్యాంకులు విజయపథంలో పురోగమించడం వల్లే క్రెడిట్ క్రంచ్ వచ్చిందంటాడు. విజయమే వైఫల్యం-ఏమిటా విజయం అంటే మెజారిటీ ప్రజలను అప్పుల పాలు చేసి రుణగ్రస్తుల జాతిని సృష్టించడం, రుణాలతో జీవించే కళలో వారిని ఆరితేర్చడం. ఇది పెట్టుబడిదారీ వ్యవస్థ పతనానికి మాత్రం దారి తీయదంటాడు. ఈ వ్యవస్థ ఒక

పరాన్నభుక్కు. అది ఒక చేను తర్వాత మరో చేనును మేస్తూ పోతుంది. ప్రపంచంలో మేసేందుకు ఇక చేలు లేకపోవడం ప్రస్తుత ఆర్థిక సంక్షోభానికి కారణం. ఇలాంటి సందర్భాల్లో అది కొత్త చేలను, కొత్త హోస్ట్‌లను సృష్టించి వాటిని భోంచేస్తూ బతుకు కొనసాగిస్తుంది.

వంటగ్యాస్ లాగానే ప్రపంచీకరణ యుగంలో జీవితమూ ప్రైవేటీకరించబడింది. పేదరికాన్ని గురించిన పథకాలకు 'సంక్షేమం' అనే దృష్టి అంతరించింది. పేదలను అదుపులో ఉంచే పోలీసింగ్‌గా మాత్రమే వాటిని చూడాలి. లక్షలాది కాందిశీకులు, వలస కూలీలు, నిరుద్యోగులు, తిరుగుబోతులు - వీరందరినీ మానవ చెత్త (హ్యూమన్ వేస్ట్)గా 'అవసరానికి మించిన జనాభా'గా చూసే దురాలోచనను ఆర్థిక ప్రపంచీకరణ పోషించింది.

## డిస్పోజబుల్ ప్రేమలు

నేటి ఆధునిక కాలాన్ని - అంటే ప్రపంచీకరణ కాలాన్ని ద్రవ ఆధునిక కాలం అంటాడు బౌమన్. పారిశ్రామిక విప్లవానంతరం ఆధునికత సృష్టించిన వ్యవస్థీకృత ఏర్పాట్లను చిద్రం చేస్తూ, గాఢమైన బంధనాల్ని, బంధాలను సడలించే ప్లాస్టిక్ పాన్పుల పులకింతల, సైబర్ సెక్స్ సకిలింతల పాడుకాలం ఇది. సిమెంట్, కాంక్రీట్, భారీ డ్యాములు ఆధునికతకు చిహ్నాలైతే, సైబర్ స్పేస్ ద్రవాధునికత చిహ్నం. ఫొటోగ్రాఫిక్ ఫిల్మ్ ఆధునికత సంకేతం. ఎరేజబుల్ వీడియో టేప్ ద్రవాధునికత సంకేతం. ఫొటోగ్రాఫిక్ ఫిల్మ్‌పై ఒకసారి ప్రింటయితే అలాగే ఉండిపోతుంది. కానీ డిజిటల్ కెమెరాలో రికార్డయిన దృశ్యాన్ని మరుక్షణం తుడిపేసి కొత్తదాన్ని రికార్డు చేయవచ్చు. జీవితం ఇవాళ ఎపిసోడిక్ అయిందంటాడు. టీవీ సీరియల్ లాగా ఏ ఎపిసోడ్‌కు ఆ ఎపిసోడ్ స్వతంత్రమైనదే. గుర్తుపెట్టుకోవడం పాత విషయం. ఇవాళ మరచి పోవడం ఎలానో నేర్చుకొనే కాలం వచ్చింది. కుప్పలకొద్దీ సమాచారంతో మెదడు డస్ట్‌బిన్‌లా మారకుండా చూసుకుంటూ ఉండాలి.

ఈ కాలంలో ప్రేమలు కూడా ద్రవస్థితిలో ఉంటాయి. గాఢమైన ప్రేమలు మాయమయ్యాయి. ప్రేమించడానికీ వదిలెయ్యడానికీ మధ్య పెద్ద దూరం లేదు. గతంలోలా ప్రేమకోసం తపన, అందుకోసం ప్రయత్నించడం, విరహం,

వేచి చూడడం లాంటి యత్నాలు బాగా తగ్గిపోయాయి. కోరికకు, దాన్ని పొందడానికి మధ్య దూరం తగ్గి ప్రేమలో గాఢత అంతరించిందని చెప్తాడు బౌమన్. అటు వ్యాపారంలోనైనా, ఇటు ఉద్యోగంలోనైనా, ప్రేమలోనైనా, బంధాలు పెళుసుబారిపోయాయి. పలు కంపెనీలు ఇవాళ కలిసి వ్యాపారం చేస్తూ రేపు విడిపోయి మరొకరితో జతకడుతున్నాయి. కొత్త అవకాశాలొస్తే ప్రేయసినో, ప్రేమికుడినో విడిచి మరొకరితో జతకలిపేందుకు సదా సిద్ధంగా ఉండే అణుమాత్ర మానవులు తయారయ్యారు. గాఢానుబంధం ఒక పీడ. కొత్త భాగస్వామితో ప్రయాణానికి సదా సిద్ధంగా ఉండటమే కాలానుగుణంగా జీవించడంగా మారింది. డిస్పోజబిలిటీ వస్తువులకే కాదు, ప్రేమలకూ, మానవ అనుబంధాలకు కూడా వర్తిస్తుంది.

ఈ కాలం సమూహాన్ని ధ్వంసించిన కాలం. సమాజం, కుటుంబం అనే వాటిని చంపిన కాలం. కానీ అవి బతికి ఉన్నట్టు భ్రమింపజేస్తాయి. వీటినే 'జోంబీ కేటగరీస్' అంటాడు బౌమన్. సెక్స్ విషయంలో స్వేచ్ఛ పెరిగే కొద్దీ ఒంటరి జీవితం గడిపే వాళ్లూ పెరిగారని గుర్తు చేస్తాడు. ఒంటరితనపు బాధను అనుభవిస్తూ, మానవ సంసర్గం కోసం, సాహచర్యం కోసం తపిస్తూ జీవించడం ఎక్కువయింది. ఆన్‌లైన్ బంధాల వెంపర్లాట సంతృప్తి నివ్వదు. గాఢతలేని 'ప్రేమ' కుప్పలు తెప్పలుగా ఏరులై పారుతుంది.

మనుషుల మధ్య భౌతికంగా సంసర్గం తగ్గిపోయి సైబర్ సంపర్కం పెరుగుతూ వచ్చింది. ఇ-మెయిల్స్ ద్వారా టచ్‌లో ఉండటం ఎక్కువైంది. గతంలోలా సమాచారం వ్యక్తుల దేహాల ద్వారా ప్రసరించడం లేదు. మానవులు ఆవిర్భవించిన నాటి నుంచి ఎలక్ట్రానిక్ యుగం ప్రారంభం వరకూ మనుషులు మాట్లాడిన మాటలన్నిటినీ డిజిటల్ రూపంలోకి మారిస్తే అది 5 ఎక్సాబైట్‌లు. కేవలం 2000 సంవత్సరంలో పంపిన ఇ-మెయిల్ మెసేజ్‌లే 6 ఎక్సాబైట్‌లు. డిజిటల్ రూపంలో ఇప్పటివరకూ నిక్షిప్తమైన సమాచారం 988 ఎక్సాబైట్‌లు, అయినా మనిషికీ మనిషికీ మధ్య అనుబంధం సడలి ఒంటరి తనం పీడిస్తోంది.

జీవితమే ఒక పరుగైంది. 'అలిస్ ఇన్ వండర్‌లాండ్'లో లాగా మనం ఉన్నచోట ఉండాలంటే పరుగెత్తుతూ ఉండాలి. ఇంకాస్త ముందుకు వెళ్లాలంటే

రెండింతలు పరిగెత్తాలి. ఇలాంటి జీవితంలో స్నేహాలు, అనుబంధాలు కనుమరుగు కావడం ఎంత సహజమో చెప్తాడు బౌమన్. అసలు గత 200 ఏళ్లుగా ఆధునిక ప్రపంచం చేస్తున్నది సంప్రదాయాన్ని, మానవ సంబంధాల గాఢతను ధ్వంసించే పనే అంటాడు.

## మార్కెట్ చేతిలోనే అధికారం

బలమైన ట్రేడ్ యూనియనిజం ఎందుకు అంతమైంది? ఆధునిక కాలంలో యజమానీ కార్మికుడూ ఒకే ప్రదేశంలో ఉంటూ సుఖదుఃఖాలను పంచుకున్నారు. యజమానిపై కార్మికులు సంఘటిత పోరాటాలు చేశారు. కానీ ద్రవాధునిక కాలంలో యజమాని సైబర్ ప్రపంచంలో నివసిస్తే కార్మికుడు స్థానిక ప్రదేశంలో ఉండిపోయాడు. కనిపించని యజమానిపై పోరాడే శక్తి వారికి లేదు. పైగా జీవిత పరుగుపందెంలో ఉన్న రుణగ్రస్త జాతి జనులకు ఉద్యోగం కోల్పోయిన క్షణంలో మరో ఉద్యోగానికి పరుగెత్తడమే కానీ నిలబడి పోరాడే తీరికలేదు. సంఘటిత కార్మిక తత్వం అలా అంతరించిందన్న బౌమన్ విశ్లేషణ సమంజసంగా తోస్తుంది. ఈ స్వేచ్ఛాయుగంలో ఎంత స్వేచ్ఛగా ఉంటే అంత అసమర్థత (ఇంపొటెన్సీ) పెరుగుతూ పోతోంది. స్వేచ్ఛ ఒక భ్రమ. స్వేచ్ఛ పేరుతో సంప్రదాయం నుంచీ, గత బంధనాల నుంచీ బయటికి వచ్చిన మనుషులు మార్కెట్ సాలెగూటిలో ఇరుక్కుపోయారు. ఇవాళ మార్కెట్‌దే సార్వభౌమత్వం. రాజ్యానిది కాదు.

రాజకీయాల నుంచి అధికారం మార్కెట్‌కు బదలాయించబడింది. రాజ్యమూ, అధికారమూ విడాకులు తీసుకుంటున్నాయి. రాజ్యాధికారం కోసం చేసే పోరాటం రాజ్యంపై కన్నా మార్కెట్‌పై చేస్తేనే ఫలితం. ఇవ్వాళ రాజ్య విధుల్లో ప్రధానమైనవి - మార్కెట్ సార్వభౌమత్వాన్ని కాపాడటం, మార్కెట్‌కు కావాల్సిన సౌకర్యాల కల్పన, సరుకుల సరఫరాకు అంతరాయం కలగకుండా చూడటం. ఇవాళ పౌరులు, ఓటర్లు రద్దయి వినియోగదారులుగా పునరుత్థానం చెందారంటాడు బౌమన్. వినియోగ సైన్యాల పద ఘట్టనతో దద్ధరిల్లే విపణి వీధులు తయారయ్యాయి. కొన్నా కొనకపోయినా మాల్స్‌లో తిరుగాడుతూ వస్తువులను దర్శిస్తూ స్పృశిస్తూ సంతృప్తిపడే మానసిక స్థితికి జనం చేరుకున్నారు.

సామాజికంగా ఉత్పన్నమైన సమస్యలను వ్యక్తుల మీదకి తోసి పరిష్కారాలను వ్యక్తిగతం చేయడం, వ్యక్తిగత బాధలు, సెలెబ్రిటీల ప్రైవేటు జీవితాలు టీవీ స్క్రీన్‌లను, పత్రికలను ఎక్కువగా ఆక్రమించడం - ఇలాంటి ఎన్నో పరిణామాలను స్పష్టంగా విప్పి చెప్తుంది బౌమన్ తాజా పుస్తకం. ప్రశ్నలు - సమాధానాల రూపంలో ఎనిమిది సంభాషణలు ఉన్నాయి ఇందులో. మార్కెట్ నుంచి మనిషి దాకా, భయాల నుంచి బయో టెక్నాలజీ దాకా మన కాలపు పోకడలను విప్పి చెప్తుంది. కొండకచో హెచ్చరిస్తుంది. ఆయన ఇప్పటికి రాసిన గ్రంథాల సారాన్నంతా నిక్షిప్తం చేసిన గ్రంథమిది.

బౌమన్‌ను చదవడం ఒక వ్యసనం.

బౌమన్‌ను చదవక ముందు జీవితానికీ, చదివాక జీవితానికీ ఎంతో తేడా ఉంటుంది. అందుకే కొత్త సంవత్సరంలో బౌమన్‌ను మన మెదళ్ల లోగిళ్లలోకి ఆహ్వానిద్దాం.

**డిసెంబర్ 26, 2010 - ఆంధ్రజ్యోతి దినపత్రిక, ఆదివారం సంచిక**

# 44. అవినీతిపై

అవినీతి వ్యతిరేకంగా ఉద్యమించడం కంటే అన్నాహజారేను గాంధీజీ సరసన నిలబెట్టాలనే తాపత్రయం అన్నాబృందంలో ఎక్కువగా ఉంది. దేశ స్వాతంత్రోద్యమానికి నాయకత్వం వహించేనాటికే గాంధీజీ దక్షిణాఫ్రికాలో పలు పోరాటాలు నడిపారు. యువకుడిగా ఉన్నప్పుడే జాతిపితకు సత్యాగ్రహం గురించిన అవగాహన ఏర్పడింది. కానీ గాంధీ చిత్రపటం నేపథ్యంలో అవినీతి వ్యతిరేక జనలోక్‌పాల్ చట్టం కోసం దీక్షచేసిన అన్నా హజారే వృద్ధుడైనప్పటికీ గతంలో ఆయన ఏ దురన్యాయాలకు వ్యతిరేకంగా ఏమి చేశారు అన్న ప్రశ్నకు 'అన్నాల' వద్ద సమాధానం లేదు.

గాంధీజీ దృష్టిలో సామాజిక మార్పు శాసనాలతో వచ్చేది కానేకాదు. ఆయనది నైతికమార్గం. శాసనమార్గంకాదు. జాతివివక్షతతో తనపై భౌతికదాడికి పాల్పడిన సందర్భాల్లోకూడా ఆయన పోలీసు స్టేషన్‌కు వెళ్ళడానికి నిరాకరించారు. అహింసాయుత సత్యాగ్రహ పద్ధతిలో శత్రువులో మానసిక పరివర్తన తేవడం ఆయన సన్మార్గంగా భావించారు. కానీ అన్నా హజారేది అందుకు భిన్నమైన మార్గం. అవి శాసనాల ద్వారా అవినీతి నిర్మూలన మార్గం. గాంధీజీకి నైతికమార్పు ప్రాథమికం శాసనాలు అప్రాముఖ్యం. అన్నాకి శాసనాలు ప్రాథమికం నైతిక మార్పు అప్రాముఖ్యం. మరణశిక్షను గాంధీ వ్యతిరేకించారు. అవినీతిపరులను ఉరిశిక్ష విధించాలనేది అన్నాల డిమాండ్. ఎంత తేడా. అయినా అన్నాహజారేను గాంధీ సమానుడిగా ఈనాటి గాంధీగా చూపే ప్రయత్నాల్లో అన్నాలు ఉన్నారు.

పౌరసమాజం అనే భావనను అన్నాలు బలంగా తెరపైకి తెచ్చారు. రెండున్నర దశాబ్దాల క్రితమే పౌర 'సమాజం-రాజ్యం' అనే రెండుగా దేశాన్ని

చూపడం మొదలైంది. వాటి పరస్పర ఆవరణాల, ప్రభావాల చర్చ జరిగింది. ఈ విషయంపై సైద్ధాంతిక కృషి జరిపిన వారిలో అగ్రగణ్యురాలు నీరా చందోక్ ఇటీవల రాసిన ఒక వ్యాసంలో ఇక పౌరసమాజం వేపు కాకుండా సామాజిక మార్పుకోసం రాజ్యంవేపు చూసే పరిస్థితులు వచ్చాయని అభిప్రాయపడ్డారు. పౌరసమాజం గురించిన ఈ చర్చ గురించి అన్నాలకు ఏ మాత్రం తెలుసోగానీ పౌరసమాజం పార్లమెంటు కంటే ఉన్నతమైనదనే ప్రచారాన్ని వారు ప్రారంభించారు.

సమాజం యొక్క రాజకీయ వ్యక్తీకరణగా చట్టసభలు వచ్చాయి. అలా సమాజం నుంచి రాజకీయాలు విడిపోయాయి. మిగిలిన డొల్లను పౌరసమాజం అనవచ్చు. రాజకీయ రహితమైనదది. ప్రస్తుత రాజకీయాల్లో విలువల సంక్షోభానికి పౌరసమాజంలో రాజకీయాలపట్ల ఉండే ఏహ్యభావం, నిష్క్రియాపరత్వం ప్రధాన కారణాలుగా చెప్పవచ్చు. ఆర్థిక లావాదేవీల్లో నిరంతరం ఉండే స్వార్థపర మనుషులు మెసలేది పౌరసమాజం అని జర్మన్ తత్వవేత్త హెగెల్ భావించారు. స్వలాభాపేక్షతో సంచరించే రాజకీయరహిత అణుమాత్ర మానవులు సముదాయమైన పౌరసమాజాన్ని రద్దుచేసే దిశగా పనిచేయాలని కారల్‌మార్క్స్ భావించారు. పౌరసమాజం అనేది అన్నిటికంటే పవిత్రమైనదనే భావాన్ని నెలకొల్పడం అనేది చరిత్ర తెలియని వాళ్ళకు ఉత్తేజకరంగా ఉండవచ్చేమో కానీ చరిత్ర చదువుకున్నవాళ్ళకు కాదు. 'ఐ హేట్ పాలిటిక్స్' అనే వాళ్ళు అన్నాలుగానూ, నీతి వాక్యప్రబోధకులుగానూ, నిష్క్రియాపరులుగానూ దర్శనమివ్వవచ్చు గానీ, వాళ్ళవల్ల అంతిమంగా దేశానికి ఒరిగేది గుండుసున్నా. (సామాన్యులకిచ్చే సంక్షేమ పథకాలను ఆడిపోసుకునేది కూడా వీళ్ళే).

ఈ అన్నాల పౌరసమాజంలో ఆమ్ ఆద్మీకి స్థానంలేదు. సామాన్యుల పోరాటాలు వీళ్ళకు పట్టవు. రైతులు, కూలీలు, కర్షకులు, కార్మికులు చేసే ఏ ఉద్యమం కూడా 'పౌరసమాజం' చేసే ఉద్యమంగా భావించబడదు. అన్నాలు ఈ ఉద్యమాలలో మమేకం అవడం అటుంచి కనీసం సానుభూతి కూడా ఏనాడూ ప్రకటించిన పాపాన పోలేదు. వీళ్ళకి గత ఉద్యమ చరిత్ర శూన్యం. దారుణ మారణకాండకు సంఘ్ పరివార్ శక్తులు తెగబడిన సందర్భాల్లో ఈ అన్నాలు, వారి పౌరసమాజం ఎక్కడుంది? అని అరుంధతీ రాయ్ వేసిన ప్రశ్నకు

జవాబులేదు. ఏనాడూ ఏ సామాజిక దురన్యాయాన్ని గురించి కూడా కాస్తంత గొంతెత్తకుండానే వృద్ధుడైపోయిన అన్నా హజారే దశాబ్దాల కుంభకర్ణ నిద్ర అనంతరం మేల్కొన్న భారత లిప్ నాన్ వింకిల్ అని చెప్పవచ్చు. అలాంటి కోవలోకి వచ్చే వాళ్ళలో రామ్‌దేవ్ ఒకరు. (అతనికీ సంఘపరివార్‌తో సంబంధా లున్నాయి).

కేజ్రీవాల్‌తో సహా అన్నా బృందంలోని పలువురు ముఖ్యులకు సంఘ్‌పరివార్ శక్తులతో ప్రత్యక్ష పరోక్ష సంబంధాలు ఉన్నాయన్నది బహిరంగ రహస్యమే. మతం పేరిట మూడువేలమంది ముస్లింలను ఊచకోత కోసిన గుజరాత్ రాష్ట్రంలో ముఖ్యమంత్రి మోడీని అన్నా పొగిడారు. దానిపై తీవ్ర విమర్శలు రాగా నాలిక కరుచుకున్నారు. సంఘ్‌పరివార్‌తో అన్నాల సంబంధం బహిర్గతమైతేనే ఇరువురికీ లబ్ది చేకూరుతుంది. కాబట్టి అన్నాలు ప్రత్యక్ష రాజకీయాలకు దిగజారి రాజస్థాన్ ఎన్నికల్లో కాంగ్రెస్‌ను ఓడించటమే ధ్యేయమని ప్రచారం చేస్తూ మతతత్వ వాదులను గెలిపించే ప్రయత్నంలో ఉన్నారు. అద్వానీ అవినీతి వ్యతిరేక రథయాత్రకు అనుగుణంగా అన్నాలు పావులు కదుపుతున్నారు. రానున్న ఎన్నికల్లో రాష్ట్రపతి అభ్యర్థిగా అన్నాను నిలబెట్టే దిశగా సంఘ్‌పరివార్ కృషి చేస్తుందని వచ్చిన వార్తల్లో నిజం లేకపోలేదు.

రాజ్యాంగ సంస్థలపై ప్రజలలో అవిశ్వాసం రేకెత్తించడం అన్నాలు చేస్తున్న మరోపని. ఇటీవల కేజ్రీవాల్ ఒక ఇంగ్లీషు టివి ఛానల్‌కు ఇచ్చిన ఇంటర్వ్యూలో ఒక అడుగు ముందుకేసి పార్లమెంట్ కంటే అన్నానే గొప్పవాడు అని అన్నాడు. పౌరుడే పార్లమెంటు కంటే గొప్ప అని రాజ్యాంగం చెప్పింది కాబట్టి తనన్నది సరైనదేనని సమర్థించుకోచూశాడు. కానీ రాజ్యాంగంలోని ఏ అధికరణం ప్రకారం పార్లమెంటుకంటే పౌరుడు గొప్ప అనేది ఆయన చెప్పలేకపోయారు. ఇప్పటివరకూ 'పౌరుడు వర్సెస్ పార్లమెంటు' అనే చర్చ రాజ్యాంగ ప్రవచనంలోకి రానేలేదు. హెచ్.ఎమ్.సీర్వాయ్, గ్రాన్‌విల్లి ఆస్టిన్ లాంటి రాజ్యాంగ కోవిదులు రాసిన గ్రంథరాజాల్లో గానీ, కోకాసుబ్బారావు, వి.ఆర్.కృష్ణయ్యర్, ఓ. చిన్నపరెడ్డి, భగవతి లాంటి ఉద్దండులైన న్యాయమూర్తుల తీర్పుల్లోగానీ ఈ ప్రశ్నకు తావేలేదు. కానీ అన్నాలు ఒక పథకం ప్రకారం ఈ చర్చను లేవనెత్తుతున్నారు. పౌరుడు అనే ఒక అమూర్త భావనను నిర్దిష్టమైన పార్లమెంటుకు వ్యతిరేకంగా

ప్రయోగించడం చాలా అపచారం. పౌరులకు పార్లమెంటుకు మధ్యలేని అగాధం సృష్టించి ఎవరు/ఏది గొప్ప అనే తప్పుడు చర్చను లేవదీసి రాజ్యాంగాన్ని, రాజ్యాంగ సంస్థలను బలహీన పరిచే దురుద్దేశపూరిత ప్రయత్నంలో అన్నాలున్నారు. పౌరులు గొప్పవారే. అలాంటి పౌరుల రాజకీయ వ్యక్తీకరణగా ఏర్పరచబడిన/ఎన్నికైన పార్లమెంటును కించపర్చడం బి.ఆర్.అంబేద్కర్ విరచిత రాజ్యాంగానికే ఎసరు పెట్టే ప్రయత్నం తప్ప మరొకటికాదు. సంఘ్‌పరివార్ శక్తులు అధికారంలో ఉన్నకాలంలో రాజ్యాంగాన్ని తిరిగి రాయాలనే విఫలయత్నం చేయడాన్ని ఇక ఈ సందర్భంలో గుర్తుచేసుకోవాలి. ఇప్పుడు మళ్ళీ అదే శక్తుల నుంచి 'రాజ్యాంగ సంస్థలకు వస్తున్న ముప్పు గురించి ప్రజలు అప్రమత్తం కావాల్సిన అవసరం ఉంది.

దేశంలో అవినీతి బాగా వేళ్ళూనిందనడంలో సందేహం ఏ మాత్రం లేదు. ప్రపంచీకరణతో పాటు ఈ అవినీతి మనదేశంలోనూ ప్రపంచవ్యాప్తంగానూ కొత్త పుంతలు తొక్కుతున్నది. దాన్ని కట్టడి చేయాల్సిందీ, శిక్షించాల్సిందే. ప్రపంచీకరణ పేరిట లబ్ధి పొందిన వర్గాల 'పౌరసమాజం' అవినీతిని అంతమొందించ లేదనడంలో అతిశయోక్తిలేదు. తిలాపాపం తలాపిడికెడు అన్న చందంగా ఇప్పటివరకూ దేశంలో ప్రత్యక్షంగా కానీ పరోక్షంగా కానీ అధికారంలో ఉన్న ప్రతి పార్టీ ఈ అవినీతి వటవృక్ష ఛాయలో సేదదీరినదే. కానీ అన్నాలు పాపమంతా కేవలం ప్రస్తుతం పాలకులదే అన్నట్టు చిత్రీకరించి గాలిజనార్ధనరెడ్డి లాంటివారిని తయారుచేసిన సంఘ్‌పరివార్‌కు లబ్ధి చేకూర్చే ప్రయత్నంలో ఉన్నారు. మసీదులు కూలగొట్టే, మతకల్లోలాలు సృష్టించే, ప్రజాస్వామ్య రాజకీయాలను ద్వేషించే, ఆమ్ ఆద్మీని ఈసడించుకునే, స్త్రీలను అణగదొక్కే, దళితులను వివక్షకు గురిచేసే ఈ శక్తుల గురించి ప్రజలు బాగా అవగాహన చేసుకోవాల్సి ఉంది.

అన్నా ఉద్యమానికి కేంద్ర ప్రభుత్వం సానుకూలత మోతాదుకు మించినదని కొన్ని వర్గాల నుంచి విమర్శలు వచ్చాయి. వాటిని సైతం పక్కనబెట్టి నేరుగా అన్నాలతో చర్చలు జరిపి పలు డిమాండ్లు అంగీకరించినా వారు సంతృప్తి చెందకపోవడానికి కారణం సంఘ్‌పరివార్‌కు లాభం చేకూర్చాలన్నదే. లేకపోతే అన్నాలు అమ్మకానికో (డిజిన్వెస్ట్‌మెంట్) మంత్రిని కేబినేట్‌లో ఉంచుకుని బాల్కో లాంటి లాభసాటి ప్రభుత్వ సంస్థలను చౌకగా అమ్మి సొమ్ముచేసుకున్న వారిని

పల్లెత్తుమాట ఎందుకనరు. ఒక పక్క పార్లమెంటును ప్రశ్నిస్తూ మరోపక్క మోడీని ఎలా సమర్థించగలరు?

ప్రస్తుత రాజకీయ పార్టీలలో గిరిజన, దళిత, బలహీన వర్గాలకు, మైనారిటిలకు మహిళలకు లబ్బిచేకూర్చే పలు పథకాలతో సామాన్యుల ఆదరణ చూరగొన్న జాతీయ పార్టీ కాంగ్రెస్ తప్ప మరొకటి లేదు. కాంగ్రెస్ పార్టీ సిసలైన సెక్యులరిస్టు పార్టీ. అలాంటి పార్టీని దెబ్బతీసిన పక్షంలో లబ్దిపొందేవి అన్నాల వర్గ స్వభావం కలిగిన వర్గాలే వారి పార్టీలే, సెక్యులరిజాన్ని, ఆమ్ ఆద్మీని దెబ్బతీసే సంఘపరివార్ శక్తులే. అంబేద్కర్ అన్నట్టు - ‘‘మెజారిటీ రెండురకాలు (1) మతపరమైన మెజారిటీ (2) రాజకీయపరమైన మెజారిటీ. రెండవ దాన్ని మార్చవచ్చు. కానీ మతపరమైన మెజారిటీ అలాకాదు. అది పుట్టుకతో ఏర్పడేది. రాజకీయ మెజార్టీలో ఎవరికైనా ప్రవేశం ఉంటుంది. కానీ మతపరమైన మెజారిటీ విషయంలో తలుపులు మూసి ఉంటాయి. దాని రాజకీయాలు దానిలో పుట్టిన వాళ్ళు నిర్ణయిస్తారు. రాజకీయ మెజారిటీ గలిగిన ప్రభుత్వాన్ని తెగనాడి మతపరమైన మెజారిటీ రాజకీయాల దిశగా దేశాన్ని నడిపించే మహాకుట్ర ఇందులో దాగివుంది. అన్నా హజారే, బాబా రామ్‌దేవ్, మోడీ, అద్వానీ చెలిమికి ప్రాతిపదిక.

ఏది ఏమైనప్పటికీ రాజ్యాంగ సంస్థలపై నమ్మకంలేని, రాజ్యాంగ సంస్కృతికి భిన్నమైన భావజాలాన్ని కలిగివుండే ఈ శక్తులు రాజ్యాంగంపైనా, రాజ్యాంగ విలువలపైనా, రాజ్యాంగం సృష్టించిన అత్యున్నత ప్రజాసంస్థ పార్లమెంటు పైనా చేస్తున్న దాడిని మనం ఆదిలోనే ఎదుర్కోవాలి. లేనిపక్షంలో దేశాన్ని పెనుసంక్షోభంలోకి వారు నెట్టేసే ప్రమాదం ఉంది.

**రాతప్రతి, 2010**

# 45. పేదల కోసం నిలిచిన 'లా' రాజు

కందాళ గోపాలస్వామి కన్నబిరాన్ - ఈ పేరు న్యాయవాదంలోనే కాదు, హక్కుల ఉద్యమంలోనూ ఇంటింటా ఎరిగిన పేరు. నిత్య నిర్బంధానికీ, రాజ్య హింసకు బలౌతున్న పేద ప్రజల నాలుకపై నడయాడిన తారక మంత్రం. పోలీసులకు సింహ స్వప్నం. అటు న్యాయశాస్త్రంలో అపార పాండిత్యం, ఇటు పేదల బాధల పాటల పల్లవికి స్పందించే హృదయం - వెరసి కన్నబిరాన్‌ను కన్నబిరాన్ చేశాయి. నిత్య పఠనం, నిశ్చల రచన కూడా. ప్రపంచంలో ఆయనతో పోల్చదగ్గ మరొక న్యాయవాదిని చూపిస్తారా? నాలుగు దశాబ్దాలకు పైగా విశ్వవీణకు హక్కుల తంత్రియై మోగిన, కోర్టుల్లో బయటా సింహగర్జన చేసిన ఆయన లాంటి లాయర్ మరెప్పటికైనా దొరుకుతారా? శామ్యూల్ లిబోవిట్జ్, లీ బెయిలీ లాంటి అలనాటి ప్రఖ్యాత పాశ్చాత్య న్యాయవాదుల చరిత్రలు తిరగెయ్యండి. ఆధునిక న్యాయవాద వృత్తి ఆవిర్భావం తర్వాత న్యాయస్థానాల చరిత్రను తిరగెయ్యండి. అన్ని దేశాల్లో కంచు కాగడాతో వెతకండి. నాటి నుంచి నేటి వరకూ ఇక ఏ నాటికీ సాటిలేని న్యాయవాద రారాజు మా సీనియర్ కన్నబిరాన్. తమిళంలో కన్న అంటే కృష్ణుడు, బిరాన్ అంటే ప్రభువు - ది లార్డ్. మధురై జైల్లో పుట్టాడు. కటకటాల బందీఖానాలో కాదు. ఖైదీల డాక్టర్ ఇంట్లో.

కొన్నేళ్ళ క్రితం ఒక ఉరిశిక్షలో ఆయన రెండు నిమిషాల వాదన సరిపోయింది. శిక్ష రద్దయింది. హైకోర్టు వెలుపలికి వస్తూ సార్ మెట్లమీద నిల్చున్నారు. మిమ్మల్ని ఇలా ఫోటో తీస్తే ఎంత బాగుంటుందో అన్నాను. కోటు, గౌనులో ఆయన వెనుక ఎత్తైన హైకోర్టు భవనం. ఎంత అద్భుత దృశ్యం.

ఆయన మహోన్నత వ్యక్తిత్వ శిఖరంతో అవి వెలవెలబోతున్నట్టున్నాయి. ఇంత ఎత్తుగా హైకోర్టు భవనాలు ఎందుకు కట్టారో తెలుసా అన్నారు. "కోర్టులలో జనన్యాయం గొంతు నులిమి చంపబడెను అని చెరబండరాజు రాశాడు. రోజూ ఇక్కడ జరిగేది అదే. పీక నులిమిన శబ్దాలు వినపడకుండా ఇంత ఎత్తైన రాతి గోడల్తో కట్టారు" అన్నారు సార్.

రెండేళ్ళ క్రితం సార్ కోమాలోకి వెళ్లారు. ఆయన జూనియర్లలో నేనూ, నళినీ కుమార్, భరత్ కుమార్ వెళ్లాం. సార్‌ను చూశాం. ఆయన గురించిన జ్ఞాపకాలు నెమరేసుకుంటుంటే భరత్ చెప్పాడు. గుర్తేడులో నక్సలైట్‌లు బంధించిన శంకరన్ తదితర ఐఎఎస్ ఆఫీసర్లను విడిపించిన తర్వాత రోజు సార్ కోర్టుకు వెళ్తోంటే ఒక సీనియర్ లాయర్ పరిగెత్తుకుని ఆయన దగ్గరకొచ్చి కన్నబిరాన్ నీకు మీసాలుండాలయ్యా, నువ్వు మొనగాడివి అని అభినందించాడు. అలాంటప్పుడు చిక్కని కాఫీ పరిమళం లాంటి చిరునవ్వు సార్ ట్రేడ్ మార్క్.

సార్ ఇంట్లో ముందు రెండు గదుల్లో ఆఫీసుండేది. ఉదయం సాయంత్రం జూనియర్లతో క్లయింట్లతో కళకళలాడుతూ... ఆయన్ను నమ్ముకున్న క్లర్క్ రమణ హడావుడి. ప్రతి శుక్ర, శని, ఆదివారాల్లో సాయంత్రం సెలవు. గోడలకు ఆనించిన షెల్ఫుల్లో అన్నీ పుస్తకాలే. తన గదిలో దేశంలో ఏ లాయర్ ఆఫీసులోనూ కనిపించని అనేక విదేశీ న్యాయశాస్త్ర గ్రంథాలు. సాధారణ లా బుక్స్ మాత్రమే కాదు - రాజకీయ, సామాజిక, అర్థశాస్త్ర గ్రంథాలు. తెలుగు, ఇంగ్లీషు సాహిత్యం. వాటి మధ్య ఆయన టేబుల్, కుర్చీ. చూడాలనిపించే ముఖవర్చస్సుతో అందమైన సార్. లక్షలు వెచ్చించి పుస్తకాలు కొనడమే కాదు వాటిని చదవడం ఆయన వ్యసనం. గోగియా లా హౌజ్‌కు కొత్తగా వచ్చిన ఏ పుస్తకం సార్‌కు అవసరమో తెలుసు. నేరుగా తెచ్చి ఇచ్చేస్తారు. ఆయన టేబుల్ మీద ప్రతిరోజు కొత్త కొత్త పత్రికలు, పుస్తకాలు. వెళ్ళిన ప్రతిసారీ సార్‌తో మాట్లాడుతూనే నా కళ్ళు ఆ పుస్తకాల కొత్తదనాన్ని ఆస్వాదించేవి.

గత వేసవిలో ఆయన నాకు మూడు పెద్ద బుక్ రేక్స్, వాటిల్లో 200 లా జర్నల్స్, పుస్తకాలు ఇచ్చి పట్టుకెళ్లమన్నారు. తనే ట్రాన్స్‌పోర్ట్ అపరేటర్‌ను మాట్లాడి మినీ లారీలో గుంటూరు తీసుకెళ్ళే ఏర్పాటు క్షణాల్లో చేశారు. ఇచ్చేటప్పుడు

“చంద్రా, ఇవి నీ షేర్‌కు వచ్చిన బుక్స్ అన్నారు. గుర్తుంచుకో లెగసీ ఆఫ్ కన్నబిరాన్ ఈజ్ నాట్ జస్ట్ బుక్స్ బట్ ఆల్సో ఎ కల్చర్”. ఎంత ప్రేమగా చెప్పారో.

అప్పటికి కొన్నేళ్ళ క్రితం ఒక లారీడు పుస్తకాలు నల్సార్ యూనివర్శిటీకి, కొన్ని లాయర్ నళినీ కుమార్‌కి, కొన్ని బాలగోపాల్ సార్‌కు, మరి కొందరు జూనియర్లకు ఇచ్చారు. నన్ను “అవుట్‌డోర్ జూనియర్” అని పిలుస్తారు సార్. జూనియర్లపై ఆయన ప్రేమానురాగాలు సదా స్మరణీయం.

పదిహేనేళ్ళ క్రితం సంగతి. నేనూ, పర్‌స్పెక్టివ్స్ ఆర్‌కె ఆయన ఇంటికి బయల్దేరాం. దారిలో వర్షంలో పూర్తిగా తడిసి ముద్దై చీకటి పడుతుండగా ఆయన ఇంటికి వెళ్లాం. మాకు టవల్స్ ఇచ్చి తుడుచుకోమని చెప్పారు సార్. కాఫీ తాగుతారా అని అడిగారు. తాగుతాం అన్నాం. ఇంట్లో ఎవరూ లేరు. ఆయనే స్వయంగా కాఫీ చేసి తెచ్చిచ్చారు. ఆయన చేతి కాఫీ తాగే అదృష్టం వరించిన జీవుల లిస్టులో నేనూ ఆర్‌కె అలా చేరిపోయాం.

చుండూరు కేసు పనిమీద నేనూ, ప్రొఫెసర్ సుబ్రహ్మణ్యం, జాలాది మోజెస్, మరి కొందరు దళితులు ఒక రోజు వెళ్లాం. పనయ్యేసరికి రాత్రి 8 అయింది. మాకు సరైన లాడ్జిలేదన్న సంగతి ఆయన మమ్మల్ని అడిగి మరీ తెల్సుకున్నారు. వెంటనే ఫతేమైదాన్ క్లబ్‌కు ఫోన్ చేశారు. తన మిత్రులు వస్తున్నారని చెప్పి రెండు రూమ్‌లు ఏర్పాటు చేయించి బిల్ తనకు పంపమన్నారు. వెళ్లేటప్పుడు రెండు డ్రింకులకంటే ఎక్కువ తాగకండి అని నవ్వుతూ చెప్పారు. దటీజ్ కన్నబిరాన్.

రాత్రి ఎనిమిది గంటల తర్వాత నన్నెవరూ అడగడానికి లేదు. దటీజ్ మై టైమ్, అంటూ డ్రింక్ గ్లాస్ అందుకోవడం ఇంట్లో ఉంటే ఆయనకు దాదాపు నిత్యకృత్యం. జూనియర్స్‌కు నెలకోసారి మేడమీద గదిలో పార్టీ, కబుర్లు. సంతోషాన్ని ఏ మొహమాటం లేకుండా అనుభవించడం ఆయన స్టైల్. దాన్ని అందరికీ పంచడం కూడా.

అద్భుతమైన, సంప్రదాయానికి అందని మెరిసే వాక్యాలు ఆయన సొంతం. బుర్ర పాదరసం. తక్షణ స్పందన ఆయనలో ప్రత్యేక ఆకర్షణ. ఒకరోజు

ఆయనతో ఉండగా ఒక ఆంగ్ల దినపత్రిక విలేఖరి ఫోన్ చేశాడు. వరంగల్‌లో కొత్తగా వచ్చిన ఎస్పీ ఇష్టారాజ్యంగా వ్యవహరిస్తూ ప్రజల హక్కులు హరించడం మీద ఆయన షార్ట్ కామెంట్ అడిగాడు. వెంటనే సార్ ''వరంగల్ హాజ్ బికమ్ ఎ లాటినమెరికన్ బనానా రిపబ్లిక్'' అన్నారు.

ఇంగ్లీషు దినపత్రిక దక్కన్ క్రానికల్‌లో ఒక మహిళా విలేఖరి మావోయిస్టు ఉద్యమం మీద వ్యాస పరంపర ప్రారంభించి ఆయనను ఇంటర్వ్యూ చేసేందుకు వచ్చింది. ఆ రోజు ఆమె రాసిన మొదటి వ్యాసం సార్ చదివి ఉన్నారు. మావోయిస్టులు ఉన్మాదులనీ, మతి భ్రమించిన వాళ్ళు మావోయిస్టులుగా తయారై ప్రజలను ఊచకోత కోస్తున్నారనీ, అందులో రాజకీయం ఏమీ లేదనీ ఆమె రాసింది. ప్రస్తుత డిజిపి అరవిందరావు లాంటి వాళ్లతో ఇంటర్వ్యూ చేసి రాసిన వార్తా వ్యాసం. సార్‌కు బాగా కోపమొచ్చింది. మావోయిస్టు ఉద్యమానికి సామాజిక, రాజకీయ, ఆర్థిక కారణాలున్నాయన్న అవగాహన లేని ఆమెకు ఇంటర్వ్యూ ఇవ్వడానికి ఆయన నిరాకరించారు. ఆమె ప్రాధేయపడింది. మావోయిస్టు ఉద్యమం నీకు ఎప్పటికీ అర్థం కాదు. నీలాంటి వాళ్లతో మాట్లాడను వెళ్లిపొమ్మని చెప్పారు. ఆమె మళ్లీ బ్రతిమాలడం మొదలుపెట్టింది. అప్పుడు ''హావ్ యు ఎవర్ సఫర్డ్ హంగర్ ఆన్ ఎకౌంట్ ఆఫ్ పావర్టీ ఈవెన్ ఫర్ ఒన్ డే?'' అని ప్రశ్నించారు. రోగమొచ్చి పడుకునే పస్తు కాదు. డబ్బులేక కడుపు మాడటం గురించి సార్‌కు ప్రత్యక్ష అనుభవం ఉంది. మావోయిస్టు ఉద్యమం కడుపు కాలితే పుట్టిందని ఆయనకు బాగా తెలుసు. దాన్ని ఉన్మాదం అనటాన్ని ఆయన సహించలేకపోయాడు. ఆకలి బాధ తెలియని వాళ్లకు నో ఇంటర్వ్యూ అని చెప్పి పంపేశారు.

ప్రిన్స్ ఆఫ్ డెన్మార్క్ 1993లో మానవ హక్కుల చట్టం తెచ్చారు. జాతీయ మానవ హక్కుల కమిషన్‌ను నియమించారు. ఆ సందర్భంగా డిసెంబర్ 10న హైదరాబాద్‌లో రాష్ట్ర ప్రభుత్వం ఆధ్వర్యంలో అంతర్జాతీయ మానవ హక్కుల దినోత్సవం జరిగింది. జస్టిస్ చిన్నపరెడ్డితో పాటు సార్‌నూ వక్తగా ఆహ్వానించారు. తర్వాత పోలీసు అధికారుల ఒత్తిడి వల్ల కన్నబిరాన్ సార్ పేరును వక్తగా తొలగించారు. ఈ విషయం తెలిసిన జస్టిస్ చిన్నపరెడ్డి వేదికపైనే నిరసన వ్యక్తం చేశారు. కన్నబిరాన్ లాంటి యోధుడు లేకుండా మానవ హక్కులపై

సభ వెల వెలపోయిందని పత్రికలు రాశాయి. దక్కన్ క్రానికల్‌లో మొదటి పేజిలో వార్త అచ్చయింది. ఆ వార్తకు శీర్షిక "హేమ్లెట్ విత్ అవుట్ ప్రిన్స్ ఆఫ్ డెన్మార్క్." అయన లేని ఉద్యమం పరిస్థితి అదీ.

1975 జూన్ 6న అర్ధరాత్రి ఎమర్జెన్సీ ప్రకటన. మరుసటి రోజు ఉదయంకల్లా ఎమర్జెన్సీ రాజ్యంగ విరుద్ధం అని దాన్ని సవాలు చేసి రిట్ పిటీషన్‌ను హైకోర్టులో దాఖలు చేసిన ధీశాలి ఎవరుంటారు కన్నబిరాన్ తప్ప. అరెస్టుకు భయపడక ప్రాణాలకు తెగించి ఎమర్జెన్సీ ఇరవై నెలలూ అహర్నిశలూ ఖైదీల విడుదల కోసం హెబియస్ కార్పస్ రిట్ పిటీషన్లు దాఖలు చేస్తూ నిరంతరం వాదించిన ధీరుడు, మహోన్నతుడు కన్నబిరాన్. ఆ 20 నెలల కాలమంతా ఆయన ఒకరోజు హైకోర్టుకు వెళ్ళకపోతే రిట్ పిటీషన్లు విచారించే బెంచీల న్యాయమూర్తులు తమ ఛాంబర్లలో విశ్రాంతి తీసుకోవాల్సిందే తప్ప పబ్లిక్ కోర్టులు పనిచేయని పరిస్థితి. నక్సలైట్లు, వారి సానుభూతిపరులు మాత్రమే కాదు, అన్ని పార్టీల వాళ్లూ చివరికి ఆర్ఎస్ఎస్ వాళ్లూ ఆయన క్లయింట్లే. జైలు నుంచి ఉత్తరం వస్తే చాలు వెంటనే సొంత ఖర్చుతో రిట్ వేసి ఉచితంగా వాదిస్తూ వచ్చారు.

పదిహేనేళ్ల క్రితం రాష్ట్ర ప్రభుత్వం క్షమాభిక్ష జీవో పాస్‌చేసి శిక్షా కాలం పూర్తి కాకుండానే చాలామంది యావజ్జీవ ఖైదీలను విడుదల చేసింది. జీవో క్లాజును తప్పుగా వ్యాఖ్యానించి చాలామంది అర్హులను విడుదల చేయకుండా అపారు. ఆ విషయాన్ని ఖైదీలు కొందరు ఉత్తరం రాసి కన్నబిరాన్ దృష్టికి తెచ్చారు. వెంటనే దానిపై హైకోర్టులో రిట్ వేసి వాదించి నెగ్గారు. రాష్ట్రంలోని పలు జైళ్ళలో మగ్గుతున్న వందలాది లైఫ్‌కన్విక్ట్స్‌కి అది స్వేచ్ఛ ప్రసాదించింది. చంచల్‌గూడ జైలు నుంచి వందమంది ఖైదీలు విడుదలయ్యారు. వాళ్లంతా ఒక పూలదండ కొనుక్కొని ఊరేగింపుగా సార్ ఇంటికి వచ్చి ఆయన మెళ్లో అది వేసి సత్కరించి కృతజ్ఞత ప్రకటించుకున్నారు. ఒక న్యాయవాదికి ఇంతకన్నా ఘనసత్కారం ఏముంటుంది. లాయర్ కేరీర్‌లో ఇంతటి తృప్తి ఏ డబ్బు ఇస్తుంది. దాన్ని తృప్తిగా అనుభవించిన మహా న్యాయవాదిగా ఆయన పేరు ఎప్పటికీ నిలిచిపోతుంది.

మధురైలో ఆర్ఎస్ఎస్ బిల్డింగ్ పేల్చివేత కేసు, కోయంబత్తూరు బాంబు పేలుళ్ల కేసు, పార్లమెంటు భవనం మీద దాడి కేసు, వీరప్పన్ అనుచరులపై టాడా కేసు ఇలా వేరే రాష్ట్రాల్లో సైతం తన న్యాయవాద జీవితాన్ని విస్తరించారు ఆయన. ఛత్తీస్‌ఘడ్‌లో ప్రముఖ కార్మికనేత హత్య కేసులో స్పెషల్ పబ్లిక్ ప్రాసిక్యూటర్‌గా హైకోర్టులో హాజరయ్యారు. ఇక రాష్ట్రంలో అనేక ప్రముఖ కుట్ర కేసుల్లో ఆయన డిఫెన్స్ లాయర్ కావడం అందరికీ తెలిసిందే.

బ్లాక్ అండ్ వైట్ సినిమాల షూటింగ్ రిట్జ్ హోటల్లో జరిగే రోజుల్లో ఆ హోటల్‌కే కాదు, హైదరాబాద్, సికింద్రాబాద్‌లో ఇవాళ వందల కోట్లయ్యే ఆస్తుల దావాలలో కన్నబిరాన్ లాయర్. ప్యారీ, కోరమాండల్ లాంటి ఎన్నో కంపెనీల లాయర్. ఇది రాష్ట్రంలో జన సామాన్యానికి తక్కువగా తెలిసిన విషయం.

ఆయన న్యాయస్థాన అంతరాత్మ. తమిళ టైగర్స్ అధినేత కిట్టూ హిందూ మహాసముద్రంలో విశాఖపట్నం దగ్గర భారత నావికా దళాలకు పట్టుబడ్డాడు. ఏం చేశారో ఇప్పటికీ తెలియదు. కిట్టూని కోర్టులో హాజరు పర్చాలని దాఖలైన హెబియస్ కార్పస్ పిటీషన్‌లో కన్నబిరాన్ రాష్ట్ర హైకోర్టులో వాదించారు. ఆ వాదన వినేందుకు అప్పట్లో లాయర్‌గా ప్రాక్టీస్ చేస్తున్న నేటి రాష్ట్ర మంత్రివర్యుడు మాణిక్య వరప్రసాద్ వెళ్లాడు. అది ఎప్పటికీ న్యాయశాస్త్ర చరిత్రలో నిలిచిపోయే అద్భుత వాదన అంటారు వరప్రసాద్. “కన్నబిరాన్ న్యాయస్థాన అంతరాత్మ. ఆయన కోర్టులోకి నడిచొస్తుంటే తమ అంతరాత్మ న్యాయమూర్తులకు గుర్తుకు వస్తుంది” అంటారాయన. అందుకే ముస్లిం రిజర్వేషన్ కేసుల్లో తన తరఫున వాదించేందుకు కన్నబిరాన్‌ను నియమించుకున్నానని చెప్పారాయన.

కన్నబిరాన్ కోర్టులో పెదవి కదిపితే న్యాయమూర్తులు చెవులు రిక్కించాల్సిందే. ప్రతి వాక్యం ఒక అద్భుత న్యాయపద కవితా విన్యాసం. శాస్త్ర శస్త్రం. మేధస్సు, నిజాయితీ, పట్టుదల, కృషి, పేదల బాధల గురించిన ఆర్తి, సంపదల గురించిన నిరాసక్తత, అన్నిటినీ మించి ధైర్యం ఆయన సొంతం. ఆయన లాంటి పరిణామం నభూతో నభవిష్యతి. నిజంగా, ముమ్మాటికీ.

**జనవరి 8, 2011 - ఆంధ్రజ్యోతి దినపత్రిక**

# 46. ముట్టడిలో ఏకాంతం లేదా ఏకాంత రాహిత్యం

ఒక నెలలోనే 3000 టెక్స్ట్ మెసేజ్‌లు పంపిన టీనేజ్ అమ్మాయి కథను క్రానికల్ డాట్‌కామ్ కొన్నేళ్ళక్రితం ప్రచురించింది. రోజుకి వంద మెసేజ్‌లు. ప్రతి పది నిమిషాలకు ఒకటి - ఉదయం, మధ్యాహ్నం, సాయంత్రం, రాత్రి, వారం రోజులూ, వారాంతాలూ, క్లాసులో ఉన్నప్పుడూ, లంచ్ టైంలోనూ, హోంవర్కు చేసేటప్పుడూ, పళ్ళు తోముకునేటప్పుడూ. దానర్థం ఆమె రోజులో పది నిమిషాలు కూడా ఒంటరిగా లేదనీ. తన పాటికి తాను వుండలేదనీ - తన ఆశలతో తనలో తాను వుండలేదనీ. ఇతరులు దగ్గరలేకుండా తన పాటికి తాను వుంటూ ఎలా జీవించాలి, ఆలోచించాలి, పనిచేయాలి, నవ్వాలి, ఏడవాలి అనే విషయాలను ఈ పాటికి బహుశా ఆమె మరిచిపోయి వుండవచ్చు. మరొక విషయం - ఏకాంతంగా జీవించే కళను నేర్చుకొనే అవకాశం ఆమెకు ఎప్పుడూ లేదు. నిజం చెప్పాలంటే - ఆ కళను ఆచరించే సమర్థత లేకపోవడంలోనే ఆమె ఒంటరిగా లేకపోవడం ఇమిడి వుంది.

మెసేజ్‌లు పంపీ, అందుకునే పాకెట్‌సైజు పరికరాలు మాత్రమే ఆమెకు, ఆమెలాంటివాళ్ళకు ఆ కళ లేకుండా బ్రతికి వుండేందుకు అవసరమైన ఏకైక పనిముట్లుకావు. న్యూయార్క్ విశ్వవిద్యాలయానికి చెందిన జిమ్మర్‌మన్ ప్రకారం యుఎస్.ఎలోని మూడొంతుల మంది టీనేజర్లు ఫేస్‌బుక్ లేదా మైఫేస్ వెబ్‌సైట్లకు గుడ్లప్పగించి తమకు అందుబాటులో ఉన్న ప్రతి నిమిషాన్ని చాటింగ్ చేస్తూ గడుపుతున్నారనీ, ఎలక్ట్రానిక్ శబ్దాలను, స్క్రీన్ ఫ్లాషెస్‌ను సృష్టించడంలో అందుకోవడంలో నిమగ్నమౌతున్నారు. ఆయన దృష్టిలో చాట్‌సైట్లు క్రొంగొత్త మాదకద్రవ్యాలు. వాటికి టీన్స్ బాగా బానిసలవుతున్నారు. మత్తుమందు

అలవాటైనవాళ్ళకు అవి మాన్పించేటప్పుడు పడేబాధ వర్ణనాతీతం. అలాగే ఏదైనా వైరస్ వ్యాపించో, మరో కారణంగానో టీనేజర్ల ఇంటర్‌నెట్ కనెక్షన్లను బ్లాక్ చేస్తే లేదా మొబైల్ ఫోన్లను పనిచేయకుండా చేస్తే వారి వ్యథను మీరు ఊహించుకోవచ్చు.

మనమున్న ప్రపంచం ఊహకు అందనిది. నిరంతరం ఆశ్చర్యపర్చేది. మొండి ప్రపంచం. అపరిచిత ప్రపంచం. అందులో ఏనాడైనా మనం ఒంటరిగా వదిలవేయబడబోతున్నామన్న ఊహే నిజంగా భయంకరంగా తోస్తుంది. ఏకాంతం తీవ్ర అసౌకర్యం. ఏకాంతం ఒక భయానక భీభత్స స్థితి. ఇలా అయ్యేందుకు మనకు చాలా కారణాలున్నాయి. ఎలక్ట్రానిక్ అలల కేబుళ్ళ జిగిబిగి అల్లికల, తంత్రుల, నిస్తంత్రుల ప్రపంచంలో కళ్ళు తెరిచిన ప్రజలకు అనుభవంలోకి వస్తున్న దానికి కేవలం ఎలక్ట్రానిక్ పరికరాలను మాత్రమే నిందించడం అల్పత్వం. ఎలక్ట్రానిక్ వస్తువులు మన అవసరాలను తీరుస్తున్నాయి. వాటిని వాడటం చాలా తేలిక. అవి ప్రతి ఒక్కరికీ అందుబాటులో ఉంటాయి. కొన్ని మీటలు నొక్కడం మినహా ఏ ప్రయత్నమూ అవసరంలేదు. ఎప్పుడు కోరుకున్నా ప్రపంచాన్ని వినేందుకు మీకు సహాయపడే పరికరం 'వాక్‌మన్'. దాని సృష్టికర్తలు ఇలా ప్రకటించారు. వాక్‌మన్ వుంటే 'మళ్ళీ ఏనాడూ మీరు ఒంటరి కారు'. వాళ్ళు చెప్తున్నది వారికి బాగా తెలిసివుండవచ్చు. నిజంగానే లక్షలాది వాక్‌మన్‌లు అమ్ముడుపోయాయి. వీధుల్లో ఒంటరితనం అనుభవించే కోట్లాది మంది ఉన్నారని వారికి తెలుసు. ఏకాంతం బాధాకరం అనీ, గర్హనీయమనీ వారికి ఎరుకే. సాహచర్యం లేకపోవడంవల్ల దుఃఖిస్తున్న వాళ్ళున్నారు. నివాస గృహాలు పగటిపూట మరింతగా ఖాళీ అవుతున్నాయి. ఇళ్ళలో పొయ్యిలు మాయం. డైనింగ్ టేబుళ్ళు మాయం. ప్రతిగదిలో టెలివిజన్ సెట్లు వాటిని స్థానభ్రంశం చేస్తున్నాయి.

**ఫిబ్రవరి 1, 2011 - రాతప్రతి**

# 47. ముస్లిం వ్యతిరేక, క్రైస్తవద్రవాధునిక నవల

పౌలు కోయిలో నవల ద ఆల్కెమిస్ట్ పుస్తక ప్రపంచంలో ఒక సంచలనం. పోర్చుగీసు భాషలో 1988లో వెలువడి పెద్దగా అమ్ముడుపోని ఈ నవల ఇంగ్లీషు అనువాదం 1993లో అమెరికాలో వెలువడ్డాక బెస్ట్ సెల్లర్స్ లిస్టులో చేరింది. అరవయ్యారు భాషల్లో వెలువడి గిన్నిస్‌బుక్‌లోకి ఎక్కింది. పదికోట్ల కాపీలు అమ్ముడుపోయి రికార్డులు బద్దలు కొట్టింది. తెలుగులో ఇది 'పరుసవేది' పేరిట 'మంచిపుస్తకం' ప్రచురణగా అచ్చయింది.

పౌలు కోయిలో బ్రెజిల్‌కు చెందిన రోమన్ కేథలిక్ క్రైస్తవుడు. ఆయన నవల క్రైస్తవాన్ని ఆవాహన చేస్తూ ముస్లింలను అవమానిస్తుంది. దీనిది ముస్లింలను ఈసడించుకునే, లోబర్చుకునే పాశ్చాత్య ఓరియంటలిస్టు వైఖరి. ఆధునికత తెచ్చిపెట్టిన వ్యక్తివాదాన్ని, స్వార్థచింతనను, ధనానికి అపరిమిత ప్రాధాన్యతనిస్తూ సమూహజీవితాన్ని తృణీకరించే ధోరణిని వ్యక్తీకరిస్తుంది. వాటితోపాటుగా, ప్రపంచీకరణ యుగపు ద్రవాధునిక (Liquid Modern) పోకడలను ఉదాత్తీకరిస్తుంది. ఆధునిక పూర్వ కథాకాలం మాటున, తప్పుడు తాత్వికత మేలిముసుగు చాటున పాశ్చాత్య స్వర్ణపిశాచి దండయాత్రకు అక్షరసైన్యాన్ని ఆసరాగా పంపుతుంది.

## I

**ఏడవ శతాబ్దం నుంచీ - అంటే ఒక రాజకీయ, భావజాల శక్తిగా ఇస్లాం ఎదిగి క్రైస్తవ సామ్రాజ్యాన్ని సవాలు చేసేదిగా తయారైనప్పటినుంచీ, ఇస్లాంకు పాశ్చాత్యులకు వైరుధ్యాలున్నాయి. (ఎ లెటర్ టు క్రిస్టియన్‌డమ్)**

**- రానా కబ్బాని.**

కోయిలో ద ఆల్కెమిస్ట్ కథానాయకుడు స్పానిష్ క్రైస్తవుడు. పేరు శాంటియాగో. అది క్రైస్తవ సెయింట్ పేరు. క్రీస్తు శిష్యులలోని అపొస్తలు సెయింట్ జేమ్స్ మరో పేరే శాంటియాగో మటమొరోస్. ఆయన స్పెయిన్‌లో ప్రజలను క్రైస్తవీకరించాడు. పాలస్తీనా యూదురాజు హెరోడేస్ అగ్రిప చేత క్రీ.శ.44లో చంపబడ్డాడు. అంతకు నాలుగేళ్ళముందు స్పెయిన్ వాయువ్య ప్రాంతంలో ఒక చోట మగ్దలినా ఆయనకు కనిపించిందని క్రైస్తవుల నమ్మకం. ఆ ప్రదేశాన్ని శాంటియాగో డి కంపొస్టెలా అని పిలుస్తారు. ప్రపంచ క్రైస్తవుల అత్యంత పవిత్రస్థలాల్లో అదొకటి. లక్షలాది మంది క్రైస్తవ తీర్థయాత్రికులు ప్రతియేటా దానిని సందర్శిస్తారు. వాటికన్, జెరూసలంలతో దానికి సమాన పవిత్రతా హోదాను యిస్తూ వందల ఏళ్ళ క్రితమే పోప్ ఆజ్ఞ జారీ అయింది.

పిచ్చాసుపత్రి నుంచి, హిప్పీయిజం నుంచి, విచ్చలవిడి సెక్సు నుంచి, నిర్నిబంధ స్వేచ్ఛకై అక్షర ఆరాటం నుంచీ, తద్వారా సంప్రాప్తించిన బందిఖానా నుంచీ, మాదక ద్రవ్యాల సేవనం నుంచీ, రాకెన్ రోల్ డాన్సు పాటలనుంచీ, చేతబడుల నుంచీ పౌలు కోయిలో ప్రస్థానం 1986 నాటికి శాంటియాగో డి కంపొస్టెలాకు సాగింది. సుమారు 500 మైళ్ళు కాలినడకన అక్కడికి తీర్థయాత్ర చేసిన అనంతరం తన జీవితం మలుపు తిరిగిందని కోయిలో చెప్పుకున్నాడు. రెండేళ్ళ తర్వాత, బెస్ట్‌సెల్లర్ రాయాలనే అతని జీవిత లక్ష్యాన్ని సాక్షాత్కారం చేసుకుని ద ఆల్కెమిస్ట్ నవల ప్రచురించాడు.

సెయింట్ శాంటియాగో కేవలం క్రైస్తవ మతప్రచారకుడు మాత్రమే కాదు. క్రైస్తవ యుద్ధవీరుడిగా పేరుగాంచాడు. ఆఫ్రికా ఉత్తర ప్రాంతంలోని మూర్‌లను సంహరించిన సాహసయోధుడిగా గుర్తింపు పొందాడు. అందువల్ల సెయింట్ శాంటియాగో - ద మూర్ స్లేయర్ గా సుప్రసిద్ధుడయ్యాడు. స్లేయర్ అంటే సంహారి. మొదటి రమిరో రాజుకు సాటిగా కదనరంగంలో కత్తిపట్టి నిలిచి మూర్ సైన్యాలపై నిర్ణయాత్మక యుద్ధం చేశాడని ప్రతీతి.

ఆఫ్రికా ఖండపు ఉత్తర ప్రాంతంలోని మొరాకో, అల్జీరియా దేశీయులను మూర్‌లు అని పిలవడం ఐరోపా వారికి ఏనాటి నుంచో పరిపాటి. మూర్‌లు బర్బర్ జాతీయులు - అరబ్బులు. ఒకనాటి ఐబీరియా ద్వీపకల్పం (నేటి

పోర్చుగల్, స్పెయిన్) ప్రాంతాన్ని జయించి దానికి అల్ అండలూస్‌గా నామకరణం చేసిన దక్షిణాత్యులు. క్రీ.శ. 8వ శతాబ్దం నుంచి 15వ శతాబ్దం వరకూ ఆ ప్రాంతాన్ని కొంతగానీ, మొత్తంగానీ పరిపాలించారు. అప్పటికల్లా మూర్‌లు ముస్లింలు. ఉత్తర ప్రాంతం నుంచి క్రైస్తవ ప్రభువుల విజృంభణ తర్వాత మూర్‌ల పాలన క్రమేపీ అంతమౌతూ వచ్చింది. క్రీ.శ. 1492లో వారి పాలనలో ఉన్న చివరి ప్రాంతం గ్రైనెడా (స్పెయిన్‌లోది) కూడా క్రైస్తవ ప్రభువుల పాలన కిందకు తేబడడంతో అల్ అండలూస్‌లో మూర్‌ల రాజ్యం పూర్తిగా అంతమైంది.

మూర్‌లపై క్రైస్తవ ప్రభువులు చేసిన యుద్ధాలన్నింటిలోనూ సెయింట్ శాంటియాగో-ద మూర్ స్లేయర్ స్ఫూర్తిగా నిలిచాడు. శ్వేతాశ్వారూఢుడై మూర్ మూకలను దునుమాడిన అతని ఉగ్రరూపం ముస్లిం వ్యతిరేక యుద్ధాలలో శత్రుహననానికి క్రైస్తవ సైన్యాలకు ఉత్తేజమిచ్చింది. సెయింట్ శాంటియాగో కాలం నాటికి ఇస్లాం మతం లేనప్పటికీ, తర్వాత కాలంలో వారు ముస్లిం మతస్థులైనందువల్ల అతని ప్రతిరూపం ముస్లిం సంహారానికి మారుపేరుగా మారింది. అంతమాత్రమే కాదు. తర్వాత కాలంలో ఆధునిక స్పానిష్‌జాతి స్ఫూర్తికి ప్రతీకగా సెయింట్ శాంటియాగో భావించబడ్డాడు. క్రీ.శ. 17వ శతాబ్దిలో టెరాసా అనే క్రైస్తవ నన్‌కు సెయింట్‌గా శాంటియాగో సరసన స్థానం కల్పించేందుకు పోప్ చేసిన ప్రయత్నాన్ని సైతం స్పెయిన్ ప్రజలు నిరోధించారు. సెయింట్ శాంటియాగో మాత్రమే స్పెయిన్‌కు ఏకైక సెయింట్‌గా ఉండాలని స్పానియార్డులు భావించారు. అంటే ఆధునిక స్పానిష్ అస్తిత్వంలో శాంటియాగో - ద మూర్ స్లేయర్ ఎంతగా భాగమో అర్థం చేసుకోవచ్చు.

మూర్ పదాన్ని మొదట్లో ఆఫ్రికన్ అరబ్బులకు శ్వేత జాతీయులు వర్తింపజేసినప్పటికీ మధ్యయుగాల నుంచీ నల్లజాతి (ఆఫ్రికన్) ముస్లింలకూ, ఆ తర్వాత ముస్లింలందరికీ ఉపయోగిస్తూ వచ్చారు. నీచార్థంలో ఈ పదప్రయోగం కొనసాగింది. పలు యూరోపియన్ భాషల్లో మూర్ అంటే నల్లని స్త్రీ లేదా పురుషుడు అని అర్థం. పౌలు కోయిలో మాతృభాష పోర్చుగీసులో మూర్‌లు అంటే నల్లవాళ్ళు (Tanned) అనే అర్థముంది. స్పానిష్ మాట్లాడే దేశాల్లోనూ మూర్ పదానికి అదే అర్థం చలామణిలో ఉంది. అలా నల్లవాళ్ళకు

నిక్‌నేమ్‌గా మూర్ పదాన్ని నిందార్థంలో వాడతారు. ఆ పదాన్ని శ్వేతజాతి దురహంకారానికి చిహ్నంగా భావించవచ్చు.

క్రైస్తవులతో జరిగిన యుద్ధాల్లో 'మూర్'లు ఆధిపత్యం కోల్పోయి ఐబీరియా నుంచి తరిమేయబడ్డారు. మతవిద్వేషం కరాళనృత్యం చేసిన సందర్భంగా అది చరిత్రలో నిలిచిపోతుంది. లక్షలాది మంది ముస్లింలు బలవంతంగా క్రైస్తవీకరించబడిన ఘోరకలి రాజ్యమేలిన కాలమది. (ఐబీరియాలో ఈనాడు 10.6 శాతం జనాభాకు ఆఫ్రికన్ మూలాలున్నాయని ఒక అంచనా). ముస్లిం రాజ్య పతనానంతరం 200 ఏళ్ళ తర్వాత సైతం 18వ శతాబ్దం మొదట్లో అక్కడ మత విద్వేషానికి ముస్లింలు తీవ్రంగా నష్టపోయారు.

ద ఆల్కెమిస్ట్ కథానాయకుడు ద మూర్ స్లేయర్ నామధారి శాంటియాగో జన్మస్థానం అండలూసియా. జిబ్రాల్టర్ జలసంధిదాటి ఉత్తర ఆఫ్రికా నుంచి ఐబీరియాలో ప్రవేశించాలంటే తొలుతగా అడుగుపెట్టాల్సింది అక్కడే. 'మూర్' దండయాత్రకు గురైన తొట్టతొలి ప్రదేశం. తరీఫ్ అబుజ్మ క్రీ.శ. 710లో తన సేనలతో వచ్చి 'మూర్' పాలనకు బీజాలు వేసిన ప్రాంతం.

అక్కడి సముద్రపు ఒడ్డునున్న తరీఫా నగరం దగ్గర జిబ్రాల్టర్ జలసంధి దాటితే మొరాకోలో అడుగుపెట్టవచ్చు. తరీఫా నుంచి చూస్తే ఆఫ్రికా కనిపిస్తూనే ఉంటుంది. తరీఫాలో ఉండగా నవలా నాయకుడు మూర్‌ల దండయాత్రల గురించి గుర్తు చేసుకుంటాడు. 'నగరంలోని కోట పక్కగా నడిచి వెళ్తూ దారి మళ్లాడతను (శాంటియాగో). కోట గోడపైకి తీసుకెళ్ళే రాళ్ళ చప్టాను ఎక్కాడు. అక్కడినుంచి అతను దూరంగా ఉన్న ఆఫ్రికాను చూడగలిగాడు. స్పెయిన్ మొత్తాన్నీ ఆక్రమించేందుకు మూర్‌లు అక్కడి నుంచే వచ్చారని ఒకప్పుడు ఎవరో అతనికి చెప్పారు' - ఇలాంటి స్మృతుల ద్వారా రచయిత ముస్లింలపట్ల నవలా నాయకుడి ద్వారా అసహనాన్ని ప్రకటిస్తాడు.

సముద్రాన్ని దాటించి మొరాకోలోని టాంజియర్ నగరానికి నవలా నాయకుడిని చేర్చాక పౌలు కోయిలో తన ముస్లింల వ్యతిరేకతను, క్రైస్తవ పక్షపాతాన్ని ఏ మాత్రం దాచుకోలేకపోయాడు. అక్కడి వ్యాపార వీధుల్లో శాంటియాగో తిరుగుతుండగా మసీదులో ప్రార్థన విని అక్కడి ముస్లింలంతా

ఉన్నపళాన మోకాళ్లమీద నిల్చుని తలలు నేలకు ఆనించి ప్రార్థనలో నిమగ్నమౌతారు.

'ఏ ప్రాక్టీస్ ఆఫ్ ఇన్‌ఫిడెల్స్' అనుకుంటాడు శాంటియాగో. ఇన్‌ఫిడెల్స్ అంటే విమతస్తులు/ పరమతావలంబకులు/ క్రైస్తవేతరులు అనే సున్నితార్థాలను ఈ సందర్భంలో చెప్పుకోవాల్సిన పనిలేదు. దైవప్రార్థనలో నిమగ్నమైన ముస్లింల గురించిన ఆ తలంపులో మతద్రోహులు, మతభ్రష్టులు, విశ్వాసఘాతకులు అనే అర్థాలే ఉన్నాయని చెప్పుకోవాలి. నర్మగర్భితమైన ద్వేషంతో అతను 'మతభ్రష్టుల ఆచారాలు' గురించి తలపోశాడు. ఇంకాస్త ముందుకెళ్తే ఈ విషయం మనకు బాగా బోధపడుతుంది.

'ఏ ప్రాక్టీస్ ఆఫ్ ఇన్‌ఫిడెల్స్' అని తనలో తాను అనుకున్న తర్వాత శాంటియాగోకు సెయింట్ శాంటియాగో గుర్తొస్తాడు. జీవన్ముక్తుడు జీసస్ శిష్యుడిగా, అపొస్తలుడిగా శాంతిమంత్రం జపిస్తూ కాదు. అహింసాత్మక క్రైస్తవమత ప్రచారకుడిగా కానేకాదు. మూర్ స్లేయర్ రూపంలో గుర్తొస్తాడు.

'తన చిన్నతనంలో చర్చిలో సెయింట్ శాంటియాగో మటమొరోస్ చిత్రపటాన్ని ఎప్పుడూ చూసేవాడు. అందులో శాంటియాగో తెల్లటి గుర్రం మీద కత్తిపట్టి ఉండేవాడు'. అతని ప్రక్కన ఇలాంటి వారే మోకరిల్లి ఉండేవారు. సెయింట్ శాంటియాగో ముందు భయంతో మోకరిల్లిన మూర్‌లతో ఆ సమయంలో నవలానాయకుడు శాంటియాగో చూసిన భక్తితో మోకరిల్లిన ముస్లింలను రచయిత పోల్చాడు. ఉచ్ఛస్థితిలో ఉన్న క్రైస్తవుడి ముందు నీచస్థితిలో ముస్లింలు మోకరిల్లినట్లు కథానాయకుడి ఊహద్వారా రచయిత తనదైన స్పష్టమైన సంకేత భాష మాట్లాడుతున్నాడు.

అది మనసులో మెదిలాక శాంటియాగోకి నలతగా అనిపించింది. ఒంటరితనానికి గురయ్యాడు. ప్రార్థన చేస్తున్న ముస్లిందరిలోనూ అతనికి 'దుష్టత్వం గోచరించింది' అని నవల పేర్కొంది. పరమతస్తులపట్ల నవలా నాయకుడు ద్వేషభావం వ్యక్తపర్చడమూ, ముస్లిం మతాచారాలనూ, వాటిని అవలంబిస్తున్న సందర్భాన్ని హేళనగా చూడటం, భయపడటం, వారి పూర్వీకులను సంహరించిన సెయింట్‌ను గుర్తుచేసుకోవడం, ఆయన పాదాల

ముందు మూర్‌లు మోకరిల్లిన చిత్రపటాన్ని జ్ఞాపకం చేసుకోవడం, తను చూస్తున్న ముస్లింలలాంటి వారే సెయింట్ ముందు మోకరిల్లింది అని సంభావించడం నవలా రచయిత మతవిద్వేషానికీ, క్రైస్తవ పక్షపాతానికీ తిరుగులేని ఉదాహరణలు. దుష్టులనీ, వారిని లొంగదీసుకోవాలనీ ఈ సన్నివేశంలో రచయిత చెప్పక చెప్పాడు. శ్వేతజాతి వలస దురహంకారాన్ని ఈ సన్నివేశం స్పష్టంగా వ్యక్తీకరించింది.

ముస్లింల పట్లేకాదు, జిప్సీల పట్ల కూడా రచయితది దురంహంకారపూరిత వైఖరి. ప్రార్థనలో ఉన్న ముస్లింలను చూసి భయపడినట్టుగానే అంతకు ముందు అండలూసియాలో ఒక చోట జిప్సీ మహిళను చూసి శాంటియాగో భయపడతాడు. ఆందోళనకు గురౌతాడు. 'ఇతరులను మోసం చేసి జిప్సీలు బ్రతుకు వెళ్ళదీస్తుంటారని ప్రజలు చెప్పారు. వాళ్ళకి దెయ్యంతో ఒప్పందం ఉందనీ చెప్పుకునేవారు. పిల్లలను ఎత్తుకుపోతారని, వాళ్ళ మార్మిక స్థావరాలకు తీసుకెళ్తారనీ, బానిసలుగా చేసుకుంటారనీ చెప్పుకునేవారు. తనను జిప్సీలు బంధిస్తారన్న చావు భయం అతన్ని బాల్యమంతా వెంటాడింది. జిప్సీ వృద్ధురాలు అతని చేతులను తన చేతుల్లోకి తీసుకునేసరికి ఆ చిన్ననాటి భయం అతన్ని తిరిగి ఆవహించింది.'

ఆ భయాన్ని పోగొట్టుకునేందుకు శాంటియాగో ఏం చేశాడు? ముస్లింల విషయంలో చేసినదే. అంజనేయ దండకంలాగా క్రైస్తవ స్తోత్రాన్ని వల్లెవేశాడు. 'అక్కడ క్రీస్తు పవిత్ర హృదయం బొమ్మను ఆమె వుంచింది అని తనను తాను సమాధానపరచుకునే ప్రయత్నం చేశాడు... నిశ్శబ్దంగా అవర్ ఫాదర్ (క్రైస్తవస్తోత్రం)ని మనసులో మననం చేయడం మొదలు పెట్టాడు'. ముస్లింల గురించిన భయమైనా, జిప్సీల గురించినదైనా తన మతాన్ని ప్రతిగా పేర్కొని భయం పోగొట్టుకునే ప్రయత్నం కథానాయకుడిది. ఇక్కడ 'ప్రజలు', 'చెప్పుకునేవారు' అంటే కథానాయకుడి అస్మదీయులు(We). జిప్సీలు కూడా ముస్లింలలాగే ఇతరులు(The other). (తెలుగు అనువాదంలో జిప్సీలను బంజారాలుగా పేర్కొనడం చాలా ఘోరమైన అనువాదదోషంగా పేర్కొనాలి. బంజారాల పట్ల అనువాదకుడి బాధ్యతారాహిత్యానికి ఇది ఉదాహరణగా నిలుస్తుంది.)

టాంజియర్‌లో అరబ్బీభాష మాత్రమే మాట్లాడటం పట్ల కూడా కథానాయకుడికి భయం, అసహనం. ఎందుకంటే 'అది తనను చాలాకాలంపాటు నిధికి దూరంగా ఉంచవచ్చు'. తన డబ్బు వేటకు ముస్లిం భాషను ఆటంకంగా అతను భావిస్తాడు. సామ్రాజ్యవాదులకు తమదికాని భాషపట్ల ఉండే ఆక్రోశం శాంటియాగోకు ఉంది. ఇటీవలి చరిత్రలో ఐరోపా కోర్టులు తమ తీర్పుల్లో ఇలాంటి అసహనాన్నే పరభాషలపట్ల వ్యక్తంచేస్తూ వచ్చాయి. సరుకుల చలామణికి సుంకాలు ఆటంకం కలిగించినట్టుగానే భాష కూడా సుంకమేతర నిరోధకంగా పనిచేస్తుందనీ, భాషా వైవిధ్యాలు ఆర్థిక సమగ్రతకు, ప్రపంచీకరణకు అడ్డుగోడలనీ ఆ తీర్పులు వాపోయాయి. పరభాషా హననానికి దారితీసే సామ్రాజ్యవాద భావనలు అవి. కథానాయకుడి ద్వారా రచయిత వ్యక్తపరచిన వైఖరి కూడా సరిగ్గా ఇదే.

ముస్లింలపట్ల పాశ్చాత్యుల చిన్నచూపుకు, ముస్లిం సంస్కృతిపట్ల వాళ్ళ ద్వేషానికి ఉదాహరణగా నిలిచే ఓరియంటలిస్టు నవల ద ఆల్కెమిస్ట్. పాశ్చాత్యం (ఆక్సిడెంట్) కాని దానిని అంటే ఓరియంట్‌ను తక్కువగా చూసి, దాన్ని మార్చే, లోబర్చుకునే, దానిపై ఆధిపత్యం వహించే వలసవాద వైఖరిని ఓరియంటలిజం అని అంటారు. అలాంటి వైఖరి పాశ్చాత్య నవలలన్నిటా ఉండే సాధారణాంశంగా ఎడ్వర్డ్ సెయిద్ పేర్కొన్నారు. వలసవాదంతో జతగట్టిన కిప్లింగ్, ఫోస్టర్, కాన్‌రాడ్ రచనల్లోనే గాక, సామ్రాజ్యవాదంతో చెలిమిలేని ఆస్టిన్, డికెన్స్, హెన్రీ జేమ్స్ నవలల్లో సైతం ఇదే పరిస్థితి ఉందన్నాడు. వలస సామ్రాజ్యాన్నీ సామ్రాజ్యవాద దోపిడీని సంభవం చేసిన విలువలే పాశ్చాత్య నవలనన్నింటినీ రూపుదిద్దాయి అంటాడు సెయిద్. ఇంకాస్త ముందుకెళ్ళి సామ్రాజ్యవాదం లేకుంటే యూరోపియన్ నవలే లేదు పొమ్మంటాడు సెయిద్.

పాశ్చాత్య విలువలను, సామ్రాజ్యవాద సంస్కృతిని జీర్ణించుకున్న పౌలు కోయిలో ఆల్కెమిస్ట్ కూడా అదే రీతిలో సాగింది. స్థలకాలాలు, వస్తువు, వ్యక్తపరిచిన భావాలు అందుకు అనుగుణంగా ఉన్నాయి. ఐరోపా సామ్రాజ్యవాదంతో లోబరచుకోబడిన పరాజిత దేశం తన బ్రెజిల్ అన్న స్పృహ కోయిలోకి లేశమాత్రం లేదు. పాలకుల భాషను మాతృభాషను చేసుకొన్నాడు. బ్రెజిల్‌ను పోర్చుగల్ ఆక్రమించి ఆ దేశప్రజల మూల సంస్కృతిని, భాషను,

మతాలను ధ్వంసం చేసి వారిపై తనవైన వాటిని రుద్దిందని ఆయనకు ఎలాంటి ఫిర్యాదూ లేదు. క్రైస్తవ మతనేత పోప్ ఆశీస్సులతో 1494లో స్పెయిన్‌కు పోర్చుగల్‌కు మధ్య జరిగిన ఒప్పందం (ట్రీటీ ఆఫ్ టోర్డెసిలాస్) ఐరోపాయేతర ప్రపంచాన్ని కేకులా కత్తిరించి ఆ రెండు దేశాలకు ఆహారంగా ఇచ్చింది. అలా ఆ రెండు దేశాలకూ దోచుకునే విషయమై వచ్చిన తగవు క్రైస్తవ జోక్యంతో పరిష్కృతమైంది. దక్షిణ అమెరికా తూర్పుభాగాన్ని ఆక్రమించుకునే హక్కు పోర్చుగల్ పరమైంది. తక్షణమే పోర్చుగీసు సైన్యం దాన్ని దురాక్రమించి దానికి బ్రెజిల్‌గా నామకరణం చేసింది. తమ భాషను రుద్ది ప్రజలను క్రైస్తవీకరించింది. స్పెయిన్ నావికుడు క్రిష్టఫర్ కొలంబస్ అమెరికా ఖండాన్ని 1492లో కనుగొన్న వెంటనే వరుసగా జరిగిన విపరిణామాలు ఇవి. కోయిలో సామ్రాజ్యవాద ఆధిపత్య సంస్కృతిని అంతరీకరించుకున్నాడు. ఈ రచన రూపంలో దానినే వెదజల్లుతున్నాడు. ద ఆల్కెమిస్ట్ సామ్రాజ్యవాద భాష అయిన పోర్చుగీసులో రాశాడు. ఏడాదిలో సగభాగం ఆయన స్పెయిన్‌లో గడుపుతున్నాడు. అక్షర సరుకు అమ్ముడు పోయేందుకు మెరుగైన మార్గాలు అతనికి బాగా తెలుసు.

ఓరియంటలిజం శ్వేతజాతీయేతరులను సాంస్కృతికంగా అథమస్థాయి వాళ్ళుగా, అనాగరికులుగా, అజ్ఞానులుగా, అంధకారంలో ఉన్నవాళ్ళుగా చూస్తుంది. పాశ్చాత్య సంస్కృతి ఉన్నతం, నాగరికం, జ్ఞానం, వెలుగు. అది ఓరియంట్‌ను ఉద్ధరించే దానిగా తనను తాను సంభావిస్తుంది. ఇలాంటి భావనలు ఆఫ్రికా, తూర్పు దేశాల పట్ల ముఖ్యంగా ముస్లింల పట్ల వ్యతిరేకతను వ్యక్తీకరిస్తుంటాయి. శామ్యూల్ హంటింగ్టన్ క్లాష్ ఆఫ్ సివిలిజేషన్స్ మర్మం కూడా ఇదే.

సినిమాల్లో ఈ ధోరణి బాగా ప్రబలింది. డెల్టా ఫోర్స్ చలన చిత్రంతో 1958లో ఇది కొత్త పుంతలు తొక్కింది. ఇండియానా జోన్స్ చిత్రాలలో, పలు పాశ్చాత్య టెలివిజన్ సీరియళ్ళలో జోరుగా కొనసాగింది. కొనసాగుతోంది. ట్రూ లైస్ సినిమా మరొక తిరుగులేని ఉదాహరణ. ఇవన్నీ ముస్లింలను నీచులుగానూ, హింసాపరులుగా, దుష్టశక్తులుగానూ అన్నిటికంటే మించి చంపదగినవాళ్ళుగా చూపిస్తాయి. నల్లముసుగు ధరించిన ఓరియంటల్ మనుషులు (ముఖ్యంగా ముస్లింలు) వారితో తలపడే శ్వేతజాతి కథానాయకులు (ముఖ్యంగా

అమెరికన్‌లు, కొండొకచో అమెరికన్ నల్లజాతివారూ) అందులో ఉంటారు. చివరికి ఓరియంటల్ మరణంతో విజయం వారిని వరిస్తుంది. పౌలు కోయిలో నవలదీ అదే ధోరణి. కథానాయకుడు శ్వేతజాతీయుడే. కాకపోతే అతను వారితో యుద్ధం చేయడు. మాయ సహాయంతో లోబర్చుకొని తన పని (డబ్బు సంపాదన)లో ముందుకు సాగుతాడు.

ఓరియంటలిస్టు నవల రచనా ధోరణి 1988లోనే ప్రచురితమైన సాల్మన్ రష్డీ నవల సాటానిక్ వెర్సెస్‌లో కొత్తబాటలు వేసింది. ముస్లిం వ్యతిరేక సెంటిమెంట్ వెల్లువ తిరిగి మొదలైంది అంటాడు ఇస్మాయిల్ ఈసా పటేల్. సరిగ్గా అదే ఏడాది ప్రచురితమైనప్పటికీ తర్వాత సంవత్సరాల్లో మెల్లమెల్లగా ప్రపంచీకరణ విస్తరణతోపాటుగా ప్రాచుర్యం పొందిన ద ఆల్కెమిస్ట్ సాల్మన్ రష్డీ చేసిన పనిని కొంత నాజూకుగానూ, కొంత మొరటుగానూ చేసింది.

ఓరియంటలిజం ముస్లింలకు సాంస్కృతిక అధమత్వాన్ని ఆపాదించేటప్పుడు దానికి వారి గొప్పతనాలు ఏవీ గుర్తుకురావు. ఖగోళ, తర్కశాస్త్రాల్లో ముస్లింలు సాధించిన అద్భుత జ్ఞాన సంపదనుగానీ, వైద్యాన్ని శాస్త్రంగా అభివృద్ధి చేసిన వారి విద్వత్తును గానీ, ఆల్‌జీబ్రాకు ప్రాణం పోసిన వారి మేధోకృషిని గానీ ఓరియంటలిజం గుర్తుచేయదు. ఓరియంటలిజం జాతి వైషమ్యం. అరబ్బులను చురుకుదనం లేనివాళ్ళుగా, జడత్వంతో ఒకేచోట కాలం వెళ్ళమార్చేవారిగా, ఎదుగుదలకు శక్తిసామర్థ్యాలు లేనివాళ్ళుగా, చరిత్రహీనులుగా చిత్రీకరిస్తుంది. రూపొందుతున్న చరిత్రలో వారిది ప్రతినాయక పాత్ర. ఓరియంటలిస్టులైన శ్వేతజాతీయులకు మాత్రం శాంటియాగో లాగే తమ శక్తిసామర్థ్యాల గురించి బాగా తెలుసు. వారు ఆశావాదులు. తమ ఔన్నత్యాన్ని, అరబ్బుల అధమత్వాన్ని సదా నిర్వచించగలిగిన శక్తిగలవాళ్ళమని ఓరియంటలిస్టులు భావిస్తారని అంటాడు ఎడ్వర్డ్ సెయిద్.

ఆధునికతే ఈ జాత్యహంకారానికి మాతృక. సాంస్కృతిక పునరుజ్జీవనకాలపు యూరప్‌లో బీజప్రాయంగా ఉన్న జాత్యహంకారం వలసవాదక్రమంలో పెరిగి పెద్దదై ప్రపంచ పరివ్యాప్తమైంది. పాశ్చాత్యేతర ప్రజలందరినీ అంధకార బంధులుగా, తమచే ఉద్ధరించబడేందుకు సిద్ధంగా ఉన్న పదార్థాలుగా చూసే

వికాసయుగపు ధోరణి అది. ఆధునికతకు బాహ్యంగా ఉన్న వారిపట్ల, ఆధునికతను వ్యతిరేకించే వారిపట్ల విద్వేషాన్ని వెళ్ళగ్రక్కుతూ పెంపొందింది. అలా ఓరియంట్‌పై ఆధిపత్యం సాధించే వలస అధికార ప్రతిఫలవమే ఓరియంటలిజం. ఓరియంటలిజం, ఓరియంట్‌కు ఆక్సిడెంట్‌కు మధ్య అసమాన అధికార సంబంధానికి సైద్ధాంతిక వ్యక్తీకరణ మాత్రమే కాదు, అది దాని సృష్టికర్త కూడా!

ద ఆల్కెమిస్ట్ నవల రెండు ప్రపంచాలలో నడుస్తుంది. ఒకటి ఆక్సిడెంట్ మరొకటి ఓరియంట్. ఆక్సిడెంట్ ఇక్కడ యూరోపియన్ - స్పెయిన్. ఓరియంట్ అంటే ఆఫ్రికన్ -మొరాకొ, ఈజిప్టు. ఒకటి పాశ్చాత్యం. క్రైస్తవం, తెల్లప్రపంచం (తెలుపంటే పౌలు కోయిలోకి చాలా యిష్టం - ఒక షాపులో తెల్లని పక్షి ఈకను చూడటం తటస్థించాక ఈ రచన ప్రారంభించాడు). మరొకటి ముస్లిం ప్రపంచం. 'మూరిష్' (నల్ల) ప్రపంచం. మొదటిది ఉత్తరగోళార్థంలో, రెండవది దక్షిణ గోళార్థంలో ఉన్నాయి. మొదటిది రెండవ ప్రపంచంలో, రెండవది మూడవ ప్రపంచంలో భాగం. మొదటిది - అండలూసియా (స్పెయిన్) కథానాయకుడి జన్మస్థలం. సస్యశ్యామలం. జిప్సీలాంటి వాళ్ళు తప్ప అక్కడి వాళ్ళలో ఎవరూ చెడ్డవాళ్ళు లేరు. కథానాయకుడికి ఏ సమస్యలూ తెచ్చిపెట్టరు. రెండవది - మొరాకో, ఈజిప్టు ప్రాంతం. ఎడారి. ఇసుక పర్ర. అక్కడివాళ్ళు 'ఇన్‌ఫిడెల్స్'. కేవలం అరబ్బీ మాత్రమే మాట్లాడేవాళ్ళు. కారణాలు లేకుండా యుద్ధాలు చేసి రక్తాలు పారించే తెగలవాళ్ళు. దొంగలు, అజ్ఞానులు, సమూహాజీవితం గడిపేవాళ్ళు - స్వేచ్ఛ లేనివాళ్ళు. తెల్లతోలున్న పాశ్చాత్య కథానాయకుడి ద్వారా ఉద్ధరించబడాల్సిన నల్లవాళ్ళు.

టాంజియర్‌లో జోగుతున్న గాజువస్తువుల వ్యాపారిని మేలుకొల్పిన వైతాళికుడు శాంటియాగో. అతనికి అభివృద్ధి మంత్రం బోధించి, దాన్ని ఆచరించి చూపిన దార్శనికుడు. అతనిలో డబ్బు సంపాదన యావను నిద్రలేపి అతని దుకాణాన్ని 'అభివృద్ధి'చేసి పెడతాడు. 'బ్రతకడం' ఎలానో నేర్పుతాడు. 'నా జీవిత పద్ధతిని మార్చుకోవాలి' అని ఆ వ్యాపారి మారుమనసు పొందేలా చేస్తాడు. (నవలలో చెప్పిన కొరాన్ బోధనలు అతనికి ఆ విషయం నేర్పవు). 'నువ్వు నిజంగా నా పాలిట వరానివి' అంటాడు. తర్వాత శాంటియాగో టాంజియర్

నగరాన్ని విడిచిపోయే సందర్భంలో గాజు దుకాణాన్ని బాగుచేయడం గుర్తుకు తెచ్చుకుని 'ఆ ప్రదేశాన్ని జయించాను' అనుకుంటాడు. ముస్లిం 'వెనుకబాటు'పై పాశ్చాత్యుడి విజయం. ఇక తను 'ప్రపంచాన్ని జయించగలను' అనుకుంటాడు. రెండు పేజీల తర్వాత మరోసారి నవలలో శాంటియాగో గాజు దుకాణాన్ని గుర్తుచేసుకుని ఆత్మవిశ్వాసాన్ని ఇనుమడింపజేసుకుంటాడు. 'ప్రపంచాన్ని జయించగలనని' మరోసారి అనుకుంటాడు. అతని లక్ష్యం ధనం కాబట్టి డబ్బుతో ప్రపంచాన్ని జయించగలనని అనుకుంటాడని భావించాలి.

తర్వాత ప్రకృతి శక్తుల సహకారంతో అరబ్బులను నిరుత్తర పరుస్తాడు. వారిని తన మాయ కింద కమ్మేస్తాడు. వారి అగ్రనేతను శిష్యుడిగా చేసుకుంటాడు. వారి అహేతుక నిర్బంధం నుంచి విముక్తుడై నిధివేటలో ముందుకు వెళ్తాడు. దానికి ముందు మరొకచోట (ఒయాసిస్సు దగ్గర) రానున్న ప్రమాదాన్ని గురించి అరబ్బులను హెచ్చరించి వారిని కాపాడి బహుమతులందుకుంటాడు. రనా కబ్బాని వేరే సందర్భంలో అన్నట్లు 'యూరోపియన్ వలసవాది ప్రతిబింబం గౌరవప్రదమైనది'. అతను దోపిడీదారుడిగా రాలేదు. 'జ్ఞానదాత' (enlightener) గా వచ్చాడు.

పేరుపెట్టబడిన ఒకే ఒక స్త్రీపాత్ర ఈ నవలలో ఫాతిమా. ఫాతిమా అంటే అరబ్బీలో 'వెలుగొందుతున్నది' అని అర్థం. ఆమె పవిత్రతకి, పుణ్యస్త్రీకి ప్రతిరూపం. మహ్మద్ ప్రవక్త కుమార్తె. ఆయన వారసురాలు. ఆయనకు తల్లిగా, అరేబియన్ చంద్రదేవతగా ఆమెను ముస్లింలు భావిస్తారు. ఇమామ్‌ల మాతగా కీర్తిస్తారు. ఆమె కన్యమేరీకి ముస్లిం సమానురాలు. ఆమెతో శాంటియాగో ప్రేమ దేనికి సంకేతం? ముస్లిం స్త్రీత్వంపై పాశ్చాత్య మగతనం ఆధిపత్యానికి సంకేతం. స్త్రీని ప్రకృతి అనుకుంటే పాశ్చాత్య సంపన్నత దాన్ని లోబరుచుకోవడంతో నవల ముగుస్తుంది. తను శాంటియాగోలో భాగమని ఫాతిమా ఒకచోట ప్రకటిస్తుంది. ఎందుకంటే 'నువ్వు విశ్వభాష నేర్చావు. ప్రపంచాన్ని గురించి చెప్పావు' అంటుంది.

శాంటియాగోకు తగిన తత్వదర్శనాన్ని ఈ నవలలో రచయిత ఒక బైబిల్ పాత్ర చేత చెప్పిస్తాడు. సాలెమ్ రాజు మెల్కిజిడెక్ తరఫాలో శాంటియాగోకి తత్వబోధ చేస్తాడు. బైబిల్‌లో సాలెమ్ రాజు మెల్కిజిడెక్, సాలెం జెరూసలెమ్ ఒకటే. ఉరిమ్, తుమిమ్ అనే రంగురాళ్ళను సాలెమ్‌రాజు శాంటియాగోకి ఇస్తాడు.

బైబిల్‌లో ఉరిమ్, తుమిమ్ ప్రస్తావన ఉంది. యెహోవా ఇచ్ఛను తెలియజేసేవిగా వాటిని పేర్కొన్నారు. మెల్కిజిడెక్ పాత్ర ద్వారా, ఉరిమ్, తుమిమ్ ద్వారా, ఒక రకంగా ఫాతిమా ద్వారా (ఈ పేరుగల నగరం క్రైస్తవ తీర్థయాత్రా స్థలం. పోర్చుగల్‌లో ఉంది.) రచయిత తన క్రైస్తవ ప్రపంచానికి ఈ నవల తమదేనన్న సంకేతాలు స్పష్టంగా పంపాడు.

క్రైస్తవ ప్రపంచంలో ఈ నవల అమ్మకాలకూ, రచయిత ఓరియంటలిస్టు దృక్పథానికీ, క్రైస్తవ సంకేతాల వాడుకకూ సంబంధం ఉంది. యూరప్, అమెరికాల్లో క్రిస్మస్ సందర్భంగానే కాక, ప్రతి క్రైస్తవ పండుగకూ తప్పక ఇవ్వాల్సిన బహుమతిగా ఈ నవల ప్రాచుర్యం పొందింది.

పోప్ జాన్‌పాల్-II పౌలు కోయిలోని 1998లో వాటికన్ నగరానికి ప్రత్యేకంగా ఆహ్వానించి సత్కరించారు.

**II**

"...The boy (Santiago) knew that in money there was magic; whoever has money is never really alone" - The Alchemist

ద ఆల్కెమిస్ట్ నవలా నాయకుడి దృక్పథాన్ని పై విషయం సూచిస్తుంది. అతని లక్ష్యానికి తాత్విక ప్రాతిపదిక అదే. ఆ లక్ష్యసాధన కోసం (నిధికోసం) నవలా నాయకుడు చేసే కష్టతర యాత్రానుభవాల సమ్మిళితమే నవల. ఆధునిక పూర్వకాలాన్ని కథావస్తువుగా తీసుకున్నప్పటికీ ఈ నవల స్పష్టంగా ఆధునిక కాలపు, ప్రపంచీకరణ యుగపు విలువలను ప్రతిష్టించేది. ప్రపంచీకరణలోని ఆధునికత దశను ప్రఖ్యాత సామాజిక శాస్త్రవేత్త జిగ్మంట్ బౌమన్ ద్రవాధునిక కాలం (Liquid Modernity) అంటాడు. పారిశ్రామిక విప్లవానంతరం ఏర్పడిన ఆధునిక ప్రపంచానిది ఘన ఆధునికత, స్టీలు, సిమెంటు, కాంక్రీటు, ఫోటోగ్రఫిక్‌ఫిల్ము దాని ప్రతీకలు. సైబర్ ప్రపంచం, ఎరేజబుల్ టేప్ దీని ప్రతీకలు. తేలికమాటల్లో చెప్పాలంటే -- ద్రవాధునిక ప్రపంచం అన్ని ద్రవాల్లాగే ఉన్న చోట నిలబడలేదు. తనలో ఉన్న అన్నిటి రూపాల్ని మార్చుతూ పోతుంది. తనకడ్డు వచ్చే వాటిని మార్చుతూ, కరిగించుకొంటూ నిరంతర చలనంలో ఉంటుంది. అంటే ముట్టనట్టు ఉండటాన్ని జీవన శైలిగా మార్చి ప్రేమలను డిస్పోజబుల్

చేసింది ఈ కాలం. మనల్ని ఆకర్షించేవి మారతాయి. మన కలలు మారతాయి. మనల్ని భయపెట్టేవి, మనం కోరుకొనేవి, అసహ్యించుకునేవి, ఆశపెట్టేవి, నిరాశపెట్టేవి మారుతూ ఉంటాయి. మనల్ని కొందరితో కలిపి, విడదీసే స్థితిగతులు, మన భవిష్యత్తు ప్రణాళికలకు ఆధారభూతాలైన సంగతులు నిరంతర మార్పులో ఉంటాయి. మన సంతోష దుఃఖకారణాలు మారుతుంటాయి. మనల్ని సంతోషపెట్టే పరిస్థితులు మారి దుఃఖపెట్తాయి. ఒకప్పుడు దుఃఖానికి కారణమైనవే సంతోషపెడ్తాయి. నిరంతరం మనల్ని తేలుస్తూ ముంచుతూ అస్థిరంగా ఉంచుతాయి. నిరంతర పరుగులో ఉంటూ మార్పుతో ఉక్కిరి బిక్కిరి కావడం, ఆశ్చర్యపోవడం మనవంతు.

ద్రవాధునిక విలువలలో ఒకటి మహత్తర ఆశయాలు లేకపోవడం. కేవలం వ్యక్తిగా షెల్‌లో (సెల్ఫ్‌లో) ఉండగలగడమే కాదు, ఉండటమే గొప్పదిగా భావించడం. నవలానాయకుడికి ఉదాత్త ఆశయాలు లేవు. ప్రపంచాన్ని మార్చాలనో, విప్లవాలు తేవాలనో, ప్రజలు సుఖశాంతులతో వర్ధిల్లే సమాజాలను సృష్టించాలనో అతను పొరపాటున కూడా అనుకోలేదు. మహాకథనాలకు కాలం చెల్లిందని ఆధునికానంతర వాదం చెప్పింది. అందుకు శాంటియాగోను లేదా అతని సృష్టికర్త కోయిలోను తప్పుపట్టాల్సిన పనిలేదనుకుంటే - కనీసం ఎవరికైనా సాయపడాలన్న ఆలోచన కూడా శాంటియాగోకు ఉన్నట్టు నవలలో ఎక్కడాలేదు. తన గురించి తప్ప కథానాయకుడు మరొకరి క్షేమం తలచినట్లు లేదు. అతను కేవలం స్వార్థంతో సాహసికమైన ప్రయాణాన్ని చేపట్టినవాడు. అతనిది స్వార్థార్థం సాగిన ప్రస్థానమే. తనకు నిధి దొరికాక దానిలో కొంత భాగమైనా లోకకళ్యాణం కోసం ఖర్చుపెట్టాలన్న తలంపు లేకపోవడమే దీన్ని 'మంచి పుస్తకం' చేసినట్టుంది. అతను ఆధునిక స్వార్థ పరాయణుడు. తనపరంగా మాత్రమే ప్రపంచాన్ని చూసే అణుమాత్ర మానవుడు. సంపద పొందేందుకై అదీ ఎవరో దాచిపెట్టిన ధనం మూటను కైవశం చేసుకొనేందుకై అతను చేసే ప్రయాణాన్ని కీర్తిస్తూ, ఆ స్వార్థాన్ని ఉదాత్తీకరించే ఈ కట్టుకథకు ప్రపంచవ్యాప్త ఆదరణ రావడం నేటి కాల మహిమ. ఇది ఎందరి జీవితాలకో వెలుగు కావడం మనకాలపు విషాదం.

స్వార్థపూరిత కథానాయకుడి లక్ష్యసాధనకు తప్పుడు తాత్వికతను మేళవించి, పిట్టకథలతో రంగరించి ఆకర్షణీయంగా తయారుచేసిన రచయిత గొప్పదనాన్ని

మెచ్చుకోకుండా ఉండలేము. 'నీకు ఏదైనా కావాలనిపించినప్పుడు నువ్వు దానిని సాధించడంలో సహాయపడేందుకు ఈ విశ్వమంతా కుట్రపన్నుతుంది'. అయితే నువ్వు కావాలనుకున్నది నీ జీవిత గమ్యమై ఉండాలి. మరో షరతు - ఏనాడూ నువ్వు నిరాశచెందకుండా పట్టుదల కోల్పోకుండా గమ్యం దిశగా ప్రయాణం చేయాలి. దీన్ని తాను నమ్ముతానని పౌలు కోయిలో చాలా సార్లు చెప్పుకున్నాడు. ద ఆల్కెమిస్ట్ నవల మొత్తానికీ ప్రాతిపదికగా దీన్నే ఆయన ప్రస్తావించాడు.

నీ లక్ష్యం ఉదాత్తమైనదీ, ఉన్నతమైనదీ కాకపోయినా ఫర్వాలేదు. అది నీదే అయితే దాని సాధనకు విశ్వాత్మ కుట్ర చేయకమానదు అని మెల్కిజిడెక్ (సాలెమ్‌రాజు) పాత్ర ద్వారా కథానాయకుడికి రచయిత ఉద్బోధ చేస్తాడు. విశ్వాత్మ అంటే ఏమిటో అడక్కండి. విశ్వాత్మది చెడు (కుట్ర) ఎందుకు అవుతుందో కూడా అడక్కండి. సాలెమ్‌రాజు తరీఫాలో శాంటియాగోకి ఇంకా ఇలా బోధిస్తాడు. 'నువ్వు ఎవరివైనా, ఏమి చేస్తున్నా నీకు నిజంగా ఏదైనా కావాలనిపించిందంటే ఆ కోరిక విశ్వాత్మలో పుట్టింది. ఈ భూమిపైన నీ కర్తవ్యం అదే! అది విన్నాక శాంటియాగో - 'అది కేవలం ప్రయాణం చేయడం కావచ్చా లేదా ఒక వస్త్రవ్యాపారి కూతురిని పెళ్ళి చేసుకోవడం కావచ్చా?' అని అడుగుతాడు. 'కావచ్చు, లేదా నిధికోసం వెతకడం కూడా కావచ్చు. ఈ విశ్వాత్మ ప్రజల సంతోషం నుంచి బలపడుతుంది. దుఃఖం, ఈర్ష్య, అసూయల నుంచి కూడా ఎవరి జీవిత గమ్యాన్ని వారు సాధించడమే వారి ఒకే ఒక నిజమైన కర్తవ్యం. అన్నీ ఒకటే.... నీకు ఏదైనా కావాలనిపించినప్పుడు నువ్వు దానిని సాధించడంలో సహాయపడటానికి విశ్వమంతా కుట్రపన్నుతుంది' అంటాడు మెల్కిజిడెక్.

నువ్వు హీరోషిమాపై బాంబులు వేయాలనుకున్న అమెరికా యుద్ధవిమాన చోదకుడివి కావచ్చు. సూరిబావ కళ్ళలో కాంతి చూసేందుకు బయల్దేరిన మొద్దు శీనువు కూడా కావచ్చు. సూరిని చంపాలనుకున్న భానువి కూడా కావొచ్చు. నీకు విశ్వాత్మ సహకరిస్తుంది. నువ్వు భోఫోర్స్ రాజీవుడివైనా, ఖత్రోచీవైనా, 2-జి స్పెక్టమ్ రాజావైనా ఫరవాలేదు. నీకోసం ప్రకృతి అన్నీ అమరుస్తుంది. నువ్వు సిలికాన్ వ్యాలీలో సైబర్‌కూలీవై కన్నతల్లిదండ్రులను, మాతృదేశాన్ని వీడి డాలర్‌వేటలో ఉన్నా సరే ఖచ్చితంగా నువ్వు శాంటియాగో తరహావాడివే. సందేహం లేదు. నీకు శుభం చేకూర్చే సహకారం విశ్వాత్మ పుష్కలంగా

అందిస్తుంది. ఆర్థిక సంక్షోభాల గురించి ఆలోచించనక్కరలేదు సామాజిక ఆర్థిక శక్తుల గురించిన చింతతో పనేలేదు నీ భవిష్యత్తుకు నువ్వే కర్తవు. నీ లక్ష్యం నుంచి నీ ఆలోచనను ఏ మాత్రం బెసకనీయకుండా ముందుకు సాగు. డాలర్ వర్షంలో తడిసి ముద్దవుతావు. నీ ఆశయసిద్ధికి విశ్వాత్మ ఇన్సూరర్‌గా మారుతుంది. నువ్వు విఫలమయ్యావా, నీ జీవితానికి విశ్వాత్మ కేటాయించిన లక్ష్యం/గమ్యం అదికాదని గ్రహించు. గ్రహించకపోవడం నీ వెర్రితనం. నీ వ్యక్తిగత వైఫల్యంగా దాన్ని గుర్తించు. నీ 'సొంత' కల నువ్వు కనలేదని నమ్ము.

ఒకరికి అభిముఖంగా మరొకరి కల/లక్ష్యం/గమ్యం ఉన్నాయనుకోండి. విశ్వాత్మ ఇద్దరికీ సహకరిస్తుంది కదా! అనే ప్రశ్నను ఈ 'తాత్విక' రచయిత వేసుకోలేదు. ఎడారి తెగల యుద్ధాల్లో ఇరుపక్షాలూ సమవుజ్జీలనీ, అల్లా ఇరువైపులా ఉన్నాడు కాబట్టి, యుద్ధం సుదీర్ఘకాలం కొనసాగుతుందని ఒంటెల బిడారం నాయకుడు చెప్పినదాన్లో దీనికి మనం సమాధానం వెతికితే నవల మొత్తం ప్రాతిపదిక వినిర్మాణం అవుతుంది. వైరిపక్షాల లక్ష్యాలను నెరవేర్చే కుట్రకు విశ్వాత్మ పాల్పడితే ఏమవుతుంది? పరస్పర విరుద్ధమైన విషయాలు తన ప్రతిపాదనలో ఉన్నట్లు రచయిత గమనించలేకపోయాడు.

ఈ నవల అట్లాంటిక్‌కు అటూ, ఇటూ ఉన్నవాళ్ళకూ, ఆధునిక జీవితపు వెంపర్లాటలో అట్లాంటిక్ తీరానికి చేరుకోవాలన్న ఆరాటం, డాలర్ వాలులో కొట్టుకుపోవాలనే తపన ఉన్న యువతకు కిక్కినిస్తుంది. ప్రపంచీకరణ భావజాలంతోపాటు ద ఆల్కెమిస్ట్ నవల అమ్మకాలూ పెరిగాయి. మార్పుకు సిద్ధం కావాలనేది శాంటియాగో ఆత్మఘోష. ధనంకోసం జరిపే వ్యక్తి అన్వేషణలో ఆత్మను పునఃరూపకల్పన చేసుకోవాలని అది చెప్తుంది. ఈ నవలలో నిరంతర చలనముంది. గొర్రెలతో చలనంలో ఉన్న కథానాయకుడితో మొదలైన నవల, చివరికి నిధి సంపాయించాక ప్రేయసి కోసం పరుగెత్తడంతో ముగుస్తుంది. నిరంతరం చలనంలో ఉండటం ద్రవాధునిక లక్షణం. 'అంతరాయం, అసంబద్ధత, ఆశ్చర్యం అనేవి మన జీవితంలో సామాన్య విషయాలయ్యాయి. అనేక మంది ప్రజల అవసరాలుగా కూడా అవి మారాయి. హఠాత్పరిణామాలతో 'ఎప్పుడూ సరికొత్త వుత్తేజాలతో తప్ప మరేవాటితో మన మెదళ్ళు నిండిలేవు. ఎక్కువకాలం మనగలిగేదానిని ఇక ఎంతమాత్రం మనం భరించలేము'

అంటాడు పాల్ వేలరీ. దీన్ని ఉల్లేఖించిన జిగ్మంట్ బౌమన్ 'ఆధునికంగా ఉండటం అంటే ఆగలేకపోవడం, నిలబడి ఉండగలిగే శక్తిని కోల్పోవడం' అంటాడు. ఈ నవలలో తుది నుంచి చివరి వరకూ ఇది కనిపిస్తుంది. ఆశయాలతో సంబంధం లేకుండా చేగువేరా మోటార్ సైకిల్ డైరీని ప్రేమించడంలో రహస్యం ఇదే. ఒకే సందర్భంలో అటు డాలర్ వేటకు, ఇటు చే మోటార్ సైకిల్ డైరీకి అభిమానులు కాగలరు. నేటి ద్రవాధునిక యువతరం సామ్రాజ్య సాంస్కృతిక పిశాచి మైకేల్ జాక్సన్ మృతికి సాహిత్య తర్పణాలూ వదలగలదు. దానికి వ్యక్తిగత లబ్ది తప్ప మరో యావలేని శాంటియాగో నిధి ప్రస్థానం అత్యంత ప్రీతిపాత్రం కాగలదు.

శాంటియాగోకి చరిత్ర గతం లేదు. దేశీయ సంస్కృతి పట్ల మమకారం లేదు. కాస్తో కూస్తో ఉన్నప్పటికీ వాటి నుంచి దూరం కావడం అతని లక్ష్యానికి అవసరమైంది. గతం నుంచీ, సంస్కృతి నుంచీ తుంచివేయబడిన అణువు ఆధునిక వ్యక్తి. అతడు/ఆమె పారిశ్రామిక విప్లవానంతరమే పుట్టారు. గతం ఒక పీడకల. ఒక బంధనం. 'స్వేచ్ఛ' అనేది గతం నుంచి తప్పుకోవడంలో ఉంటుంది. తల్లి, తండ్రి, సొంతవూరు, సంస్కృతి అన్నీ గతావశేషాలే. అన్నీ గుదిబండలే. గతం నుంచి ఎంత దూరమైతే అంత ఆధునికత. ఆధునికతకు గతం ఉండదు. 'గతం' విధ్వంసమే దానికి పునాది. ఎంతగా చలిస్తే అంత స్వేచ్ఛ. అది నీ నిధికి నిన్ను చేర్చే ఉపకరణం. అణుమాత్ర మానవుడు శాంటియాగో. ప్రయాణిస్తూ పలు ప్రదేశాలు చూడాలన్నది అతని తొలి లక్ష్యం. పాడుపడిన చర్చిలో నిధి గురించిన కల తర్వాత అతని లక్ష్యం కేవలం చలనం కాదు. డబ్బు సంపాదన కోసం చలనం. ఇక ప్రస్థానమంతా ధనార్జనే ధ్యేయంగా సాగుతుంది.

కథానాయకుడి తల్లి గురించిన వూసే లేదు. తండ్రి గురించి కొద్దిపాటి ప్రస్తావన ఉంది. తర్వాత నవల్లో శాంటియాగో తన సొంతవూరు గురించీ, తల్లిదండ్రుల గురించీ అంతగా తల్చుకున్నట్లు లేదు. వారి వియోగం అతన్ని లేశమాత్రమైనా బాధించిన దాఖలా కంచుకాగడా వేసినా ఈ నవల్లో కన్పించదు. క్రైస్తవ మతబోధకుడు కావాలన్న తల్లిదండ్రుల కోర్కెను శాంటియాగో తిరస్కరిస్తాడు. ప్రయాణించడాన్ని లక్ష్యంగా ప్రకటిస్తాడు. 'పేదలు ప్రయాణించడానికి అనువైన సాధనం గొర్రెల మంద అని అతని తండ్రి చెప్తాడు.

కొద్దిపాటి వారసత్వ సంపద (తండ్రికి దొరికిన పురాతన నాణాలు) అమ్మి గొర్రెలు కొంటాడు. అలా చలన ప్రపంచంలోకి అడుగిడేందుకు తల్లిదండ్రులనూ, సొంతవూరునూ, చివరికి స్వదేశాన్నీ కూడా వదిలేస్తాడు. (సొంత ఊళ్ళో పొలం అమ్మి విదేశాలకు విమానం టిక్కెట్టు కొనుక్కునేవాళ్ళు గుర్తొస్తారు). పుట్టిపెరిగిన పరిసరాల నుంచీ, కుటుంబం నుంచీ - ఒక్క మాటలో సమూహ జీవితం - నుంచీ స్వేచ్ఛ పొందుతాడు. (స్వేచ్ఛ అంటే ఎవరినుంచీ, ఎక్కడినుంచీ అన్న ప్రశ్న వేసుకోవాలి అని బౌమన్ అంటాడు). తర్వాత అతనికి సమూహ జీవితం లేదు. అంతా వ్యక్తిగతమే ఏ సమాజంలోనూ అతను భాగం కాడు.

గొర్రెలతో కథానాయకుడి సంబంధం చలనం కోసం ఏర్పరచుకున్న సంబంధం. ఇది ద్రవ సంబంధమే. గాఢమైనది కాదు. గొర్రెలు అతనికి చలనసాధనాలు మాత్రమే. అతని గొర్రెల కాపరితనం అంతంత మాత్రమే. 'గొర్రెల కాపరి ప్రయాణం చేయవచ్చు. తన గొర్రెలను ఎప్పటికీ మర్చిపోరాదు' అని సాలెమ్‌రాజు శాంటియాగోకు చెప్తాడు. కానీ నిజంగా గొర్రెల కాపరి కాడు కాబట్టి శాంటియాగో గొర్రెలను పూర్తిగా మర్చిపోతాడు. అందువల్లనే పుస్తకాలు చదవగలిగీ గొర్రెలకాపరిగా ఎందుకు ఉన్నాడనే తొలి ప్రేయసి సందేహాన్ని అతను నివృత్తి చేయడు. గొర్రెల సమూహంతో ఏ గాఢానుబంధం అతనికి ఏర్పడదు. ఒకానొక దశలో కొంత సంబంధమూ ఏర్పడినట్టు అన్పిస్తుంది. గొర్రెలతో మాట్లాడతాడు, వాటి కష్టనష్టాలను గమనించి స్పందిస్తాడు. వాటికి పుస్తకాలు చదివి వినిపిస్తాడు. ఆధునికులకు వస్తువులతో, కార్లు లాంటి చలనశీల వినియోగ సరుకులతో ఏర్పడే ప్రేమానుబంధం లాంటిదే అది. గొర్రెలతో శాంటియాగోకు fleeting coalition, floating bond మాత్రమే వుంది. అంతిమంగా తన నిధి వేటకు అవసరమైన నిధుల కోసం వాటిని తెగనమ్మడానికి కూడా అతను వెనుకాడడు. వారసత్వ సంపద నాణేల రూపంలోంచి గొర్రెలుగా మారి తిరిగి ఇప్పుడు డబ్బులుగా మారుతుంది. అతనికి స్వస్థలం నుంచి ఏర్పడిన ఒకే ఒక బలహీనబంధం అంతటితో తెగిపోతుంది. దేశీయ ప్రకృతితో అతనికి చివరి భౌతిక బంధం అలా అంతమౌతుంది. 'ఏదో ఒక మార్మికశక్తి తన జీవితాన్ని రెండేళ్ళుగా గొర్రెలతో ముడిపెట్టినట్టు గమనించాడు. గత రెండేళ్ళుగా వాటితో గడిపాడతను. మేత, నీళ్ళు వెతుక్కుంటూ గ్రామీణ ప్రాంతంలో వాటిని తిప్పాడు'.

అవి తన దినచర్యకు కాక తానే వాటి దినచర్యకు అలవాటుపడ్డానని అతను అనుకుంటాడు. తర్వాత అతను ఆ బంధం నుంచి తప్పుకుంటాడు.

ఎవరితోనూ గాఢమైన అనుబంధంలో ఉండకపోవడం, అవసరమైతే ఒక బంధాన్ని వదిలేసి మరో బంధంలోకి వెళ్ళేందుకు సదాసిద్ధంగా ఉండటం ద్రవాధునికత ప్రత్యేకతలు. అది స్నేహమైనా, ప్రేమైనా, వ్యాపారమైనా ఇదే స్థితి, 'Until further notice relationship' అంటాడు బౌమన్. తొలి ప్రేయసి (ఈమెకు పేరు లేదు) విషయంలో సైతం అతని సంబంధం అదే. ఆమె గురించిన తలంపు తనను నిధికి దూరం చేస్తుందని తలచి రెండవసారి ఆ మార్గంలో వెళ్ళకుండా వేరే మార్గంలో ప్రయాణిస్తాడు. అలా ఆమెతో అనురక్తికి దూరం కావడం ధనమే లక్ష్యంగా సాగిన అతని ప్రయాణానికి అవసరం. ఆమె తనను మర్చిపోయి ఉండవచ్చు ననుకుంటాడు. ఎందరో గొర్రెల కాపర్లు గొర్రెబొచ్చు అమ్ముతూ ఆ దారిన వెళ్ళారు. అతనికి 'అదేమంత విషయం కాదు,' ఎందుకంటే 'నాకు ఇతర ప్రదేశాల్లో వేరే అమ్మాయిలు తెలుసు' అనుకుంటాడు. ఎవరైనా ఒకటే 'కానీ అది పట్టించుకోవాల్సిన విషయమని అతనికి తెలుసు' అని రచయిత రాసినప్పటికీ అతను పట్టించుకోకుండా ఆమె ఉన్న ఊరునుంచి దారి మళ్ళడమే ఖాయంగా జరిగింది. డబ్బుయావతో ప్రేయసిని వదలడం ఇక్కడ ఉదాత్తలక్షణంగా రచయిత భావించాడు. ఇది ద్రవాధునిక లక్షణాల్లో ఒకటి. ఏదీ గాఢంగా ఉండరాదు - డబ్బుతోనూ, దాన్ని సంపాయించాలన్న యావతోనూ తప్ప ఏదీ గాఢమైన అనుబంధం కారాదు. అంతా ద్రవమే. పారుతూ ఉంటుంది. పట్టుకోవడం సాధ్యం కాకుండా రూపాన్ని, మార్గాన్ని మార్చుకుంటూ చిక్కడు, దొరకడులా నిరంతరం చలనంలో ఉండే అణుమాత్ర జీవితం.

ద్రవాధునికత మనస్తత్వానికి గ్రామాలు సరిపడవు. గ్రామీణ వాతావరణం సెలవు రోజుల్లో ఉల్లాసానికి పనికొచ్చేదే తప్ప నివాస యోగ్యం కాదు. జీవన ప్రాంతం కాదు. 'గ్రామాల్లో ప్రతిరోజూ ఒకేలా ఉంటుంది' అనుకుంటాడు శాంటియాగో. ఎండుపళ్ళ దుకాణం యజమాని కూతురుకు కూడా 'ప్రతిరోజూ ఒకేలాంటిది. ప్రతి సూర్యోదయం తెచ్చే మార్పును గమనించలేని' హీనురాలు. ఆమెతో మాట్లాడాక అతనికి అంతకుముందు అనుభవంలో రానిది వస్తుంది. 'ఒకే చోట ఎప్పటికీ ఉండిపోవాలి' అని అనిపిస్తుంది. ఇబ్బంది పడతాడు.

ఆధునికతలో సమూహజీవితం ఉండదు. సమాజమూ ద్రవాధునికతలో శవప్రాయమే. కథానాయకుడు ఏ సమూహంలోనూ భాగం కాకుండా, సమాజంలోనూ భాగం కాకుండా చలనంలో ఉండటం దాన్నే సూచిస్తుంది. 'మానవుడిని సామాజిక జీవిగా నిర్వచించడం అంతమైంది అని ప్రకటించే కాలం వచ్చింది' అని ఎలైన్ టూరియిన్ అంటాడు. మార్గరెట్ థాచర్ బ్రిటన్ పార్లమెంట్‌లో చేసిన ప్రముఖ ప్రకటన ('సమాజం మిథ్య, వ్యక్తులు మాత్రమే వాస్తవం') వెలువడిన సంవత్సరమే ఈ నవల అచ్చువడం గమనార్హం. సమాజం నెట్‌వర్కింగ్‌గా మారింది. మానవ సంబంధాలు 'టచ్‌లో ఉండటం'గా మారిపోయాయి. శాంటియాగోకు గాఢమైన స్నేహితులు లేరు. ఒకే ఒక స్నేహితుడి ప్రస్తావన ఉంది. ఆ అనామక స్నేహితుడితో అతని సంబంధం కొనుగోలు - అమ్మకంతో ముగుస్తుంది. టరీఫాలో తన గొర్రెలను అతడి కొట్టంలో ఉంచి చివరికి అతనికే శాంటియాగో అమ్ముతాడు. 'ప్రయాణాల్లో అతనికి నచ్చేది ఎప్పుడూ కొత్త మిత్రులను పరిచయం చేసుకుంటూ ఉండటం' అని రచయిత చెప్పాడు. ఎందుకంటే 'ఎప్పుడూ వాళ్ళతోనే ఉండాల్సిన అవసరం లేదు. ఏ వ్యక్తిని అయినా జీవితంలో భాగం చేసుకోనవసరం' లేని నగరజీవితపు పోకడ మానవ సంబంధాల గాఢతారాహిత్యాన్ని తెలియజేస్తుంది. టాంటియర్‌లో కూడా అతనికి ఏ వ్యక్తితో గాఢానురక్తిలేదు. ఎవరితో పెద్దగా సంపర్కం ఉన్నట్లు లేదు. (దుకాణదారుడితో తప్ప), ఫ్రాంజ్ కాఫ్కా మెటమార్ఫోసిస్ కథలో సంచారజీవికి లాడ్జిబాయ్స్‌తో ఉండే కొద్దిపాటి పరిచయ స్నేహం లాంటివి శాంటియాగోకు ఇష్టం. కాఫ్కా కథలోలాగా. అది గాఢంగా లేకపోవడం అతనికి సమస్యకాదు. గాఢమైన స్నేహమే సమస్య. ఘనాధునికత కాలం నుంచి ద్రవాధునికత కాలం వరకూ అంటే పారిశ్రామిక విప్లవకాలం నాటి నుంచి నేటి ప్రపంచీకరణ యుగపు మానవ మనస్తత్వ పరిణామాన్ని ఇది సూచిస్తుంది. నవలలో చెప్పినట్లుగా జిప్సీ మహిళ, సాలెమ్‌రాజు మాత్రమే కాదు. శాంటియాగో కూడా అణుమాత్రుడే (Solitary Individual).

అటు అండలూసియాలోనూ, ఇటు టాంజియర్‌లోనూ అతనికి మనుషులతో ఉన్న సంబంధం డబ్బు సంబంధం, సరుకుల సంబంధమే. అండలూసియా అంతటా ఏళ్ళతరబడి తిరిగిన కథానాయకుడికి ఒక్కచోట కూడా

పొలాల్లో రైతులు తటస్థపడటం జరిగినట్లు లేదు. ప్రవాధునిక సమాజం ఉత్పత్తి ప్రధాన సమాజం కాదు. వినియోగ ప్రధాన సమాజం. దానినే నవల ప్రతిఫలిస్తుంది. జిబ్రాల్టర్‌కు ఇరువైపులా దృశ్యం అదే. ఎవరూ ఏమీ ఉత్పత్తి చేసినట్టు నవల పేర్కొనదు. దుకాణాలు, అమ్మకాలు, కొనుగోళ్ళు, భౌతిక సంపదకోసం కథానాయకుడి యావ. ఇదే నవల్లో దృశ్యాలు. ఎండుపళ్ళ వ్యాపారికి గొర్రెబొచ్చు అమ్మడం, డబ్బును బట్టి సమయం కేటాయించే జిప్సీ వృద్ధురాలితో పదిశాతం డబ్బు సంబంధం, సాలెమ్‌రాజుతో కూడా డబ్బు సంబంధం (అతనికి గొర్రెలను ఇవ్వాల్సి వస్తుంది). అటు టరీఫాలో, ఇటు టాంజియర్‌లో దుకాణాలు, వ్యాపార లావాదేవీలు ఇవి తప్ప మరొక జీవిత చిత్రణ లేదు. టరీఫాలో సాలెమ్‌రాజుకు గొర్రెలిచ్చి నిధి రహస్యం చెప్పించుకోవడం, గొర్రెలను అమ్మడం, ఓడ టికెట్ కొనుక్కోవడం, టాంజియర్‌లో బార్‌లో పానీయం కొనుగోలు, వీధుల్లో అంగళ్ళు, వాటిలో బేరసారాలలో మునిగిన అరబ్‌లు, గాజు దుకాణంలో అమ్మకాలు, టీకొట్టు వ్యాపారం, వినియోగదారులను ఆకర్షించడం - ఇది నవలా సమాజపు విశేషాలు. అవి కాకపోతే ముస్లింల మోసాలు, హింసాకాండ, రక్తపాతాలు. ఈ పూసల్లో దారంగా నవలా నాయకుడి ధనార్జన ప్రస్థానం. ఓరియంటలిజం.

పుస్తకాలను శాంటియాగో దిండ్లుగా వాడుకుంటాడు. పెద్ద పుస్తకాలు మంచిదిండ్లుగా ఉపయోగపడతాయనుకుంటాడు. 'పుస్తకాల నుంచి కాకుండా గొర్రెల నుంచి ఎక్కువ నేర్చుకున్న' కథానాయకుడు డబ్బు వేటకోసం గొర్రెలను తెగనమ్మాక పుస్తకాల నుంచి కూడా ఏమీ నేర్చుకున్నట్లు కనిపించదు. ఉంటేగింటే వాటిల్లో బంగారం గురించింది మాత్రమే అతనికి ప్రాసంగికం. అతని జీవితంలో అంతా పైపైనే. గాఢత లేదు (డబ్బు యావలో తప్ప). తన మతంలో సైతం అతనికి గాఢానురక్తి లేదు. యుక్తవయస్సు వరకూ అతనికి నేర్పిన క్రైస్తవ మతవిద్య ఏమైందో తెలియదు. దైవప్రార్థన అతని నిత్యకృత్యంలో భాగం కాదు. ఏ ఆదివారాన్నీ అతను తల్చుకున్నట్లు లేదు. ఉత్పాదక శ్రమ చేయకుండానే డబ్బు సంపాయించే పనికి ఉపయోగపడే మేరకు మాత్రమే అతను క్రైస్తవాన్ని వాడుకుంటాడు. 'ఇతరుల' గురించిన భయం పోగొట్టుకునేందుకు దాన్ని ఉపయోగించుకుంటాడు. ఇది ప్రవాధునికతకు మతం పట్ల ఉండే దృక్పథాన్ని సూచిస్తుంది.

తాత్విక గురువుగా నవల ప్రచురణానంతరం పేరు గడించిన కోయిలో తన నవలా నాయకుడు శాంటియాగోకి ప్రయత్న విరమణ చేయవద్దని సాలెమ్‌రాజు ద్వారా చేయించిన ప్రబోధలో సైతం ధనార్జనే ప్రధానంగా ఉంది. గనుల్లో ఎమరాల్డ్ (పచ్చ) కోసం తవ్వుతూ పోయిన ఒక ధనపిపాసిని ఆదర్శంగా చూపుతాడు. ఆ వజ్రసంకల్పుడి జానపద కథ నవలానాయకుడికి ధనం గురించిన ఆర్తిని పెంచి అతను మరింతగా ప్రమాదాల కోర్చి నిధి వేటలో దృఢసంకల్పంతో పాల్గొనేలా ఉత్తేజపరుస్తుంది.

చలనంలో ఉండాలి. మార్పుకు లోనుకావాలి. కొత్తదారుల వెంట ప్రయాణించాలి. మార్పు ఇక్కడ సహజమైనది కాదు. స్వీయ మనోసంకల్పంతో చేసేది. సహజమైన మార్పు అంతటా జరుగుతుంది. ఆధునిక పూర్వ సమాజాల్లోనూ అదే సత్యం. కానీ ఆధునికతలో మార్పును స్వీయ సంకల్పంతో సాధించాలి. 'నేను' మార్పుకు కేంద్రబిందువై, చోదకశక్తియై నడపాలనే ఆధునిక వ్యక్తివాదం శాంటియాగోలో జడలు విప్పుతుంది.

తాగే నీటి కోసం, తినే తిండికోసం పాటుపడటంలోనూ, జీవితమంతా ప్రతిరాత్రీ, ఒకే ప్రదేశంలో నిద్రపోవడంలోనూ ఎన్నో ఏళ్ళపాటు ప్రపంచాన్ని చూసిరావాలన్న కోరికను అతని తండ్రి అణచివేసుకున్నట్లు శాంటియాగో భావిస్తాడు. తండ్రిని వీడే సమయంలో అతను తండ్రి కళ్ళలో ఆ కోర్కెను చూస్తాడు. తండ్రి ఆధునిక పూర్వతకు, కొడుకు ఆధునికతకు సంకేతాలు. ఆధునిక పూర్వతకు సైతం ఆధునిక కోర్కెలు ఉండి కూడా వ్యక్తిగత చొరవ లేకపోయినందువల్ల అవి అణగారాయని రచయిత చెప్పదల్చుకున్నాడు. ఆధునిక పూర్వదశలో మనుషులు జంతుప్రాయులనీ, నీరు, తిండి, వసతి తప్ప మరే సంతోషమయ జీవితం లేని మోడువారిన మొద్దులనీ గ్రామీణులను కించపరుస్తాడు. 'గొర్రెలకు కావలసిందల్లా మేత, నీరు. గొర్రెలకు ప్రతిరోజూ ఒకేలా ఉంటుంది!' ఇది చెప్పిన వెంటనే గ్రామాల గురించి చెప్తూ గ్రామాల్లో ప్రతిరోజూ ఒకేలా వుంటుంది. మార్పుండదని చెప్తాడు. 'వారు (తల్లిదండ్రులు) గొర్రెల్లాగా కేవలం తిండికోసం నీళ్ళకోసం కష్టపడి పనిచేశారు' అనుకుంటాడు. గొర్రెలకు రోజులన్నీ ఒకేలా ఉన్నట్టే వారికి కూడా.

శాంటియాగోకు ఫాతిమాతో ప్రేమ సంబంధం కూడా డబ్బు సంపాదనాయావకన్నా గాఢమైనది కాదు. ఫాతిమాని వదిలేసి నిధివేటలో ముందుకు సాగేందుకు సిద్ధపడతాడు. అప్పటికే అతని దగ్గర బాగా జీవించేందుకు అవసరమైన డబ్బును అరబ్బులు కానుకగా ఇచ్చివుంటారు. అయినప్పటికీ అతను ప్రమాదభరితమైన నిధిమార్గంలో సాగుతాడు. ఎడారి స్త్రీలు వేచి వుంటారు. తమ శీలాన్ని ('పవిత్రతను) కాపాడుకుంటూ తమ మగవాళ్ళకోసం వేచి చూడగలుగుతారు. (చాలామంది ఎన్నారై పురుషులకు ఇలాంటి వారే భార్యలుగా కావాలి). దీన్నే అతను ఇష్టపడతాడు. ఆమె శీలం అతని ఆస్తి.

సమూహ జీవితాన్ని పోగొట్టుకున్న నేటి అణుమాత్ర మానవుడు ఆ స్థానాన్ని డబ్బు పూరిస్తుందనే భ్రమలో ఉంటాడు. సమూహజీవితం కోల్పోయినందువల్ల వచ్చే అభద్రతా భావాన్ని డబ్బుతో పోగొట్టుకునే ప్రయత్నం చేస్తాడు. తనకు నిధికి మధ్య ఉన్న ఒక అడ్డుకట్టగా గొర్రెలున్నాయని (రెండవది తొలి ప్రేయసి) అనుకుని ఆ బంధనాన్ని తెంచేసుకున్న శాంటియాగో దగ్గర గొర్రెలు అమ్మగా ధనం చేకూరుతుంది. 'డబ్బులో ఇంద్రజాలం ఉందనీ, డబ్బున్నవాడు నిజంగా ఏనాడూ ఒంటరికాదని అతనికి తెలుసు' అని నవల ప్రకటిస్తుంది. సమూహాన్ని వదలి ధనంతో చెలిమిలో ఊరట పొందుతాడు.

ప్రకృతి నుంచి మనిషి వేరై, ప్రకృతి మొత్తం మనిషికోసం ఉండటం (Anthropo centrism) ఆధునికత తెచ్చిపెట్టిన విషాదాల్లో ఒకటి. ఈ నవలలో ప్రకృతికి మరోపని ఉండదు - మనిషికి సహకరించడం తప్ప. ఆమె/అతను అనుకున్నదానిని సిద్ధించేలా కుట్ర చేయడమే దాని పని. ఇలా మానవ కేంద్రకంగా సమస్త విశ్వాన్ని నిర్వచించడం ప్రమాదకరమైన దృక్పథం. సమూహం నుంచి విడదీయబడిన అణుమాత్ర మానవుడిని ప్రపంచ లేదా విశ్వ సార్వభౌమ కేంద్రంలో ప్రతిష్టించింది ఆ దృక్పథం. ఇక్కడ సమూహం అంటే కేవలం మానవ సమూహం మాత్రమే కాదు - ప్రకృతిలోని సమస్తమూ. వీటి నుంచి మనిషిని వేరుచేసి మనిషి విజయానికి సోపానంగా ప్రకృతిని వాడుకోవడం జరుగుతూ వచ్చింది. మానవతావాదంగా ఇది కొనియాడ బడింది. ('దేశమంటే మట్టికాదోయ్/ దేశమంటే మనుషులోయ్' అని పేర్కొన్న గురజాడ కవిత తెలుగు సాహిత్యంలో

దీనికి తొట్టతొలి ఆధునిక సాహిత్య వ్యక్తీకరణ. మట్టి నుంచి అంటే పాంచభౌతిక ప్రకృతి నుంచి మనిషిని వేరుచేసే దారుణమైన భావప్రకటన). అలా 'ప్రకృతి' నుంచి 'మనిషి' వరకూ జరిగిన పరిణామాన్ని నవల గొప్పదిగా చిత్రించింది.

అమెరికా మాజీ అధ్యక్షుడు బిల్ క్లింటన్ ఈ నవల చదువుతూ ఫోటోకు చిక్కాడు. హాలీవుడ్ నటి జూలియా రాబర్ట్స్ రష్యా వెళ్ళినప్పుడు ఈ నవలను పొగిడింది. ఈ విషయాలను స్వయంగా రచయిత మాటగా రాసుకున్న పౌలుకోయిలోకి వ్యాపార సూత్రాలు బాగా తెలుసు. కోయిలోను ఐరాస శాంతిదూతగా నియమించింది. ఐరోపా యూనియన్ సాంస్కృతిక రాయబారి (2008) అయ్యాడు. అమెరికా, యూరప్ బిజినెస్ స్కూళ్ళలో ద ఆల్కెమిస్ట్ పారాయణ గ్రంథంగా మారింది. స్వప్నాలు దైవభాష, డబ్బుకోసం వెంపర్లాట దైవనిర్ణయం, సహజం. పెట్టుబడిదారీ విధానం సహజం అని సందేశమిస్తుంది ఈ నవల. అక్షరాలను బంగారంగా మార్చుకున్న పౌలు కోయిలో నిజమైన ఆల్కెమిస్ట్.

ప్రపంచ పెట్టుబడిదారుల అత్యున్నత సంస్థ ప్రపంచ ఆర్థిక ఫోరం (WEF) ప్రతి ఏటా దావోస్‌లో జరిపే సమావేశాలకు గత కొన్నేళ్లుగా కోయిలో ప్రత్యేక ఆహ్వానితుడు. 1999లో ప్రతిష్టాత్మక క్రిస్టల్ అవార్డుతో WEF ఆయనను సత్కరించింది.

- **ఫిబ్రవరి 6, 2011 - ది సండే ఇండియన్**

# 48. మాయదారి! మాం పాహి!!

## హక్కుల ఉడుంపట్టు

అనగా అనగా రాజులుండేవారు. వారికి కోటలుండేవి. కత్తులు కటార్లతో యుద్ధాలు జరిగే రోజులు.

కొండకోనల మీద ఎత్తైన కోటగోడలు శత్రుదుర్భేద్యంగా ఉండేవి. వాటిని ఎక్కేందుకు శత్రు సైనికులు ఉడుములను ఉపయోగించేవారు.

ఉడుము ఒకసారి గట్టిగా పట్టుపట్టిందంటే వలలదు గాక వదలదు. అందుకే రాజులు ఉడుములను పెంచి తమ వెంట యుద్ధాలకు తీసుకెళ్ళేవారు. వాటికి తేనె అంటే మహాయిష్టం. వాటి నడుముకు తాళ్ళుకట్టి ముట్టెకి తేనెరాసేవారు. శత్రురాజుల కోటగోడల మీదకు వదిలేవారు. తేనె రుచి చూసిన ఉడుములు ఇంకా తేనె దొరుకుతుందనే ఆశతో కోటగోడల పై దాకా వెళ్ళిపోయేవి. వాటికి కట్టిన తాళ్ళ సాయంతో కోటగోడపైకి సైనికులు ఎక్కేవారు. ఉడుములు మాత్రం పట్టు వదిలేవి కావు. అలా శత్రువుల కోటల్లోకి ప్రవేశించి ఆక్రమించేవారు.

హక్కుల తేనె మన ముట్టెలకు పూసి మనల్ని ఉడుముల్లాగా ఉపయోగించుకొని మన ప్రాచ్య కైవారాలను ఎగబ్రాకి మనల్ని జయిస్తున్న మాయావులు అప్రాచ్యులు. మానవ హక్కుల తేనె రుచిచూపి పాశ్చాత్య మార్కెట్లు మనల్ని లోబరచుకుంటున్న మాట నిజం.

## తిరకాసులో అరకాసు

మానవహక్కులు విస్తరిస్తున్న కొద్దీ మన జీవితాల్లో వెలితి విస్తరిస్తోంది. ఒక కొత్త మానవహక్కు తయారైందంటే హక్కుల లేమితో బాధపడే కోటానుకోట్ల

బాధితులు సృష్టించబడినట్టే. అంతేకాదు, ఆ బాధితుల ఉద్ధరణకోసం మార్కెట్లు రంగప్రవేశం చేస్తాయి. హక్కుల దుకాణాలు తయారౌతాయి. వాటికి సరసమైన బేరాలు కావలసినంత లాభమూ ఉంటాయి.

అంటే మార్కెట్ తిరకాసులో హక్కుల అరకాసు దాగుంది. ఎలా అంటే - కంప్యూటర్ లిటరిసీని ఒక మానవ హక్కుగా గుర్తిస్తే - ప్రపంచంలో ఎనభైశాతం జనాభా కంప్యూటర్ ఇల్లిటరేట్స్ అవుతారు. కంప్యూటర్ లిటరసీ హక్కుకు నోచుకోని బ్రతుకూ ఒక బ్రతుకేనా అని వారు వాపోయారు. జీవించే హక్కులో కంప్యూటర్ లిటరసీతో జీవించే హక్కు భాగమని అత్యున్నత న్యాయస్థానాలు రాజ్యాంగ భాష్యం చెప్తాయి. ఆ హక్కును అనుభవంలోకి తేవలసిందిగా హక్కుల సంఘాలూ, హక్కుల దుకాణాలు ఏకం పాకమై ఉద్యమిస్తాయి. 'కంప్యూటర్ విద్యలేనివాడు కాటిపశువు' అని నినాదాలు గోడలపై వెలుస్తాయి. దేశం కంప్యూటర్ల మయమైపోతుంది. మైక్రోసాఫ్ట్ లాంటి కార్పొరేట్ దిగ్గజాలకు మంచి బేరాలు దొరుకుతాయి. ప్రజల అనుభవంలోకి ఆ హక్కు వచ్చేసరికి మనదేశ ఋణభారం కొన్ని వేలకోట్లు పెరిగి తడిసి మోపెడౌతుంది. ఆర్థిక వ్యవస్థ జవసత్వాలు క్రుంగిపోతాయి. మనం మరింతగా ప్రపంచ కాబూలీవాలా చక్రబంధంలో ఇరుక్కుపోతాము.

అందుకే హక్కులు వెంటపడుతున్నాయ్!

ఎదిరించి పోరాడదాం. లేదంటే మనపని ఖాళీ.

## బడిలో బాలకార్మికులు

ఒక పక్క సముద్రము. మరొక పక్క బడి. బడికి వెళ్తున్న బాలలకు చేపలవేటకు వెళ్తున్న జాలరి ఎదురయ్యాడు. శిలువ మోస్తున్న క్రీస్తుల్లా వీపులపై పుస్తకాల గోదాలతో వంగిపోయిన బాలలు. వారికి సముద్రం పడవ బలే బలే అనిపించాయి.

'మేమూ నీతోవస్తాం. మాకు చేపలవేట నేర్పుతావా?' నేర్పడం నాకు రాదు. నేను నేర్చుకోలేదు. మీ ఇష్టమైతే మీరే ఆడుతూ పాడుతూ గడపండి. దానంతటదే వస్తుంది' అన్నాడు జాలరి.

'ఓ.... సరే!' అంటూ పుస్తకాలు ఒడ్డున పారేసి బిలబిలా పడవ ఎక్కారు. పిల్లల కేరింతలతో సముద్రపు అలలహోరు ప్రకృతి పులకరించింది.

సరిగ్గా అదే సమయంలో పశ్చిమ దిశనుంచి ఇనుపడేగపై ఆకాశయానం చేస్తున్న శ్వేతాసురుడు సుదూరం నుంచి ఈ దృశ్యాన్ని చూశాడు. సరాసరి పడవ దగ్గరికి వచ్చాడు. ఇనుప డేగ రెక్కల గాలికి కెరటాలు ఎగిసిపడ్డాయి. పడవ అటూ ఇటూ ఊగింది. పిల్లల ఆనందం ఆవిరైంది.

'అన్యాయం! హక్కుల ఉల్లంఘన ఘోరం! బాలకార్మిక వ్యవస్థ నశించాలి!' అంటూ అసురుడు పెడబొబ్బలు పెట్టాడు.

'ఎవరి గురించి నీ రగడ?' అన్నారు పిల్లలు.

'మీ గురించే' అన్నాడు.

'మేం నువ్వొచ్చే ముందు వరకూ సంతోషంగానే ఉన్నాం కదా'

'విద్య మీ హక్కు. మీ నుంచి విడదీయరాని హక్కు' అన్నాడు అసురుడు.

'ఇప్పుడు మేం చేపల వేటను నేర్చుకుంటున్నాం కదా?'

అది విద్యకాదు. చదవడం రాయడం లేనిది విద్య అనిపించుకోదు.'

'బళ్ళలో చదువు చాకిరీ చేసి అణగారిపోయాం. మా వీపులు కాయలు కాసాయి. మా నడుములు ఒంగిపోయాయి. మా కంటి చూపు మందగించింది. మా బాల్యం హరించుకు పోయింది' అన్నారు పిల్లలు ముక్తకంఠంతో.

'అయినా సరే మీరు చదువుకొనాల్సిందే.' మీ హక్కును హరించడాన్ని మేం సహించం' అన్నాడు శ్వేతాసురుడు.

అన్నదే తడవుగా జాలరినీ, సముద్రాన్నీ దండింపజేసేందుకు పశ్చిమాద్రివేపు తన వాహనంపై వేగంగా వెళ్ళిపోయాడు.

ఆ తర్వాత కొంత కాలానికి -

'బళ్ళలో లేని బాలలంతా బాల కార్మికులే' అని ఒక శాంత సింహంలా గర్జించింది. ఆమెకు పడమటి బంగారంతో మెరిసేసే అవార్డొచ్చింది. బాలలను బలవంతంగా బళ్ళలో చేర్పించడం మొదలైంది.

'బళ్ళలో ఉన్న బాలలంతా బాలకార్మికులే' అన్న వారి ఆక్రోశాన్ని తూర్పుగాలి మోస్తోంది.

## శుద్ధ జాతక కథ/అస్తిత్వయాత్ర

'నేనది ఎట్లయిత?' గ్రంథకర్తకు రచనానంతరము ఆధునికానంతర సహజ మరణము సంప్రాప్తించెను. అతని ఆత్మ మరొక దేహాన్ని వెతుకుతూ పశ్చిమ దిశగా వెడలెను. అలా ప్రయాణించి కొంత కాలమునకు అట్లాంటిక్ మహాసముద్రమునకు ఆవలిగట్టునున్న స్వర్ణ పిశాచి నగరమునకు చేరెను. నగర సౌందర్యమునకు అచ్చెరువొందిన ఆ ఆత్మ ఒక ఉద్యానవనమునందు బల్లపై చతికిలపడి సేదదీరసాగెను.

అంతట చెహోవ్ కథలో వలె కుక్కపిల్లను వెంటపెట్టుకున్న ఒక శ్వేతమహిళ అచటకు వచ్చెను. ఆమె చేతియందు ఒక ఖాళీ కేరీబ్యాగు ఉండెను. దానిని ఆమె ఎందుకు మోయుచున్నదో రచయిత ఆత్మకు అవగతం కాక సతమతమాయెను.

కొలది సేపటికి ఆ శునక కిశోరము ప్రకృతి పిలుపుకు పులకరించసాగెను. ఆ మహిళ శునకాశుద్ధాన్ని తన కేరీబ్యాగ్ నందు పడునట్టుగా హస్తలాఖవాన్ని ప్రదర్శించి తదుపరి దానిని చెత్తకుండీ నందు పారవైచెను. రచయిత ఆత్మ ఆనందడోలికల్లో ఊగిపోయెను. శ్వేత జాతి పరిశుద్ధాత్మకు నమస్కరించెను. బ్రాహ్మణ అపరిశుభ్రతను తెగనాడెను.

ఆ క్షణమునందు -

మరో నూట యేబది వత్సరములు భరత ఖండమును ఆంగ్లేయులు పరిపాలించి ఉంటే బాగుండేది అనే అస్తిత్వ చైతన్యము కలిగెను. గాంధీ, అల్లూరి, భగత్‌సింగ్, ఝల్కారీబాయిలు దానికి దేశద్రోహులుగా కన్పించసాగెను.

అదే సమయమున ఆకాశమార్గమున వెళ్తున్న జనరల్ డయ్యర్, రూథర్‌ఫర్డ్ పిశాచములు రచయిత ఆత్మపై హక్కుల వర్షము కురిపించి అతని దేహాత్మ వినియోగాత్మగా మారి అమెరికా అఖండాత్మతో లీనం కావాలని ఆశీర్వదించాయి.

## ఎగిరే స్వేచ్ఛ ఎవరిది

ఒకానొక సెప్టెంబర్ 11న విమానాలనే ఆయుధాలుగా ధరించి బిన్ లాడెన్ గారు స్వర్ణ పిశాచి నగర ఆకాశహర్మ్య ద్వయాన్ని నేలకూల్చాడు. అమెరికా

వాళ్ళు తీవ్ర భయకంపితులయ్యారు. విమానాలు ఎక్కడం మానేసారు. లోహ విహంగాలు నేల వాలాయి. అథవా ఎగిరినా ఖాళీ సీట్లతోనే. విమానయాన పరిశ్రమ సంక్షోభంలో పడింది. వేలాది మంది ఉద్యోగాలు గాల్లో తేలాయి.

విమానయాన బేహారులు బిల్‌క్లింటన్ దగ్గరకు పరిగెత్తారు. 'మాజీ మహాప్రభో! మమ్మల్ని కాపాడండి!' అని మొరపెట్టుకున్నారు. మాజీగా ఉన్న క్లింటన్ మహాశయుడు ఈజీగా నలభై ఎనిమిది గంటలపాటు విమానాల్లో ఎగిరాడు. విమాన ప్రయాణం సురక్షితం అని నిరూపించాడు. కానీ, అక్కడి జనంలో వణుకు తగ్గలేదు. ఆయన వీవీఐపీ కాబట్టి సురక్షితంగా ఎగరగలడు. తమబోటి వారి గతేమిటని అనుకున్నారు. విమానాశ్రయాల పొయ్యిలో పిల్లి లేవలేదు.

విమానయాన బేహారులు ఈసారి దేశాధ్యక్షుడిని శరణుజొచ్చారు. నేలమాళిగలో దాక్కున్నా వెన్నులో చలి తగ్గని చిన్న బుష్ ఏకంగా షికాగో ఇంటర్నేషనల్ ఎయిర్‌పోర్ట్ రన్‌వే మీద మీటింగ్ పెట్టాడు -

'అల్‌ఖైదా దాడి స్వేచ్ఛపై దాడి' అన్నాడు. జనం చప్పట్లు చరిచారు. నిజంగా బుష్షు బుష్షే, ట్రీ కాదు అనుకున్నారు. 'ఎగిరే స్వేచ్ఛ ఎంతో గొప్పది. దాన్ని అనుభవిద్దాం. స్వేచ్ఛా ప్రియులమని చాటుదాం' అని ఆవేశంగా ప్రసంగించాడు.

జనం ఉద్రేకపడ్డారు. ఎగిరారు. విమానయాన పరిశ్రమ ఊపిరి పీల్చుకుంది. గల్లాపెట్టెల్లో గలగలలాడాయి. అవును నిజమే అల్‌ఖైదా దాడి స్వేచ్ఛపై దాడే. మాయల ఫకీర్ ప్రాణం ఏడేడు సముద్రాల ఆవల మర్రిచెట్టు తొర్రలో రామచిలుకలో దాగున్నట్టుగా మార్కెట్ ప్రాణం మానవ హక్కుల్లో దాగుంది.

## కొట్టుకో కొట్టుకో దేవుణ్ణి పట్టుకో

తూర్పు కొండలవాళ్ళు ప్రతియేటా పెదగట్టులో ఒక సంబరం జరుపుకుంటారు. రెండూళ్ళ మధ్య దేవుణ్ణి పెట్టి ఎవరు పట్టుకెళ్ళ గలిగితే వారు గెల్చినట్టని తీర్మానిస్తారు. అందుకోసం బడితె కర్రలతో కొట్టుకుంటారు. చుట్టుపక్కల పన్నెండామడ నుంచి ఆ రోజున ఇసుక వేస్తే రాలనంతమంది జనం పిల్లాపాపలతో పోగౌతారు. రక్తాలు కారేవాళ్ళకు పసుపు అద్దేవాళ్ళు తయారుగా ఉంటారు.

పడమటి కొండలవాళ్ళకు అది వింతగా అనాచారంగా తోస్తుంది. ఎందుకలా పిచ్చిగా ప్రవర్తిస్తారో వారికి ఏ మాత్రం బోధపడదు. అనాగరికంగా అజ్ఞానంలో ఉన్న తూర్పు వారిని ఉద్ధరించేందుకు పలు పథకాలు సిద్ధం చేస్తుంటారు. రక్షకభటులు ఉండీ ప్రేక్షకపాత్ర వహించడం కూడా వారికి చికాకు తెప్పిస్తుంటుంది. పడమటి గాలి సోకిన మీడియా కూడా తూర్పు సంప్రదాయాన్ని తెగనాడుతూ ప్రతియేటా గగ్గోలు పెడతాయి.

కానీ పడమటి కొండవాళ్ళు బాక్సింగ్ పేరుతో రక్తాలు కారేట్టు కొట్టుకుంటారు. దాన్ని క్రీడ అని పిలుస్తారు. టికెట్ పెట్టి ప్రదర్శిస్తారు. హౌస్‌ఫుల్ షోలు నడుస్తుంటాయి. పలు టీవీ ఛానళ్ళు లైవ్ ప్రసారాలు చేస్తాయి. మధ్య మధ్యలో వాణిజ్య ప్రకటనల హోరు కూడా జోరుగా ప్రసారమవుతూ ఉంటుంది.

తూర్పు కొండలవాళ్ళలో కొంతమంది తలలు ఎప్పుడూ పశ్చిమానికే తిరిగి ఉంటాయి. తమ సమస్యలకు పడమటి నుంచే పరిష్కారాలు వెతుకుతుంటాయి. వారికి ఎప్పటికీ పెదగట్టులో అనాగరికతే కనిపిస్తుంది. మార్కెట్టులోని WWF బాక్సింగ్ పోటీ వారికి శిరోధార్యం. మార్కెట్టు బయట పెదగట్టు సంబరం ఖండనీయం.

## బాల్‌రూంలో జోగిని

జోగిని దురాచారాన్ని రూపుమాపేందుకు ఎందరో అహర్నిశలు శ్రమించారు. సంస్కృతి, సంప్రదాయం పేరిట జరుగుతున్న బడుగు మహిళల హక్కుల హననాన్ని నిరసిస్తూ శాసనాలు తెచ్చారు. ఎక్కడ ఆ దురాచారం పొడసూపినా కాటు వేసేందుకు శాసన సర్పం, తెగనరికేందుకు స్వచ్ఛంద విచ్చుకత్తులు సిద్ధంగా ఉన్నాయి.

జోగిని దేశీయంగా మరణించింది. కానీ దేశమంతటా బాల్‌రూం డాన్సర్‌గా పునరుత్థానం చెందింది. ఒకనాడు పదుల సంఖ్యలో జోగినీలు, ఈనాడు వేల సంఖ్యలో బాల్ రూం డాన్సర్లు మధుశాలల్లో తాగివూగే మందు బాబుల ముందు వంపు సొంపులు వలకబోస్తూ వెస్టర్న్ సంగీతానికి మత్తెక్కి నాట్యం చేస్తున్నారు. వారిలో అధికశాతం బడుగు కులాల అమ్మాయిలే. నిరుపేద గ్రామీణ యువతులే.

ఒకానొక రోజున మన పొరుగునున్న రాష్ట్రంలో బాల్‌రూం డాన్స్‌లను నిషేధించారు. ఇంకేముంది, బాల్‌రూం డాన్సర్ల జాతీయ సంఘం గగ్గోలు పెట్టింది. మహిళా సంఘాలు కొన్ని మానవహక్కుల వాదులు కొందరు గొంతెత్తారు. ఏకంగా 75వేల మంది బాల్‌రూం డాన్సర్లు తమ 'జీవించేహక్కు' నశించడాన్ని నిరసిస్తూ ఊరేగారు. రాజ్యాంగం ప్రసాదించిన వృత్తిహక్కు తమకుందని ఆక్రోశించారు. పలు టీవీ ఛానళ్ళు వారివైపు నిలిచాయి. గౌరవనీయ వృత్తిగా భావించి బాల్‌రూం డాన్సర్లకు లైసెన్స్‌లు ఇవ్వాలని స్వచ్ఛంద సంస్థలు డిమాండ్ చేస్తున్నాయి.

మార్కెట్ బయటి 'జోగినీ' దురాచారం.

మార్కెట్ లోపలి 'బాల్‌రూం డాన్సర్' సదాచారం.

దురాచారాన్ని రూపుమాపి సదాచారాన్ని కాపాడటం మానవ హక్కుల బాధ్యత.

## మార్కెట్ ఆరోగ్యమే మన మహాభాగ్యం

'ఆరోగ్యమే నా జన్మహక్కనీ చాటండీ....!'

'ఏ ఆరోగ్యం? ఆయుర్వేదం, ఆకుపసర్లు, యునానీలతో వచ్చే ఆరోగ్యమా?' కాదు. 'హోమియోపతితో వచ్చే ఆరోగ్యమా?' కానే కాదు. అల్లోపతీతో వచ్చే ఆరోగ్యమే మనహక్కు. 'అలా అని రాజ్యాంగంలో రాసి ఉందా?' లేదు. కానీ ఇప్పుడు రాజ్యాంగం మార్కెట్ రెండూ ఒకటే. జీవించే హక్కులో భాగమైన ఆరోగ్యంగా జీవించే హక్కు మాత్రం అల్లోపతి మార్కెట్‌దే. అన్ని 108 దారులూ అల్లోపతి ఆస్పత్రులకే.

ప్రతియేటా ఐరాస, ప్రపంచబ్యాంకులు తయారుచేసే మానవ అభివృద్ధి నివేదికలో మనదేశం వెనుకబడే ఉంటుంది. ఒక దశాబ్దం క్రితం అలాంటి నివేదికలో హెల్త్ ప్రొఫైల్‌లో మనది 128వ స్థానం. ఇలాంటి నిచ్చెనమెట్ల సూచికల్లో అమెరికా, కెనడా, యూరోపియన్ దేశాలు మొదటి పది పదిహేను స్థానాలను ఆక్రమిస్తాయి. ఇక మన దేశంపై వత్తిడి పెరుగుతుంది. ఆ నిచ్చెనలో పైకి ఎగబాకేందుకు మనల్ని రుణగ్రస్తుల్ని చేస్తారు. విక్రమాదిత్యుడి సింహాసనం మెట్లదారిలో ఉన్న సాలభంజికల కథల చిక్కుముడులు విప్పితేనే మనల్ని

ఒక్కోమెట్టు ఎక్కనిస్తారు. అందుకోసం వేలకోట్ల రుణాలు తెచ్చి మనల్ని మనం పాశ్చాత్యీకరించుకోవాలి.

ఆరోగ్య సూచికలో స్థానాన్ని బట్టి ఆయా దేశాల్లో ప్రజలు ఆరోగ్యాన్ని అంచనా వేద్దాం అని ఎవరైనా అనుకుంటే పొరపాటే. సూచికలకూ, ఆరోగ్యానికీ సంబంధం కంటే సూచికలకూ, ఆరోగ్య మార్కెట్‌కూ సంబంధమే ఎక్కువ. తలసరి ఏడాదికి డాక్టర్లకు, మందులకు ఎంత ఖర్చు పెడుతున్నారు అన్న ప్రశ్నకు సమాధానాన్ని బట్టి ఆరోగ్య సూచికలో పాయింట్లుంటాయి. అమెరికాలో తలసరి ఏడువేల డాలర్లకు పైగా ఖర్చుపెడతారు. కాబట్టి అమెరికా పై ఎత్తున ఉంటే, మనం 45 డాలర్లు ఖర్చు పెడుతున్నాం కాబట్టి మనం ఏ 90వ స్థానంలోనో వందో స్థానంలోనో ఉంటాం.

మనకు జలుబు చేస్తే శొంఠివాడి తగ్గించుకుంటే లాభం లేదు. పుండ్లకు పసుపురాసి నయం చేసుకుంటే, కలబందను యాంటీసెప్టిక్‌గా వాడుకుంటేనో, కామెర్లకు ఆకుపసర్లు వాడితేనో మనకు పాయింట్లురావు. ఆహారపు అలవాట్లను మార్చుకునో, వ్యాయామం చేసో ఆరోగ్యాన్ని కుదుటపర్చుకుంటే పాయింట్లు సున్నా. మన గతి ఆరోగ్య సూచిక నిచ్చెన మెట్లలో అథోగతే.

ఆ అథోగతిని తప్పించుకోవడానికి, ఆ నిచ్చెనమెట్లు ఎక్కడానికి మనం ప్రతి చిన్న సమస్యకూ అల్లోపతి డాక్టర్ దగ్గరకు వెళ్ళి కన్సల్టేషన్ ఫీజు చెల్లించి, పరీక్షల ఖర్చులు భరించి జర్మన్, అమెరికన్ డ్రగ్ కంపెనీల యాంటిబయటిక్ మందుల లాంటివి భారీగా వాడితేనే సూచికలో ముల్లు కదులుతుంది. మన జేబు ఖాళీ అయితేనే మార్కెట్ సాలభంజిక పై మెట్టెక్కనిస్తుంది. ఐరాస అభినందిస్తుంది.

అలా ఎక్కేకొద్దీ మన ఆర్థికవ్యవస్థ ఆరోగ్యం కునారిల్లుతుంది. దేశీయవైద్యం అటకెక్కుతుంది. మన అథోగతే మార్కెట్ పురోగతి అదే అభివృద్ధికి అసలు అర్థం.

## కోడి గద్ద కావడమే అభివృద్ధి

కోడిపెట్ట ఉదయాన్నే తన దేహయాత్ర ప్రారంభించింది. దానికి గింజలు ఏరుకుని తినడంలో, పులుగులను పసిగట్టడంలో చాలా ప్రావీణ్యం ఉందని

ప్రతీతి, కోడి పిల్లలు కుయ్ కుయ్‌మని వెంట బయల్దేరాయి. వాటి పన్లో అవి ఉండగా శ్వేత గండ భేరుండం వచ్చి వాటి ముందు వాలింది. దాని రెక్కల చప్పుడుకు నేలమీద దుమ్ము లేచింది. ఒక్క క్షణం కోడిపెట్టకు ఏమీ అర్థం కాలేదు. ఎదురుగా గండభేరుండాన్ని చూసి బిక్క చచ్చింది. పిల్లలను రెక్కల చాటున దాచిపెట్టింది.

పిల్లలచే అలా పని చేయించడాన్ని గండభేరుండం హూంకరించింది.

'ఇది పనికాదు మహాప్రభో, నా పిల్లలు నన్ను చూసి ఆహార సేకరణ చేస్తున్నాయి... అవీ నేర్చుకోవాలి కదా!'

'కానే కాదు, దీన్ని బాల కార్మిక వ్యవస్థగా గుర్తించి నేరంగా ప్రకటించాం. ఇకనుంచీ ఈ రాజ్యంలో కోళ్ళు ఇలా చేయరాదు'.

'తమరు నన్ను అనుగ్రహించాలి ప్రభూ! అవి నన్ను విడిచి వుండలేవు. నేనూ అంతే. నాతో తిరుగుతూ కడుపారా ఆరగిస్తాయి. అడుతూ పాడుతూ నేర్చుకుంటాయి.

'అదంతా ఇకపై రద్దు. నిన్ను ప్రథమ తప్పుకు క్షమిస్తున్నాం. నీ పిల్లలను మేము తీసుకెళ్ళి విద్య నేర్పుతాం. అభివృద్ధిచేస్తాం.'

'నా పిల్లలు నాతో సంతోషంగా గడపరాదా ప్రభూ!'

'మమ్మల్నెవరూ ప్రశ్నించరాదు. ఏది సంతోషమో, ఏది దుఃఖమో, ఏది విద్యో ఏది కాదో మేం నిర్ణయిస్తాం. మీరు అనుసరించాలి.'

'ధర్మ ప్రభువులు తమకు తెలియందికాదు నేనే నా పిల్లలకు విద్యాబుద్ధులు నేర్పుతాను రాజా! ఇది అనూచానంగా వస్తున్న మా జాతి సంప్రదాయం.

సంప్రదాయాలకు కాలం చెల్లింది. మా యుగకవి వాక్కు వినలేదా. మతములన్నియు మాసిపోవును అని తెలియదా. మతాలు, సంప్రదాయాలూ, కులాలూ, సంస్కృతులు అన్నీ మాసిపోయాయి. మా జ్ఞానమొక్కటే నిలిచి వెలుగుతుందని, గండభేరుండం పెద్దగా అరిచింది. మళ్ళీ ఇలా అంది 'తల్లిదండ్రులు, బామ్మలు, తాతయ్యల కాలం ముగిసింది. మీరు పిల్లల్ని పాడుచేస్తారు. వాళ్ళు ఎప్పటికీ కోళ్ళలాగే మిగిలిపోయేటట్టు చేస్తారు. వాళ్ళను మీ నుంచి దూరంగా ఉంచాలనే మా శాసనం నిర్దేశిస్తోంది.'

‘అయితే మా కథలు, గాథలు వాళ్ళకు చెప్పనివ్వరా?

‘చెప్పనివ్వంగాక చెప్పనివ్వం. నీకు తెలియదా పేదరాసి పెద్దమ్మ ఆకలిచావు చచ్చింది. విక్రమార్కుడు తనే శవమై చెట్టుకు వేలాడుతున్నాడు. భేతాళుడు మార్కెట్ గురూ అయ్యాడు. ఆలీబాబాను మా సేనలు బాగ్దాద్ సరిహద్దుల్లో కాల్చి చంపాయి. ఇక ఓపెన్ సెసేమ్‌లు లేవు. అంతా క్లోజ్ సర్క్యూట్సే. అక్బర్ బీర్బల్‌లు అరిటాకులు మేస్తున్నారు. కాశీ మజిలీ కథలు గంగలో కలిశాయి.’

‘ఇన్ని ఘోరాలు జరిగాయా?’ తల్లికోడి నోరెళ్ళబెట్టింది.

‘ఇవి ఘోరాలు కాదు, అభివృద్ధి. ఇంకా చాలా జరిగాయి. చంద్రుడిలో రాట్నం వడికే అవ్వ స్పేస్‌షిప్ దెబ్బకు చచ్చిపోయింది. అవునూ నాకు తెలియకడుగుతా నీకు నెట్ కనెక్షన్ వుందా?’ ‘అదేంటి?’

‘నీకు వెబ్ గురించి తెలియదు. నెట్ కనెక్షన్ లేదు. నీ ముఖానికి ఫేస్‌బుక్ ఎకౌంట్ లేదు. నీ పెంపకంలో పిల్లలు పెరిగితే మటాష్. నీ అజ్ఞానం వాటికీ అంటుకుంటుంది. యుగకవి వాక్కు ఫలించకుండా పోతుంది. మన పక్షి జాతికి అవమానకరంగా బ్రతుకీడుస్తాయి నీ పిల్లలు. ప్రపంచం చాలా విశాలమైంది. న్యూయార్క్ వాషింగ్టన్‌ల దాకా విస్తరించింది. ఇకపై మేమే నీ పిల్లల బాధ్యత వహిస్తాం.’

గండభేరుండం తల్లికోడిని పక్కకు నెట్టి పిల్లలను ఎత్తుకుపోయింది. తల్లి దిగులు పడింది. పొరుగున ఉన్న కోళ్ళగూళ్ళకు వెళ్ళి చూస్తే ఎక్కడా ఒక పిల్లా కనపడలేదు. అన్నిటినీ గండభేరుండమే తీసుకెళ్ళింది.

కొన్నాళ్ళకు తల్లికోడి పిల్లలను చూద్దామని బయల్దేరింది. ఎంతో కష్టంగా దార్లు వెతుకుతూ గండభేరుండ విద్యాలయానికి అతి ప్రయాసకోర్చి వెళ్ళగలిగింది. తల్లి గుర్తుపట్టలేనంతగా పిల్లలు మారిపోయాయి. వాటికి పెద్ద పెద్ద రెక్కలు. గద్దలాంటి ముక్కు, దృఢమైన పంజాలు భయంకరాకారంలో ఉన్నాయి. ఇప్పుడు అవి కోడి భాషను మాట్లాడటం అవమానంగా భావిస్తున్నాయి. ఇప్పుడు గద్ద భాషే మాట్లాడుతున్నాయి. ఎంతో ఎత్తు ఆకాశంలో ఎగరగలుగు తున్నాయి. తమ స్వేచ్ఛను చూసి మురిసిపోతున్నాయి. రంగులలో ఉన్న తమ దేహచ్ఛాయను శ్వేత వర్ణంగా మార్చుకునేందుకు లేపనాలు పూసుకుంటున్నాయి.

పిల్లలు తల్లిని చూసి దూరంగా జరిగాయి. తమ తల్లి అని చెప్పుకోడానికి వాటికి సిగ్గుగా ఉంది. పొడి పొడి మాటలయ్యాక 'వెంటనే నువ్వు ఇక్కడ నుంచి వెళ్ళిపో, మళ్ళీ ఎప్పటికీ రాకు. లేదంటే మేం కోడి జాతి వాళ్ళమని మాకు వీసాలు, ఉద్యోగాలు రావు, అని చెప్పి తల్లిని సాగనంపాయి.

తర్వాత తెలిసిందేమిటంటే గద్దలయిన కోడిపిల్లల్లో కొన్ని మాత్రం భేరుండ కొలువులో ప్రాపు సంపాయించగా మిగిలినవి గండభేరుండ పాకశాలలో రుచికరమైన వంటకంగా మార్చబడుతున్నాయని. ఏమైనా కోడి గద్ద కావడమే కదా అభివృద్ధి.

**డిసెంబరు 25, 2011**

# 49. అతిరాత్రం 'అగ్ని' చయనుడు ఫ్రిట్స్ స్టాల్

భద్రాచలంలో ఏప్రిల్ 22న అతిరాత్ర మహాయజ్ఞం ప్రారంభానికి రెండ్నెల్ల ముందు థాయ్‌లాండ్‌లో చియాగ్మయ్ గ్రామంలో ఫిబ్రవరి 19న 82 ఏళ్ళ ఫ్రిట్స్ స్టాల్ తుదిశ్వాస విడిచారు. ఆయన అతిరాత్ర మహాయాగాన్ని అమితంగా ప్రేమించి, కలవరించి, పలవరించి, పులకరించిన పండితోత్తముడు. బెల్జియం దేశస్థుడు. అసలు పేరు జోహాన్ ఫ్రెడరిక్ స్టాల్.

ఆమ్‌స్టర్‌డాంలో 1930లో పుట్టి స్థానిక విశ్వవిద్యాలయంలో గణిత, భౌతికశాస్త్రాలూ, తత్వశాస్త్రం అధ్యయనం చేసిన తర్వాత భారతదేశం వచ్చాడు. భారతీయ తత్వశాస్త్రం పట్ల, సంస్కృత భాష పట్ల మక్కువతో బనారస్ హిందూ విశ్వవిద్యాలయంలో నవ్యన్యాయతర్కాన్ని అధ్యయనం చేశాడు. మద్రాస్ విశ్వవిద్యాలయం నుంచి 1957లో పాణిని వ్యాకరణ సూత్రాలు గురించిన పరిశోధనకు డాక్టరేట్ పొందాడు. వ్యాకరణంలో గణిత సూత్రాలను వాడే నోమ్ చోమ్‌స్కీ పద్ధతి వేల ఏళ్ళ క్రితం పాణినికి కరతలామలకం అని నిరూపించాడు. కంప్యూటర్ భాషల వివరణకు వాడే auxiliary markers ను Email Post అనే పాశ్చాత్య శాస్త్రవేత్త 1930లో కనిపెట్టడానికి వేల ఏళ్ళ క్రితమే పాణినీయ పద్ధతిలో వాటిని వాడారని నిరూపించాడు. నలభైఏళ్ళ వయసులో బుల్లెట్ మోటార్ బైక్‌పై కేరళ గ్రామీణ ప్రాంతంలో తిరుగుతూ 1970ల తొలి సంవత్సరాల్లో నంబూద్రి బ్రాహ్మణ వైదిక సంస్కృతిని అధ్యయనం చేశాడు. అప్పటికే ఆయన లండన్, పెన్సిల్వేనియా, ఆమ్‌స్టర్‌డాం విశ్వవిద్యాలయాల్లో, మసాచుసెట్స్ యం.ఐ.టిలో పనిచేసి కాలిఫోర్నియా విశ్వవిద్యాలయంలో తత్వశాస్త్ర అధ్యాపకుడిగా పనిచేస్తున్నాడు. అక్కడ దక్షిణ, ఆగ్నేయ ఆసియా అధ్యయన విభాగాన్ని స్థాపించాడు. నంబూద్రి బ్రాహ్మలతో సంసర్గంవల్ల అతిరాత్రం

గొప్పతనాన్ని గమనించాడు. వైదిక వాఙ్మయంలో కర్మకాండకున్న ప్రాముఖ్యతను, విలువను గుర్తించాడు. మూడువేల ఏళ్ళకుపైగా వేదాలను, యజ్ఞక్రతువుల తంతునూ తమ మెదళ్ళలో మోసుకువస్తున్న ప్రత్యేక కులంగా బ్రాహ్మణులను గుర్తించి అచ్చెరువొందాడు. నంబూద్రీలలో అతిరాత్రయాగ సంస్కృతి అంతరించిపోయే దశకు చేరిందని భయపడ్డాడు. అప్పటికి రెండు దశాబ్దాల క్రితం 1956లో మాత్రమే కేరళలో అతిరాత్రం జరిగింది. 1875 నుంచి వందేళ్ళ కాలంలో 17సార్లు మాత్రమే దేశంలో జరిగిన ఈ క్రతువు విధి విధానాలు నంబూద్రీల స్మృతి నుంచి తొలగిపోయే ప్రమాదం ఏర్పడిందని బాధపడ్డాడు.

స్టాల్ ప్రయత్నం వల్ల త్రిసూర్ దగ్గరున్న పంజాల్ గ్రామం 1975లో అతిరాత్ర మహాయాగానికి వేదికైంది. దాని మొత్తం ఖర్చును (రూ. 35వేలు) స్టాల్ సేకరించి దాన్ని డాక్యుమెంట్ చేసే హక్కులను పొందాడు. సుమారు 80 గంటల ఆడియో టేప్, 20 గంటల కలర్ ఫిల్మ్, నాలుగువేల స్టిల్ ఫోటోలు తయారుచేయించాడు. తర్వాతి కాలంలో 'అనల వేదిక' (Altar of Fire) పేరిట 1977లో 45 నిమిషాల డాక్యుమెంటరీ విడుదల చేశాడు. 'అగ్ని- ది వేదిక్ రిచ్యువల్ ఆఫ్ ది ఫైర్ అల్టార్' పేరిట 1500 పేజీల పరిశోధనాత్మక గ్రంథాన్ని రచించి 1983లో ప్రచురించాడు. అతిరాత్రం గురించిన సమగ్ర చిత్రాన్ని సచిత్రంగా ఆవిష్కరించిన అపురూప గ్రంథరాజంగా అది ప్రపంచ సనాతన వాఙ్మయానికే వన్నె తెచ్చింది. వైదిక కర్మకాండకు అంతర్జాతీయ ఖ్యాతిని తెచ్చిపెట్టింది. భారత దేశంలో మోతీలాల్ బనారసీ దాస్ ప్రచురణగా రెండు సంపుటాల్లో వెలువడింది. సి.వి.సోమయాజి పద్, ఇట్టి రవి నంబూద్రి మొదట సంపుటి రచనలో ఆయనకు సహకరించారు. క్రతువుకు సంబంధించిన అన్ని వస్తు పరికరాల నమూనాలను సైతం స్టాల్ అమెరికా తీసుకెళ్ళి బర్కిలీ విశ్వవిద్యాలయంలో భద్రపరిచాడు.

అతిరాత్రం జరిపేందుకు ఫ్రిట్స్ స్టాల్ అధ్యక్షతన ఒక అంతర్జాతీయ కమిటీనే ఏర్పడింది. దేశ విదేశాలకు చెందిన ఉద్దండ వైదిక శాస్త్రపండితులు, చరిత్రకారులు, పరిశోధకులు ప్రొఫెసర్ ఆర్. ఎస్. దండేకార్, సి.జి. కషికర్ (పూనా), క్లాస్ మెలియస్ (లీప్జిగ్), ఆస్కో పర్పొలా (హెల్సింకి), వి.రాఘవన్ (మద్రాస్), ఇ.ఆర్. శ్రీకృష్ణశర్మ (తిరుపతి), జె.ఎ.బి.వాన్ బుయ్‌టెవెన్ (షికాగో) అందులో సభ్యులు. యజ్ఞ ప్రారంభానికి ముందే యజ్ఞం గురించి వైదిక

వాఙ్మయంలో ఉన్న క్రియా సంవిధానంపై శ్రౌత సూత్రాలు, సులభ సూత్రాలు, ప్రయోగాల ఆధారంగా 30 పేజీల నోట్సు తయారు చేసి పంచారు. భారతీయ ప్రాచీన చరిత్ర, రచనలో లబ్ద ప్రతిష్టురాలైన రొమిల్లా థాపర్ సైతం క్రతువుకు హాజరై దాన్ని అధ్యయనం చేశారు.

'అగ్ని' గ్రంథం మొదటి సంపుటిలో రెండు విభాగాలున్నాయి. మొదటి విభాగంలో కర్మకాండ గురించిన సాధారణ విషయాలు, దాని మూలాలు, సంప్రదాయ వ్యాఖ్యానాలు, చరిత్ర, చరిత్ర పూర్వనేపథ్యం, రుత్విక కులం గురించిన విశేషాలు పొందుపర్చారు. రెండవ విభాగంలో 1975లో జరిగిన అతిరాత్రం గురించిన 12 రోజుల కర్మకాండను సవివరంగా, సచిత్రంగా వస్తురూప సహితంగా వివరించారు. రెండవ సంపుటిలో మూడు భాగాలున్నాయి. మొదటిభాగంలో కర్మకాండల గురించిన విశేషాలపై చరిత్రకారుల, పురావస్తు శాస్త్రవేత్తల, వివిధ సైంటిస్టుల వ్యాసాలూ, పురావస్తు గణితం, వాస్తు, శాలివాహనం (pottery) లాంటి పలు విశేష శాస్త్రాల్లో పరిశోధకుల వ్యాసాలున్నాయి. అగ్నిచయన క్రతువు గురించిన పురావస్తు సాక్ష్యాలను వివరించే రొమిల్లా థాపర్ వ్యాసం కూడా ఉంది. రెండవ విభాగంలో యాగానికి సంబంధించిన వివిధ వైదిక మూల గ్రంథాల నుంచి ఉల్లేఖనలున్నాయి. బౌద్ధాయన, శ్రౌత సూత్రాల నుంచి అగ్నిచయన విశేషాలు పొందుపర్చారు. చివరి భాగంలో ఫిల్మ్, ఆడియో రికార్డింగ్ విశేషాలు, డాక్యుమెంటరీ గురించిన వివరాలు ఇచ్చారు.

అతిరాత్రం మహాయజ్ఞంలో సకల శాస్త్రాలకు సంబంధించిన విశేషాలున్నాయంటాడు స్టాల్. చరిత్ర, ఎత్నోగ్రఫీ, పురావస్తు శాస్త్రం, కళ, వాస్తుశాస్త్రం, సంగీతం, గణితం, మతం, మానుష శాస్త్రం, భాషాశాస్త్రం, సాహిత్యం, పురాణం, ఇంద్రజాలం, నాటకరంగం, మనోవిశ్లేషణాశాస్త్రం, తత్వశాస్త్రం, భౌతికశాస్త్రం, వృక్షశాస్త్రం, ఔషధ శాస్త్రం - ఇలా పలురకాల శాస్త్ర అధ్యయనానికి అతిరాత్రం అవకాశమిస్తుందని స్టాల్ భావించాడు. కషికర్ వైదిక మృణ్మయ పాత్రల నిర్మాణంపై పరిశోధన, వాస్సన్, ఫ్లాటరీలు సోమరసం పై చేసిన పరిశోధనల గురించిన వివరాలు సైతం 'అగ్ని' గ్రంథంలో స్టాల్ పొందుపర్చాడు. ఆధునికత సృష్టించిన వివిధ శాస్త్రాల పీజియన్ హోల్స్‌ను స్టాల్ తిరస్కరించాడు.

అందుకే తన 'అగ్ని'లో అతిరాత్రం ఆవిష్కరించిన పలు శాస్త్రాలకు సంబంధించిన విశేషాలు, పరిశోధనలు పొందుపర్చాడు. ఆధునికత సృష్టించిన వివిధ విశేష శాస్త్రాలన్నిటి సరిహద్దులనూ అతిరాత్రం తుడిచి పెడ్తుంది. స్టాల్‌పై సైతం అతిరాత్రం ప్రభావం అతి గాఢంగా ఉంది. అందుకే ఆయన శాస్త్రాల మధ్య కృత్రిమ సరిహద్దులను చెరపడానికి జీవితాంతం ప్రయత్నించాడు. కర్మకాండను ప్రత్యేకంగా అధ్యయనం చేయాల్సిన అవసరం ఉందని స్టాల్ గుర్తించాడు. వైదిక కర్మకాండ అధ్యయనాన్ని 1805లోనే యూరోపియన్ ఇండాలజిస్టు ఫెల్‌బ్రూక్ మొదలుపెట్టాడు. హిల్ బ్రాంట్, విలియం కలండ్ (1859-1932) కొనసాగించారు. వారికి భిన్నంగా కర్మకాండను స్టాల్ ఒక శాస్త్రంగానే కాక, దాన్లో పూర్తిగా నిమగ్నమై తదాకార వృత్తితో అధ్యయనం చేశాడు.

తొట్టతొలి భారతీయుల శాస్త్రీయమైన, పాండిత్యపరమైన గొప్పదనం శ్రౌతసూత్రాల అమరికలోనూ, సంక్లిష్ట కర్మకాండను అవి చిత్రించిన విధానంలోనూ ఉందని, అవి భాషా శాస్త్రానికీ, తత్వశాస్త్రానికీ బాటలు వేశాయని ఫ్రిట్స్ స్టాల్ కీర్తించారు. అతిరాత్రంలో రిత్వికులు నాటకంలో పాత్రల్లా చేసే పనులు, చదివే మంత్రాలు దాన్ని ఒక అద్భుత పురానాటకంగా మార్చిందని స్టాల్ పేర్కొన్నాడు. అతిరాత్ర యజ్ఞం లాంటి కర్మకాండలే భారతీయ నాటకానికి మూలమని కూడా భావించాడు. పండితుడు గొండా భారతీయ నాటకరంగం వైదిక కర్మకాండ నుంచి పుట్టిందని నిరూపించాడు.

సైన్సుకు సాంస్కృతిక నేపథ్యం ఉంటుంది. ఏ సంస్కృతికి సంబంధించిన సైన్సుకు దాని నేపథ్యం, లక్షణాలు, నిరూపణ మార్గాలు వేరే వేరేగా ఉంటాయి. పాశ్చాత్య సైన్స్, ఇస్లామిక్ సైన్స్ వేరే వేరే. భారతీయ సైన్సుకు ప్రత్యేక లక్షణాలున్నాయి. పాశ్చాత్య సైన్సుకు ప్రకృతితో వైరుధ్యం ఉంది. భారతీయ, ఇస్లామిక్ సైన్సులు ప్రకృతి యొక్క దైవిక, ఆత్మిక లక్షణాలను పరిగణిస్తాయి. అందుకే ఇస్లామిక్ సైన్సును పాశ్చాత్య సైన్సుకు సృజనాత్మక తిరస్కృతిగా ఎస్. హెచ్. నాసర్ భావించాడు. అలాగే భారతీయ సైన్సునూ చెప్పవచ్చు. స్వచ్ఛమైన సైన్సు అంటూ ప్రాక్ సంప్రదాయంలో లేదు. మాయ/పురాణం/ప్రకృతి/ దైవారాధన/వైద్యం వగైరా కలిసిన ఒక సేంద్రియ సంసర్గంలోనే ఇక్కడ సైన్సు మనుగడ కొనసాగింది (చూడండి. వెస్టర్న్ సైన్స్ ఇన్ మోడ్రన్ ఇండియా:

మెట్రోపాలిటన్ మెథడ్స్, కలోనియల్ ప్రాక్టీసెస్ - ప్రతిక్ చక్రవర్తి).

ఇందుకు అతిరాత్రం ఒక మంచి ఉదాహరణ. శుద్ధ సైన్సువల్ల పాశ్చాత్యంలో హేతువు మహాకథనమై ఆ సమాజాలను నాశనం చేసింది. మహాహేతువు నేడు మార్కెట్ హేతువుగా స్థిరపడింది. మార్కెట్‌లో బాగా చలామణి అయ్యేదే హేతుబద్ధమైనది. సుఖవాదానికీ, అనిశ్చితత్వానికీ, పలు విధాలుగా మానవ వినాశనానికి కారణభూతమైంది. పాశ్చాత్యుల అధోగతికి దారితీసింది.

కర్మకాండలో ముడిపడని పక్షంలో వేదవాఙ్మయం చాలావరకు అంతరించి ఉండేది. అందువల్ల వేదాలను కర్మకాండలు మోసాయని, కర్మకాండ వేదాల ప్రిజర్వేంట్ అని పూనె విశ్వవిద్యాలయ సంస్కృతాచార్యులు వి.ఎన్.ఝూ ఒక సందర్భంలో ఈ వ్యాసకర్తతో చెప్పారు. అది పాక్షికంగా మాత్రమే నిజం. క్రతువు ద్వారా కాకుండా కేవలం వాచకంగా జీవిస్తున్న యజ్ఞయాగాదులను సైతం స్టాల్ పేర్కొన్నాడు. పాణిని వ్యాకరణ సూత్రాల్లో ఉపయోగంలో లేని సూత్రాలలాగా అవి కూడా అవసరమేనంటాడాయన. అయితే క్రతువును అర్థం చేసుకోవడానికి కేవలం పుస్తకాలు చదివితే చాలదనీ, మంత్రాలు, సూత్రాలు చాలవనీ, కర్మకాండను పరిశీలించడం ముఖ్యమనీ స్టాల్ భావించాడు. 'అగ్ని' ముందుమాటలో 'క్రతువు వాచకం ద్వారా అర్థమయ్యేది కాదు. వాచకం ఏం చెప్పినప్పటికీ భాష కర్మను వివరించదు. కర్మిష్టులకు క్రియ ప్రధానం. అందులో మంత్ర పఠనం కూడా క్రియే. అది వారికి ముఖ్యమని రాశాడు. బ్రహ్మవాక్కు వాగ్దేవిని సృష్టించింది. ఇక్కడ వాక్కు క్రియ రెండు విడివిడిగా లేవు. అతిరాత్ర మంత్ర పఠనం గురించి రాస్తూ 'రుత్వికులు చేసే క్రియలు, ఉచ్ఛరించే మంత్రాలు వేగ్నర్ స్వర రచనలాగా అద్భుతంగా ఉంటాయి' అంటాడు స్టాల్.

ఇక్కడ శతపథ బ్రాహ్మణం గుర్తొస్తుంది. - 'ఈ అనల వేదిక ఒక భాష. ఇది భాషతో నిర్మితం'.

అగ్ని-సోమ యాగాల సమ్మేళనంతో అతిరాత్రం రూపొందిందని స్టాల్ భావన. 'మానవ కథా వికాసం జరిగిన తొట్టతొలి రోజులకు చెందినది అతిరాత్రం' అంటాడు.

రుగ్వేదంలో అతిరాత్రం నుంచి పలు ప్రస్తావనలున్నాయి. కానీ అవి శకలాలుగా మాత్రమే ఉండటం వలన యజ్ఞ కర్మకాండను పూర్తిగా వివరించవు. యజుర్వేదం కూడా అతిరాత్రాన్ని పరిపూర్ణంగా చెప్పలేదు. మలి వైదిక కాలంలో (700-300 బి.సి.) ప్రత్యేకమైన సంహితల్లో అతిరాత్రం గురించి పేర్కొన్నారు. యజుర్వేద తైత్తరీయ సంహిత నంబూద్రి అగ్ని చయనంకు మూల గ్రంథం.

వైదిక కర్మకాండలు పురాణాలకు చెందినవి అనేది పాశ్చాత్యుల భ్రమ. లెవీ-స్ట్రాస్ లాంటి గొప్ప మానుష శాస్త్రవేత్త సైతం ఈ భ్రమ బారిన పడ్డాడని స్టాల్ చెప్తారు. పురాణ రచనకు ముందు నుంచే కర్మకాండ ఉంది. బహుశా పురాణ సాహిత్యానికి మాతృక కర్మకాండే కావచ్చు - కొన్ని మినహాయింపులు ఉన్నప్పటికీ. పితృకర్మలకు యజ్ఞాలకు సాధారణ సంబంధాన్ని కూడా స్టాల్ ఒప్పుకోడు. క్రతువుల లక్షణాలు పితృకర్మల నుంచి వచ్చాయని ఆయన ఒప్పుకోడు. ఇక్కడ రొమిల్లా థాపర్‌తో ఆయన విభేదిస్తాడు.

రుగ్వేదంలో చివరగా చేరిన పురుష సూక్తంలో అగ్నిచయనం గురించి ఉంది. అందులోని పురుషుడు వెయ్యితలలు, వెయ్యికళ్ళు, వెయ్యి కాళ్ళున్నవాడు. వైదికులకు వెయ్యి అనంతానికి సూచిక. పురుషుడు సర్వ వ్యాపకుడు. అమరత్వానికి అధిపతి. ఆహారంపైన ఆధారపడి వ్యాపించేవాడు. పదవ మంత్రంలో యజ్ఞాలలో బలిద్వారా మంత్రాలు, సూత్రాలూ, వాటి నుంచి గుర్రాలు, గుర్రాల నుంచి ఆవులు, వాటి నుంచి గొర్రెలు, మేకలూ జన్మించాయి. ఐదు రకాల జంతువుల తలలను అతిరాత్రంలో యజ్ఞవేదిక కింది పాతిపెట్టారు అవి - మనిషి, గుర్రం ఎద్దు, గొర్రెపొటేలు, మేకపోతు.

పురుష సూక్తంలో 13వ మంత్రంలో పురుషుడి మనసు నుంచి చంద్రుడు (సోముడు) పుట్టాడు. సోమరసం hallucinogenic. మెదడు మీద పనిచేస్తుంది. (పిచ్చి వాళ్ళకు lunatics అని పేరు. lunar అంటే సోముడు). పురుషుడి నోటి నుంచి ఇంద్రుడు, అగ్ని పుట్టారు.

అతిరాత్రంలో ప్రజాపతి పురుష సూక్తంలోని పురుషుడే రుగ్వేదంలోని ఒక మంత్రం ప్రకారం. తర్వాత పురుషుడు విష్ణువుగా, నారాయణుడిగా రూపాంతరం చెంది స్థిరపడ్డాడు. ప్రజాపతిగా బ్రహ్మ భావించబడ్డాడు.

అగ్ని, సోమ - ఇద్దరూ వైదిక సంస్కృతిలో పూజ్యనీయులు. వైదిక వాఙ్మయం ప్రకారం సోముడు బ్రాహ్మణులకు రాజు. ఇహలోకం నుంచి దేవతలకు సమాచార వాహకుడిగా అగ్ని ప్రసిద్ధుడు. అగ్ని, సోమ - ఇద్దరూ ఇహ పరాల్లో ఉంటారు. కోర్కెలను అగ్నిద్వారా దేవతలకు నివేదించే క్రతువు అగ్నిచయనం. అమరకోశంలో అగ్నికి 34 పేర్లున్నాయి. అందులో వహ్నిః - వహతి ప్రాపయతి హవ్యమితి వహ్నిః - అంటే హవ్యమును (దేవతలకు అర్పించిన భోజనాన్ని) దేవతలకు చేర్చువాడు అగ్ని అని చెప్పారు. హోత్రస్య హవిషోవీతి రశ్వ ఇవ వహనాద్వా - హవిస్సును గుర్రమువలె మోసుకొని పోయి దేవతలకు ఇచ్చువాడు. ఇతన్నించే వేదములు పుట్టాయని కూడా అమరకోశం చెప్తుంది. జాతాః వేదాః యస్మాత్సః జాత వేదాః అమరకోశంలో సోముడు అమృతాన్ని పుట్టించినవాడు - సూతే అమృతమితి సోమః ద్విజరాజు. దేవతలచే ప్రియంగా పానం చేయబడే వాడు - దేవా ఏనం విశేషణ ధయంతి పిబంతీతి విదుః

అగ్నిపూజతోపాటుగా మత్తునిచ్చే సోమరస పానం మనల్ని మానవజాతి చరిత్ర పూర్వదశకు తీసుకెళ్తుంది. సోమ/సుర ఒకటికాదు. శతపథ బ్రాహ్మణం ప్రకారం సోమరసం సుమదకారి. సుర దుర్మదకారి. సోమరసం ఒక విధమైన మానసిక ఔన్నత్య స్థితికి తీసుకెళ్తుంది. సోమ సత్యానికి, సుర అసత్యానికి ప్రతీకలు. కానీ కొన్ని యజ్ఞాల్లో (ఉదా: వాజపేయ యజ్ఞంలో) సురనే ఉపయోగిస్తారు. సోమ అమృతం. సుర కాదు.

అగ్నిని, సోమను స్యేన అనే గరుడపక్షి స్వర్గం నుంచి తెచ్చిందని వైదికుల నమ్మకం. అగ్నికి, గరుడపక్షికి, అమరత్వానికి (సోమ లక్షణం) మధ్యప్రాచ్యంలోని పలు పురా సంస్కృతుల్లో సంబంధం కన్పిస్తుంది. అగ్ని పదం ఇండో యూరోపియన్ జనితం - లాటిన్ ఇగ్నిస్, రష్యన్ ఓగోస్, లిథువేనియన్ ఉగ్నిస్ అగ్ని పేర్లే. కామాగ్ని కూడా అగ్ని దేవుని నుంచి జనితమే మంథనం. కట్టెల రాపిడి నుంచి అగ్ని జ్వలించడం లైంగిక క్రియను సూచిస్తుంది. ఋగ్వేద అథర్వణ వేదాల్లోనూ, బృహదారణ్య కోపనిషత్‌లోనూ ఉన్న ఒక మంత్రం (దీన్ని తరచూ అనువాదకులు మినహాయిస్తారు) అగ్ని గురించి ఇలా చెప్తుంది -

అగ్ని ఆమె తొడలను విడదీస్తాడు

స్వర్గాన్ని భూమినీ విచ్చుకోనివ్వండి!

ఆమెతో సంగమిస్తూ తన నోటిని

ఆమె నోట దగ్గర పెడ్తూ,

కేశాలు పెరిగే దిశలో మూడుసార్లు తాడిస్తూ

ఆమెతో సంగమిస్తాడు......

నీలో విత్తనాన్ని నాటుతున్నాను అంటాడు.

ప్రమంధన - మధించి నిప్పును రాజేయడం అనే సంస్కృత పదం ప్రొమితియస్‌కు దగ్గరగా ఉందంటారు. మత్ అంటే సంస్కృతంలో దొంగిలించడం. ప్రమత్తత అంటే తెలివి. ప్రొమితియస్‌కు ముందుచూపున్న, తెలివైన వాడు అనే విశేషణాలున్నాయి. సోముడికి కామాగ్ని రేకెత్తించే లక్షణాలున్నాయి. సోమయాగంలో మంత్ర సహిత రతికూడా భాగంగా కొన్ని సంప్రదాయాల్లో ఉంది (చూడండి - హిందూవరల్డ్, బెంజమిన్ వాల్టర్).

అతిరాత్రం మానవ పురాస్మృతిని రేకెత్తిస్తుంది. జంతుజాలాల్లో సైతం కర్మకాండలున్నాయి. మానవుడు జంతుస్థితిలో ఉన్నప్పుడే కర్మకాండలు, శబ్దాలు, ఉచ్చారణ మొదలుపెట్టి ఉంటాడు. పక్షి అరుపులకు వేదమంత్రోచ్ఛరణకు సామీప్యత ఉంది. (చూడండి - అండర్‌స్టాండింగ్ వేదాస్, ఫ్రిట్స్ స్టాల్). వేదాలు అపౌరుషేయాలు అంటే మనిషి/పురుషుడు ఉద్భవించక ముందే అవి రూపొంది ఉంటాయి. జంతువు నుంచి ఉత్పన్నమైనవి కాబట్టి అపౌరుషేయాలు అయి వుంటాయి.

అతిరాత్రం అలాంటి పురాయుగంలోనికి మనల్ని నడిపించి, ప్రాకృతిక సంబంధాన్ని ఆవాహన చేస్తుంది. సోమరసం మానవ సహజాతాల (instincts) ను ప్రేరేపించి, అంతరాత్మను సంహరించి పురాస్థితికి చేర్చే అమృతం.

ఇండో-ఐరోపా సంస్కృతిలో అగ్ని భాగమైతే, ఇండో-ఇరాన్ సంస్కృతిలో సోమ భాగం. కానీ అతిరాత్ర యజ్ఞ క్రతువు మాత్రం భారతీయమేనని స్టాల్ భావన. యజుర్వేదంలో ఋగ్వేదం కన్నా ఎక్కువ భారతీయత ఉందని కొందరి భావన. కర్మకాండ యజుర్వేదంలో ఎక్కువగా పేర్కొనబడింది.

ఐదొందల ఏళ్ళ వైదిక యజ్ఞాల సువర్ణయుగం బుద్ధిజం రాకతో బి.సి.నాడే ముగిసింది. కానీ వైదిక బ్రాహ్మణులు మాత్రం వేద సంస్కృతిని తరతరాలుగా తమ జీవితంలో భాగం చేసుకుని జీవింపజేస్తున్నారు. వారికి అందువల్ల సంపదలు రాలేదు. పంచె, కండువా, తమ నిష్టలను అనుసరించే వీలు తప్ప నంబూద్రి వైదిక బ్రాహ్మణులు పెద్దగా ఆశించింది లేదు. క్రతువును వేరే ఏదో ఆశించి చేయడం కాక దానికదే ఒక జీవిగా వీరు చూస్తారు. ఒక వేళ సంపదలను మోక్షాన్ని ఆశించి క్రతువు చేసినా అది వెంటనే సిద్ధించాలని లేదంటాయి శ్రౌత సూత్రాలు. క్రతువును క్రతువు కోసమే చేయాలంటాయి. స్వర్గాన్ని ఆశించి యజ్ఞం చేసిన వ్యక్తి యజ్ఞ సమాప్తి తర్వాత సజీవుడిగా ఇంటికి చేరితే అతను జీవితాంతం అగ్ని హోమం చేయాలంటాయి శ్రౌత సూత్రాలు. మరణానంతరం స్వర్గ ప్రాప్తి అని మీమాంస ప్రకటిస్తుంది. దీన్నే అద్వైతులు హేళన చేశారు. కర్మకాండని నిరసిస్తూ ఉత్తమీమాంస - జ్ఞానకాండనే నమ్మమన్నారు.

కర్మకాండకు జ్ఞాన కాండకు మధ్య ఇలా వైరుధ్యం ఉత్పన్నమైంది. జ్ఞానమార్గమే గొప్పదనే అహంకారం వ్యాపించి సనాతన యజ్ఞ సంస్కృతినే నిరసించే వైఖరి కొనసాగింది. దానికి ఆధునిక సమర్థన కూడా తోడైంది. కానీ, కర్మకాండ నిరాఘాటంగా కొనసాగుతోంది. దాన్లో అపారజ్ఞానం ఉందని ఫ్రిట్స్ స్టాల్ ప్రపంచానికి చాటాడు.

ప్రయోజనాన్ని ఆశించనితనమే ఈ దేశంలో కర్మకాండను ఒక శాస్త్రంగా అభివృద్ధి కానివ్వలేదని స్టాల్ అభిప్రాయం. పాశ్చాత్యంలో ప్రతి శాస్త్ర విషయాన్నీ భౌతిక ప్రయోజనంతో ముడిపెట్టి చూడటం అనే అవలక్షణం ఇక్కడ లేదు. 'భారతీయ కర్మకాండ శాస్త్రం ఒక గొప్ప శాస్త్ర విభాగంగా గణితం, భౌతిక శాస్త్రం, భాషా శాస్త్రాలకు దీటుగా అభివృద్ధి అయ్యే అవకాశం ఉంది. ఎందుకంటే, దానికి క్రతువులకు సంబంధించిన అనుభవ జ్ఞానం ఎంతో ఉంది.' కర్మకాండను శాస్త్రంగా కీర్తించడంలో అతనిలో ఆధునిక దృష్టి ఉన్నప్పటికీ అతిరాత్ర విజయాన్ని ప్రపంచ మేధోవేదికపై సగర్వంగా గానం చేశాడు.

అతిరాత్ర అధ్యయనం స్టాల్‌ను పాశ్చాత్యం నుంచి ప్రాచ్యానికి చేర్చింది. 1983లో **అగ్ని** ప్రచురించిన స్టాల్ భారతీయ వైదికతపై, తత్వశాస్త్రంపై, సంస్కృత

